శా. లావణ్యమ్మున మించి నీలగిరిలీలంబొల్చు నెమ్మేను సు
శ్రీవత్సాంకిత వక్షమాశ్రితజనక్షేమంకరాపాంగముల్
ప్రావీణ్యాన్వితముక్తమానసలసద్భద్రాంఘ్రిపంకేజముల్
దేవప్రస్తుతిగల్గునట్టి పరముం దేవేశుఁ గీర్తించెదన్."

రేఫ శకటరేఫమైత్రి త్ర్యార్థకసంధులు మున్నగునవి యీ కవి కనభిమతములు గావు. లక్షణశ్రద్ధాళువులాదృష్టితోఁ బరిశీలించి యింకనుగలిగిన విశేషములను వెలువరించుటకు వలసిన యవకాశమిందు లేకపోలేదు. ఇందనుస్యూతమైన విషయ ప్రపంచము సూచికవలన వెల్లడియగునుగాన నిచ్చటఁ బ్రత్యేకపరిగణమున చేయఁబడుట లేదు. శ్రీ వేంకటేశ్వరునకు రంగశాయికవిచే సమర్పితమై నిర్మాల్యవైభవమునంది కొనిన యీ వనమాలాసౌరభములు నేఁటివఱకును తాళీదళ సంపుటములలో నణఁగి మాఁగియున్నవి. నేఁడిది యుద్ధరింపఁబడుచున్నది గాన నవి వాఙ్మయ లోకమున సీమావగాహులై కల్యాణకరములు కాఁగలవు.

తి. చంద్రశేఖరన్.

•

# విషయసూచిక

# వాణీ విలాస వనమాలిక.

## ప్రథమాశ్వాసము

### అవతారిక

శా. శ్రీ విశ్వంభర లాత్మపాద సదుర స్సీమోరు పీఠంబులన్
దీవుల్ మీఱఁగ శంభు శక్ర ముని వాణీనాథ ముఖ్యుల్ నుతుల్
గావింపన్ శుభదాధిక ప్రభలచేఁ గల్యాణవద్వేంకట
గ్రావాధ్యక్షతఁ బొల్చు వేల్పుఁ గొలుతున్ గైవల్య సంసిద్ధికిన్.

సీ. వరనీల చికుర శైవాల జాలమ్మున
నిందిత వదనపూర్ణేందు విభవ
మతుల విశాల తరాక్షి మీనంబులు
కమనీయ దంత ముక్తాఫలములు
సులలితదరహాస శుభ్రడిండీరమ్ము
మధురాధరామృత మహితసుధయుఁ
గలిత త్రిరేఖా ప్రకాశిత గళదర
మామోద పృథుల కుచాచలములు

తే॥గీ॥ మానితోజ్జ్వల జంఘికా మకరములును
లీలఁ దళుకొత్తు పాదప్రవాళ లతిక
యమర గాంభీర్యగతి జనకానురూప
మమర సుప్రాంగు నలమేలుమంగఁ గొలుతు

ఉ. హార కిరీట భాక్కమల హారికి వారణ దైత్యవీర ని
ర్హారికి రౌప్య భూధరవిహారికి దేహవిభాజితార్థ నీ
హారికిఁ గాలకూట పరిహారికి సంతత సంశ్రితామృతా
హారి కజిహ్మగ ప్రకర హారికి మ్రొక్కెదఁ గార్యసిద్ధికిన్.

చం. జగములకెల్లఁ దల్లియన సారనిదానతఁ జెంది తండ్రికిన్
మగనికి ధైర్య భూతిగరిమల్ విహితంబుగఁ గూర్చునేర్పునన్
సుగుణతఁ బుట్టినింటికినిఁ జొచ్చినయింటికిఁ గీర్తిరాఁగ న
త్యగణిత సన్నుతుల్గనిన యద్రిసుతన్ మది నెంతు నెంతయున్.

చం. అనువుగ దేవ తిర్యగచ రాఖిల మానవ మానకల్పనం
దనచతురాననత్వము యథాస్థితిగా వెలయింపఁ జేయుచున్
మును మినుకుల్ తదీయగతి ముఖ్యములై నెరయంగ రంగునన్
దనరిన వాగ్వధూసహితు ధాతను సృష్టివిధాతఁ గొల్చెదన్.

కం. క్షోణీ చక్రశ్రోణిన్
వేణీ రుచి విజిత నీలవేణిన్ ఘన క
ల్యాణిన్ నతగీర్వాణిన్
వాణిన్ శుభవాణిఁ దలఁతు వనజజు రాణిన్.

కం. సంతత దంతురవిఘ్న
ధ్వాంతార్క ప్రతిభు సుగుణవంతు ననంతున్
శాంతు నిరంతర కరుణా
క్రాంతున్ గాంతున్ నుతింతుఁ గరిముఖు ననఘున్.

మ. హరి సేనాపతియై సమస్తదితిజాతానీక సంహార శౌ
ర్యరసోదంచితుఁడై రమేశ భజనా రంజన్మహాయోగి భా
సుర చిత్తాబ్జ పరిస్ఫుటైకవిలసత్పూర్ణాకృతిన్ బొల్చు భా
స్వర కారుణ్యసుధానిధానుఁ డగు విష్వక్సేనుఁ బ్రార్థించెదన్.

కం. ఆది మదీయ కవిత్వము
సాది మహిన్ సుకవి తురగసమితికి ననుచున్
బ్రోఁది మదిఁ బాదుకొల్పిన
యాదిము వాల్మీకి కవి మహామునిఁ గొలుతున్.

ఉ. వేదపుఁ బాదునన్ స్మృతులు విత్తులుగా నితిహాస వృక్షసం
పాదన చేఁ బురాణము లపారసమంచితశాఖలై తగన్
మోదముతోడ భాగవత ముక్తిరసైక ఫలప్రసంగతా
స్వాదన ధీరులం దనుపు వ్యాసమునీంద్రుని సన్నుతించెదన్.

చం. గురుకులవర్యుఁ గణ్వమునిగోత్రుని వామనదేవు పుత్రునిన్
స్థిర శుభచర్యు ధర్మపురి శ్రీ నరసింహ వరప్రసాది ని
ద్ధరఁ దగు నారద ప్రకటిత స్థిత భాగవత క్రమాఢ్యునిన్
జిరమతి రామభద్ర గురుశేఖరునిన్ భజియింతు నిత్యమున్.

సీ. భవభూతి శివభద్రు బాణు మయూరాఖ్యుc
గలభుని హేరంబుc గాళిదాసుc
గవిమిత్రు శ్రీ హర్షు భవ్రు భారవిc జయ
దేవు మల్హణు శుకదేవు మాఘు
భాట్యుc ప్రాభాకరు భద్రు శంకరు దండి
కవ్యాది గీర్వాణ కవులc దలcచి
భీము సూరయc దిక్క ప్రెగడ నన్నయ పోత
నార్యు నెఱ్ఱన సోము నమరు రంగ
తే.గీ. నాథు శ్రీనాథు గౌరన నవ్యకావ్య
భానురాంధ్రకవిత్వ ప్రబంధ బంధు
రార్థ సర్వజ్ఞ నిధుల మహాకవీంద్ర
వరుల నభినుతి గావింతు గరిమ మెఱయ.

ఉ. సారత రౌచికార్థిక విశారద శిల్పిక ముఖ్య మాధురీ
ధారల సత్కృతుల్ పదులు తాము రచింపcగ లేక యూరకే
నేరని ప్రజ్ఞలన్ సుకవి నిందయొనర్చుట, వానరంబు త
వ్వారల వెక్కిరించి శుభవైఖరిc బూనcగలేనిచాడ్పగున్

ఆ. వె. అనుచు నిష్టదేవతాభివందనమును
వరకవీంద్రనుతియు నెరయc గుకవి
నిరసనమ్ముచేసి నెమ్మితో నొకకృతి
నమరcబూనియున్న యవసరమున.

సీ. * వేలుపు మిన్నల విందు మానికె కందు ?
కలిమింతి పొందు పతంబువాcడు
సోcకు మూcకల హత్తి వీకచూపెడు సత్తి
కాcకల బలుకత్తి గలుగువాcడు
మగరాల జిగడంబు మహిమంబు మకుటంబు
తల నొడికంబుగc గలుగువాcడు
తమ్మిచుట్టcవు లేపు నెమ్మివెన్నెల ప్రాపు
గ్రమ్మినకనుచూపు గలుగువాcడు
తే.గీ. శేషనారద గరుడ సంసేవ్యమాన
చారు చరణాంబుజ ప్రభోదార సకల
దాస మానస సంతోషదాయకుండు
వెలయు గల్యాణ వేంకటాచల విభుండు.

---

మేలంపు మిన్నల విందుతాలి మానికెకందు. అని మూలపాఠము
* ఇందు గణ భంగమును, బట్టి పై పాఠము సరియని యూహింపబడినది.

స్రగ్ధర॥ శుభ్రాంభోద ప్రభావిస్ఫురిత హయముపై శోభనాంగ ద్యుతుల్ నీ
లాభ్రభ్రాంతిన్ ఘటింపన్ హవణిక జిగిపాగంగి చుంగుల్ చెలంగన్
విభ్రాజ ద్రత్న భూసావిభల దశదిశల్ విశ్రుతం బందగా భ
ద్రభ్రాజి (స్వా) ననాంచ ద్దరహసితము నిద్దంపు మేలింపు నింపన్.

వ. చతుర మితజన సేవితుండై వితత విభవసంగతి నురగరాడ్గిరిపతి యుషఃకాలం
బున మదీయదృగ్గోచరుండై ప్రణామ ప్రణతులు గైకొని నీ తలంచిన కృతి వాణీ విలాస
మాలిక యన మద్వనమాలికభాతి మెఱయుచు నానాకాలంకారంబగు, నగణితనుగుణుం
డును ప్రబంధ కల్పనాధురంధరుండును నగు మద్దానుం డొకరుండు సహాయుండుగా
నేతత్కృతి, మత్సమర్పణంబు సేయుమని మన్నాననినివాసుండయ్యె నంత నివ్విధంబు
మద్గురు బాంధవజనంబుల కెఱింగించిన రోమాంచకంచుకితగాత్రులై మత్కృత పరిపా
కం బభివర్ణించి యిట్లనిరి.

సీ. శ్రీ విష్ణునాభి రాజీవ సముద్భవ
భువనేశ మానసపుత్రుఁడైన
భృగుఁ డచ్యుతాబ్జభూనగవిభుల గుణంబు
లరయుచో హరిపత్ని మంఘ్రి నదుము
వారిజోదరుఁడు శ్రీవత్సాంకుఁ డగుటను
న్ముని శ్రీవత్సాఖ్య మొనర నొసఁగి
నీ గాత్ర సంభవుల్ శ్రీగరిష్ఠు లటంచు
వరమిచ్చి దయమెచ్చ నిరుపమాన

తే.గీ. మహిమఁ జెన్నగు శ్రీవత్సమౌని గోత్రుఁ
డనఘతర తేకుమళ్లాన్వయైక ధర్మ
పురి నృసింహాంఘ్రి భజనాప్త నిరత రామ
భద్ర గురుభక్తియుతుఁడు తిప్పప్రభుండు.

కం. ఆ మంత్రి రామమాంబా
సీమంతినియందుఁ గనియె శ్రిత సుకవిజన
స్తోమ క్షేమంకర వి
ద్యామహిమాన్వితు నప్పయామాత్యుఁ దగన్.

ఉ. ఆయత కీర్తిశాలి యగు నప్పన యొప్పగు కృష్ణసీతి ప
త్న్యాయి శుభప్రదాయిని బుధాఢ్యవిధా యనిభార్య కాఁగ బాఁ
గాయజువంటి సద్గుణనికాయుఁ దనూభవుగాంచె వైభవ
శ్రీయుతు రామనార్య మతిశిక్షిత దేవగణార్యు నయ్యెడన్.

సీ. ఆ రామమంత్రి సీతా రమణీ నిభ
సద్గుణనికురుంబ జనకదంబ
సుత కచరోలంబ సతి లక్ష్మమాంబ స
త్కులకాంత గా సముజ్జ్వలనిరూఢి
నరసింహ వరజాతు నిరుపమ విఖ్యాతు
మతినిత్య గప్పరామాత్య సత్య
ప్రాకట సద్గుణా స్తోకవిఖ్యాతాఖ్యు
స్థిరకార్యరంహు నృసింహు నాన
తే.గీ. నాబ్జరిపు బింబయగు నరసాంబఁ గనియె
నందు ననవరతాన్న దానాతిశయ మ
హా ప్రభావ సదాచార విప్రభజన
కప్పరామాత్యుఁ డలరు లోకప్రసిద్ధి.

ఉ. వాసవ వైభవుఁడు బుధవర్తన దానవిధాన మాన లీ
లా సమ కీర్తి సత్యముల, నంబుద కౌరవ దస్ర శేష ర
క్షోనువిదారులం గెలుచు నంచిత సంచితపుణ్యశాలి యా
నా సచివాగ్రగణ్యుఁడు కులాంగన తిమ్మమనెమ్మిఁ గొల్చెఁగన్.

శా. సామాన్యత్వము నొంది రత్యధిక భాషా చంపలా చండికా
నామ ప్రాప్తిని, సత్య నిశ్చల కళా నాథానుకూల్య క్రియా
సామర్థ్య స్థితి తిమ్మమాంబ కెన రా, ప్రాప్తి రమా పార్వతీ
భామ ప్రాభవ శీల లయ్యు నది చిత్రంబా త్రిమూర్త్యంగనల్.

సీ. ఆ కప్పరార్య తిమ్మాంబల కవని
జనావన కల్పవృక్షాళిఁ బోలి
యింగితకీర్తుల హెచ్చిన యచ్చన
ధర్మతత్పరుఁడైన ధర్మనయును
రాజిత సుకవి సమాజిరామాజియు
ధీయుక్తు లొప్ప నారాయణప్ప
రమ్యవిద్యా విశారద బుధజన గేయు
రంగద్గుణ స్థాయి రంగశాయి
తే.గీ. యనఁగ నీవును జనియించి తంచిత మతి
హరి కరాంబుజ దీప్త పంచాయుధముల
కరణి గౌరీశ పంచవక్త్రముల రీతి
నమిత కీర్తిప్రభఁ ధర నతిశయిల్ల.

సీ. అన్వర్థ నామ పుణ్యాస్పదులైన భా
గీరథి కృష్ణమ్మ ధీర కొండ
మాంబయు సైఁదోడులై వెలయ జనించి
యధిక సత్కీర్తుల ననుపమధృతి
గజవెల్లి జనపదగతి నైదిపురి బాంధ
వాధార విద్యానిబోధ సింధు
సన్నుత సుకృతైక సప్తసంతాన సం
పన్న ప్రసన్నత వన్నెకెక్కి

తే.గీ. చెలఁగితివి రామభద్రార్య శిష్య వర్య !
వేంకటాధిప పాదారవింద మాక
రంద సుమలిడ్పిథానందకంద హృదయ !
కృతి రొనర్పుము నీదు కోర్కెలు ఘటిల్లు.

చం. ఉరుశుభసన్నతిన్ దిరువళూరి పురాధిప వీరరాఘవ
స్థిర శతకంబు కృష్ణగుణ దీపితదండక, మొప్పు జానకీ
పరిణయయక్షగానమును భాగవత ద్విపద ప్రబంధమున్
విరచన చేసినట్లు యిది వేడ్క నొనర్పుము రంగధీసుధీ !

సీ. ధర మొలురన్వయామరతరుఫల లీల
మంతు కెక్కు ననంత మంత్రిపత్ని
యగు లక్ష్మమాంబ యం దనువొందఁ గలశాబ్ధి
ఘనవీచి శ్రీకాంత కరణిఁ బొడమి
యన్వర్థనామ్నియా నట్టి లక్ష్మాంబ శ్రీ
రంగశాయి ప్రభ రంగు మీఱు
వరు నిన్ను వరియించి నిరుపమ శుభగుణో
దార సద్బాంధవాధార గరిమ

తే గీ నమరి వెంకటపతి నచ్చనాఖ్యు నయ్య
నంతు వేంకటపతి జగన్నాథు పద్మ
నాభు బాహులు నాగ నందనులఁ గాంచ
ధరణి వర్ధిల్లు నీకు నీ ధర్మ మమరె.

తే.గీ. వరకవి బహుశ్రుతుఁడు శేషగిరినివాస
భక్తుఁడు వివేకియు బహుప్రబంధకర్త
విశదమతి శ్రీ మహంకాళి వేంకటపతి
చెలిమికాఁడౌటఁ దగు కార్యసిద్ధి నీకు.

సీ. అతఁ డల కుత్స గోత్రాన్వయక్షీరపా
రావార తుహినాంశుఁడై వెలుంగు
నన్న పార్యాన్న యాంబాత్మజుండగు కోన
యాఖ్యుఁడు లింగము యందుఁ గనిన
గుణనిధి ఘనుఁ డప్ప కొండాఖ్యుఁడచ్చమాం
బిక యందుఁ గనిన సత్ప్రీతమతుల
లింగార్యుఁ డలమేలుమంగా కృపార్థుండు
విశ్రుత సుకృతియౌ వేంకటపతి

తే.గీ. ప్రచుర లీల చతుర్విధ రచన లెఱుఁగు
నెమ్మి నాతఁడు నీకృతి నిర్వహించు
నింపు దలిర్చ శ్రీవేంకటేశు పేర
నంకితమొనర్చు మనుడు నే హర్షమొంది.

ఉ. ఏక కథా ప్రసంగతి గభీరగవులాద్యులు సత్ప్రబంధముల్
ప్రాకట మాధురీ రతుభస్థితిఁ జేసిరి వారి సత్కృతుల్
శ్రీకర సత్పురాణము లశేషతరాగము సంహితైక బో
ధా కలితార్థముల్ వినినయంతయుఁ గూర్తుఁ ప్రబంధసంగతిన్.

కం. ఏతత్కథా సరిద్వర
జాత వచస్సురభి పారిజాత ప్రసవ
వ్రాతాంచిత దామము శ్రీ
నే తకు ఫణిరాజశైలనిలయున కిత్తున్.

చం. కృతమున బ్రహ్మ నందనులు త్రేత రఘూద్వహముఖ్య భూపతుల్
తతమతిఁ బాండవాదు లల ద్వాపరవేళలఁ బూజసల్పఁ గా
హితమతిఁ దన్మనోరథము లిచ్చిన వేంకట భర్తయిప్పుడ
ట్లు తులిత లీల నాశ్రిత జనాళికి నిచ్చు నభీష్ట సంపదల్

ఆ.వె. అంబురాశి తరగ లవనిరేణువు లుడు
గణము లమిత వర్ష కణములైన
నెన్నవచ్చుగాక యీ వేంకటేశ్వరు
భవ్యగుణము లెన్న బ్రహ్మ వశమె !

## షష్ఠ్యంతములు

కం. శ్రీ రమ్య స్వామి సర
సీత్తీరావనిజాత కుసుమసీధు పరిమళా
సార మహాధీరానిల
వార స్ఫుట సుప్రసన్న వదనాబ్జునకున్.

కం. ఆటవికా నయనోత్సవ
కోటిరవిద్యోతమాన కోటీర విభా
ఘాటహృత భక్తకలుషో
ద్ఘాట తమః పుంజునకును గరకంజునకున్.

కం. వనజభవార్చిత కాంచన
వనజాధిక దివ్యపాదవనజ ద్యుతి స
న్మునిహృద్బోధాకరునకు
జనితాదరణునకు శంఖచక్రధరునకున్.

కం. వృషభాసుర మదవిదళన
పృషదశ్వాయిత సువేగ భీకర శార్ఙ్గ
త్యక్షణామిత బాణవ్రజ
విషయాస్పద లాఘవునకు విహతాఘునకున్.

కం. సేవాగత కలుషాపహ
పావన పటుతీర్థనికర పరివృత రుచిర
శ్రీవైకుంఠాగత శుభ
భావ విమానాధిరతికి బంధురధృతికిన్.

కం. చేతోభవ కోటివిలా
సాతత సౌందర్యదీపితాకృతికిన్ గం
జాతభవ భవనుత ప్ర
ఖ్యాతికిఁ గల్యాణ వేంకటాచలపతికిన్.

వ. సమర్పితంబుగా నే రచియింపం బూనిన వాణీవిలాస వనమాలికయను మహా ప్రబంధమునకుఁ గథాక్రమం బెట్టిదనిన—

సీ. చందన మందార చాంపేయ జంబీర
కురవక మాలూర కోవిదార
కేతకీ ఖర్జూర కింశుక కరవీర
శిర్షప వానీర సిందువార

మాతులుంగ తమాల మన్మథ(వ)టసాల
మాలతీ హింతాల తాల వాల
సరళ చూతాంకోల శర కదంబ రసాల
వకుళ కుద్దాల బిల్వ ప్రియాళ

తే.గీ. పనస లికుచామలక లుంగ కనక తిలక
హింగు నారంగ తుంగ లవంగ రంగ
దమిత సుమఫలతరు కుంజ యమి మనోజ్ఞ
కుశల హర్ష ప్రదంబు నైమిశవనంబు.

ఉ. తామరసోద్భవుండు ప్రమదంబునఁ బుణ్యము లెల్లఁ బ్రోవు గా
నేమి యొనర్చి ధాత్రి నిది నిల్చిన చోటతిపుణ్యభూమి నాఁ
దా మది గోరికన్విడువఁ దారక యచ్చట నుక్కి దాని చే
నైమిశకాననంబన ఘనం బగు తద్వన సీమ యొంతయున్

తే.గీ. నీలగళ సంగతిన్ ఫణినివహ మలరు
హరి మదేభేంద్ర రక్షణ మాచరించు
పుండరీకాళి సారంగములను బ్రోచు
సరస నన్యోన్య వైర ప్రచార ముడిగి ॥

వ. తద్వనంబున—

ఉ. కుత్స మరీచిశౌనక భృగు చ్యవనాంగిరసాత్రి కణ్వులున్
వత్సపులస్త్య మంకణ కణాదులు నా హరి సత్ప్రభావము
తృత్సవ మాన సుండగుచు నొప్పెడు సూతుఁడు దెల్ప వించు రా
జత్సుగుణాఢ్యులై మఱియు శౌనకుఁ డాతనిఁ జూచి యిట్లనున్ ॥

శా. సూతా! నైగమ భానుదార్ధ పదవీ శోభాత్త మేధా లస
త్ఖ్యాతా! శాస్త్రపురాణ సంహిత కళా ధారాళ లీలా వచో
జాతా! పావన రోమహర్షణ తనూజాతా! సదా తత్త్వ వి
ద్యా తాత్పర్యయుతా! బుధానుమత చర్యాస్ఫీత! ధీరవ్రతా!

కం. యుక్తాగ మోక్తి స్మృతు లను
రక్తిన్ గడు విస్తరించు రహి స్మృత్యర్థో
ద్యుక్త గతి పురాణములా
సక్తిన్ బ్రకటించు సకల సారార్థములన్

మ. మునుమిన్కుల్ గొనియాడు వేని పరుడున్ ముఖ్యుండు నానంద కం
ద నిరూ త్ముఁ డమేయుఁ డవ్యయుఁడు విద్యాగమ్యుఁ డా విష్ణుఁ గీ
ర్తన సేయన్ భవదోషముల్ దొలఁగు నిత్యక్షేమసిద్ధిం దగున్
మనుజుం డూర్జిత తత్కథామృత సుధామాధుర్య సేవారతిన్॥

ఉ. కావున సర్వలోకవిభు గౌరవ చారు కథా సుధారస
శ్రీ వహి వీనులం జొరఁగఁ జేయఁగ దే! మది సంతసిల్లఁగాఁ
బావనుఁ డాదిమూర్తి గుణపారగుఁ డావిభుఁ డెట్లు లోక సం
భావితమౌ ప్రపంచమనుభావముగా సృజియించె నెంచఁగన్॥

తే.గీ. వింటిమఖిల పురాణముల్ వేఱు వేఱ
నిశ్చితార్థమ్ము దెలియంగ నేరమింక
కరుణ నర్థవిభాగ సంగతులు నెరయ
వలయుఁ దెలుపఁగ మిశ్రభావంబు గాఁగ.

సీ. బ్రహ్మస్వరూపంబు బ్రహ్మాండ విభవముల్
వరుసఁ జతుర్వ్యూహ వైభవములు
లోక నిర్ణయములు లోకోద్భవస్థితి
లయ గతుల్ వర్ణాళి లక్షణములు
సుచిత కర్మకలాప మురుజీవ దేహ పిం
డోత్పత్తి విధములు నౌనరు జాత
కస్థితి షోడశకర్మ విభాగముల్
స్త్రీ పుంస లక్షణ స్థితులు, భేష

తే.గీ. జ ప్రకారంబు భరతశాస్త్రంబు స్వప్న
సుప్తి జాగ్రదవస్థా విశోధనములు
వ్రత సవన దాన గో విప్ర వైభవములు
విష్ణు కైంకర్య తద్భక్తి విధ ఫలములు.

చం॥ త్రిగుణ విభాగముల్ నృపవిధి క్రియ లింద్ర మను ప్రచారముల్
దగఁ జతురాననాయువు విధంబును గాలనిరూపణంబులున్
మృగధర సూర్యవంశజుల మేలియు సాంఖ్య హఠాదియోగ శా
స్త్ర గతులు, కల్పరీతి విశదంబుగ నిప్పు డెఱుంగఁ బల్కవే!

కం. మున్ను పురాణార్థము లీ
పన్నని యేవర్గు రీతి నమరగ సంక్షే
పోన్నతి విస్పష్టము గా
సన్నుత సారార్థ మెల్లఁ జతురతఁ జెపుమా!

మ. అనినన్ సూతుఁడు శౌనకాదుల మహాహ్లాదంబునం జూచి యో
యనఘాగ్రేసరులార ! మేలు, భవదీయంబైన సంప్రశ్నమా
వనమాలిన్ శుభశీలి దాసజనభావ ప్రస్ఫురత్సత్కృపా?
వనశాలిన్ మది భక్తి నెన్నఁ దగు కైవల్యాభిలాషస్థితిన్.

కం. మీరడిగిన ప్రశ్నల హరి
గౌరవ మహిమములు తేఁటగాఁ బలుకఁ బడున్
సార పురుషార్థదాయక
మై రహిఁ దగు విష్ణు సత్కథామృత పదవుల్.

చం. విలసిత బుద్ధి నిచ్చుటలు విశ్రుత ధర్మము, నీతి తోడ ని
శ్చల గతిఁ గూర్చుటర్థము వశంవద వృత్తి మెలంగు కామినిం
గలయుట కామ, మీ క్రియలు గావని విష్ణు రమేశు భక్తితోఁ
గొలుచుట మోక్ష మచ్యుతునిఁ గోరి భజించినఁ గల్గు కోరికల్

కం. కోరక యూరక గొల్చిన
వారికి నపవర్గ పద మవారిగ నొసఁగున్
జేరిక నెట్లయినన్ భవ
తారకమగు విష్ణుసేవ తథ్యం బరయన్.

తే. గీ. క్రమ పురాణము లుపపురాణములు స్మృతులు
త్రిగుణయుతములు, పదునెన్మిదింట నమరు
నందు సాత్త్వికములు హరి నభినుతించు
నల రజస్తమములు ధాత్రుహరులఁ బొగడు.

చం. హరియొకఁ డెల్ల దేవశుభదాకృతులన్ జనకోటి పూజ సే
ర్పులుపగఁ దాసె కైకొనుచు భవ్యమనోరథ దాయియై తగున్
సురపథపాతి తోయములు సొంపున వారిధిఁ జేరునట్లు న
ప్పురుషవరేణ్యుఁ జెందు నెటఁ బొందిన వేల్పుల మ్రొక్కు లన్నియున్.

కం. ఆరోగ్యేచ్ఛన్ భాస్కరు
సారజ్ఞానమ్ము కొఱకు శంకరు, ధనధా
న్యార్యాధి కగ్ని, ముక్తికి
నారాయణుఁ గొల్వఁ దగు జనంబుల కెల్లన్.

సీ. వెస ఋగ్యజుస్సామవేదముల్ సకల క
ర్మ ప్రతిపాద్యముల్ మఱియు నవియొ
హరి హర మాహాత్మ్య వరసూచకంబులో
నం వ ధర్మణము మంత్రాత్మక మగు

నుపవేద వేదాంగయుక్తములగు నందు
నైదగు శాఖల, నాఱు సూత్ర
ముల, నొప్పు ఋగ్వేద మెలమి యజుర్వేద
మన్ని సూత్రంబుల నెన్న నెనుఁ
తే.గీ. దాఱు శాఖలు సామంబు నన్ని సూత్ర
ముల వెలయు సప్తగానత లలిఁ దనర్చె
బ్రాహ్మ్య మష్టవిధమ్ములఁ బరిఢవిల్ల
ననఘరీతి సహస్రశాఖాన్వితముగ.

వ. సూత్రమ్ము లెవ్వియం బేని, బోధాయ నీయాపస్తంబ సత్యాషాఢద్రాహ్యాయ నాగస్త్య తౌయన శాకల్య కాత్యాయన వైఖానస శౌనకీయ భారద్వాజాగ్ని వైశ్య వాతూల మాధ్యందిన కౌండిన్య కౌశికంబు లష్టాదశంబులు, ఇవి యొక్కొక్క వేదంబున కొకొసి సూత్రంబులు. పూర్వోక్తలీల నమరు నైదు కల్పమ్ములు నాఱంగ మ్ములును వినుండు—

తే.గీ. ధరణి నక్షత్ర కల్ప విధాన కల్ప
శాంతి సంహిత కల్పముల్ సరసత నివి
దాన కల్పము శిక్షాప్రధాన మంగ
షట్క మిరవగు కర్మ ప్రశస్త మగుచు.

మ. మను కాత్యాయన విష్ణు దక్ష గురు యామ్యంబుల్ తగన్ గౌతమం
బును శాత్యాయన యాజ్ఞవల్క్య హరితంబుల్ వ్యాస వాసిష్ఠ శో
భన సంవర్త పరాశరాత్రి లసదాపస్తంబముల్ భార్గవం
బ నగా మేల్స్మృతు లొప్పు శంఖ లిఖితాఖ్యన్ గూడి పద్దెన్నిదై.

వ. ఇవియె ధర్మ శాస్త్రంబులగు న్యాయతర్క మీమాంసాద్వయ సాంఖ్యయోగ శాస్త్రంబు లాఱు ప్రధాన శాస్త్రంబులు. భరత శిల్ప కల్ప కళా స్వరాశ్వ రత్న శాస్త్రంబులును, ఆయుర్గాంధర్వ ధనుర్వేదాది వేదంబులును, ఉపవేద శాస్త్రంబులనందగు, నింక నాగమంబుల తెఱంగెఱింగించెద—

సీ. వైఖానసము భాగవతము బుగాగము
పాంచరాత్రంబులు వైష్ణవమును
వాసుదేవార్చనా వైభవములు దెల్పు
శైవ దీక్షలు మహాశైవ సోమ
ములు శైవ సిద్ధాంతమును జిదంబర వివ
రణ మాకులమును సరవిని బెక్కు
భేదంబులన్ శివప్రియకర పూజ లి
య్యాఱును వివరించు, సౌర బౌద్ధ

ఆ.వె. మునులు గణపతి యుది వెలయు దేవి పరమ్ము
లగుచుఁ బదియునాల్గు నమరు బెరసి
యిరువదెనిమిదగుట నిందు రమాధీశ
పరము లైదు నేరుపఱతు వినుఁడు.

కం. వేదోక్త మంత్ర తంత్రము
లాదిగ వైఖానసార్చ నా రూఢిఁ బెగుక
శ్రీ దగు వేంకట ఘటికా
ద్ర్యాదుల ముఖ్యమ్ము లగుచు నతితంత్రములన్.

వ. అదియు వైఖానస మరీచి భృగ్వత్రులు ప్రవర్తకులు గా బలిపురావాస క్రియాధికారంబు లాదిగా నిరువదెనిమిది తంత్రంబులం బరగియుండు.

కం. భాగవతాఖ్యంగల్గిన
యాగము మిది నీల భూధరానంతములన్
బాగగు బహుభేదార్చన,
నాగతిఁ బూజనలు యోగ్యమగు హరికింటున్.

కం. పదునెనిమిది బుక్కుల కా
స్పదమగు సత్పురుషసూక్త పద్ధతి పూజా
నిరతికిఁ దనరు బుగాగమ
మిరవుగ గృహదేవతార్చనేప్సితమగుచున్.

ఆ.వె. బ్రహ్మరుద్ర శక్రరాత్రులు మొని స
నగ్రిహాఖ్య లమర వరుస వేద
మనుర యొత్తినప్పు డచ్యుతార్చనకు గా
రచనఁ జేయఁ బాంచరాత్రమయ్యె.

వ. అది తంత్రక్రమం బయ్యె. వైష్ణవాగమంబు క్రియాయోగంబగు. క్రియాయోగం బగు శివాగమంబు లాఱునుం బదినాల్గు భేదంబులం బ్రవర్తిల్లుచుఁ బంచాక్షర్యాది జప భేద పార్థివ లింగార్చనాది లింగభేదార్చనామహిమలును దివ్యస్తవ వైభవోత్సవవిధానంబు లును వివరించు. సౌరంబు సూర్యోపాస్తియు, గాణాపత్యం బష్టావింశతి గణపతి పూజావిధులును, బౌద్ధంబు పాషండ క్రమంబులును విస్తరించు మఱియును—

తే.గీ. తనరు సింద్రాణి త్రిపురసుందరియు వాణి
య నైదు పదునాల్గు నామములు లతిశయిల్ల
గలవు తన్మామ సేవకాగమము లవియు
పంచ విద్యలు నా నిందుఁ బరిఢవిల్లు

వ. శ్రీవిద్యా కాళీ మాతంగీ శూలినీదుర్గలును సిద్ధా భువనేశ్వరీ వారాహీ పూర్వకంబు లగు విద్యలపురు. సాంఖ్యాయన వామకేశ్వర బద్ధా మహేశ్వర యామళాది

---

† ఇట నుత్తరార్ధమునఁ బ్రాస భేదంచినది

తంత్రంబు లమరు. భైరవా కాశదక్షిణా మూర్తి కల్పాదులనేకంబులును, రుద్ర భైరవ యామళ జ్ఞానార్ణవాది చతుర్దశ భేదంబుల మంత్ర తంత్ర యంత్ర జపహోమ దాన తర్పణ విప్రభోజన విధానంబుల వామదక్షిణాచారంబులం బ్రవర్తిల్లు వెండియు.

సీ. కౌర్మమాత్స్యాగ్ని లైంగ్యములు వాయు స్కాంద
తత షట్పురాణముల్ తామసములు
బ్రహ్మాండ వామన బ్రాహ్మ్య మార్కండేయ
బ్రహ్మకైవర్తముల్ పటుభవిష్య
ములు నాఱు రాజసంబు లురుభాగవత వై
ష్ణవ పాద్మ వారాహ నారదీయ
గారుడంబులు సాత్త్వికంబు లాది పురాణ
సమితి యష్టాదశ సంఖ్య నిట్లు

తే.గీ. నారసింహంబు శైవంబు సార విష్ణు
ధర్మ ముఖ్య పురాణముల్ తఱచు ఉప పు
రాణములు సంహితలును విరాజితములఁ
బదియునెనిమిది విద్యలై ప్రబలు నివియు.

వ. అగస్త్య సనత్కుమార, ఉమా మహేశ్వర, సూతసంహిత లాదిగాఁ బదునెనిమిదియగు నిట్లు.

ఉ. ఆరసి యీ పురాణ వివిధార్థములెల్ల గ్రహింప వేడ్కతో
మీ రిటు కోరికం బలుకు మేలిమి ప్రశ్నకు నుత్తరంబుగా
గౌరవ మొప్పఁ జెప్పెద వికాస మనస్స్థిరులై వినుండు దు
ర్వార మహాఘవారణ మపార శుభంబు హరి ప్రసంగమున్.

వ. అని పలికి.

ఉ. కంతునిఁగన్న తండ్రి సుదుకాంత నిశాంత హృదంతరున్ శుభా
త్యంత నిరంతర ప్రదు, ననంతు ననంతశయాను సర్వ వే
దాంత నితాంత సంతత దురంతవిహారు పరాత్పరున్ రమా
కాంతుఁ దలంతుఁ దచ్చరణకాంతి భజింతు నుతింతు నెంతయున్

ఉ. భాసుర వేదకల్పక విభాగిత భవ్య శిఖాగమోత్కళా
భ్యాసు ముని ప్రతోష దరహాసు వినిర్మల పేశలాతి గీ
ర్వ్యాసు మనస్సరోజ హరిదాసు పరాజనవాసు సంతతో
ల్లాసు మునీశు వ్యాసు సువిలాసు మదీశుఁ దలంచి మ్రొక్కెదన్.

తే.గీ. అనుచు హరిగురు వందన మాచరించి
యం చితోక్తుల నల శౌనకాదిమునుల
సావధానత వినుఁడని చతుర మధుర
రచన సూతుఁడు బల్కె ధీరతర మతిని

మత్తకోకిల. నిర్వికారుఁడు నిర్గుణుండును నిత్యుఁడుం విభుఁడాద్యుఁడుం
నిర్వికల్పుఁడు నిష్కళంకుఁడు నిర్మలుండు నిరీహుఁడుం
సర్వభర్తయు సత్యవర్తియు సర్వజీవదయుండు భా
ధూర్వహ ప్రణవస్వరూపుఁడు తొల్త ప్ర[illegible]మనం దగుం

కం. ఆ నిరుపమ,తర సత్య
జ్ఞానానందాత్మ తోడఁ గలసిన దగుచుం
దానున్నది లేనిదియై
పూనికతోఁ బ్రకృతి చేష్టపాలుపరయుండుం

తే.గీ. నిస్తరంగా(బ్ధి) కరణి సమస్త వస్తు
శస్తమై పూర్ణత నఖండ నిస్తులగతి
విస్తరిల్లు నపార గభస్తిసమితి
వాస్తవంబగు నంచితాభ్యస్త మహిమ

చం. జగములు సత్తు సత్యమని సార వివేకముచే నెఱుంగ వా
దగునది జ్ఞాన మయ్యెఱుకదాల్చి ముదంబెదఁ బాదుకొల్పటిం
పుగనది చిత్సుఖంబనఁగఁ బొల్చుఁ దదీయమహాత్సుఖంబు లీ
రగణిత మా నెఱుంగుటకు నారసి పల్కుట నాగమోక్తికిం

సీ. ఎలమి మహానుభావులు మానవులు తదా
నందశతంబు నింపొంద మనుజ
గాంధర్వమగు దేవగాంధర్వ మదినూఁట
నగు (గుణింపఁగఁ) బైతృకాఖ్య నటుల
చిరలోక లోకుల చిన్మదంబులు నూఱు
నాజానజానంద మహరునొకఁడు,
నవి నూఱు కర్మదేవానంద మానూఱు
పొందగు దేవతానంద మగుటు

తే. గీ. శక్ర జీవ ప్రజాపతి సరసిజాత
జాత పురుషాహ్వయంబుల శతగుణోత్త
రోత్తరాధిక్య మానంద మొనరు తుదిని
కలదు పురుషునియందు భాస్కరునియందు

వ. అట్టి పురుషానందంబె బ్రహ్మానందం బగుటకు వరుణ భృగు సంవాదం బెఱింగించెద.

చం. వరుణుని పుత్రుఁడా భృగుఁ డవశ్యతఁ దండ్రినిఁ జూచి బ్రహ్మమే
కరణిదియొ నాఁ దపంబనుడు గైకొని చేసిక నెద్ది నావుడున్
ధరఁగల భూతకోటివిదితంబుగఁబుట్టి నడంగ హేతువై
పరగిన యన్న మన్న పరిపాటి యెఱింగి నుతెద్ది నావుడున్

కం. ప్రాణమె బ్రహ్మంబనఁ ద
త్ప్రాణక్రమ మెఱిఁగి భృగువు బ్రహ్మము నడుగన్
రాణఁ ద్రిగుణక్రియా సం
త్రాణంబగు మనసు బ్రహ్మతత్త్వం బనుఁడున్

చం. వరుణభవుండు మానసము వారక నారసి బ్రహ్మ మెద్దినా
గురుఁడును జ్ఞానమే యనుఁడు కూరిమి మీఱ నెఱింగి బ్రహ్మమే
ర్పుఱుపు మటన్నచో, సుతుని ప్రౌఢిమ మెచ్చుచుఁ జిత్సుఖంబె శ్రీ
కరమగు బ్రహ్మ మా యెఱుక కల్గిన మానవుఁ డొందుఁ దద్గతిన్॥

కం. అని నిజ తనయునకిమ్మని
వినిపించిన వరుణువలన విజ్ఞానమునన్
దనరి భృగుఁ డట్ల బ్రహ్మము
గని మనె నని యతఁడు మౌనిగణముల కనియెన్.

కం. ఆ దిమతేజోనిధి యతఁ
డాదట లీలావినోదియై లోకములు
త్పాదింపంగఁ దలంచి మ
హా దయతోఁ జూడఁ బ్రకృతి యప్పుడ వొడమెన్

కం. అండత నవలంబన చే
నిండిన తత్ప్రకృతివలన నెరిఁ బెక్కగు బ్ర
హ్మాండములు త్రిగుణయుతములు
పొందుగ సప్తావరణ సమేతములయ్యెన్

చం. బహుళతఁ బద్మజాండములు భాసిలగాఁ బరుఁ డంతఁ దద్బహి
ర్విహితశుభాకృతిం దనరి విశ్వమయస్థితి వాసుదేవుఁడై
మహిమ నిదానమయ్యెడ రమాసతియుం దను గొల్వఁగా మహ
ద్వ్యూహవికృతి వ్యత్రిత పరివార సమేత విభూతి నేతయై

సీ॥ మహనీయ మణిహేమ మయ కిరీటంబును
కౌస్తుభమణి పతకంబు హార
కేయూర కటక సత్కృత భూషణంబులు
శంఖ చక్ర గదాసి శార్ఙ్గ కలిత
ఘనచతుర్బాహులు కాంచనవసనంబు
మేఖలా కింకిణీ మిళితకటియు,
నిందిరా సుందరీ మందిరవక్షంబు
డంబైన కంబు కంఠంబు గలిగి

తే.గీ. గరుడ సైన్యేశ పన్నగేశ్వరులు నిత్య
ముక్తు లంచితభక్తిసంసక్తిఁ గొలువ
హరియు సొంపొందు వైకుంఠపురము నందు
లీల శేషునిపైఁ బవ్వళించి యుండు.

కం॥ ఔదుంబర వృక్షంబునఁ
బాదగు తత్ఫలము లట్ల బ్రహ్మాండము ల
య్యాదిమ తనువున కంటె మ
హోదితమగు మాయకంటె నుజ్జ్వల మయ్యెన్

తే.గీ. మహదహంకార సురవర్త్మ మారుతాగ్ని
కమల పృథ్వులు నావరణములు గాఁగ
ప్రకృతిచేఁ గప్పఁబడి లెక్కపఱుపరాని
యండముల్ నిండె సకల దిగంతరముల.

ఉ. అండము లిట్లు చాలఁగ నయంబగుచున్ వర వాసుదేవుఁ డెన్
దండ సమస్తదిక్కుల నుదారత నిండఁగ మాయ యప్పుడా
చండతర ప్రభా విశదసారకళల్ గొని చొచ్చి యన్నిఁటన్
దండిగ నుండి తత్కమలనాభ విధానవిరాజమాన శక్

కం. అచ్చట నండంబులలో
నచ్చుగ శ్రీ విష్ణుతేజ మను తన కూటు
పొచ్చియత విరాట్పురుషుం
డెచ్చఁగఁ గనుపట్టెఁ బ్రకృతి హితసంగతి శేన్

కం. మును పెట్టినుంచు రత్నము
లనువుగ వెలినుంచ మెఱయునట్లన జగముల్
ఘనమాయాసంగతిఁ దా
త్మనువునఁ గనుపట్టె గిరి సదమ్రిమ యుతమై

తే.గీ. రమణ వీర్యమ్ము సత్యాదరస్థ మగుచు
వృద్ధిఁ దద్గర్భగోళమ్ము వెడలి రూప
మమరఁ గనుపట్టుగతిఁ బరమాణు కళను
బ్రికృతి ధరియించి లోక సూర్వడఁగఁ గనెను.

వ. అట్టియెడ——

ఉం. శిరములు పెక్కువేలమరఁ జేతులు కన్నులు పాదముల్ బహూ
దరములు కర్ణముల్ గలిగి తత్కనదండము తెల్లనిండి మే
నిరవుగ వానికిన్ మిగుల నెంతయు నొప్పఁగ సర్వలోక వి
స్ఫురణ నదీనదావని విభోజ్జ్వల లోల నిజాంగముల్ దగన్

కం. వర్ణాశ్రమా బ్ధిముని స్రా
వర్ణగిరి ప్రకర దేవవరముఖ మాహో
దీర్ణగతి మెఱయఁ దద్విభు
వర్ణితతేజమ్ము మిగుల వైభవ మెసఁగన్

శా. బ్రహ్మాండమ్ములు పాదభాగమున సంపన్నమ్ము గావించి త
ద్బ్రహ్మానేక మరుచ్చరాచరము లుద్యద్దివ్యదేహమ్ము గా
బ్రహ్మాంతస్తుతి పాత్రమై మెఱయు రూపం బాద్యమై యొప్పు
ద్బ్రహ్మాండోపరి నా త్రిభావమున నిత్యశ్రేయస స్థానమై

కం. పురుషుఁడు విశ్వమయుం డను
వరనామము లన్యులరయఁ వర్తింపవిలన్
పురములు దేహము లచ్చటఁ
బురణింపుచు నుండుకతనఁ బురుషుండయ్యెన్.

కం. విశ్వములన్నియు మేనున
శశ్వద్గతి నట్టియునికి సర్వాత్మకుఁడున్
విశ్వమయుండనఁ దనరున్
విశ్వాత్మకుఁ డగుటవలన విష్ణుం డయ్యెన్.

సీ. అది విరాడ్రూపమా నఖిలపూర్ణతఁ జేసి
క్షీరాబ్ధియం దాదిశేష శయ్య
శ్రీధరానీళలు సేవ యొనర్పఁగ
యోగనిద్రారతి నుండు మూర్తి
ప్రద్యుమ్నుఁ డనఁదగు ప్రాణికోటుల కెల్ల
నాధారమగుచుఁ దదాత్మ యైన
విష్ణుఁ డయ్యనిరుద్ధ విఖ్యాతి విలసిల్లు
పాతాళమున లోకపంక్తిఁ దాల్చి

తే.గీ. బహుశిరః పాణిపాద విభాసితుఁడును
ఘన సహస్రఫణాన్వితుఁ డనుపమాన
మూర్తి సంకర్షణుం డిట్లు, మురవిదారి
క్రీడఁ గావించు నిజమాయ తోడఁ గూడి.

కం. భోగార్థముగా బ్రహ్మం
బీగతి పరవాసుదేవుఁ డిందిరతో జ్యో
త్స్నాగత శశియును బోలెన్
బాగగు కందర్పకోటి భాసురలీలన్.

ఉ. ఏ సతిచూడ్కిచే జగము లిన్ని పరిస్ఫుట మందు నెప్పు పా
లే సతి సేయఁగా భువన మెంతయు నంతము నందు నట్టి ల
క్ష్మీ సరసీరుహాక్షి యొదఁ జెల్వగు భంగిఁ ద్రిపాద్విభూతి ది
వ్యాసమవైభవంబుగ మహాపురుషుండు వసించు నెంచఁగన్.

చం. జగములకెల్లఁ దల్లి వరసంపదకెల్ల నివాసభూమి యై
మగఁడెటనుండు నచ్చట రమాలలనాఖ్యఁ బొసంగి వెండియున్
దగు ధరణీస్వరూపమునఁ దాలిమి లోకములన్ ధరించి యొ
ప్పగు రసవాయు రూపముల నర్మిలి నీళయు నాగలీల పై

కం. మేలిమి చూపులచే ద
క్పాలామర తతికి సిరులపారము గాఁగన్
శ్రీ లెల్ల నైజ కళలుగఁ
జాలఁగ లీలావిభూతి సలుపున్ మఱియున్.

చం. అరుదుగ వేదసంతతుల యంగములన్ బ్రభవించు ఘర్మముల్
విరజయనా దనర్చునట వేదనలున్ రుజలున్ జరల్ సమ
త్సర మదడాంభికుల్ పొడముచందము లేవది హేయశూన్య మీ
శ్వరసమ నిత్యముక్తజనసంతతి యొప్పు నిరంజనస్థితిన్.

శా. చూడంగూడునె! రుద్రధాతృ దివిజ స్తోత్రంబు లా దిక్కునన్
గూడంగూడునె! నిత్యముక్తతనులన్ గ్రోధాదులచ్చోటునన్
వాడం గూడునె వేదశాస్త్రమత సద్వాదంబులం గాక వా
దాడంగూడునె! తన్మహామహిమ లుద్యద్బుద్ధి నెవ్వారికిన్.

కం. పరిఘ గతి విరజ వలగొని
పురి వరణోన్నత్య సౌధపుణ్య సరో భూ
సుర వీథీ మణివేదీ
తరు మోదీకృతత వెలయు ధన్యోజ్జ్వల మై.

సీ. సరవితోఁ జండప్రచండ భద్ర సుభద్ర
జయ విజయులు విధాతయును ధాత
ప్రాచ్యాది దిగ్ద్వార పాలకుల్ కుముదుండు
కుముదాక్షు పుండరీకులును వామ
నుండల సర్వనేత్రుండును మొగి సుప్ర
తిష్ఠిత బలులందు దిగధిపతులు
పరవాసుదేవుండు పద్మయుఁ బ్రద్యుమ్నుఁ
డనిరుద్ధ సంకర్షణాగమములు

తే.గీ. శాంతమూర్తియు రతియు నిచ్ఛలు వసింతు
రాది వరణంబునందుఁ బ్రాగాది గాఁగ
నమరు రెండవయది కేశవాదిమూర్తు
లవల మాత్స్యాది మూర్తుల యావరణము.

తే.గీ. నవనిధులు సత్యుఁ డచ్యుతానంతవిభులు
సైన్యపతి ముఖ్య హరిపార్శ్వ చరులు నాల
వయదియగునట్టి మేటి యావరణమునను
వెలయు చుండుదురెప్పుడా విష్ణుఁ గొలిచి.

కం. వేదములు ఋక్కులున్ గ్రతు
భేదములున్ గరుడ జంఘభేదులు ధర్మం
బాదటు సావిత్రియు లో
కాదులు నుండుదురు పంచమావరణమునన్.

సీ. అట్టి సప్తావరణాళి మధ్యంబున
నప్రావృతాన్విత మగుచు దివ్య
సభ యొప్పు సురసిద్ధ సాధ్య మరుద్గణ
వసు సేవ్య మగుచుఁ బావకసహస్ర

భానుకోటి ప్రభా భాసుర వృత్తి పై
నందు సౌందర్య మహాప్సరసలు
సకల గణంబులు సన్నిధి సేవింప
బ్రహ్మాగ్ని విధుల సత్ప్రభల మేని
తే.గీ. మహిమ వెలయ నరుణాభ్యయన్ మందిరమునఁ
బ్రబల భూషణదీధితుల్ ప్రజ్వరిల్ల
భాసురస్థితి నప్పరవాసుదేవుఁ
డందు శ్రీ లక్ష్మితోఁ గూడి యధివసించు.

వ. ఆ వైకుంఠపురి యండ్లోపరి యగుట నప్రాకృతంబును ముక్తిసాధనంబును ననన్యగోచరంబును వేదవేద్యంబునునై విలసిల్లుననిన మునులప్రాకృతలోకవర్తి యగు నవ్వాసుదేవుండు ప్రాకృతలోకంబున నెలంగు కుట్టులని యడిగిన గిరిజకుఁ బరమేశ్వరుండానతిచ్చిన తెఱంగెఱింగింతు నని సూతుండు శౌనకాది మునుల కిట్లనియె—

చం. పొలుపుమఁ ద్రిభాగయుక్తమగు భోగవిభూతి వహించి లీలకై,
యలపడు నొక్కభాగమున నండము లెల్ల ధరించినట్టి, యా
జలజదళాక్షుఁ జేరు సరసమ్మగు భోగవిభూతి నెన్న ని
శ్చలము నిరంజనంబు నతిశాశ్వతమై విలసిల్లు నెప్పుడున్.

శా. అంతన్ శ్రీహరి వాసుదేవుఁడు వినోదార్థంబు భావింప, న
త్యంతాసన్నత మాయ భక్తిమెయి సాష్టాంగంబు గావించి దా
నెంతే వేడుక సన్నుతింపఁ గృపతో నీక్షించి గోవిందుఁడా,
క్రాంతుడై ప్రకృతిన్ ధరించి కడు వేడ్కన్ నిండె బ్రహ్మాండముల్.

కం. సత్త్వ రజస్తామస గుణ
సత్తాఢ్య ప్రకృతిఁ బూని సర్వేశ్వరుఁ డా
తత్త్వ స్వరచిత సృష్టి మహ
త్తత్త్వము బుట్టించి సగుణ ధామ స్ఫూర్తిన్.

తే.గీ. అం దహంకార ముదయించి యందు వలనఁ
బంచతన్మాత్రలు నొనర్చి ప్రబల వాటి
వలన నలపంచభూతముల్ గలుగ నందు
నివ్వటిలు క్షీరవారిధిఁ బవ్వళించి.

కం. హరి లోకసృష్టి సేయఁగ
నిరుపమగతి యగుచు యోగనిద్ర వహించెన్
వర నారశాయి యగుటన్
నరుల కడన్ వెలఁగు వలన నారాయణుఁ డై.

ఉ. లీలగ విష్ణునాభికమలీకృత చారుసరోజ మయ్యెడన్
జాలఁ బరిస్ఫుటంబగుచుఁ జయ్యనఁబుట్టెఁ జతుర్ముఖుండు త
త్పాలితుఁడై తపంబు సలుపన్ హరి మెచ్చి వరంబు లిచ్చినన్
జాలె నతండు సృష్టివిధి చాతురికిన్ ఘనమేధ సొంపునన్.

వ. అట్టి చతురాననజనక నాభిసరోరుహుండగు నారాయణునకు నాగారం బైన క్షీర పారావారంబు.

శా. శ్రీరామామణి పుట్టినిల్లు హరికిన్ జిత్తంబు రంజిల్లు సా
రారావంబుల నుప్పతిల్లు సొబగారయ్యారంబు వాటిల్లు ష
ట్పారావార వర ప్రభావ శుభ శుంభత్స్ఫూర్తి వర్తిల్లు నా
క్షీరాంభోనిధి నెన్న శక్యమె! ఫణిశ్రీ నేతకున్ ధాతకున్.

సీ. గుఱిసెన్న నెఱమిన్న తరి సన్నరుచిఁగన్న
విను మన్నియల యొన్నికనుఁ బొసంగి
తెలితళ్కు లల గుళ్కు కళ జిల్కు బలుబెళ్కు
కోడెబేడిసగమి పోడి మలరి
నెరపూన్కి హా(రి) కున్కి మెరమన్కి మినుజిన్కి
బలువైన వలపుటావటము గలిగి
పగచివ్వ వగబువ్వ తగ రవ్వలుగ నవ్వ
గల మునివినతులు నలువదనరి

తే.గీ. పరిపరివిధంపు గరిమంపుఁ బెరిమ నింపు
మించుటంచెల రాయంచ లంచితముగ
మెఱుఁగు జిలిబిలి వెలిదమ్ము లలము కొనఁగ
నమరి విలసిల్లు క్షీరాబ్ధి యతిశయిల్లు.

మత్త. వెండికొండల వంటియున్నతి విశ్రుతంబగు కూర్మముల్
మెండుగా నొకఁడొంటికంటెను మిక్కుటంబగు నక్రముల్
చండసంచర దండకాండ సుజాత రీతుల మీనముల్
దండినుండఁ గరళ్ల తుంపర తండ మెల్లడ నిండఁగన్.

ఉ. ఒప్పగు నప్పయోమయ మహాంబుధి మధ్యమునన్ సితప్రభల్
గప్పుచు నాలుగెన్మిదుల లక్షల యోజనముల్ వెడల్పుగా
గొప్పగు సైకతం బొకటి కోటిశశి ప్రభమించు దీవియై
యెప్పుడు విస్మయాకరము నింపగు దివ్యతరు ప్రసంగతిన్.

శా. పూళుం బిండెల నాకు జొంపముల నొప్పున్ సత్ఫలశ్రేణిచే
తేవన్ జూడ్కికి విందొనర్చుచు నిరూఢిన్ వాసనల్ వింతఁగా
దేవ ప్రీతిదమౌ సువర్ణకదళీ దివ్యప్రభారేణు నా
నా వైచిత్రులనెన్న దిన్నెలఁగడున్ రాణించుచున్ బెంచఁగన్.

చం. మినుకుకడాని చెక్కడపు మేలిమి మానికపు స్వినోదపున్
బనిహరువుల్ చెలంగఁగ శుభంబును రమ్యము సప్తలక్ష యో
జన పరిణామమున్ విబుధసన్నుతమైన విమాన మొప్పు నం
దనుపమ శేషశయ్య రమ యయ్యవనీసతియున్ భజింపఁగన్.

సీ. పాదశిరఃకర్ణ బాహూరు నేత్రముల్
మోహనాకృతులటు మురువు చూప
పరఁగ నిన్నూటి యేబది యోజనమ్ముల
(శ్రీ) దివ్యదేహమ్ము చెలువుగులుక
శ్రీ వత్సకౌస్తుభ శ్రీ విభానివహమ్ము
దిక్కుల నెక్కొన మిక్కుటముగ
ప్రస్ఫురన్మిగనిగ ప్రకటిత బ్రహ్మసూ
త్రంబు భుజాంతర స్థలిని మెఱయ

తే.గీ. వైజయంత్యాది మాలికల్ వైభవముగ
మేరు సంకాశుఁడై భక్తమిళిత హృదయ
వీక్షణానంద సంధాన (ద) క్ష చరణ
రుచి మెఱయఁ జక్రి యోగనిరూఢుఁడగుచు.

సీ. వెలయ నిర్వదియైదు వేల యోజనముల
నరవింద సదృశమౌ నంఘ్రియుగము
నందుల కైదు వేలగు యోజనముల మీ
సై మకరాకృతి నమరు జంఘ
లేఁబది రెండు వేలిభకర పరిమాణ
మొనర నిద్దంబు లౌనూరుయుగము
నంతయి వృత్తమై యలరు కంఠంబు నేఁ
బది వేల నేనూఱు వదన శశియు

తే.గీ. చంపకము భాతి నాస పంచ శతసంఖ్య
లక్షయోజనముల్ సు విలాసబాహు
లుంగరమ్ములతోఁ గూడ నంగుళములు
దనరు నిడివి సహస్రయోజనము లగుబు.

కం. విరివిన్ సహస్రయోజన
పరిమితమున్ బుండరీక పత్రసదృశమై
కరుణామృత ధారా జగ
దురు కారణ నేత్రయుగము వొప్పఁగ మఱియున్.

తే.గీ. మకరకుండల కర్ణయుగ్మంబు మెఱయ
నర్ధ చంద్రాభమగు ఫాల మమిత రత్న
హేమమయ కోటిసూర్య విభాసహితము
నైన మేటి కిరీటంబు నమరి మెఱయ.

ఉ. చారుతర ప్రభాపటలసంగతమై తగి కోట్ల సంఖ్య క్రొ
క్కాఱు మెఱుంగు లేక గతిఁ గైకొని నిల్చిన రీతి సారహే
మోరు వరాంశుకంబు కటి నొప్పఁగ వక్షమునందు నంబరా
ధార శుభర్క్ష పంక్తుల విధంబున హారములా రహింపఁగన్

సీ. నవరత్నమణిమయ నానాప్రభాయు (గ్వి)
మానంబునందు సమస్తదేవ
మానులు జయజయమహిత శబ్దంబుల
సేవింప నచ్చరల్ చేరి నాట్య
గతులఁ బ్రౌఢిమ చూప గాయక తుంబురు
నారద వీణా నినాద మెసఁగ
కల్పప్రసవ ధూపకాశ్మీర కస్తూరి
కా సౌరభమ్ములు గ్రందుకొనఁగ

తే.గీ. ఘనచతుర్ద్వారబంధుర కనకఖచిత
మందిరంబున నిత్య సన్నుతులు గొల్వ
గరిమఁ బ్రహ్లాదముఖ భక్తగణము, లూడి
గములు గావింపఁ బేరోలగమున నుండి.

తే.గీ. లలితమణి హేమ భూషణాలంకృతాంగు
లగుచుఁ జండప్రచండులు సమరవీర
శక్రశక్తి బలోత్కటుల్ సరవిఁ దూప్వ
వాఁకిటను గొల్తురెపుడు నవ్వారిజాక్షు.

కం. కుముద కుముదాక్ష శక్తులు
యమగణపతు లమితగణ సమన్వితులై శ్రీ
రమణాలయ యామ్య ద్వా
రమునన్ సేవింతు రతివిరాజిత భక్తిన్.

ఆ.వె. శంఖకర్ణ వరుణ సర్వనేత్రులు శతా
నీకుఁ డాది గాఁగఁ జోకఁ దనరి
మహిమ మెనరఁ బశ్చిమద్వారమున నుండ్రు
కమలనయను గొల్చి ప్రమద మెసఁగ.

కం. పద్మాక్షు ధనదదుర్గలు
పద్ముఁడు చంద్రుండు మఱియుఁ బార్శ్వచరులౌ త
త్పద్మోత్తర గోపురమునఁ
బద్మాధిపుఁ గొల్చియుంద్రు పరమప్రీతిన్.

శా. లావణ్యంబున మించి నీలగిరి లీలన్ బొల్చు నెమ్మేను ను
శ్రీ వత్సాంకితవక్ష మాశ్రిత జనక్షేమంకరా పాంగముల్
ప్రావీణ్యాన్వితముక్తమానస లసద్భక్తాంఘ్రి పంకేజముల్
దేవప్రస్తుతి గల్గునట్టి పరముల్ దేవేశుఁ గీర్తించెదర్.

కం. క్షీరాబ్ధినుండు శ్రీమ
న్నారాయణు విష్ణు నళిననాభుఁ దలంపన్
వారలు సుఖులై తత్పద
వారిజములు గాంతు రనిన వైభవ మరుదే!

ఉ. ఈ గతి నుండు విష్ణుఁ బరమేశ్వరు నాత్మఁ దలంచిరేని య
య్యోగివరేణ్యు లెంతయు శుభోచిత లీలఁ దదీయసన్నిధిన్
బాగుగనుండి తాపములఁబాసి సుఖస్థితి నంత నమ్మహా
భాగుని దివ్యదేహమున బాగుగఁ గూడుదు రైక్యవైఖరిన్

కం. ఏ తత్పుణ్య చరిత్రము
ప్రాతః కాలమ్మునందుఁ బఠియించిన వా
రా తత సౌఖ్యాన్వితులై
పాతకములఁబాసి ముక్తిఁబడయుదు రెలమిన్.

తే.గీ. రేపకడ మాపు స్మరియింపఁ బాప మడఁగు
నిశఁబఠించిన పుణ్యుల కెసఁగు సుఖము
ముద్గలుఁడు వేడ నిది ధాత మున్ను దెలిపె
క్షీరసాగర మహిమ మచ్చికదలిర్ప.

వ. అని గిరిజకుఁ బరమేశ్వరుం డానతిచ్చి వెండియును,

తే.గీ. అట్టి క్షీరాబ్ధిశాయి యగు నబ్జనాభుఁ
డూహ మెఱయఁగ రెండవ వ్యూహమునకుఁ
బ్రభుతఁ బ్రద్యుమ్న సంజ్ఞచే విభవమొందె
నంత నజు ఫాలమున ఘర్మమమరఁ బొడమి.

చం. ఘనతర బుద్ధ్యదప్రతిభఁ గైకొని ధాత్రిఁబడంగ నందు (నే)
జననము నందితిన్ హరినిజ ప్రకటాంశము దాల్చి శూల శో
భన కర సజ్జటా మకుట భాసురవైఖరి నంతఁజేరి యా
వనజజుఁ జూచి యేమిపని పంచెదొ నేయుదునన్న నాతఁడున్.

మ. ననుసంకర్షణు నంశఁబూని జగముల్ నాశమ్ముగావించు న
ప్పనికిన్ బూన్చిన నియ్యెడంటి వినుమో పద్మాక్షి ! క్షీరాబ్ధి శ
య్యను బ్రద్యుమ్నుఁడు నైజతేజమున నెయ్యంబొప్పఁ గావించె సృ
ష్టిని వాణీపతికిన్ సహాయుఁడగుచున్ జెన్నొందు లీలాగతిన్.

వ. అది యెట్లంటేని—

సీ. శిరమున నభము భాసురముఖంబున నగ్ని
నింద్రుని విప్రుల నిలమిఁ జెవుల
దిక్కులఁ గన్నుల దినకరు నాసిక
వరుణుని మిత్రునిఁ గరయుగమున
సకలామర దినర్క్ష సంఘ దిక్పాలుర
ప్రాణంబులన్వాయు పటలము మది
(నరి) నాభినంతరిక్షము కుక్షి జగముల
నుజ్జ్వల ద్వాపుల మహోదధులను

తే.గీ. మేహనమునఁ బ్రజాపతుల్ మేటి కటినిఁ
బితరు లూరుల వైశ్యులు గ్రతువు లఖిల
పశుమృగాండ తతి రోమపంక్తి వనులు
శైలములు శల్యముల నాడిసమితి నదుల.

కం. పదముల శూద్రులు భూమియు
హృదయంబున మరుఁడు భానుకేక్షణముల సం
పదలున్ షడృతు వేళలు
నుదితంబుగఁ జేసె నిజమహోజ్జ్వల లీలన్

వ. మఱియు నతల వితల సుతల రసాతల తలాతల మహాతల పాతాళంబు లధో భాగంబులును, భూర్భువస్స్వర్మహర్జన స్తపస్సత్యలోకం బులు నాభ్యూర్ధ్వాంగంబులు నుం గా విరాడ్రూపంబు ధరియించె నతండు క్షీరాబ్ధిశాయియుం గూటస్థుండును విరాట్పురుషుండును విశ్వమయుండు ప్రద్యుమ్నుండు ననం బరగి వెండియు :—

సీ. అణుపరిమాణుఁడై యఖిలదేహంబుల
నేకాకృతిని జీవుఁడెలమి నున్కి
నచట నంతర్యామియై కాలధర్మముల్
క్రమము దప్పకయుండు గతుల నరసి
సకల చరాచరసంఘములకు నైజ
కర్మంబు లెయ్యెడఁ గలుగ వలయు
నప్పు డట్టివ కల్గునట్టుగ వసియించు
ననిరుద్ధనాముఁడై యబ్జనాభుఁ

తే.గీ. డమరు సంకర్షణాఖ్యచే నవనిఁదాల్చి
విలయవేళల ముఖజ్వాలరవిహ మహోగ్ర
వీతిహోత్రునిచే లోకవితతి నణఁచు
నతివ! తెల్పితి నాల్గువ్యూహముల తెఱఁగు.

మ. గుఱి నండోపరిఁ గారణాఖ్యమగు వైకుంఠమ్మునన్ క్షీర సా
గర సీమన్ జనకోటి యాత్మల వికాసస్ఫూర్తిఁ బాతాళ గ
హ్వరసీమన్ బరవాసుదేవుఁడను తేవన్ బొల్చు ప్రద్యుమ్నుఁడున్
ధరనై నత్యనిరుద్ధమూర్తియు ననంతస్వామియు న్నాదగన్.

కం. అని యాత్రిపాద్విభూతియు
ఘనతఁ జతుర్వ్యూహములును గౌరికి శివుఁ డి
ట్లనుచుఁ దెల్పుట విది చది
విన వినినన్ శుభము లొదవు వృజినము లుడుగున్.

వ. అనిపల్కి రోమహర్షణి వెండియు నిట్లనియె

ఉ. తామసయుక్త విగ్రహముదాల్చి రమాధవుఁడుండు శేషుఁడ
న్నామ మనంతసంజ్ఞయు ఘనమ్ముగ సర్వచరాచరస్థ శో
భా మహితోర్ధ్వలోకములు భవ్యకిరీటవినూత్నరత్నముల్
గా మహిమన్ సహస్రఫణ గౌరవ మాభువనంబు నిండగన్.

కం. గంగా ప్రవాహసంగతి
రంగచ్ఛశి కిరణ భరణ రాజితహిమవ
త్తుంగాంగ ద్యుతితతి ధృతిఁ
బొంగుచు దశదిశలనెల్లఁ బూర్ణము గాఁగన్.

సీ. ఏ కకుండలములను బ్రాకటు నవరత్న
భరితంపు కటకముల్ బాహుపురులు
మౌక్తికహారముల్ మణి కిరీటమ్ములు
హల ముసలములు రత్నాంగుళీయ
కస్ఫురత్కంఠ కమనీయ బాహువుల్
కనకాంబరావృత కటియు దివ్య
గంధానులేపన కల్ప ప్రసవదామ
సౌరభంబులు దిశాసమితిఁ బర్వ

తే.గీ. ధూప పరిమళ మేళన దీపితాంశు
క స్ఫుట వితానశృంగార కనకరత్న
సభ సుధోపమ మధుపాన చలితరక్త
ఘూర్ణితేక్షణుఁడై యుండు కొలువునందు.

చం. శిరముల రత్నదీధితులు చెన్నుగ దిక్కులఁ జెల్వు నింపఁగా
సుర గరుడోరగాంగనలు సుందరరూప విలాస భాసురా
కరగతి నాటుపాటల వికాస మొనర్పుచుఁ జేరి కొల్వ నా
మరముని దైత్య దానవులు మానిత భక్తి భజింప నింపుగన్

కం. మంగళహారతులిడి నా
గాంగనలును యక్ష కిన్నరాబ్జాతముఖుల్
సంగతి నిఱుగెలఁకులఁ జోఁ
కం గొలుతు రనంతు ననఘు కడువేడుకలన్.

సీ. తత్ప్రభావము నెన్న ధాతయుఁ బార్వతీ
నేతయు సురమునుల్ నేర రహిన
నితరుల కలవియె ! ధృతిఁ దలల్ కదలింప
సకల లోకంబులు చలన మొందుఁ
బ్రీతి పద్నాలుగు జాతుల దేవతల్
గొలుతు రా విభుని నెక్కుడగు భక్తి
వారెల్ల వేర్వేఱ వర్ణింపుచోఁ దద్గు
ణావళి మిగుల ననంతుఁ డయ్యె

తే.గీ. వ్యాళకాంతా కరాబ్జ పావన సుగంధ
గంధ మాఘ్రాణ మొనరించి ఘనత నిశ్వ
సనము గావించి దిశలఁ దత్సౌరభంబు
నింప గర్గుఁ డెఱుంగుఁ దన్నిత్య మహిమ.

తే.గీ. అట్టి సంకర్షణుని మహిమాతిశయత
విష్ణుచక్రంబు చీఁకటుల్ వీఁకఁ దఱిమి
దుష్టనిగ్రహమును ఘన శిష్టపాల
నంబు సేయుచు మెలఁగు నిత్యంబు నచట.

శా. కూర్మం బావరణాంత సంస్థితిని దత్క్షోణి భరప్రక్రియన్
గూర్మిన్ జెల్వగు దాని మీఁద జగముల్ క్రోడంబు దంతంబు చేఁ
బేర్మిన్ బూనఁ దదీయ సంగతగతిన్ బృథ్వీధరేఖాళి యున్
శర్మాధిక్యము పూని శేషుఁ డమరున్ జాతుర్య ధుర్యస్థితిన్.

ఆ.వె. అనుడు శౌనకాదు లనఘాత్మ! పరమాను
దేవువలన సృష్టి భావ మెందు
వలనఁ గలిగె దెలియఁ బలుకవే! యనవుండు
సూతుఁ డిట్టులనియెఁ బ్రీతి తోడ.

చం. ప్రకృతియనందనర్చు బహుభంగుల నుండుట చేసి మాయ యా
సకల విచిత్ర సృష్టి నది జ్ఞాననిరుద్ధత చే నవిద్య నాఁ
బ్రకటము నందుచున్ ద్రిగుణ భావము నందుచుఁ గారణమ్ము నా
నొకటియ యై నిదానమన నొప్పు గుణమ్ములు వేఱువేఱుగన్.

కం. వినుఁడదియె మహత్తత్త్వము
గనుచు నహంకార భూతగణ తన్మాత్రల్
జనియింపఁజేసి వరుసన్
దన గుణములఁ బ్రబలఁ జేసెఁ దత్త్వములఁ దగన్.

తే.గీ. సరవి సాత్త్వికంబు జ్ఞానకర్మేంద్రియ
చిత్తములను గనియె హత్తి తామ
సంబు గనియె భూత జనక తన్మాత్రల
రాజసంబు తమకుఁ దేజమెసఁగ

సీ. శబ్ద తన్మాత్రఁ ఖమ్మ్ కారమును దాని చే
స్పర్శంబు స్పర్శచేఁ బవనుఁ డమరె
తదనిలజము రూపతన్మాత్ర రూపత
న్మాత్రచేఁ దేజంబు పాత్రమయ్యె
తేజో భవంబగు ధృతి రసతన్మాత్ర
యా రస జనితమై నీర మమరె
నంబుల గంధంబు నట గంధ తన్మాత్ర
చేత ధరిత్రి సంభూతమయ్యె

తే.గీ. మహ దహంకారభూత సివహము కార్య
మునకు గా నొక్కటిగఁ జేసి ముఖ్యలీల
లోకకారణ చయము సప్తీకరణము
చేయుటకు రెండు భాగముల్ జేసి యొకటి.

తే.గీ. కమల జాండమ్ములకు వరణములు నొకఁట
చేతన స్థిత దేహముల్ చేసె నొకఁట
సృజన రక్షణ విలయముల్ చేయుటకును
దానె యై శార్ఙ్గి వెలయు మాయానిరూఢి.

కం. గాత్రముల సప్త ధాతు వి
చిత్రత మహదాదు లమరు శ్రీ విభు నాజ్ఞన్
ధాత్రి మొదలొక్కటొకటి జ
గత్ప్రాణత దశక వృద్ధి గను వరణమ్ముల్.

తే.గీ. ఇట్లు తత్త్వాళి జగముల నెసఁగఁ జేసి
క్షీరసాగరశాయి యై శ్రీ ధరుండు
నాభి పద్మంబునను నళినజుని గాంచి
సృష్టికారణుఁ గాఁగ శిక్షించె నెలమి.

కం. క్రమ భూతసృష్టి పరిమిత
మమరంగ సమష్టి సృష్టియగు వ్యష్టియనాఁ
గామరొప్పు సృష్టి యయ్యెన్
గమలజముఖ దేవజంతు గణభవ మరయన్.

తే.గీ. చేతనా ద్వారకం బను రీతి నమరు
నా చతుర్ముఖ జనన పర్యంత మవల
చేతన ద్వారకంబు విఖ్యాతి సకల
జంతు సంభవ మంతయు శాస్త్రి రూఢి.

ఉ. ఆరయుచో జగమ్ములు రమాధిపు మేనునఁ జిచ్ఛరీరి యా
వారిజనాభుఁ డెన్నఁగ నవారిత కారణ వృత్తు లన్నియున్
దా రహిఁ దాల్చు నెయ్యెడ నుదారతఁ గుంభపటు ప్రవృత్తికిన్
గారణముల్ విభేదమగు కైవడి గాఁగ మహత్త్వ వైఖరిన్.

తే.గీ. మేలి ప్రకృతి వెలార్ప నిమిత్తమచటఁ
గలుగు భూతములొగి సహకారి ప్రాణి
పూన నిర్ణయగతి స.పాదాన కార
ణాకృతుల్ బూను తగు నవస్థాంతరముల.

కం. మేలిమి తత్త్వము లిరువది
నాలుగు తత్త్వముల మించినన్ జీవుఁడు త
త్త్వాలన పడ్వింశుఁడు హరి
కాలం ౨౭ది తృణ*ము ( ఖ ? ) ప్రకాశత నమరున్.

ఆ.వె. అట్టి కాలరూపుఁ డాఢ్యుఁ డవ్యయుఁడైన
కమలనేత్రు నాభికమలమునను
కమలభవుఁడు పొడమి కమలాధిపుని పాద
కమల దర్శనమున కమల బుద్ధి,

చం. తప మొనరింపఁ గా మురవిదారి దయాకరతన్ బ్రసన్నుఁడై
యపుడతిభక్తి మీఱ వినయంబునఁ జేరి ముహుర్ముహుః ప్రణా
మ పరిమితాధి కస్తుతులు మానిన యా నళినప్రసూతి నైఁ
గృప దళుకొత్తఁగా ననియెఁ గేవలలోక విధాన దక్షుఁడై.

ఉ. నీవు సమస్తజీవముల నెమ్మి సృజింపుము నీకు సర్వమున్
భావగతంబగున్ భువన భార ధురంధరతన్ సహాయమై
కావలె నన్న వెల్ల నొడికంబుగ నే నొన గూర్తు నెప్పుడుం
గావునఁ జేయుమీ నలినగర్భ ! చతుర్విధసృష్టి నెమ్మెయిన్.

మ. అనినన్ బంకజ సంభవుండు నిటలాయతోజ్జ్వలత్పాణి యై
యనఘా ! పావన నామధేయ మునివంద్యా ! సర్వదేవాత్మ వి
శ్వ నిదానామితధీ ప్రసంగ ! గుణభాస్వచ్చారుచారిత్ర ! ధీ
ర నిరూఢా పరమాత్మ ! సర్వగ ! రమారామామనోరంజనా !

సీ. లీలా విహారైకలోల చిత్తమ్మున
జగములు గల్పింప సరవిఁ బ్రకృతిఁ
బుట్టించి త్రిగుణాళి భూతాత్మకమ్ము లౌ
తన్మాత్ర నిరసించి దానివలన
జగములు త్పాదించి జగముల లోపల
వెలుపల నీవ యై యిల చరాచ
రాత్మ సుస్థితుఁడవై యమిత తేజశ్శక్తిఁ
బ్రకృతి తోఁ గూడియుఁ బ్రకృతి దవుల

తే.గీ. కవల నెక్కటివై సాక్షివగుచు నుండు
నిన్ను నెన్నఁగ నేర్తునే నీరజాక్ష !
దైత్యకుల శిక్ష శ్రితజనోద్ధరణదక్ష
కల్ప కారణవీక్ష భాగవతపక్ష !.

---

* తృణవక ప్రకాశత, అని మూలపాఠము.

కం. నీ లీల లెఱిఁగి చాతురిఁ
జాలఁగ సృష్టింప శక్తి సమకూరదు నీ
పాలన్వసించి కొల్చెదఁ
బాలింపుము శోభనకర భవబంధహరా !

చం. అని నతియించు ధాతఁ గని యాత్మజ! నీమది సంశయమ్ము మా
ను నిఖిల భూతకోటుల వినూతన వర్తన లన్నిఁటి న్ననున్
గనుగొని (నీవు) నిర్గుణ వికాసు ననున్ సగుణప్రధాను గా
వినుతి యొనర్చి తిందులకు వేఱుక యయ్యె సరోజ సంభవా !

ఉ. నాదగు మేనలోకములు నవ్య విచక్షణ ! నీవు చూడఁగాఁ
బాదగునట్టి లీలఁ గనఁబట్టెడి నీకు మదీయమూ లస
త్ప్రాద నిరీక్షణన్ గలుగు భద్రములన్నియు నింక నిట్ట మ
ర్యాద ననుం భజింపుచుఁ గృతార్థతనుండుము నీరజాసనా !

కం. కనుగొనియెదు నన్నున్ నీ
వనువుగ సృజియించు సృష్టియందునఁ దేజః
ఖనియగు మద్వీర్యం బెం
దును నీకు బలం బొసంగుఁ దోడ్తో మహిమన్.

మాలిని. అని యిటు నియమింపన్ హరి చిత్తాంబుజాతం
బొనరఁగ హరి రూపం బొప్పఁ గన్గొంచు వేడ్కన్
వినమిత (శిరుఁ) డై యా వేధ శ్రీనాథు నాజ్ఞన్
బనువడ నొనరించెన్ భక్తితోడం దపంబున్.

కం. కావించి శౌరి వరమున
నా విధమ్ముఁగనిన జగములన్నియు బయలన్
దా వీక్షించి సృజించెన్
శ్రీ వెలయఁగ వర్తమాన సృష్టి యనంగన్ ॥

సీ. ప్రాకృత వైకృత ప్రకటిత ద్రవ్య గు
ణంబులు నాఁ ద్రివిధంబు లగుచుఁ
బ్రబలు మహత్తది ప్రథమ సర్గంబగు
... ... ... ...
... ... ... ...
... ... ... ...
... ... లీలమై సాత్త్వికా
హంకార మగునది యలరు నేన

ఆ.వె. వడి సమస్త జీవవరణ మబుద్ధి కృ
తంబు నైన యట్టి తామసంబు
నాఱవది యనెల్ల హరి లీలలైన ప్రా
కృతము లనఁగ సర్గ కీర్తితములు.

కం. ఆ యేడిటిది వైకృతమగు
భూరి నగనికుంజలతలు భూరుహ తతులున్
ధీరాండజ పశు మృగము ల
పారము లివి యష్టమంబు బహుధాకృతులన్.

సీ. అవనిపై మఱియును నావాస విజ్ఞాన
రహిత మాహారనిరతుల వస్తు
వులు ఘ్రాణమున నె నిచ్చలు నెఱిఁగెడు వృష
ఖర మహిషా జ సూకరము లుష్ట్రి
రురు కృష్ణ గవయాదు లరయ ద్విశఫములు
నిలఁ దురంగాదు లేనేకశఫము
లాఱునుం బంచనఖా ఖుభుగాది క
ద్వాదశమును మకరాది జలచ

తే.గీ. రములు కంక గృధ్ర రాజహంసా నేక
ఖగ గణంబులేక గణన మెఱయ
దిర్యగాఖ్య నొప్పు ధృతి నమానుష మైన
సర్గ మమరు నవమ సంజ్ఞ నలరి.

కం. ఈ మూఁడు వైకృతములు మ
హా మహిమన్ దేవ సర్గ మది యష్ట విధం
బై మెఱయు దశమముగ నది
తామరస జునకు స హాయతగ హరి నేనేన్.

సీ. సుర పితరులను కిన్నరకింపురుషులఁ జా
రణ పన్నగుల యక్ష రాక్షసులను
గరుడాప్సరసల భాస్కర మరుత్తుల సిద్ధ
సాధ్యుల భూత పిశాచములను
గంజుఁడెనిమిది గణములుగాఁ జేసి
యేను నాదను ? మోహ మెసఁగు చంద
నాదుల విషయేచ్ఛ హాదుగ క్రోధంబు
చిత్త విభ్రమములు జెంద నొవ్వి

ఆ.వె. యనెడి క్లేశగతియు నైద విద్యలు ధాత
కోటి యందుఁ గలుగఁ జేటుపఱచి
దాన ఫలము లేమిఁ దలఁచి చతుస్సనా
తనులఁ గాంచి వారి మనుజ తతిని.

వ. పుట్టింపుఁడని నియమించిన——

ఉ. వారలు వారిజాసనుని వాక్యము లారసి త్రోసివేసి సం
సారము రోసి యింద్రియ వశస్థితిఁ బాసి మురారి పాద పం
కేరుహ భక్తిఁ జేసి తన క్రేవ మెలంగమిఁ జూచి క్రోధి యౌ
నీరజసూతి భ్రూకుటి జనించిన పావకునందు నయ్యెడన్.

చం. పొడమిన నీలలోహితుఁడు పూర్వక వందన మాచరించి యొ
ర్యెడల మెలంగువాఁడఁ బనియేమి యనా విని ధాత వేడుకల్
గడలు కొనంగ నాదరణ గౌరవ మొప్పఁగఁ జూచి మేలు నా
నొడువు లితండు సేయునని సూన్ను విచక్షణ మొప్ప నిట్లనున్.

సీ. తనయ ! పుట్టినయెడ రోదనము చేసితి గాన
రుద్రనామత ననిరుద్ధ వృత్తి
ననిలా నలేందు జలార్క భూవ్యోమాశ
హృత్తపః ప్రాణమ్ము లింద్రియమ్ము
లను పదునొండుల నభవ మన్యు మను ఋ
త ధ్వజనామ ధృత వ్రతోరు
రేతస శివ కాళు లాతలి వామదే
వ మహాశు లనెడి పావన పేరాహ్వ

తే.గీ. యములు తత్సంఖ్య నేర్పడ నమరి ధీయు
నుమయు నేకయు నంబిక యూర్ధ్వ వీక్షు
సాధ్వి యిరయు నిలావతి శశియు సుధయు
ననెడి పత్నులఁ గూడి నీ వనఘ గరిమ.

చం. ప్రజల సృజింపు మంచుఁ బనుపన్ విని రుద్రశతమ్ము గాంచె న
య్యజుఁడగు నీలలోహితుఁ డనంతఁ దదాత్మజు లెల్లలోకముల్
గజిబిజి క్రిమ్మఁగ ధాత యొడికంబుగ వారలఁ జేరి యిట్లనున్
విజనధరం దపస్థితులు విష్ణు భజింపుఁడు మీర లింకిటన్.

కం. మీ సృష్టి చాలు ననవుడు
నా సరకములు వనులఁ జేరి యనుమోద తపో
వ్యాసంగ వృత్తి నుండిన
చో సరసిజభవుఁడు సృష్టి చొప్పరసి తగన్.

చం. బొటనవ్రేల నూరువులఁ బొక్కిటఁ ద్వక్కున ఘర్మబిందులన్
బటుతర నాసికాస్యకుల భావమునం గనుదోయిఁ బద్మజుం
డటఁ గనె దక్షనారదుల నా భృగునిం బులహున్ బులస్త్యు న
జ్జటిలు వసిష్ఠు నాంగిరసు శాంతు మరీచిని నత్రినిం దగన్.

తే. గీ. దక్షిణస్తనసీమను ధర్ము వెన్ను
నందు ధర్మము మృత్యువు నాత్మఁ గాము
ముఖమున న్వాణి నధరోష్ఠమునను లోభ
వర్తనంబును బుట్టించెఁ బద్మభవుఁడు ॥

కం. కను బొమలయందుఁ గ్రోధం
బొనరఁగ మేఢ్రంబునం బ్రమోదు లపానం
బునఁ బాపాశ్రయునిబురుతి
... ... కర్దముని విధాత సృజించెన్.

ఉ. ఒప్పుల కుప్పయై మెఱయుచున్న తనూభవ వాణిఁ జూచి తా
నప్పుడె మోహ ముప్పతిల సంగనఁ బొందఁగఁ బూను ధాత పెన్
దొప్పు లెఱింగి క్రూరతకుఁ జొత్తురె యంచు మరీచి ముఖ్యుల
య్యొప్పమిఁ జుల్కనాడిన నిజోచిత హీనతకున్ దలంకుచున్.

శా. దేహం బప్పుడె వీడినంత నది నల్దిక్కుల్ భరింపన్ దమో
నీహారమ్ములు పుట్టి దాని వలనన్ నీరేజ సంజాతుఁడ
త్యూహన్ వేఱొక దేహమంది నిజకృత్యోపాయ హీనస్థితిన్
మోహంబందిన వేదముల్ వొడమె మోముల్ దమ్ములన్ నాలుగై.

తే.గీ. మఱియు ధర్మగతులు మఖమంత్ర తంత్రము
లాశ్రమములు నడక లమరఁ బొడమె
తూర్పు మొదలుగాఁ జతుర్ముఖ ముఖముల
సాము బుక్చయములు శాస్త్రములును.

వ॥ అవి యెయ్యవి యనిన.

సీ. ఋగ్యజుస్సామంబు లెలమి నథర్వణ
హోతృకిత్సాధ్వర్యురీతి నుతియు
స్తోత్రయు నుద్గాత శుభ ఋక్చయంబు ప్రా
యశ్చిత్త ముఖ్య కర్మావళులును
ఘనత నాయుర్వేద గాంధర్వ వేదముల్
స్థాపత్యమును శిల్పశాస్త్ర సరణి
యమరఁగ సకలేతిహాస పురాణముల్
కర్మతంత్రాహ్నిక క్రము చయనము

తే.గీ. లఖిల సవనప్రవర్తన మనఘ ధర్మ
పదములగు సత్య శౌచ తపః కరుణలు
నాలుగాశ్రమములలోన లీలనొక్క
టొకటి నాల్గన వృత్తిక్రమోక్తిచయము

తే.గీ. వరుస నాన్వీక్షకీత్రయీ వార్తలఁ గల
న్యాయ విద్యాచతుష్కంబు నాయత మగు
వ్యాహృతి యుత గాయత్రి వర్ణపంక్తి
వదనమునఁబుట్టెఁ మదిఁ బ్రణవము జనించె.

కం. రోమత్వక్చర్మంబుల
నా మాంసస్నాయుశోణితాధికశల్యా
స్తోమములన్ మజ్జమునన్
ధామరస భవుండు గాంచెఁ దగు ఛందములన్

చ. వరుసఁ గకారముఖ్యమగు వర్గలు జీవుఁడకారమంగమున్
గరిమ శషాదియూష్మల వికాసము లింద్రియ పంక్తిగాఁగ న
య్యరలవలున్ స్వరంబులు నిజాత్మబలంబుగ నొప్పు శబ్దమున్
బరుఁ డజు లీలలున్ బొడమె భవ్యతదాఖ్య వహించి యాద్యుఁడున్.

కం. వ్యక్తావ్యక్తమ్ముల నా
సక్తమ్ముగఁ బరగుచున్న శబ్దబ్రహ్మ
వ్యక్తత నారాయణ నా
మోక్తిన్ భగవంతుఁ డమరు నొప్పగు మహిమన్.

ఆ.వె. అంత ఖ్యాత వీర్యవంతమౌ పురుష సం
తతిఁ దలంప విస్మృతం బటంచుఁ
దలఁచి ధాత పూర్వ తను సర్జనము జేసి
యప్పుడన్య దేహ మధిగమించె.

కం. అది యాదిఁ జతుర్వదనుఁడు
పొదలుచుఁ దగ మిథునసృష్టి పూని జగములన్
విదితముగ జనుల మిక్కిలి
యొదవించి కృతార్థుఁ డగుచు నొప్పెన్ మఱియున్.

సీ. అది యెట్టులన వినుఁడజుని దేహద్వయ
మున నొంటఁ బ్రజలు లేకునికి నొకఁట
జనములు గలుగుట చర్చింపఁ దత్తను
వందు భాగముల స్వాయంభువుఁడను
మనువును శతరూప యనియెడి కన్యయు
జనియించి మిథునమై సరవి మెలఁగఁ
నింపుతో నామేటి దంపతులకు వరా
త్మజులు ప్రియవ్రతోత్తానపాదు
తే.గీ. లాత్మజులు దేవహూతియు నా ప్రసూతి
యమరు నాకూతియన ముఖ్య రపుడు వొడమ
మనువు నాకూతి బుచికునికినిఁ బ్రసూతి
దక్షునకు దేవహూతి కర్దముని కిచ్చె.

కం. ఆ దక్షునికిఁ బ్రసూతికిఁ
బాదుగ నట నాఱుపదులు భాసుర రూపా
మొదలగు సుతలు పుట్టిరి
యాదట నచ్చెలులవలన నయ్యె జగమ్ముల్.

సీ. మఱియుఁ దామరస సంభవుఁడు వేత్రాక దేహ
మున యక్షరక్షస్సులను సృజింప
భక్షతి రక్షతన్ బల్కులఁ దన్నామ
ముల భజించిరి వెండి నలువ యపుడు
సాత్వికతనువున సరవి దేవతలఁ బు
ట్టించి వీడిన దేహమంచితముగ
నది యహోరాత్రంబులయ్యె వేఱొక్కటఁ
గనిన రక్షస్సులు వనజభవుని
తే.గీ. బట్టి రతి సల్పఁగదియఁ దత్పటు శరీర
విరహితము సేయ సంధ్యనా వెలఁది వొడమి
మోహమగ్నులఁగావించె మోహ బానఁ
బితరు లుద్భవ మందిరి పేర్మిఁ దనర.

చ. వనజభవుండు వెండియును బాగుగ గాత్రములన్ గుణమ్ములన్
మనసున సంగకమ్ముల క్రమంబున దేవగణాళి నప్సరో
జనమును బ్రహ్మమానసుల విశాలజగత్పరిరక్షణ క్రియా
ఘన బహుకాల వస్తుగణ కల్పనఁ జేసె మహానుభావతన్.

తే.గీ. మహదహంకార భూతముల్ మఱియు నింద్రి
యములు పదునొండు ప్రాణంబులైదు ప్రకృతి
వఱల నిరువదినాల్గు తత్త్వమ్ము లవల
జీవుఁ డవ్వల పరమాత్మ స్థిరత వెలయు.

కం. ఇరువది యేడవ తత్త్వము
పరమాత్మాకృతియ యగుచుఁ బరగెడు కాల
స్థిరవైఖరి యెఱిఁగించెదఁ
బరగు పరబ్రహ్మ మదియె భావించునెడన్

కం. కాలగతి నిర్ణయమ్ములు
పోలింపఁగ సకలధర్మములకున్ మూలం
బౌటల తెలుపఁగ వశమే
కాలమె బ్రహ్మమ్ము తెలివి గలవారలకున్.

వ. అది యెట్లనిన—

కం. పదునెనిమిది నిమిషము లిం
పొదవఁగఁ గాష్ఠయగు గాష్ఠ లాగి నిర్వదియున్
బది కళ, కళలన్నియ క్షణ
మదనన్ క్షణషట్క మేక మగు నాడియగున్.

కం. ఘటికాద్వయము ముహూర్తం
బటు మూఁడు త్రిపాదయుక్తి యామంబగు న
ప్పటి యామాష్టక మొకదిన
మిటులని పదిమూళ్లు మాస మిరుపక్షములన్.

సీ. క్రమమునఁ బగలింటి గడియల పాటి ప్రా
తస్సంగవములు మధ్యాహ్న వేళ
యపరాహ్ణ సాయంబులను కాలములు సమ
మగు పితృప్రసువన నమరు సంధ్య

నెఱ్ఱి రెండు జాలర్థ నిశ నిశీథిని రాత్రి
సంజ్ఞల నొప్పగు సరవినేఁబ
దై దగు గడియల కవల బ్రాహ్మ్యంబుషః
కాలంబు నవి రెండు గడియ లరయ
తే॥గీ॥ నవల నరుణోదయము నాడి యగుటఁ బిదప
గడియ ప్రాతస్సమయ మగు గడియ సూర్యుఁ
డుదయమగుకాలమీ మానమొప్పు వేద
మార్గకర్తులగు ధరామరులకెపుడు.

కం. మాసద్వయ మొక ఋతు వవి
భాసితమగు మూఁడు నయన భావం బవి రెం
డౌ సరవిన్ వర్షంబగు
మాసారక చక్రరూప మహితం బదియున్

సీ. వినుడు పఱ్ఱాంతరంబునను గాలాత్మకుం
డగు సూర్య కిరణజాలాంతరస్థ
పటిమ గన్పట్టుటఁ బరమాణు వవి రెండు
నణువగు నవి మూఁడు నమర నొక్క
త్రసరేణు వవి మూఁడు తగునొక్క త్రుటియనఁ
ద్రుటులవి పది వేధ తెలియ మూఁడు
వేధలు లవయంబు వెస నవి మూఁడు, ని
మేషంబు, నవిమూఁడు మెఱయ క్షణము
ఆ.వె. క్షణములైదు కాష్ఠ కాష్ఠలు పది లఘు
వవియుఁ బదియు నాడి యయ్యె నాడి
కాద్వయము ముహూర్తగతి పూర్వసంఖ్యాసం
వత్సరమ్ము కాలవర్తనమున.

కం. పరమాణు వనఁగ భాస్కర
వర కాలం బదియె సూక్ష్మసంజ్ఞఁ దనర్చున్
వరుసన్ ద్వాదశ రాసుల
కరుగుటకుం బట్టునది మహత్కాల మగున్.

కం. నెల పితరుల కొక దినమగు
నలవడ నొకయేఁడు దేవతాళికి దినమా
నిల ద్వాదశ రాశ్యాత్మక
సలలిత సంచరణ మాన సంజ్ఞ లగు ధరన్

కం॥ ఆరయ బార్హస్పత్యము
సారము నక్షత్రచంద్ర సంజ్ఞల మానో
దారత సూక్ష్మ మహాత్మా
లారూఢిఁ జగము ప్రోచు నర్కుఁడు మహిమన్.

చ. తరణియె సుమ్ము కర్మఫలదాయియుఁ గాలనిరూపణక్రియా
పరుఁడును సాక్షి దేవమయభావుఁడు సత్త్వరజస్తమోగుణా
కరుఁ డుదయప్రవృద్ధిలయకారణుఁడు న్విభుఁ డంతరాత్మ యీ
శ్వరుఁడు స్ఫురించు సంతత జగన్మయనుండు త్రిమూర్తిరూపయున్.

కం. కృతముఖ్య చతుర్యుగములు
ధృతి నాల్గున్ మూఁడు రెండు తెలియఁగ నొకటే
యతులిత దివ్యాబ్దము లు
న్నతి సంధులు నెనిమి దాఱు నాలుగు రెండున్.

కం. శతసంఖ్యలు ధర్మమునకు
గతి పదములు కృతను నాల్గు కలి నొక్కటి గా
వితతమగు నేండ్ల వరుసనె
యతులిత భాగములు సంధి నల్పము నవియున్.

ఆ.వె. పరగు భూర్భువాది పదవుల కెల్ల న
త్యున్నతంబు దివ్య మొప్పు నైన
సత్యలోకమునకు స్వామియౌ చతురాన్యు
నాయువది వినుండు హర్ష మొదవ

కం. అలఘు చతుర్యుగములు వే
యలవడ నొకపగలు నట్ల యగు రాత్రికిన్
గల రొక పవలున మన్విం
ద్రులు పదునలువురును వరుస తోడ జగములన్.

చం. అనువుగ డెబ్బదొక్కటి మహాయుగముల్ మనుకాల మింద్రు ల
ట్లన పదునల్గురౌ నెడల నచ్యుతుఁ డప్పటి కప్పుడా కృతుల్
గొని మునిదేవ సంఘముల కోరిక దీరఁ జరించు, ధాత ని
ద్ర నొనరియున్న లోకములు దారుచుఁ గ్రమ్మఱ బుట్టు మేల్కొనన్.

ఉ. హర్షము గల్గు పంకజభవాంచిత నిద్ర రమేశుఁడైన సం
కర్షణు వహ్ని భూర్దివముఖ స్థిరలోకములన్ దహింప ను
త్కర్షతఁ దచ్ఛిఖిప్రభల కాఁకల కోర్వక యా మహాన్నిరా
మర్ష జనమ్ము లేగుదురు మాన్య భువర్భువనమ్ము జేరగన్.

తే.గీ. వీక తోఁ భూర్భువస్స్వర్గ లోకములకు
మిగిలి యెగసి తమోరాశి మెఱయ శేష
శయనుఁడై యోగనిద్ర నిశ్చలత లోక
సంస్థితోదరుఁడగుచు నాశార్ఙ్గి యుండు.

కం. హరి పరమేశ్వరుఁ డిట్లగు
సరణి జనుర్లోక వాస సంసేవితుఁడై
మెఱయుట దైనందినమనఁ
బరగు నిటుల నేఁబదేండ్లు బటు వగునంతన్.

సీ. విను మిట్టి రేఁబవళ్లను బక్షమాస వ
త్సరము లైనట్టి వర్షములు నూఱు
బ్రహ్మకు నాయువు పద్ధతి నేఁబది
యగుటఁ బరార్ధమ్ము నాఁ దనర్చు
నిప్పుడు పూర్వార్ధమొప్పుగఁ జనుట ద్వి
తీయపరార్ధమై తేటపడెడి
నవిరెండు నైనచో నట బ్రహ్మకల్పమన్
సంజ్ఞ చెల్వగు నట్టి సరసిజాక్షు

తే.గీ. నాభిపద్మంబు భువనజన్మతకుఁ బోడము
నవియె తగు బద్మకల్పాహ్వయమున నిట్టు
లమరు పూర్వపరార్ధము లవని నిప్పు
డైనయట్టి ద్వితీయపరార్ధమునను.

తే.గీ. హరివరాహాకృతిం బొల్చె నట్టులగుటఁ
బరగు శ్వేతవరాహకల్పంబు నాఁగ
మెలఁగు కల్పమ్ములవి పెక్కు జలజనాభు
నకు నిమేషంబులగు నెన్నఁ బ్రకటితముగ.

కం. కాలము భగవదధీనము
కాలాశ్రయ మఖిలభూతగణ లోకమ్ముల్
కాలమయుఁ డచ్యుతుఁడు త
త్కాలాధిపుఁ డతఁడనంగ గణుతింపఁ దగున్

సీ. యుగములు నాలుగు దగ జనుచోట భూ
లోకమ్ము పాలియుట జోఁకతోడఁ
దగ యుగ ప్రళయమ్ము ధాత నిద్రించుచోఁ
బొందుగ నదియ దైనందినంబు

మన్వంతరంబుల మలయు నవాంతర
ప్రళయంబు బ్రహ్మకుఁ బరగు నాయు
వంతయుఁ దీఱుటలదియ బ్రహ్మప్రళ
యంబు పనరును గాలంబునప్పుఁ

తే.గీ. డచ్యుతుని గర్భగోళంబు నందుఁ బ్రాణి
కోటి వసియించి తత్కృపా పాటవమున
సృష్టి మొదలిఁటి మాయా విశిష్టి యగుచుఁ
బుట్టి తల్లీల నెల్లఁగన్పట్టుఁ బ్రబలి
తుదలఁ గ్రమ్మఱ నాతనితోడఁ గలియు.

సీ. కడగి యధోర్ధ్వలోకము లెల్ల జీవగ
ర్తానేకఫల రూపమాన గతుల
భోగభూములు నాఁగఁ బొలుపొందు భూలోక
మటఁ గర్మభూమి నా నమరు నందు
భరతఖండము దక్కఁ బటుతర ద్వీపాద్రి
జలధి కానన సీమ లలరు భోగ
భూములై కొలుచు లోన్పాగఁ బంటఁ బెట్టిన
నది కాపు భుజియించునట్టి వరుస

తే.గీ. నిచటఁ గావించు సుకృతముల్ చేయఁ బాప
ఫలము లచ్చటనచ్చట కొలఁది మనుజుఁ
డనుభవింపుచుఁ గ్రమ్మఱ నవనిఁ బొడము
దత్త దుచితోరు జంతుగాత్రముల యందు.

ఉ. ఈగతిఁ బుట్టుచున్ మరల నెచ్చటు నేనియుఁ గర్మయుగ్మ మా
యాగతులన్ భుజించి యవి యన్నియుఁ దీఱినఁ బుట్టి బుణ్యతన్
యోగ విధానరీతి మది నుండు రమాధిపుఁ జూడ భోగమో
క్షా గతుఁడౌ మహోక్రియల నామిక దీఱవు జన్మకర్మముల్

శా. పాపాత్ముండు దరిద్రుఁడై పొడముచున్ బాపంబులే చేయుచున్
బ్రాపించున్ నరకంబులున్ మఱియు నున్ బాపాత్ముఁడౌ నందుఁ బు
ణ్యోపేతుండు ధనాఢ్యుఁడై మఱియుఁ బుణ్యోపేతుఁడై పుణ్యలో
కావాప్య స్థితి సౌఖ్యమంది మనుజుండౌ నెన్ని జన్మంబులన్

కం. అతులిత మతులగు స్వర్గ
చ్యుత నరకచ్యుతుల నెఱుఁగఁ జొప్పడునే! త
త్కృత కర్మంబులను గుణ
ప్రతతుల రూపముల వలనఁ బ్రస్ఫుటలీలన్.

వ. అనిన విని శౌనకాదు లిట్లనిరి.

కం. అండాండము పిండాండము
రెండొక రూపంబె యనుచు బుధాత్మకళా
పాండితి ధీ (యు ?) తులసఁ గా
మెంతుగ వినియుందు పుట్టి మేఱలు చెప్పుమా!

చం. అన విని సూతుఁడిట్లను సమంచితమౌ పరమాత్మయందు న
య్యనువున నండముల్ గలిగినట్టి విధంబును బిండ సంభవం
బును వినుచోట నైక్యమగు బుద్ధి నెఱుంగుఁడు తత్త్వసంగతిన్
ఘనత వివేకయోగములు గానబడున్ గడు నిశ్చయంబుగన్

కం. గాత్రములు ప్రకృతి మయములు
చిత్రంబుగ బ్రహ్మమయుఁడు జీవుఁడు త్రిజగ
ద్ధాత్రి చతుర్విధ తను మ
త్పాత్ర స్థితిఁ దత్త్వమయము ప్రకృతియె యగుటన్.

సీ. వాత పైత్య శ్లేష్మజాత పంచాశయ
మచన మౌ నయ్యన్నపాన వివిధ
సారము లాత్మ మనోరంజనం బగు
రస మజ్జములు నస్థి రక్తములగు
మొగి నథమము మలమూత్ర రూపం బగు
పురుషుని శుక్లంబు పొలఁతి రక్త
మును సమమైన నపుంసకుం డగు రక్త
మధిక మౌ నెడఁ బుట్టు నతివ వీర్య

ఆ.వె. మధికమైనఁ దనయుఁ డనువుగ జనియించు
శుక్లభిన్నమైన సుతయుగంబు
చేసి దినము పుత్రి పేర్మితో సమదిన
మైన సుతుఁడు బుతుదినాళిఁ గలియు॥

శా. లోకం జీవము లందు సూక్ష్మములు తేజోనంత ముల్గా జను
గ్లోకాకాశత షోడశైక వికృతుల్ సొంపారఁ గర్మాళి త
మ్మాకర్షింపఁగ సూర్యమండలగతంబై తత్కరోద్భూత ధా
రాకారాగతి భూమి నోషధుల తీరై సారమై పిమ్మటన్.

కం. అవి భక్షించిన పురుషు
ప్రవణ శరీరమున నిల్చుఁ బరగఁ ద్రిధాసం
బవలం దద్వీర్యైక
ప్రవణత స్త్రీగర్భయుక్తి సమకొను కడకున్.

సీ. అతివ పుష్పిణియై పదాఱుదినమ్ములు
ప్రస్ఫుట కుల్బస్థ పద్మయగుచు
నది రక్తమయమగు నచ్చట శుక్లంబు
గలిసిన యంతటఁ గలలమగుచు
నొకరాత్రి బుద్బుద ప్రకటమై యైదు ది
నంబుల దశమ దినంబు లందుఁ
గల్కమై యొక్క పక్షంబున ముద్దయై
యండమై యిరువది యైదు నాళ్ల

తే.గీ. నెలకు మస్తక మమరు రెణ్ణెల్ల నవయ
వములు పొల్పగు మూణ్ణెల్ల నరుస నస్థి
రోమ నఖ లింగ రంధ్ర నిరూఢి నాల్గు
నెలలఁ దగు సప్తధాతు సంవలితమగుచు.

తే.గీ. త్వక్కు చర్మంబు మాంసంబు దగ రుధిరము
మెదడు నరములు నెమ్ములు విదితముగను
సప్తధాతువు లనఁదగు సరవి నిట్టి
వేర్పడిన యంత మీఁదట నెలమితోడ.

కం. ఏ నవనెల క్షుత్తృష్ణలు
పూనఁగ నార్నెలల మావి పొదువంబడి యం
దానిక జననీ భుక్త వి
ధానాన్నాంబువులఁ దృప్తిఁ దనరుచు మఱియున్.

తే.గీ. కుక్షి దక్షిణదిశ నుండు గురుతరైక
కటు లవణ మధురామ్లముల్ క్షార రసము
లపుడు తల్లి భుజింపఁగ నందువలనఁ
శోషము వేదనచేఁ గడు నడలు కొనుచు.

మ. మలమూత్రమ్ములు శుక్లశోణితములున్ మైఁజుట్టి రా నందు లో
పలఁ బొర్లాడుచుఁ గీటముల్ తనువు వే భక్షింప మూర్ఛిల్లుచున్
దల కుక్షిస్థితి భగ్నపృష్ఠుఁ డగుచున్ దాక్రొన్న దుఃఖంబునన్
దొలు జన్మమ్మునఁ దాను జేయుటలు తద్దుర్భావ మూహింపుచున్.

ఉ. అక్కట క్రూరకర్మముల నారడియై యిటువంటి బాధలన్
దొక్కటు మందగా వలసె ధూర్వహ బుద్ధి వివేక యుక్తిచే
నెక్కుడు పుణ్యకర్మముల నీశు రమాధిపునిన్ భజించి యా
చక్కి వసింపఁ బుట్టువుల చంపము లొందునె యొందు నేనియున్.

కం. ఎఱుఁగఁగ నైతి నటంచున్
ఉరిపరి దుఃఖములఁ బొరలి పంజరమున నొ
వ్వరి చిక్కుబడిన విహగము
కరణిం జింతించు జ్ఞాన కలితాశయుఁడై

తే.గీ. ఇట్టి జ్ఞానమ్ముచేఁ జేష్టలెలమి గలిగి
సప్త మాసంబులను బూర్వజన్మకృత మ
హా ఘశతములఁ దలఁచి యుస్సనుచు వగచి
తనకు దిక్కింక హరియని వినుతిసేయు.

సీ. సూక్ష్మదేహమున నచ్చోఁ జొచ్చి పాంచభౌ
తిక గాత్రయుక్తిచే దీనదశలఁ
బొదలంగ సకల భూ భువన రక్షా దక్ష
చర్యచే భూతపంచక మహత్త్వ
మున జగదాధార మూర్తినౌ పరమేశ!
దయ గర్భనరకబాధలు దొలంగఁ
జేసి రక్షింపు భాసిత నిత్యలీలావి
హార! నా బాధల నణఁచు టురుదె!

..గీ. హేయమూత్రపురీష సంధాయకంబు
జీర్ణ మతిరంధ్రయుక్తంబు నిర్ణయాను
హీన మైనట్టి గాత్రంబుఁ బూననీక
నిత్యసుఖ మిమ్ము నిరపేక్ష! నీరజాక్ష!

కం. అని నెల లెన్నుచు భౌతిక
జనిత విపద్దశలఁ దవిలి సతతము బాధా
తను సంతాపాన్వితుఁడై
దినదిన మొక యుగముగాఁగ దీనత నుండున్.

శా॥ అంతన్ జండ మరుత్ప్రఘట్టనగతిన్ హా కృష్ణ! గోవింద! యం
చెంతే వేదన నొంది తన్ను దల్క్రిందిడ్వంగ ద్వారాంతరా
ఘ్యంతః ప్రప్రసవ ఖేదగాత్రుఁడు నవీనా లోచన ప్రక్రియా
సంతాపాన్వితుఁడై ధరంబడి వగన్ జర్యాత్ముఁడౌ నత్తరిన్.

కం. నీళ్లా ననమునఁ జల్లఁగ
బొల్లగు విజ్ఞానబుద్ధి పూర్వ వివేకం
బెల్ల న్మాని తమోవృతి
నల్లల్లన నేడ్చుఁ గ్లేశ మడరన్ బేర్చున్.

మ. మశకీ కీట తృణాది బాధ లొదవన్ మాలిన్యదేహమ్మునన్
గృశుఁడై క్షుత్తతి బాధఁజేయ మిగులన్ గ్లేశంబు దుఃఖంబు దు
ర్దశలున్ రోగములొందఁ గుందుచు మనస్తాపమ్ముచే నింద్రియ
ప్రశమద్దుర్బలత న్నెలంగు వివిధ ప్రారబ్ధ లబ్ధ స్థితిన్.

ఆ.వె. గర్భనరక బాధ ఘనబాల్య దుఃఖంబు
గురుల శిక్ష నలఁత తరుణజన వి
యోగపీడ గ్రహాసముద్ధరణ క్రియా
తాప మృత్యు వృద్ధ దశల కీడు.

కం. తొడర నొడలు నిలుకడ యని
పడతులు నందనులు వెడఁగుపడు తొడుసుగ నె
ప్పుడు దొడరెడి యలజడులను
గడువంబడి పొడము పూర్వగతి నిడుమడరన్.

ఉ. స్వేదజ బుద్బుదాండజ విశేష జరాయుజ ఉద్భిజంబులున్
బ్రోఁది ననేకవర్తనలఁ బొల్పగు సృష్టి నిజాంగకంబు ల
ట్లాదట బాధనొంద జననాంతదశల్ పడఁడా విశేషసం
పాదిత ముక్తిమార్గగత పావనయోగ నిరూఢిఁ దక్కినన్

కం॥ చెవిగల జంతువు కెల్లను
నవిరళముగఁ బిల్లవొడము నండంబులచేఁ
బ్రవణమగు గూబ గలయవి
యవనిన్ బశుపక్షి మృగ జలాకర తతులన్.

సీ. స్థావర జాతు లెంచంగ నిర్వది లక్ష
లతు క్రిమి కీటంబు లైదు నాలు
లక్షలు పక్షులు లలిఁ బదిలక్షలు
జలచరంబులు నవ సంఖ్య లక్ష

లమరంగఁ బశుమృగాశ్వాదు లిర్వది పది
లక్షలు నాలుగు లక్షలైన
మానవు లేతత్ప్రమాణ నాయుష్య ని
ర్ణయ మది శతసంఖ్య నలువచేత

ఆ.వె. నిర్మితమ్ము నగుచు నెగడిన యట్టి యీ
జంతుతతులు మనుజ సంఖ్య లపనిఁ
గమలనాభు నాజ్ఞ గడలు కొనంగను
మిథునసృష్టి వలన మెఱసె నెందు.

ఆ.వె. ఇట్టి మిథున సృష్టి నెసఁగె జగంబు స్వా
యంభువాదిగాఁగ నతని పుత్రు
లాగఁ బ్రియవ్రతుండు నుత్తానపాదుండు
క్షత్ర ధర్మనిరతి జగతి మనిరి.

కం. భృగువు మరీచ్యాంగీ రసు
లగణితగతి బ్రహ్మకుల మహాత్మ్యకరణులై
రాగఁ దక్షప్రముఖులు దెలిపెదఁ
దగుఁ జాతుర్వర్ణ్య భవ విధంబులు దెలియన్.

సీ. అబ్జజ తనయుఁడైనట్టి మరీచికిఁ
గర్దమ సుతకు శ్రీకాంత సముఁడు
కశ్యపుఁడు సువర్చ క్రమమున నుదయించి,
యా సువర్చకు విరజాహ్వయుండు
గంగయుఁ బుట్టిరి ఘనతఁ గశ్యపునకు
దక్ష పుత్రిక యందు ద్వాదశాఖ్య
లమరగ నాదిత్యు లావిర్భవించిరి
యందు వివస్వతుఁ డనెడి సూర్యు

తే.గీ. వలన వైవస్వతుండు వైవస్వతునకు
మనువు సుతుఁడున నిక్ష్వాకుఁ డినకుల ప్ర
వర్తకుఁడు పుట్టెఁ జతురాస్యు వలనఁ బొడమి
నట్టి భృగునకుఁ గర్దము పుట్టి యైన.

కం. ఖ్యాతికిఁ బుట్టిరి ధాతృ వి
ధాతృలు శ్రీ యనెడు కన్య తగ ధాతకు సం
ప్రీతి మృకండుం డతనికి
భూతిన్ జిరకాలజీవి పుత్రుఁడు పుట్టెన్.

తే.సీ. మఱియు నొక కామినికి భృగు మౌని వలనఁ
గవివృషభుఁ డాతనికిఁ బుట్టెఁ గావ్యుఁ డనఁగ
నసురగురుఁ డన నఖిలవిద్యానిధాధి
నధురు శుక్రుఁడు తేజోవిహారుఁ డగుచు.

కం. బాగుగ నతనికిఁ జ్యవనుం
డాగమనిధి పుట్టె ఋచికుఁ డతనికిఁ బొడమెన్
ఆ గుణికిన్ జమదగ్ని సు
రాగశ, నాతనికిఁ బరశురాముఁడు పొడమెన్.

సీ. ఘనతరాంగీరస ముని శ్రద్ధయందు బృ
హస్పతి సంవర్తుల నిడి సుతుల
నేని రాకా మానినీ హరిణీ సుమ
వతులఁ గన్యల గుణవతులఁ గనియె
నత్రికి ననసూయ కమృతాంశు దుర్వాసు
లనఁగ దత్తాత్రేయుఁ డనఁగ నలువ
రుద్రుండు విష్ణుండు రూఢి జన్మించిరి
క్రతునకు సూనృత వ్రతపవిత్ర
ఆ.వె. చర్యలగు పవిత్ర సహచరుల్ పొడమిరి
దేవలుండు గనియె ధీరుఁడగు ప్ర
జాపతిన్ మహాత్ముఁ డా పావనుఁడు సప్త
భార్యల యెడఁ జాలఁ బ్రజలఁ గనియె.
కం. సరవి హవిర్భుక్త యనా
తరుణిమొడఁ బులస్త్యమౌని తగఁగిన్నరులన్
గర మధికులఁ గింపురుషుల
గరిమన్ విశ్రవసుఁ గాంచెఁ గౌతుకమొప్పన్.
కం. ఆ విశ్రవసుఁడు గనియెన్
రావణునిం గుంభకర్ణు రాక్షస వంశ
శ్రీవిస్తారు విభీషణుఁ
బావనుఁడగు ధనదునిన్ ద్విభార్యల వలనన్.
సీ. పులహుండు గతియను పొలఁతుక యెడ వరీ
యాంసుల శ్రేష్ఠుల ననల భార్య
యగు క్రతుక్రియ (వ ?) ల్లి ననఘులౌ వాలఖి
ల్య సహస్రములఁ గాంచె నంచితముగ

తగ సుధర్మ ణుఁడు చిత్రాసతి మణి యందు
శ్వశిరస్క సద్వ్రతు సరసుఁ గనియె
నల వసిష్ఠుఁడు నూర్జ యను లలనామణి
వలన నిశ్చయ తపఃకలితు లైన

తే.గీ. చిత్రకేతు స దోశ్చ్యా ద్యశేష సప్త
మానులం గాంచె మతి యొండు (మగువ) వలన
వినయచర్యుల శక్త్యాది మునుల ఘనుల
వితత తేజుల సూర్వర సుతులఁ గనియె.

చం. జననుతుఁ డందుఁ బెద్ద యగు శక్తికిఁబుట్టెఁ బరాశరాఖ్యుఁడ
య్యనఘుఁడు విష్ణుసన్నిభుఁ డహర్పతితేజుఁ డతండు వ్యాసులన్
గనియె మహామహుం డతఁడు గాంచె శుకున్ గమలాధినాథ (ప)
ద్వనరుహ చంచరీకగుణవంతుఁ బ్రశాంతు నితాంత శాంతునిన్.

కం. నారదుఁడు బ్రహ్మచారి యు
నారాయణ పాదపద్మ నవ్యమరందా
సారాత్మేందిందిరుఁడను
సారజ్ఞాన ప్రమందు జననుతుఁడయ్యెన్.

ఆ॥వె॥ శ్రీవిఁ గర్దమునకు దేవహూతికిఁ బుట్టెఁ
గపిలుఁ డఖిలయోగ కారణుండు
ఘనత మతి యుఁ బుత్రికా నవకముపుట్టి
బ్రహ్మసంభవులకుఁ బత్ను లైరి.

తే॥గీ॥ దక్షునికి వేలసంఖ్యఁ బుత్రకులు పొడమి
సంగరాహిత్యులై తపశ్చరణ మనిరి
కూఁతు లేఁబది యేడ్వురు కూర్మిఁ బొడమ
నెమ్మిఁ బదునల్వురను ధర్మునికి నొసంగె.

కం. పదు ముగ్వురు కశ్యపునకుఁ
బదపడి శశికిన్ ద్రిణవక శాలామణులన్
మదనారి కొకతె మిత్రుని
కొదవగ నొక కన్య నగ్నికొక్కతె నొసఁగెన్

తే.గీ. అమరు నా ధర్మునికిఁ బ్రియయ నెడి కన్య
యందుఁ బుట్టిరి నరుఁడు నారాయణుండు
నఖిల లోకోపకార మహానుభావు
లమిత తేజులు మునినుతు లనఘు లగుచు.

కం. పావకుఁడు స్వాహా వలనన్
బావక హుతభుక్కు లనఁగఁ బవమానుఁ డనం
గా వెలయువారిఁ గనెఁ ద
త్పావనులకుఁ బంచనవ విభావసులు సుతుల్.

సీ. కశ్యపుఁ డదితియ న్స్వామినియందు ధా
తృత్వష్టృవసు భగ శ్రీధరారు
ణాంశు మిత్ర వివస్వ దర్యమ పూష స
విత్రు విష్ణునాములై వెలయు రవుల
రహిఁ గాంచె దితికి హిరణ్యకశిపు హిర
ణ్యాక్షులు పుట్టిరి యా హిరణ్య
కశిపుఁడు ప్రహ్లాదుఁ గమలాక్షహితుఁ గాంచె
రూఢి నాతనికి విరోచన బలి

తే.గీ. బాణులాదిగఁ దత్కుల ప్రభువులయిరి
దనువువల్లను విశ్వజితునముచి వరు
ణులు పులోమాదిదానవుల్ కలిగిరెలమిఁ
గాళియు వినాశుఁ గ్రోధుని గనియెఁ మఱియు
తే.గీ. మేనకకు భీమసేనోగ్రసేను లాది
యైన గంధర్వముఖ్యులు సూనులైరి
సురభికిన్ గోగణమ్ములు సుధయు నప్స
రసలు పుట్టిరి యెంతయు రాజితముగ.

తే.గీ. వెలయ వినత కసూరుండు విహగవిభుఁడు
జనన మందె రసూరు సంజాతులైరి
ఘనత సంపాతియు జటాయువు నట శ్యేని
కిఁగలన్ గ్రోధగుణము నారీఁ గనియెఁ.

కం. మృగికిన్ మృగసంతతియును
నగకున్ సిద్ధమునివరులు నన్ గద్రువకున్
దగ శేషుఁడు వాసుకిముఖు
లగు పన్నగు లుద్భవిల్లి రధికస్ఫూర్తిన్.
తే॥గీ॥ ధాతకును బుట్టి రెలమి విధాత ధాత
లక్ష్మియను కన్యకయును విలాసలీల
నట్టి లక్ష్మికి హృదయంబు నందుఁ బెక్కు
ప్రజలు పుట్టిరి లోకముల్ పరిఢవిల్ల.

కం. వరుణునికి జ్యేష్ఠరుక్ స్థలుఁ
డరుదుగ ధర్ముఁడను సుతులు నట నందిని నాఁ
దరుణియుఁ బుట్టిరి దేవలుఁ
డరయఁ ప్రజాధీశుఁ గాంచె నంచిత వృత్తిన్.

సీ. అతనికి సుతు లేడ్వురందు ధూమ్రుకు ఏరు
ణుండు బుద్ధికి నాధ్రువుండు న మ్మ
నస్వికి సోముఁడు నహుషుఁడు రథకును
శ్వసనకు ననిలుండు శాండలికి న
నలుఁడు ప్రభాస కుజ్యులు లష్టవసువులు
లిలఁ బుట్టి రందు నిత్య లఘుతేజుఁ
డగు ప్రభావసునికి నాంగిరసాత్మజ
యోగసిద్ధికిఁ బుట్టె నుచితబుద్ధి

ఆ.వె. నమరు విశ్వకర్ముఁ డమర శిల్పాచార్యుఁ
డమిత మహిమ ధర్మ నంగనకును
సవితృ రామహర్ష శములనం బుట్టిరి
యందు సవితృనకు మహావిభూతి.

కం. బడబాకృతియగు త్వాష్ట్రికిఁ
బొడమిరి యశ్వినులు దేవపూజితు లార్యుల్
కడు నాయుర్వేదజ్ఞులు
కడకున్ లోకోపకార కారణులగుచున్.

కం. రుచికున కా యాకూతికి
నచలితుఁడగు యజ్ఞమూర్తి యజ్ఞుండు యశః
ప్రచుర శ్రీ దక్షిణ యను
సుచరిత్రయు నుద్భవించె శోభనలీలన్.

తే.గీ. ఆది మిథునంబు లైరి దాంపత్యములేమి
వారి తనువులఁ బొడమె దేవముని సమితి
క్రమముతో నిట్లు కమలజాంగముల వలన
సృష్టివిస్తారమయ్యె భాసిత నిరూఢి.

తే.గీ. నెరయ ధర్మునికిన్ భయ నిబుతి మృత్యు
లనెడి తనయులు జనియించి రానుతులకు
సేని ధృతరాష్ట్రి కాకి భాసియును శుకియు
బుత్రికలు పుట్టి రెంతయుఁ జిత్రముగను.

సీ. కాకికిఁ గాకు లులూకముల్ జనియించె
శ్యేనికి డేగలు పూని భాసి
కిని కంక గృధ్రముల్ ఘనభాసములు ధృత
రాష్ట్రికి హంస చక్రకోక టిట్టి
భంబులు శుకికి నేర్పడ శుకమ్ములు పుట్టె
మఱి కశ్యపునకును హరిణి చంద్ర
మందమతంగియు మఱి శ్వేతశార్దూల
సురసలుం బుట్టి రా సుభగల యెడఁ
తే.గీ. భద్రమందకు ఋక్షముల్ షట్పదములు
హరిణికి న్వానరమ్ములు హరిణచయము
మంద కైరావతమ్ము సన్మహిమ సురస
కఖిల వృక్షతతుల్ పుట్టెనమితముగను.
కం. ఆ సురసకు గంధర్వియ
భాసురముగ దాని కశ్వపంక్తులు వొడమెన్
వాసిగ మాతంగికి ది
గ్భాసుర గజములు జనించె భవ్యస్ఫూర్తిన్.
చ. నళినభవైకమానసమునన్ జనియించిన యా ప్రజాపతుల్
గల మనువుల్ జగమ్ములు వికాస సమగ్రముగాఁ జరాచరం
బులు మిథునోద్భవంబులుగఁ బూని సృజింపఁగ నంత ధాత ని
శ్చలమతి వాణిఁగూడి వరసౌఖ్యములన్ భరియించె హెచ్చుగన్.
కం. ఇది భూతసంభవస్థితి
చదివిన వ్రాసినను వినిన సకలార్థమ్ముల్
పొదలఁగ నాయుశ్శ్రీ సం
పదలొంది సుఖింతురెందు భవ్యస్ఫూర్తిన్.

## భూలోక ప్రమాణము.

వ. ఇట్టి సకల జంతు నివాసంబగు మధ్యమభువప్రమాణంబు వినుండని సూతుం డిట్లనియె.

కం. భూలోక స్థితియంతయు
వాలిన్ మైత్రేయుఁ డడుగ నతి విశ్రుతమా
లీలఁ బరాశరముని వా
వాగ్జాలత వివరించిట్టి సరళియన దెలిపెదన్.

శా. భూలోకాంచిత మధ్యభాగమున నొప్పున్ మేరుశైలంబు నా
నాలంకార తట ప్రవేశ విలసద్వ్యాప్త ప్రభారత్న శృం
గా లోలామరసిద్ధచారణ విహారానంద సంధానతా
కేళీ కానన సారసాకర ఖగ క్రేంకార సారస్థితిన్.

సీ. అదియుఁ జౌశీతి సహస్రయోజనముల
విశదోచ్ఛ్రయంబు షోడశ సహస్ర
యోజనంబుల పాతు నొప్పు నచ్చటి వెడ
ల్పంతియ మీఁదట నమరు విరివి
యరయ ద్వాత్రింశత్సహస్ర యోజనముల
చదరమ్ము వన సరస్సారనదుల
పురములఁ దగు బ్రహ్మపురము తన్మధ్యమ
వీథిఁ బద్నాలుగు వేల యోజ
తే.గీ. నముల విస్తారమగు చుట్టు క్రమత దిగధి
పతుల నగరమ్ము లెనిమిది భాసురముగ
భూమి తామరవిరి మిద్దె ప్రేమ దాని
కర్ణికల్ నవఖండ సంగతుల చెలయు.

సీ. గిరికిఁ బ్రాచ్యాదిగాఁ గేసరముఖశైల
ములు లస దౌషధి కలన దనరు
(వై ?) తంకమును మాల్యవన్మంజవంతమ్ము
లరయ శీతాంతముల్. గిరివరములు
సరగు త్రికూటంబు పలశిరమ్ము పతంగ
బుచకము ల్ నిషధంబు ప్రచురలీల
శిఖివాస జారుస ? నీమార్య గంధమా
దన కపిలాఖ్యల ధరణిధరము
ఆ॥ వె॥ లెలమి శంఖకూట బుషభ హంసములు కా
లాంజనమ్ము నాగ మనెడి గిరులు
గలవు చైత్రరథము గంధమాదన వైద్వి
జములు నందనమ్ము నమరు వనులు...

కం. అరుణోద మహాభద్రము
లరయఁగ ననితోదమును మహాబ్ధమును నా
సరసులు నాలుగు తూరుపు
గుఱిగా నద్దెసల నమరుఁ గుధరస్థములై.

ఆ.వె. నీలగిరియు శృంగశైలమ్ము శ్వేతాద్రి
యుత్తరమున నుండు నొగి హిమగిరి
తొలమి నిషధశిఖరి హేమకూటము దక్షి
ణమున వరుసగాఁగ నమరియుండు.

కం. వారక గిరులకు నడుమగు
ధారుణి పదివేల పరిమితము యోజనముల్
మేరుగిరి దక్షిణోత్తర
ధారుణిధరములకు సంధి తగఁ దత్సంఖ్యన్.

కం. అల హిమవంతం బాదిగ
గల షడ్గ్రావముల పొడవు గమకను సరిద్రాం
విలసిల్లు నొక్కరూపం
బలవడి ద్విసహస్రయోజనాన్వితమగుచున్.

కం. సురగిరి దక్షిణమునఁ గిం
పురుషము హరిభరతవర్షములు దగు చుట్టున్
బరగు నిలావృత ముత్తర
ధర రమ్య హిరణ్యకములు తగఁ గురువనఁగన్.

తే.గీ. మేరుగిరి తూర్పు భద్రాశ్వ మారయంగఁ
బడమటన్ కేతుమాల్యనాఁ బరగు వీటి
సంధి తొమ్మిది వేల యోజనము లనరు
వెలయు నలువంక నయ్యిలావృతము నటుల.

సీ. మఱియుఁ బ్రాచ్యాదిగా మందర గంధమా
దన విపుల సుపార్శ్వ ధరము లుండు
నొనరఁగఁ బదివేల యోజనోన్నతి నంత
వెడలుపుచే నిలావృతము చుట్టు
కనకాద్రి పూర్వాద్రిగాఁ గదంబంబు జం
బు వట పిప్పలము లొప్పుఁగఁ దనర్చు
నొనర వేయునూర్వరు యోజనమ్ముల వెడ
ల్పమరఁ దదాఖ్యల నమరు దీవు

తే.గీ. లరయ నేనుఁగు తలలంతలైన పండ్లు
ధరణిఁ బడి జంబుఫలంబు దిరిగి దాని
పేర నదియై ప్రవాహ ప్రచార దక్షి
ణాభిముఖ్యతఁ బ్రబలు రసాన్వితముగ.

ఉ॥ ఆ నది నీరు ద్రావిన మహామహు లందఱు క్షుత్పిపాసలున్
బూనక రోగఘర్మములఁ బొందక యింద్రియవృద్ధిఁ జెంది యెం
దేనియు దేవతాకృతుల నింపుగనుందురు పైఁడి యయ్యె జాం
బూ నదనామమై దటిని పొంతలఁ జెన్నగు మన్నుమిన్నలన్.

చ. హరిపదజాత తీర్థము సుధాకరుఁ బొంది సుమేరుసంగతిన్
సిరిఁ దళుకొత్తు తూర్పుదెస శీత యనందగి దక్షిణాది గా
నరసురసేవ్య మై యలకనందన చక్షువు మేటి భద్రనా
గరిమను బశ్చిమోత్తర ముఖంబుల వారిధిఁ గూడు వేడుకన్.

సీ. క్రమముతోఁ బ్రాచ్యాదిగాఁగ మర్యాద ప
ర్వతములు రెండేసి ధృతి సుమేరు
గిరినంటి వార్ధులు దరియఁ జొచ్చివసించు
నొగి నెనుబదివేల యోజనములు
నిడివియు వెడలుపు నెరయంగఁ గైలాస
గంధమాదనముల కవల జఠర
దేవకూటకము లొకదెస నిషధము పారి
యాత్రము నొక్కెడ నా త్రిశృంగ

తే.గీ. చారు ధీగిరు లొకదిక్కు మేరువునకు
బాహ్యశైలంబు లివియొల్లఁ బ్రబల లీల
నదులు వనములు భూములు విదితమగుచు
నిట్టి చందాన వానితో నెనయుచుండు.

తే.గీ॥ వెలయు ఖండమ్ములం దెల్లఁగులశిఖరులు
నదులు ప్రత్యేకమగు పెక్కులొదవియుండు
దేవగణములు సతులతోఁ దిరుగుచుండు
రష్ట వర్షంబులను రమ్యమైన యెడల.

కం. అచ్చటఁ జాతకసహితులు
చొచ్చుట లే దమిత సుకృతశోభన మతుల
త్యుచ్ఛ్రయ ఫల శేషము వా
రచ్చోటుల ననుభవింతు రతి మోదమునన్.

సీ. యుగభేదములు లేక నొప్పునెప్పుడు నొక్క
తీరున విభవ సందీప్తమగుచు
హరి హిరణ్మయక కింపురుష భద్రాశ్వ ర
మ్యక కురు కేతుమాలాదు లైన

వర్షముల్ భారతవర్షంబు కర్తైక
భూమి లక్ష్మీనాథ నామ కీర్త
నంబు తద్భాష్యంబు నవ్య తచ్చరితాను
లాపముల్ పోకార్చుఁబాప సమితిఁ

తే.గీ. గాన నిది మేటి నదులలో గంగఁ బోలి
వ్రత దినంబుల హరిదినవ్రతము లీలఁ
దానముల లోన నయ్యన్నదాన మహిమ
వర్షముల లోన భారత వర్ష మొప్పు.

గీ. సప్తకుల పర్వతంబులు చాల నదులు
గిరులు వనములు దేవతాగృహ నికుంజ
పుంజములు పెక్కు లీ వర్షమున, నిలావృ
తమున గిరిజయు హరుఁడుందు రమిత సుఖము ॥

వ. గిరిసుత చారుయౌవన సుగీత కళామహిమాఢ్య లైన సుం
దరు లటి కోట్ల సంఖ్యలు ముదంబునఁ గొల్వఁ బురారిఁ గూడి త
ద్గిరి తరు దీర్ఘికా నదుల క్రేవలఁ (తే?) వ మెలంగు నందు నే
పురుషుఁడు చేరరా దరుగఁ బోల్తుక రూపముపొందు గావునన్.

తే. వాన కురియంగ నోషధుల్ వర సుమఫల
పూర్ణమగు క్షుత్పిపాసలు పుట్ట వచట
వారి తనువులు పదివేల వత్సరములు
జిరయు రుజయును శోకమ్ముఁ బొరయకుండు.

కం. గౌరీపతి గిరిశానన
వారంబుల మెలఁగు నితరవసుధఁ గల జనుల్
శ్రీరమణు హయగ్రీవు క
శారమ్యుం గొల్తు రా యిలావృతభూమిన్.

తే. పాతకా ప్రాప్తమది పుణ్యభావ లబ్ధ
మరయ నయ్యష్ట వర్షంబు లచట విష్ణుఁ
డమరుఁ బ్రత్యేకనామంబు లవధరించి
యచటి జనములు గొల్చి కృతార్థులుగను.

సీ. హరివర్షమున నరహరినాము విష్ణుఁ బ్ర
హ్లాదాదులు భజింతు రనవరతము
చెంది కింపురుషము నందు శ్రీ రఘురాము
హనుమదాదులు గొల్తు రధిక భక్తి

ఘనతతోఁ గేతుమాల్యను గామదేవుని
నిందిర సేవించు నెల్ల వేళ
నా కురుధర వరాహస్వామి సత్త్వను
జగతి విభుండు నిచ్చలు భజించు

ఆ॥ వె. మహిమ రమ్యకమున మత్స్యమూర్తి న్మను
వనుదినమ్ము గొల్చు నా హిరణ్మ
యమునఁ గూర్మదేవు నమరంగఁ బితృవిభుం
డర్యముండు నుతించు నధికభక్తి.

శా. భద్రాశ్వమ్మునఁ గల్గువారలు లసద్భావంబునం గొల్తు రా
రుద్రుల్ భారతవర్షసంభవులు కారుణ్యాత్ము నారాయణున్
భద్రాకారుని వ్యాసవంద్యు బదరీభర్తన్ సదా నారదో
న్నిద్రస్తోత్రచరిత్ర పాత్రుఁ బరము న్నిత్యాత్ము సేవింపుచున్.

తే.గీ. ప్రకట శుభపుణ్య లగుచుఁ దద్భజనపూజ
నా కథాధారణముల ధన్య ప్రవృత్తిఁ
జెంది యుందురు సంతతానంద మహిమఁ
గాన భారతవర్షంబు ఘనత మెఱసె.

తే.గీ. జలనిధికి నుత్తరము హిమశైల దక్షి
ణంబు తొమ్మిదివేల్ యోజనంబు లైన
నిడివి భారతవర్షంబు నెరయఁ గర్మ
భూమి యగు సప్తకులగిరుల్ పొలుపుమీఱు.

కం. మలయము వింధ్యము ఋక్షము
నలవడ మాహేంద్ర పారియాత్రక సహ్యం
బులు శక్తిమంతమును నాఁ
గల గిరులివి భరతవర్ష కులశైల స్థితముల్.

వ. హిమవంతంబున శతద్రుత చంద్రభాగలును పారియాత్రంబున వేదస్మృతి ముఖంబులును వింధ్యమున మందా సురసలును ఋక్షంబున నిర్వింధ్యా పయోష్ణలును సహ్యంబున గోదావరీ భీమరథీ కావేరీ కృష్ణా వేణీ తుంగభద్రలును మలయంబునఁ గృతమాలా తామ్రపర్ణులును శక్తిమంతంబునఁ గుమారీ ఋషికుల్యలును, మాహేంద్రంబునఁ

ద్రిసామా మునికుల్యలును నను పుణ్యనదులు దర్శన స్పర్శన స్నానపాన విధంబుల జనులం గృతార్థులం జేయుచుం బ్రవహించు, మఱియుం బెక్కుగతుల బహు నదీనదంబులు పొడమి భారతవర్షంబునం దనరియుండు.

కం. వారుణ లంకా నాగక
శేరు గభస్తులును సౌమ్య సేంద్రదములు తగన్
భారదము తామ్రపర్ణము
నా రహి ద్వీపములు జలధి నడుమ న్వెలయున్.

ఆ. ఒగి సహస్ర యోజనోజ్జ్వల విస్తార
మగుచు లవణవార్ధి తగిలియుండుం
దూర్పునను గిరాతు లేర్పడం బడమట
యవను లుంద్రు నడుము నవిరళముగ.

కం. చాతుర్వర్ణ్యజు లుందురు
నాతతగతి నిచట నిల్చి యంచిత లోక
వ్రాతావాప్తియుం దిర్య
క్జాతిత్వము నిరయవసతి గలుగు జనులకున్.

ఉ. తూర్పునం గామరూపకులతో విహరింతురు దాక్షిణాత్యుల
య్యోగ్నునఁ నుంద్రు మాగధికు లుత్తరభూమిని సౌరశూద్రకుల్
నేర్పునం బశ్చిమాశం గడు నెమ్మిగ మాళవులుందు రన్నిటం
దేర్పడు మేలిమా కురుమహిన్ మహిదేవతలుందు రెంతయున్.

తే.గీ. చతుర నారాయణాది దైవతము సకల
జంతు కోట్యాకరంబును జంబుఖండ
మండితా ఖండ నవఖండ మండితంబు
నైన యీదీవి భరతవర్షా (ఖ్య ?) మరయ.

వ. సముద్ర లగ్న ద్వీపమ్ములు గాక యంగవంగ కళింగ కాశ్మీర కాంభోజ కామ రూప సౌవీర సౌరాష్ట్ర మహారాష్ట్ర మగధ మాళవ నేపాళ కేరళ చోళ పాంచాల గౌళ మలయాళ సింహళ ద్రవిళ ద్రావిళ కర్ణాట మరాట కరహాట లాట కాణాతు ? చైద్య పాండ్య పుళింద ఆంధ్ర హూణ దాశార్ణ భోజ కురు కుకురు కొంకణ టెంకణ గాం ధార విదర్భ విదేహ బాహ్లిక బర్బర కేకయ కోసల కుంతల ఘూర్జర శూరసేన మత్స్య మాథుర సింధు పారసీక యవన జాలాంధ సిద్ధి అవంతి కాశ బంగాళాది ఛప్పన్న దేశంబులుం గలిగిన భారత వర్షంబునందు.

మ. హరి శ్రీ వేంకటరంగ సద్మముల యందా నీలశైలాదులన్
హర వేధో మరమాని సన్నుతులఁ దానర్చావతారమ్ములన్
బరగున్ బుణ్యనదుల్ చెలంగ జనులీపట్లన్ మహాజంతు సం
కర సంఘమ్ములఁ బుట్టి మానవగతిన్ గైకొంద్రు భాగ్యస్థితిన్.

ఉ. దాన తపో వ్రతాధ్యయన ధర్మవిధానములన్ రమాధిపా
నూన కథాప్రసంగ భజనోచితకర్మములన్ గృతార్థులై
మానితమోక్ష మార్గ మసమానతఁ గాంతురు భారతంబునన్,
గానఁగ వచ్చునే! యితరకాననశైలధరాతలంబులన్.

ఆ.వె. సారమైనయట్టి నేరేడుదీవిని
రాజితమగు లక్షయోజనముల
విరివి దానిచుట్టు నెరయ నంత వెడల్పు
నమరు లవణజలధి యధిక మహిమ.

క. పూనిక ప్లక్షద్వీపం
బా నీరధి చుట్టునుండు నది జంబూ ద్వీ
పానూన ద్వైగుణిక ద్విగు
ణానుగతిన్ సకల వైభవా కర మగుచున్.

సీ. అందు మేధానిధి యను రాజు తనయుల
పేర వర్షములేడు పేర్కొఁ దనరు
శిశిర శిభోదయ శివసేవకానంద
శాంత ధ్రువా భయ సంజ్ఞ లమరు
కులగిరులగు నందు గోమేధ చంద్ర నా
రద దుందుభులును వైభ్రాజకమును
సుమనసంబును నాఁగ సురగణగంధర్వ
పన్నగ సేవ్యమై భాసురమగు.

తే.గీ. నదులు శిఖియు సుదస్తయుఁ ద్రిదివి యమృత
సుకృతయు విపాప యమరయు శోభనగతి
మఱియు నదులును దేశముల్ గిరిపురములు
వనులు గలవెన్నియేనియు ననుపమముగ.

క. స్థైర్యము జంబూవిస్తృతి
ధార్యము ప్లక్షంబు దనరు బహుశాఖలతో
నార్యక కురక విదస్యుల
వార్యత భావికులు నాల్గు వర్ణము లపటున్.

చ. అనువుగ నైదువేలవిశదాబ్దములు చ్చటివారి కాయువం
ద నుపమభోగయుక్తుల జరామయశోకభయంబు లేర్ప్యయున్
దనుకవు వారియందుఁ గడుధర్మము పొల్పగు ద్రేతయుం బలెన్
జననుతి నెల్లకాల మందు శాశ్వత పుణ్య సమగ్ర వైఖరిన్.

క. శ్రీ మహిళాధవుఁ డచ్చట
శ్లోకముఁ దనరఁగఁ బూజ లంది శుభములొసఁగు న
ట్లా మహిత ద్వీపము చు
ట్టా మరనుతి నిక్షుజలధి యావృతి నమరున్

సీ. ... సుముత్కృష్ట శాల్మలి ద్వీప
...ము లవణవార్ధి ... యోజనముల
పతి వపుష్మంతుఁడు తత్సుతుల పేరిట సప్త
వర్షమ్ములనువుగ వరుస తోడ
శైలోన్నత బలాహక ద్రోణ కుముద కం
క మహిషాఖ్యల గిరు లమరు నచట
శ్వేతయు హరితజీమూత రోహిత వైద్యు
తలు మానసయు సుప్రభలును నదులు.
యోనియదితృష్ణ నివృత యొప్పు చంద్ర
తోయ శుక్లవిమోచన లాయతముగు
జాతు లటఁ గపిలారుణ పీత కృష్ణ
లమరుఁ బ్లక్షోం తరీప ధర్మానుసరణి.

క. భగవంతుఁడు విష్ణుండవఁ
పగి తజ్జనపూజ లొంది దయతో మనుచున్
మిగులనట దేవతలు త
జ్జగతిన్ బ్రజఁగూడి యుంద్రు సాన్నిధ్యమునన్.

క. బూరుగ యచ్చటఁ బ్లక్షో
దారప్రామాణ్య వృత్తిఁ దగు తద్ద్వీపం
బాగూఢిగఁ జుట్టి సురా
వారిధి యంతయు వెడల్పు వారక యవలన్.

సీ. ఘనతఁ గుశద్వీప మెనిమిది లక్షల
యోజనమ్ములు దాని కొనరు రాజు
జ్యోతిష్మదాఖ్యుఁ దత్సుతుల పేరిట వర్ష
ములు నుద్భిద ...స్థి రనులును వేణు

మతి లంబనాఖ్యలు ధృతిఁ బ్రభాకర కపి
లులు నా నమరు నఁగురులు విభూతి
శారిదిని దమినులు శుష్మిణుల్ స్నేహ మం
దే హు లు వర్ణ్యులు తెలివి నంద్రు.

ఆ.వె. హేమ విద్రుమములు నా మతి హార మంద
రములు నరు కుశేశయమును బుష్ప
వంతమునుదమాంత మెంతయుఁ గులగిరుల్
నదులు వనులుమిగులఁ బొదలు నచట.

చ. వెలయు విధూత పాపయుఁ బవిత్రశిలాభిద సమ్మదంబు సొం
పలరెడు విద్యుదంబు మహితాభ యయు నాయతధూర్వహల్ నదుల్
గల (వ ?) టు దర్భ చాల యొడికంబుగ మిన్నొరయు న్విశాలమై
చెలువగు బ్రహ్మరూపుఁడగు శ్రీధవుఁ డిచ్చు నభీష్టభోగముల్.

ఆ.వె. అమరు దాని చుట్టునంత వెడల్పున
ఘృతసముద్ర మెలమి వితత మగుచు
నందు నలరు క్రౌంచమనుదీవి పదియాఱు
లక్ష యోజనముల లలిత మగుచు.

సీ. అందున ధృతిమంతుఁడను రాజు తత్పుత్రా
ఖ్యాన వర్షమ్ము లచ్చోన నమరుఁ
గుశలోద ధరమూష గురువిచల ప్రివ?
రహములు నర్థతారకము లనఁగ
దుఁదుభి యూష్మయుఁ దొడరు దేవతల కా
వాసమై కులగిరు లమరు నచట
క్రౌంచ వామనగంధకారక రత్నది
వ్యావృత దుందుభు లనఁగఁ బుండ.

ఆ. వె. రీక మనెడిపేర జోఁక నొండొంటికి
ద్విగుణ మగుచు నదులు తేజరిల్లు
గౌరి సంధ్య రాత్రి ఖ్యాతి మనోజవ
పుండరీకయును గుముద్వతియును.

వ. అచటు రుద్రరూపమ్మున నభిమతార్థమ్ము లొసఁగు.

క. పుష్కర పుష్కలధిషణులు
నిష్కంటక మైన తిష్యనికరంబును శో
చిష్కేశప్రభ వర్ణ చ
తుష్కం బలరారు నచట ధూర్వహ మహిమన్.

వ. నిరాతంకులు దేవనిభులు నగు జనంబులుగల క్రౌంచద్వీపంబు చుట్టు నంతియ విస్తారంబున దధిజలధి దనరు దాని నలగొని ద్వాత్రింశల్లక్ష యోజనంబుల వెడల్పున శాకద్వీపంబు నమరు తత్పతియగు భవుని కుమారనామంబుల జలద కుమాల సుకుమాల మణిచక కుసుమోత్త సమీక మహాద్రుమంబులను సప్తవర్షంబులు గలిగియుండు—

తే. గీ. అంభ ముదయంబు జలధార మంధకేయ
రైవతకశాక ఋక్షముల్ రమ్యకేస
రీ సమాఖ్యలఁ గులగిరుల్ భాసుర మగు
వాన కురియక సస్యముల్ వసుధఁ బ్రజలు.

క. చారు నళినేత్కువులు సుకు
మారీ వైణికలు నాకుమారిగ భ (స్తుల్?)
చారుమతి ధేనుకలు (నా?)
నారూఢిగ నదులు వెలయు నతి శోభనమై.

క. తద్గిరి తటినీ మారుత
సద్గంధము సోఁకినంత సంతోషిత భా
స్వద్గాత్రు లగుచు శోక వి
షద్గతు లాతంకములును బాయుదు రచటన్.

తే. గీ. మగ మగధ మానసాఖ్యులు మందలుగను ?
నాల్గుజాతుల జనులు, శ్రీనాథుఁ డచట
సూర్యరూపమ్ముచే నిచ్చ శోభనములు
ధర్మ మభివృద్ధియగు హాని దడవదచట.

వ. మగాది నామంబులఁ దద్వర్ణ నివాసంబులగు నాల్గుదేశంబులు గల పట్టి శాక ద్వీపంబుచుట్టు నంతియ విస్తారంబున క్షీరసాగరంబు చెలువొందు

తే. గీ. అమరుక్షీరాంబునిధి చుట్టు నావరించి
యెరుబదియు నాల్గులక్షల నైన యోజ
నముల వెడలుపుగలిగి విస్తీర్ణమగుచుఁ
బుష్కర ద్వీపమొంతయుఁ బొలుపు మీఱు.

సీ. జాతిభేదములు లే వాతలి దశ సహ
స్రాబ్దంబు లాయు వందందతికిని
నొక్కగుణమ్మున నొక్కకైవడిం దుల్యు
లగుచునుందురు ధర్మ మతిశయిల్లు
ధాతకీ షండాఖ్యం దనరు నాదీవికి
వట మొక్క టచట దేవం బొసంగు
దానిక్రిందటనె శ్రీధరుం డుండు బ్రహ్మస్వ
రూపుండై లజ్జనుల్ రూఢిం గొల్వ.

ఆ. వె. నచటం దగు మహేంద్ర మన్గిరి యా దీవి
నడుమం బంచినట్టి వడువుదోప
నుండు గిరులు వనుల నొండు లే వచ్చట
సరవిం జుట్టు శుద్ధజలధి యుండు.

తే. గీ. షడ్రసోపేతపక్వాన్న సమితి యొసంగు
పైరు లచ్చటిజనుల కా పరమ జలధి
యదియు నే నూంటపది యంగుళముల పొడవు
పూర్వపక్షమ్మునఁ హెచ్చు పొసంగు పిదప.

క. ఆ పుష్కరమను దీవికిం
బ్రాపగు శుద్ధార్ణవంబు పఱప, ంతియ నై
యోపికవానికి నవ్వలం
జూపట్టు సువర్ణభూమి శోభన రుచులన్.

క. అది నిష్జనధర యవ్వలం
బదివేలగు యోజనముల పఱపున్ నిడివిన్
విదిత మగు చక్రవాళము
గుదిగొని బహు భూధరముల గూడగ వరుసన్.

ఆ. వె. దాని కవల నంధతమసంబు బ్రహ్మాండ
కర్పరమ్మునంటి కరము బ్రబలు
చక్రవాళయుతము సగము నవ్వల నింతేం
గూడియైదుపదుల కోట్లు ధరణి.

క. భూలోకం బని డెబ్బది
వే లా మడలైన పాతువెన్కన్ బది నే
లా లలి విస్తారము పా
తాళమ్ములు సప్తసంఖ్యం దగు భేదములన్.

ఆ. వె. నారద! యతల వితల సుతల మహాతల
తల తలాతలములు దగ రసాత
లంబు లాఱు గడచినం బయి పాతాళ
మమరుఁ గాద్రవేయ సమితి కలిగి.

సీ. భక్ష్య భోజ్యములు పానార్హ రసములు
గోపుర ప్రాసాద కుడ్యచయము
సాంకవ మృగమద చందన కుంకుమా
ద్యంచిత సౌగంధి కావళులును
గడవ సింపెన్నఁగఁ గల భూషణమ్ములు
హీర ముక్తా హార చారు మణులు
పీతాంబర దుకూల ధౌతాంశుకంబులు
కమనీయ రూపముల్ గల్గు చెలులు.

తే.గీ. శారికా కీర మాయూర చారు వనులు
కమలకల్హార శోభిత విమలవారి
పూర కాసార వార గభీరనదులు
లీలఁ జెలువగు సప్తపాతాళములను.

తే. గీ. శుక్లకృష్ణా(రు)ణక పీత — —
శర్కరాద్రి మయములు కాంచన మయమ్ము
లగుచు నతలాది లోకము లతిశయిల్లు
నమిత వైభవ భోగ భాగ్యాయతముగ

ఉ. పన్నగరాజ భోగమణి పంక్తులఁ జీఁకటి వాయ విక్రమా
భ్యున్నతి శ్రీధరుం డనుప నూర్జిత భానుశత ప్రభా సము
త్పన్నవిభూతి నొప్పు నతి పాతక దుష్టనిరాసనంబునన్
జెన్నగు విష్ణుచక్రములు చేరి సురాసుర నాగసేవ్యమై

క. స్వర్గమున కంటె భోగా
నర్గళసద్వస్తు విభవ నందితమై
సర్గిక తేజోమయ మగు
నిర్గత కలుషమ్ము సుకృతనిలయంబగుచున్.

చ. తనరిన యట్టిలోకములు దా మునుకన్గొనివచ్చి నారదుం
డనుపమ భోగలీల నెనయాన సురాలయ మెన్నఁ గాద్రవే
యనిలయభూమికంచు మును లామరులు న్వినఁ బల్కెఁ గాదె యిం
ద్రుని సముఖంబునందుఁ గడు దోరపు వేడుక లాత్మ సంధిలన్.

చ. తగ నట నొప్పు భోగవతి చాపున వృత్త లతా వితానముల్
భగభగ తావు లెల్లెడలఁ బూర్ణముశోక నికతాల తమ్ములన్
బగువలఁ దాముఁబన్నగకుమారులు వీణియలు న్మృదంగముల్
ధిగధిగ దింధిమార్భటుల రిమ్మని మ్రోయఁగఁ జేతు రెప్పుడున్.

ఉ. చల్లనితావు లెల్లెడలఁజల్లుచు గాంగ తరంగ శీకరో
త్ఫుల్ల సరోజకైరవ మధుద్రవ రంగదభంగ వాసనల్
మెల్లన మెల్లన జను సమీరకిశోరము లల్లఁ జాల రం
జిల్లఁగఁ జేయు నెల్లపుడుఁ జిల్వకుల బుబలంబులన్ దగన్.

మ. బలిదైత్యాధిపసద్మ పద్మనిలయ ప్రాంతోరు కాంతార వృ
త్త లతాంతాగ్ర మరంద కందళిత సుస్వాంత ప్రసక్తాళి సం
కులఝుంకార విరావసంగత లసత్కుంభీనస స్త్రీ మిథః
కలనా గీతము లందు దంపతుల యత్కాల్ దీర్చు నుత్సాహతన్.

క. ఒక్కొక్కటి పదివేలగు
నెక్కున్ విస్తారమట్టి నియతిన్ సంధుల్
పెక్కు వగల యవి యగున
య్యెక్కువ పాతాళభువన మీగతి నమరున్.

తే. గీ. అట్టి పాతాళభువి దక్షిణాశ ధర్మ
రాజపాలిత నియమమ్ము లోజఁ బెక్కు
గలవు పాతకజనుల కాకరములగుచు
ఘోరవిగ్రహ జంతుసంకులము బెరయు.

వ. తత్క్రమంబు క్రమాంతరంబున నెఱింగించెద నింక జ్యోతిశ్చక్రోర్ధ్వలోక విధంబులు వినుండు.

సీ. మేరు శృంగాగ్ర సమ్మిళిత హైమ శింశుమా
రము సప్తకోటుల నమరు నరుబ
దియు మూఁడు లక్షలు దీర్ఘమయ్యుఁ గులాల
చక్రంబు రీతి నిచ్చలను దిరుగు
నంతియే యుదయాచలాస్తాద్రి మధ్యంబు
నందు జ్యోతిశ్చక్ర మనుసరించి
కోటి యిర్వదినాల్గు కోటి యిర్వదిరెండు
లక్ష లేఁబది వేలు లలిత వస్తు

లాకృతి న్నూటి యొన్నఁగనైన వీథు
లమరి మఱుచుట్లగతిఁ బోల్చి హైమశైల
దక్షిణాశ రథాంగవిధ ప్రచార
ధృతిని గాలస్వరూపమై తేజరిల్లు.

క. తుల మొదట మేష మాదిని
సలిలత తచ్చక్రమధ్య సరణి ధరణిఁదా
మెలఁ గైదువేలు నే నూ
అఱవడ నాపుడల బింబ మమరఁగ నేమిక్.

తే. గీ. ఇలఁ గుళీర ధనుర్మాసములు మొదలుగ
నాఱు నాళ్ళసి నెల లుత్తరాయణమ్ము
దక్షిణాయన మగు హెచ్చుతక్కువ లహ
ములగు చక్రాన (మ?) ద్గతు లలవడంగ.

క. అతలగతి దక్షిణానత
గతి చక్రముక్రిందు మీఁదుగల మల్లోక
స్థితిఁ దిరుగు శోభనమ్ముల
ధృతి గ్రహమండలము లచటి తెరువుల నమరున్

సీ. రవి శీఘ్రగతి శశిర హీనతిశీఘ్రగుం
డవలి యేపురును వక్రానువక్ర
మందము ద తరసమవికల శీఘ్రతి
శీఘ్రగమాన్వికుల్ చెలఁగు రాహు
కేతువు లటు వక్రరీతి సంచారి
యింతు రర్కుండు నెల్లపుడు నయన
కోటి లంకాపురిన్ మే (టి?) రోమశ సిద్ధ
నగరాళి నుదయంబునన్ బగలిటు

ఆ. వె. మాఁద్య నర్ధరాత్రిఁ బ్రాపించుఁ బ్రతిమాస
మొక్కఁ డొక్కఁడుగ మహోజ్జ్వల మగు
విభవ మెసఁగ రవులు వేదమయుల్ మెలం
గుదురు మునులు సురలు గొలువ వరుస.

వ. అట్టి ద్వాదశాదిత్యుల యందు విష్ణుండు ముఖ్యుండగు నట్టి శింశుమార చక్ర మధ్యస్థుండగు ధ్రువుని కరగత పాశలగ్నంబులై యూర్ధ్వ లోకంబు లమరు.

తే.గీ. సగవి ముక్తికిఁ జను శివశర్మ కెలమిఁ
పుణ్యశీల సుశీలు రద్భుతము గాఁగ
మున్నెఱింగించిన విధంబు లెన్నికలర
నూర్ధ్వలోక ప్రకారము బొనర వినుడు.

ఉ. మంద విభాకరుల్ మిగుల మందమతుల్ వికృతాకృతుల్ సదా
నంద విదూరులల్పసుఖనందితులైన పిశాచకోటు లిం
పొందిన పిశాచలోకమున నుందురు భక్తి విహీనులై శివున్
జందన గంధులన్ గలసి సారె భజించినయా ఫలమ్మునన్.

కం. అక్షీణధనము ధాత్రిన్
నిక్షేప మొనర్చి దాన నిరతి దగనివా
రక్షములు గుహ్యకులు తగు
దక్షత వసియింతు రవలఁ దగుపాటి మదిన్.

ఆ.వె. గీతములను దేవతాతతి మెప్పించి
దానధర్మ నిరతిఁ దనరు ఘనులు
కాంతి సౌఖ్యయుతులు గంధర్వు లవ్వలి
వలన నుందు రధిక వైభవమున.

మ. ఘనమౌ విద్యలు శిష్యసంతతికిఁ జోకం దెల్పుచున్ వారికై
తనయస్నేహత నన్న పానములు నిత్యం బొప్పఁగాఁ బెట్టి తి
న్నని భక్తిన్ గురుదేవతాభజన లెన్నన్ గల్గి విద్యాధర
త్వనియాఢిన్ వసియింతు రవ్వల ప్రమోదశ్రీ విశాలస్థితిన్.

సీ. వ్రతచర్యతో నేకవార సంభోగిని
కామ్యపుణ్యములు గల్గు లలన
పరుఁ డెత్తికొనిపోవఁ బత్నియౌ సతియును
విరహార్తి నోరుఁ బొందు విద్రుమోష్ఠి
ధవు నాజ్ఞయోగ సిద్ధవధుఁ గూడిన చెలి
జారయై పతిభక్తి సలుపు సుదతి
తగ దేవరన్యాయతన్ సుతుఁ గనునింతి
స్మర పూజనాదర సారసాక్షి

తే.గీ. పాలకడలి జనించి కన్పట్టు నట్టి
మేనకయు రంభ మొదలగు మానినులను
గలసి మెలఁగుదు రప్సరోగణ నివాస
మైనచో నది త్రిదివాలయంబు వంత.

తే.గీ. అమరపురికి నధోభాగ మవని కెగువ
యంతవట్టు భువర్లోకమనఁగఁబరగు
గుహ్యక పిశాచ సిద్ధ సంకులము మెఱఁగు
వలన దెంతయు వాయు సంవళిత మగుచు.

ఉ. కొద్దివిమానముల్ కలిగి కూర్మిచెలుల్ తమతోడ నాడఁగా
నొద్దికమీఱ స్వల్ప విభవోచితులై యొక వేళ స్వర్గమున్
దద్దయువేడ్కఁ జేరుచును ధారుణి నెప్పుడు సంచరింతు రు
ద్యద్దురితమ్ములం దొరఁగి ధర్మ మెఱుంగక వార లెప్పుడున్.

కం. తదుపరి భాగము నందున్
విదిత మహద్వస్తు విభవ విశ్రుత మగుచున్
పొదలెడి వన దీర్ఘికలన్
జదలన్ ప్రాగాదిగా విశాలము లగుచున్.

కం. అమరావతి యర్చిష్మతి
ప్రముదిత సంయమని పుణ్యవతి యనులావ
త్యమిత శుభగంధవతి యల
క మహోదయ మనఁగ వరుసగా దిక్పురముల్.

ఉ. సత్యము శౌచమున్ దయయు సౌమ్య సుశీలములున్ గ్రతు క్రియా
నృత్యము సాహసోచిత రణస్థలనైధన మార్య కోవిద
స్తుత్య యశస్స్థితుల్ విబుధ సజ్జన పోషణ సత్ప్రసంతతుల్
నిత్యము గల్గు వార లటు నెమ్మది నుందురు స్వర్గసంస్థితిన్.

తోటకము॥ త్రిదివమ్మున గల్గిన దీపితసంపదలన్నియు నొప్పగ వాల్పడుచు
లాదవందగు కర్మఫలుండఁగనింపొదవున్ వసలన్ లలితోజ్జ్వలమై.

సీ. అందుల స్వర్లోక మతివైభవాస్పద
మచ్చట నైజవిభాతి శయత
దినము రాత్రియు లేక వివిధ సౌగంధికాం
చిత భూషణాన్విత ప్రకట దివ్య
తర విమానమ్ములందరుణీమణులఁ గూడి
యెప్పుడిర్వది వదియేండ్ల ప్రాయ
మలవడు తనువుల నారామ కేళికే
ల సరోవరంబుల ననమ సరస

తే.గీ. గతుల విహరింపు చమృతాబ్ధి కడ జనించి
నట్టి తారుణ్య రూప వికారులైన
యప్సరస లందు రచ్చటు నరువదాఱు
కోట్ల సంఖ్యల దేవేంద్రు కొలువు చెలులు.

కం. నందన మను వనమున హరి
చందన సంతాన పారిజాత ద్రుమముల్
మందార కల్పకమ్ములు
నం దమరుల కొసఁగు కోర్కె లన్నియుఁ దలఁచన్.

కం. చింతామణి యనబంగరు
కాంతుల దేవతల కోరికల నీయ శుభో
దంతముగ సకల విభవ ని
రంతర సౌఖ్యముల సురపురం బతుల మగున్.

కం. త్రిదశవరు లచ్చటున్న
ప్పది మూఁడగు కోట్ల నైజబంధుర తేజో
విదిత దశదిశా భాగా
స్పదులై చరియింతు రాత్మ భామలతోడన్.

ఉ. తెల్లని మేను నెమ్మొగము తేటయు నొప్పగు నూపురంబు ను
త్ఫుల్లసితాబ్జ నేత్రములు తోరపువాలము మేల్మిశృంగముల్
పల్లవభాతి పాదములు బాగగు కర్ణములుం జెలంగఁగా
నల్లన నందికిన్ మమత నందమృతంబిడు ధేను వత్తఱిన్.

కం. వీరులు యాజక వర్యులు
సారతర వితీర్ణి సప్తసంతాన యుతుల్
చారు శుభధర్మ కీర్తివి
హారులు నచ్చటు వసింతు రతి విభవమునన్.

సీ. వైజయంతి? నామ వరసౌధమున సుధ
ర్మాఖ్య సభాస్థలి నమిత భూష
ణాలంకృతాంగుఁడై యప్సరల్ సేవింప
గరుడ గంధర్వ కింపురుష యక్ష
కిన్నర పన్నగ గీర్వాణ వసు సిద్ధ
సాధ్యామరుల్ గొల్వ శక్రు డుండు
నుచ్చైశ్శ్రవంబన నొప్పు నైరావత
మనఁగఁ జతుర్దంతి యందమొంది

తే. గీ. వరసుధా రస పాన దుర్వార బల వి
లాస సౌందర్య ధైర్య లీలా విహారు
లమరు లచ్చటి శూరులు నసఘ మతులు
నుందు రందుల నెంతయుఁ బొందుగాఁగ.

కం. క్రమమొప్పఁ ద్రిదివ విభవము
లమరంగా వీతిహోత్ర యమ నిరుతి సరి
ద్రమణీశ సదాగతి ధన
ద మహేశుల పురము లమరుఁ దత్సమ మగుచున్.

ఉ. ఒంటను రెంటఁ దొమ్మిదిఁట నొప్పుగ నైదిటఁ బద్దకొంటు నే
డింటఁ ద్రయోదశస్థితి రహిం బదునాలుగు మూఁడు నాల్గునా
నొంటుగు లక్షలా మడల యున్నతి రావులు సూర్యుఁడాది గా
నంటి నవగ్రహమ్ములకు నబ్జుని పత్నులకున్ గ్రమంబునన్.

కం. పదియేను లక్షలన్నొం
పాదవఁగ ధృవుఁ డధివసించు జ్యోతిశ్చక్రా
స్పదుఁ డగుచు శింశు మారము
కుదుర మరఁగ నూర్ధ్వభువన గుణాధారకుఁడై.

కం. హరి నామజాపకులు శ్రీ
హరి భక్తులు హరి దివసమహావ్రత నిష్ఠల్
కర మర్థి నుండు చోటై
పరగు మహర్లోకమవలఁ బ్రస్ఫుటమహిమన్.

కం. వనజజు నౌరస పుత్రులు
సనకాదులు మెలఁగు తావు సాత్త్విక తేజః
ఖని యైన జనర్లోకం
బనఘంబై యవల వెలయు నంచితలీలన్.

చం. అనశన సద్వ్రతుల్ కుశ దళాంబు నిషేవణు లాత్మదృక్కులున్
వనజ దళాక్షు పాదయుగ వాంఛిత మానసు లుండు చోటునై
తనరు తపోమహత్త్వమున ధార్మికులై తగు యోగిపుంగవుల్
ఘనశుభలీలఁ జెందుట కుగాఁ గలదైన తపోఖ్య పై మవ్వలన్.

చం. నియమపరాయణుల్ సవననిర్మల కర్మ నిరూఢశీలాత్మ యో
గయుతులు రాజయోగులు వికాసమహర్షులు మౌనిసంఘముల్
నయవినయాన్వితైక గణనన్ భజియింపఁగ నల్వ యుండు చో
టయమయ సత్యలోక మొఱపై తగు సర్వ మనోజ్ఞ సంపదన్.

ఆ.వె. ధరణి యంతవిరివి పరగు నంబరము వి
స్తారమంతె కోటిసంఖ్య యోజ
నంబు లవని మీఁద నాకంబు పొడవగు
వసుధయగుచు భూర్భువనము పొసఁగు.

సీ. మేటి స్వర్గమునకుఁ గోటి యోజనముల
పొడవు మహర్లోక భూమి దాని
కవ్వల రెండు కోట్లగు యోజనంబుల
దవ్వు జనర్లోక మవ్వలినికి
నంతియ పొడవగునట తపోలోకంబు
నూటి దానికిఁ జతుష్కోటి యోజ
నములపై సత్యలోకము ప్రకాశిత మగు
గుఱి దాని కెన్మిది కోట్ల పొడవు

తే.గీ. నందు కార్య వైకుంఠ మింపొందు నందు
నవలఁ బదియాఱు కోట్ల పైనఁద మమరు
మహిత దేదీప్యమాన విమాన కాంతి
నచట రేయుఁబవళ్లు లే కతిశయిల్లు.

సీ. కల్పాంతమున లోకగణము నశ్యంబగు
నంచునఁ గృతకములనఁగఁ బరగు
స్వర్లోక పర్యంత సరణి మహర్లోక
మది కృతకాకృతకాఖ్య నొప్పు
నవల జనర్లోక మాదియౌ లోకత్ర
యమకృతకమగు మహావిభూతి
స్వప్రకాశంబు లౌ సరవిని లోకముల్
వెలగ పంటను బీజ వితతి వోలె

తే. నబ్జజాండకటాహమ్మునందు నుండు
నభ్ర మది భూమి విస్తార మవని మీఁది
లోకములు నాలునంతియ వీఁక పొడవు
వాని విధములు చెప్పితి వసుసతోడ.

కం. నిడివియు వెడలుపు నాతుం
బొడ వేఁబది కోట్ల సకల భువనము లగుటే
ర్పడ మును మీ కెఱిఁగించిన
వడు వాద్యంతమ్ముఁ గూర్చి వచియింతుఁ దగన్.

తే. భరత హరివర్షయుతము కింపురుషము తగ
మూఁడు తొమ్మిదు లిరువది యేడు వేలు
హిమనిషధశైలముల యోజనములు సమత
నాలు వేల్ మేరుగిరి దక్షిణాశయందు.

సీ. పదునాల్గువేల పాతోదవు సుమేరువు
చుట్టు నిలావృత క్షోణిగూడ
చతురుత్తర త్రిదశ సహస్రము లుదీచి
రమ్యక ముఖ్య వర్షములు శ్వేత
నీలశృంగాద్రు లెన్నికఁ ద్రయస్త్రింశ త్స
హస్రములు భరత వర్షాళిభంగి
దక్షిణోత్తరముల లక్ష యోజనములు
తే.గీ. ఖ్యాతిగ భద్రాశ్వకేతు మాల్య
లమరుఁబదునాల్గువేలు ప్రాగపరదిశల
వరుస వేయేసి యగు మాల్యవంత గంధ ?
మాదనము లయ్యె లావృత మహియుఁ గూడు
జాడ లెందును లక్ష నేరేడు దీవి.

చం. అమరిన దీని చుట్టు లవణాబ్ధిముఖార్ణవ సప్తయుక్తి ప్ల
క్షముఖ మహాంతరీపముల గైకొను కంధులయంత దీర్ఘమై
క్రమమున రెట్టియై నెరయగల్గినకోట్లు విశైదు లక్ష లే
డు మఱియ దీర్ఘవిస్తృతి పటుత్వము లేకవిధంబునం దగున్.

ఉ. నూటిగ నిందు కవ్వల విశుద్ధసువర్ణధరిత్రి యిర్వదా
కోటులు నిర్వదెన్మిది యకుంఠిత లక్షలఁ జక్రవాళ యు
క్పాటవమైనలోక మద పాటిగ నిర్వదినాల్గు కోటులక్షా
బాటిలుఁ గోటి లిర్వదిటిపైఁ బడి యవ్వల నండయుక్త మై.

కం. గరోత్తరక మాధారో
ద్వర్తుల గతి మూఁడు పదులపై నై దగు వి
స్ఫూర్తిన్ లక్షల దగు నిటు
కీర్తు (ల?) విస్తృతము కోట్లు కృతి నేబదియా.

వ. చతుశ్శ్రీమంబు ? నట్టి సంఖ్యం బంచాశత్కోటి భూమం డలంబు నొక్కచక్రైవ
డిం గనుపట్టు సూర్యాధ్యధోభాగ స్థితియు వివరించెద.

సీ. గర్భోదకము నరకములు శేషుని లోక
మిరువది నాల్గు కోట్లై నగుఁ దొంబ
దెనిమిది లక్షల నెనయుఁ ద్రింశత్సహ
స్రములు పై సంధుల నమరు సప్త
పాతాళపంక్తి డెబ్బదివేలు దానిపై
నినమండలము లక్షలిరువ దైదు
కోటు లప్పటికిఁ గీల్కొను నుపేంద్రాదుల
యధ్రువలోకపరిమిత మవిరళముగఁ

తే.గీ. బదియు నాలుగు లక్ష లేర్పడ మహర్జ
వన ముఖ జగంబు లవి వరుస నగు కోటి
రెండు నెనిమిది మఱియుఁ బండ్రెండు కోట్ల
నలువ లోకంబుదనుక నిట్లలవడంగ.

కం. ఘనతఁదగు నవలఁ గోటియు
నెనుబదిపై యాఱులక్ష లేఁబది కోట్లీ
యనువున నూర్ధ్వా ధో భా
గ నిరూఢిన్ లోకపంక్తి క్రమమున నమరున్.

వ. ఇట్టి లోకంబుల నుత్తమంబగు భూలోకంబు నందు భరతఖండంబు రమ్యంబగుఁ గావునఁ దత్ప్రభవంబు లెఱింగించెదనని సూతునిం గనుంగొని యెందువలన భరతఖండం బత్యుత్తమంబయ్యె వినవలయునని మునులు కౌతూహలాయత్తచిత్తులై యడిగిన.

శా. వ్యాళాపార్శ్వతట ప్రసంగ సుకృత వ్యాదిష్ట కాసారతీ
రాళోల్లస్మణి హేమసాలగత దివ్యానందసంవాసలీ
లా లావణ్య విమానరాజ శుభదోల్లాస ప్రభా దేహదీ
ప్తాలంకార విలాస భావ్య దరహాసాంచన్ముఖ శ్రీధరా !

కం. సనకాది యోగి మానస
వనజోదిత మిత్ర రుచిరవరచరణా (బ్జా?)
వనజాతాకర తీర్థా
వనభూతా ! శేషశైలవాసఖ్యాతా !

పంచచామరము. విరించి వాసవాదివంద్య ! వేదవేద్య ! భూధరా !
చరాచరప్రపంచగర్భ ! సర్వలోకసాదరా !
కరారవిందకేలి తప్రకాశ పాండుసద్దరా !
పరాపరేశ ! వాసితాహిపర్వతాగ్రకందరా !

వ. ఇది శ్రీ మదలమేల్మంగా వేంకటేశ్వరవరప్రసాదసుకవితావిచిత్ర కుత్స గోత్ర పవిత్ర మహాంకాళి అప్పకొండార్యపుత్ర సకలసుకవిస్తోత్రపాత్ర వినయగుణ

సమేత వేంకటపతి కవి సహాయ తేకుమళ్లాన్వయపయఃపాథోధి పూర్ణసుధాకర తిమ్మ
మాంబాకప్పరామాత్యకుమార సకలవిద్వజ్జనాధార శ్రీవత్సగోత్రపవిత్ర ఆపస్తంబ
సూత్ర సత్కవిప్రమోదానుసంధాయి రంగశాయి ప్రణీతంబైన వాణీవిలాసవనమాలిక
యను మహాప్రబంధంబునందు నైమిశావాస మునిప్రశ్నయు వేదశాస్త్రపురాణ సంహి
తా గణనయు బ్రహ్మస్వరూపానందతారతమ్యంబును ద్విపాద్విభూతియును సృష్టిప్రకర
ణాద్యచతుర్వ్యూహలక్షణంబులును ప్రాకృత వైకృత దశవిధ సృష్టి ప్రకరణంబులును
వాణీపరిగ్రహనిమిత్తనిర్గత చతుర్ముఖ పూర్వదేహ భవ యక్షరాక్షస సంధ్యా నీహార త
మోద్భవంబులును వేదాది సకలవిద్యాసృష్టియును శబ్దబ్రహ్మ నిరూపణంబును మిథున
సృష్టియందు నానావిధ పశుపక్షి మృగ గజాశ్వమనుజసంభవంబును, పిండోత్పత్తియు
జీవజాతి గణనంబును సకలభూతవంశావతారంబును మేరుజంబూద్వీప నవఖండ ప్రమా
ణంబులును సప్తద్వీపోపద్వీప సముద్రప్రమాణ తద్దేశావాస జనాయుర్నిర్ణయ తత్త
ద్వస్తునిరూపణంబులును గిరినదీనదసంఖ్యయుఁ బాతాళలోక ప్రమాణంబులును శింశు
మార జ్యోతిశ్చక్ర విధంబులును సూర్యలోకప్రమాణంబులును పంచాశత్కోటి ప్రమాణ
భూలోక విభాగ యోజనసంఖ్యానంబును నను కథలంగల ప్రథమాశ్వాసము.

# ద్వితీయాశ్వాసము

శ్రీమద్ధేమాంభోరుహ
ధామ ప్రేమానుగతసదావినుత శ్రీ
రామామోహనకర దే
వా! మహితోదార! వేంకటాద్రివిహారా!.

వ. దేవా! అవధరింపు మక్కథికుండు చతుర్దశభువన క్రమంబు లెఱింగించిన భరత ఖండ స్థిత పుణ్యస్థల నదీ తీర్థ ప్రభావంబు లెట్టులని యడిగిన, శౌనకాది మహామునుల కా సూతుండిట్లని చెప్పందొడంగె.

సీ. గంగాసరస్వతీ కాళిందులుఁ సింధు
సరయూ శిలల్ శోణ చంద్రభాగ
గండకి నర్మద కౌశికి గోమతి
సుముఖి విశాలయు శోణ భద్ర
యరుణయు వరుణయు నశియు గౌతమి తుంగ
భద్ర మలాపహ భవహారిణియు
నిర్వింధ్య కృష్ణవేణియు భీమరథి పయో
ష్ణయు దాప సువహ దృషద్వతియును

తే.గీ. దమస గరుడ పినాకిని తామ్రపర్ణి
వైఖ మణిము క్షి స్ప్రతి వేగవతి సువ
ముఖరి బాహుద సురస కకుద్వతియును
క్షీరనదియును గావేరి సారనదులు.

చం. అలుపగు పుణ్యశైలములఁ బుట్టి హరిస్థల సంగతంబులై
యలఘు మునీంద్ర సేవ్యములు నంచితధర్మ నిరూపణమ్ములై
తలఁపఁ గనుంగొన న్వినఁగ ధన్యసుఖాస్పద దీప్తవర్తనన్
వెలయును భారతాఖ్య పృథివీ జనభాగ్య నిధానముల్ నదుల్.

వ. మఱియు వరుసగా హరిహర నిలయ పుణ్యతీర్థ నదీ నద మహిమంబులు సెప్పెద సావధానులరై వినుండు.

కం. శ్రీ వైకుంఠమ్మున లి
క్ష్మీ వనరుహనయను గొలువ శేషగరుడ భ
క్తావళి భజియింపఁగ మో
దావహుఁడగు వాసుదేవుఁ డాద్యాకృతియై.

సీ. ఆమోద నగరి వ్యూహాత్మకుఁడగుచు శ్రీ
కరలీల (నుండు ?) సంకర్షణుండు
రమణీయమగు ప్రమోదమునఁ బ్రద్యుమ్నుండు
నమరు వ్యూహాత్మకుఁ డగుచు నటుల
నొందు సమ్మోదంబు నందనిరుద్ధుండు
విధిలోకమున నుండు విష్ణుఁ డనఁగ
వలనొప్పు సూర్యమండలమునఁ బద్మాక్షుఁ
డమృతాబ్ధి శేషశయానుఁడుండు

తే.గీ. వెల్లదీవినిఁ దారక వితతసంజ్ఞ
నుండు బదరీవనమ్మున నొనర ధర్మ
నందు జనియించి నారాయణాఖ్యుఁ డగుచు
నరునితోఁగూడి విహరించు గరిమ మెఱయ.

మ. అది పుణ్యస్థల మాద్య మంచిత ఫలం బౌటన్ దపశ్చర్య చేఁ
బదిలుండై తగు మంచుఁగొండకడ సద్భక్తాప్తవన ప్రక్రియన్
గుమరై యోగనిరూఢతన్మగులఁ రేగుల్ పుణ్యతీర్థంబు లు
ద్భిదసంఘంబులు విస్మయం బెసఁగు రీతిం బొల్పు నచ్చోటునన్.

తే. గీ. చెంతఁ గేదారమున శిలాకాంతుఁ డీశుఁ
డమర నన్యోన్యబోధ మహత్త్వతత్త్వ
యోగవిభవంబు చేనుండు యోగవినుతు
సేవ భవబంధ హరణమై సేమమొసఁగు.

ఉ. తామరసోద్భవుండు సుకృతస్థల మెయ్యదియో తలంప ని
భూమి వటించు నేమినిడ పోనికనచ్చటనిల్చెఁ గావునన్
నైమిశనామమై మునిజనమ్ముల కున్కియుఁ బుణ్యదంబు నా
నామహనీయ కాననమునందున శ్రీహరియుండు నిత్యమున్.

కం. వెంగటుఁ జెల్వగు కురుధర
ణిం గల పరపుణ్యతీర్థ నిర్మల సుకృతో
త్సంగాస్పద కారుణ్యా
పాంగుండౌ హరినిఁ దలఁప నమరున్ శుభముల్.

మ. నరగంధర్వ సురామరారులకు నైనన్ జేరఁగా రాని చో
స్థిరచక్రాఖ్య సరస్తటంబున హరిక్షేత్రంబునా నొప్పగున్
గిరి, తచ్ఛాయలఁ జక్ర శార్ఙ్గ దర లక్ష్మీ దామ చిహ్నాను లీ
లరహిన్ బెక్కగు మూపుల న్వెలఁగు సాలగ్రామ నామంబులన్.

తే. గీ. ముక్తినగరములకు నెల్ల మొదలిదాన
యోధ్య సరయూనదీతీర యోగ్యభూమి
రాఘవాఖ్యఁ జెలంగు శ్రీరమణుఁడచట
సేవకాభీష్ట దాయియై శిష్ట వినుతి.

చం. విధిముఖ దేవతాస్తుతుల విశ్రుత చారు సురూప మొప్పగా
సుధ నిం చు లే నగవు సొంపగు మోమున దుష్టనాశన
ప్రథ దళుకొత్త లోకహిత భాసురచర్య వసించు నెప్పుడున్
మధురను బాలకృష్ణుఁడన మాటికి సేవకకోటిఁ బ్రోచుచున్.

కం. వరసౌఖ్యదమగు మాయా
పురమున మధుసూదనుండు పొలుపగు భక్తి
స్ఫురిత మతిన్ సేవించిన
నరులకు సౌఖ్యప్రదాయి నా ముని వినుతిన్.

కం. సగరతనూభవ భస్మము
తగ గంగా జలముగలియఁ దపమొనరింపన్
నగచాపుఁడు తలఁదాల్చెన్
భగీరథు (ని ?) మెచ్చి నలుప పంపినదానిన్.

ఉ. అచ్చటి నుండియున్ ఘుమఘుమార్భటి శీతనగంబు మీఁది క
త్యుచ్ఛయ తచ్ఛిలాచయ తలోపరిభాగ వికీర్ణ తూర్ణ దీ
వ్యచ్ఛల మున్నత ప్రకట భంగ సురంగ దభంగవైభవో
ద్యచ్ఛటుల ప్రవాహ బహుధాగతు లల్లన నుల్లసిల్లఁగన్.

సీ. శు ద్రైతోయాకృతాభ్రయై విభ్రమా
దభ్రయై యూర్మి యుగభ్ర యగుచు
ప్రమదయై శోభితకుముదయై శ్రితముని
శమదయై విబుధసంభ్రమద యగుచు
ఖ్యాతయై హరి పదజాతయై హతదోష
జాతయై సుగుణసంఘాత యగుచు
పారయై సజ్జనాధారయై జహ్నుకు
మారియై లోకోపకార యగుచు

తే.గీ. వెలసి విలసిత జలచర కుల కలకల
లలిత విహగ సమాకుల కలిత తట సు
ఫలిత తరుకుంజ పుంజ నిర్దళన చలన
రణనవేగాతిదాంతి సౌరస్రవంతి.

చం. దరదురు పుండరీక విశద స్ఫుర దుజ్జ్వలదాతపత్ర చా
మర వరరాజహంస యసమానకవర్ధనమీన సాధనో
త్కరమకరీతురంగమ సకాశవనస్థమదేభయుక్త సా
గర కలుషాది వారణ వికస్వర వాహిని వాహినీ స్థితిన్.

కం. చెంది భగీరథు రథము పి
ఱుంద నె చనుదెంచి సుకృతరూఢి మహీభృ
న్నందనతను భూతిచయం
బుం దడుపుచు వారి ననిపెఁ బుణ్యగతులకున్.

శా. ఆ గంగాతటినీవరంబు హిమవచ్ఛైలాగ్రంబు నందుండి పు
ణ్యాగణ్యస్థితి నాశ్రితావలికి నిత్యానందముల్ గూర్ప యో
గ్యాగారమ్ముగ నాజగత్పతికి నీహన్ వే హరిద్వార భూ
భాగం బందుఁ దనర్చెఁ దద్ఘనఘృణాపారీణతన్ బొల్చుచున్.

కం. దేవనది యా జగత్పతి
పావన చరణముల కెలఁగి పటుసూక్ష్మంబై
యావల వెడలెఁ బ్రకాశత
నావిధమున నది శతాధ్వయై విలసిల్లెన్.

చం. సరసిజ సంభవుండు మురశాసనుఁ గూర్చి భజింప నర్హమౌ
ధరణి మదిం దలంచి ప్రమదంబున గంగతటిం గ్రతుక్రియా
పరుఁడగుటన్ బ్రయాగ మనఁ బ్రస్ఫుటమయ్యెఁ దదీయధాత్రి శ్రీ
వరుఁ డల ధాతయాగమున వత్సలతన్ బొడసూపె నేపునన్.

తే. గీ. అటులఁ బ్రత్యక్షమై వర మడుగు మనిన
నీత్రివేణి మకరమున నెవ్వరేనిఁ
గ్రుంక భవబంధ మణఁపుమీ ! కువలయమున
నిలిచి మత్క్రతుపాలన మెలమిఁ జేయు.

కం. అని వేడిన నలినజునకు
వనమాలి వరంబు లొసఁగి వర గంగా యా
మున వారి సరస్వతిఁ గూ
డినచోట మాధవసమాఖ్య తేవ న్నిల్చెన్.

సీ. సంవర్తవేళ నాశనము నందనిదయ్యె
నఖిల తీర్థాస్పదమయ్యె వరణ
యసి యను ధునులఁ బెంపెసఁగఁ గూడినదయ్యె
శ్రీవిశాలాక్షీశ్వరీ పతికిని

దివ్యతారక జపస్థిర బుద్ధి కనువగు
చోటయ్యుఁ బశు పక్షికీట మృగము
లైనను మృతిఁజెంద నపవర్గరమ నొందఁ
గల మేలిదైన యాకాశి యందు

ఆ. వె. నొక్క పుణ్యతీర్థ మొప్ప విష్ణుఁడు గాంచి
యొలయు విస్మయమునఁ దలఁ గదల్పఁ
గర్ణభూష దానికడఁ బడి మణికర్ణి
కాఖ్య తీర్థమయ్యె నందు మీఁద.

కం. ఉత్తరవాహిని యగుచును
హత్తర క్రోశంబు లేదు నగు తద్భూమిన్
హత్తుగ వలగొని గంగ కు
భోత్తరముగఁ బఱచె ముని సురోత్తము లెంచన్.

ఉ. ఆవరణమ్ము లెన్మిదగునట్లు గజాననుఁ డష్టదిక్కులన్
భావన డుంఠి ముఖ్య పటు భద్రపరాఖ్యులఁ గావ దుర్గలున్
భావజశాత్రవాంశజుఁడు భైరవుఁడున్ బెరవారిఁ ద్రోచుచున్
గావలి యై చెలంగఁ దగు గాశిని భోగశయాన నామతన్.

కం. నెలకొనియుఁ గంగ గ్రుంకిడి
జలజాక్షుని విశ్వనాథు సందర్శింపన్
గల యనఘు లిహపరమ్ముల
విలసిత సౌఖ్యములఁ గాంచి వెలయుదు రెలమిన్.

చం. గయుఁడను వాఁడు రాక్షసుఁ డఖండిత సత్వసమగ్రుఁడై ప్రజా
భయ మొదవంగ బాధ లిడఁ బద్మదళాక్షుఁ డెఱింగి వానిపై
రయమునఁ జేతి పెన్గద బిరాలున వ్రేయుచు వాని వక్షము
త్యయ పదపీడ చేసి విదితమ్ముగ నిల్చె మునుల్ నుతింపఁగన్.

కం. అపు డసుర విష్ణుదేవుని
విపుల పదస్పర్శనమున విద్యాయుతుఁడై
యపరిమిత చరితు నచ్యుతుఁ
గృపాయుతుఁ బొగడుచును బల్కెఁ గేవల మైత్రిన్.

ఉ. నీ పదపద్మసంగతి ననింద్య చరిత్రుఁడనైతి నిప్పుడీ
వే! పరమాత్మ సద్వరము వేడుక నాదగు వక్ష సీమ నీ
వీ పగిది న్వసించి సురలెల్ల భజింపఁగ నుండి పిండ ఖిం
దోపిక నెవ్వరే నిడిన నున్నతిఁ దత్పితరుల్ చెలంగఁగన్.

చం. అనవుడు మంచిదే యనుచు నబ్జజ శంకర కార్తికేయుల
య్యిన శశి చంద్రులింద్రుఁడు గణేశుఁ డగస్త్యుఁడు కశ్యపాది స
న్మునులటు నంఘ్రిపంక్తు లిడఁ బూన్చి గదాధరుఁ డట్లు నిల్చె భూ
జన పితృకోటి ముక్తి గనుచాయ నయంబగు నగ్గయన్ దగన్.

తే. గీ. అట శమీపత్రమంతైన నాగమోక్తిఁ
బిండ మిడ సర్వగోత్రజుల్ పేర్మి నూఱు
నొక కులములవారు కైవల్య మొనరఁ గాంతు
రచటి మహిమంబు పొగడ బ్రహ్మకుఁ దరంబె!

సీ. అటఁ బ్రేతగిరి యన నవనీధ్ర మొక్కటి
ఫల్గుని నది చెంతఁ బరిఢవిల్లు
మును రాముఁ డట నిజజనకుని మృతి విని
పిండ ప్రదానంబు పేర్మిఁ జేయ
నరుదేర, గయయందు నావరణము చేసి
పాలకుల్ పో నిమిషతియు నవలఁ
బేర్మిమైఁ గయిసేసి పిండము ల్గొనుటకు
గయ జిహ్వఁ జాఁప వీఁక న్వచింప

తే.గీ. నాలుక వెలార్ప జిహ్వ విలోల మయ్యె,
మున్నె యినుమున ఫల్గుని సన్నుతాంగి
సీత పిండము లిడినచో భూతలేశుఁ
డిడఁగఁ బితరులు రాకుండు టెంచి యతఁడు.

కం. ఏమి నిమిత్తము రారన
భూమిజ యిడుటచటి యేరు పూనికఁ బలుకన్
రామామణి ఫల్గుని నట
భూమిన్ గుప్తముగఁ గోపమునఁ బల్కెఁదగన్.

కం. అంత గయావాలకుల
త్యంత భయభ్రాంతి నిటుల నఖిల జనుల్ కా
వింతు రిట కలవదని భూ
కాంతుని వేడంగ శుద్ధగయఁ బిండ మిడెన్.

కం. ఇప్పుడు సీతారాముల
యొప్పందము నెలుఁగఁ జేయుచున్నది యదియున్
జొప్ప మరు రామగయ యనఁ
జెప్పఁగఁ దరమే! తదీయ చిర మహిమంబుల్.

శా. రంగత్తుంగతరంగసంఘములు తోరంబై కడు న్వేడుకన్
గంగా వాహిని రా సముద్రుఁ డతిలోకంబౌ ప్రవాహంబు నా
గంగా లేక హరిం దలంప నది పోకన్ వేయి పాయల్గ డిం
దంగాఁ జేయుచు విష్ణుఁ డందు నిలిచెన్ దాసావన ప్రక్రియన్.

కం. గంగ శుభాస్పద యసిత త
రంగిణి యఘహారి తీర్థరాజం బేత
త్సంగమ మెంతయు నొప్పగు
బంగారము పరిమళమునఁ బాటిల్లు గతిన్.

కం. మనువులు మును లఖిల సురల్
దినమున్ సేవింతు రట్టి తీర్థోత్తమమున్
మనమునఁ దలఁచిన శుభమగు
మునుకడలం గలుగు టరుదె మోక్షం బెలమిన్.

ఉ. ఎవ్వఁడు గ్రుంకు నయ్యెడల నెవ్వడు మాధవుఁ గాంచు భక్తిమై
నవ్విమలాత్ము వంశకరులౌ పితరుల్ ఘనపుణ్యలోకముల్
నివ్వటిలంగఁ గాంతు రవని స్మృతి పుట్టరు చూడఁ గ్రోలుడున్,
నవ్వుల కైన నెన్నఁగ ఘనంబగు పాపము లూడు నన్నియున్.

ఆ. వె. తలఁచినంతఁ దీర్థములఁ గ్రుంకు ఫల మగు
నచటి మట్టి నుదుటు నమరఁ దాల్పఁ
దలను జలకణములఁ జిలికించి కొన నెల్ల
పుణ్యగతులు గల వగణ్యగరిమ.

సీ. మహిమ మేషాదిగా మాసముల్ పండ్రెంటఁ
గృష్ణ గోదావరి ధృతి సరస్వ
తీనది వేత్రవతిన్ దుంగభద్రా ర్క—
భవలం దమస సరయూవున భీమ
రథిః దామ్రపర్ణి నారసి రేవ నిరసించి
యఖిల లోకుల యఘం బణఁచి-యుట్టి
నదుల తీర్థము పావనము చేయు క్రమమున
నా గంగ కెన్నంగ నజుని వశమె!

తే.గీ. నదులలో గంగ మేలంద్రు త్రిదశవరులు
తత్సమంబగు తీర్థంబు దలఁచ విష్ణు
మూర్తు లయిన సాలగ్రామముల నిమజ్జ
నాంబువులె శాక యొందు లే దరసి చూడ.

కం. సూర్యునికిఁ ద్వష్ట్రపుత్రికి
నార్యస్తుతిఁ బుట్టినట్టి యముని చెలియ ల
య్యార్యార్థి వినుత చరణు న
వార్య మతిం గూర్చి తప మవశ్యతఁ జలిపెన్.

శా. కాళిందీ వ్రతనిష్ఠకున్ హరి నిజాకారమ్మున న్వచ్చినన్
బాలారత్నము సన్నుతింపుచు నెదన్ బెట్టిన సిగ్గొందఁ గా
హేలాదృష్టిఁ గనుంగొనం దెలిసి నీ యిష్టార్థమున్ గూర్తుఁ బా
మ్మీ! లీలాకృతి నీ తటమ్మునను నెమ్మిన్ బుట్టి యప్పట్టునన్.

కం. అనవిని కాళిందీ నది
మనమున ముద మొదవ సూర్యమండలమున నుం
డి నిగిడి కళింద శైలము
వినుపుచుఁ బ్రవహించి గంగ నెమ్మిన్ గలసెన్.

సీ. యమునకుఁ బ్రత్యక్షమైన యాకృతి జగ
త్పతి యవంతీ పురి నతిశయిల్లె
నదియగును మధుర యట్లు శుభప్రదం బౌటఁ
గనుగొను జనులకు నొసఁగి శుభము
లబ్జాక్షుఁ డంతఁ గృష్ణావతారము నొంది
జలధి మధ్యమునఁ ద్వష్టృసుతు చేత
వితతమై తగు ద్వారవతి యాదవేంద్రుండు
డంబగు నంద వ్రజంబు నందు

ఆ. వె. గోపికా ప్రియుండు నా పట్టి బృందావ
నంబు నందుఁ జెలఁగు నంద సుతుఁడు
ననఁగఁ గాళియహ్రదావని గోవిందుఁ
డగుచు నమరె సేవకావనతను.

కం. గోవర్ధనమున గోపతి
గోవల్లభుఁడైన శౌరి గోమంతమునన్
బావనత భక్తలోచనుఁ
డై వెలయు భవిష్యమున మహత్త్వము వెలయన్.

తే. గీ. గోపపురి గోపతి యనంగఁ గొమరు మిగుల
నమరు, రాముఁడు చిత్రకూటమున, రాక్ష
సఘ్నుఁ డుండు నందిగ్రామచర్య, రామ
భూమి, జానకీ ప్రియుఁడుండు భూరి మహిమ.

కం. భాసుర పుణ్యద మైన ప్ర
భాసం బను తీర్థ ధరణిఁ బద్మదళాక్షుం
డా సక్తి విష్ణుమూర్తి య
నా, సురనుత మహిమ వెలయు నవ్య స్ఫూర్తిన్.

కం. శ్రీ కూర్మంబునఁ గూర్మం
బై కవ్వపుఁ గొండ తాలుపన విలసిల్లెన్
జోకన్ దులసీవనమున
శ్రీ కరగతి గది యనంగఁ జెలఁగు న్మహిమన్॥

సీ. శైలోత్తమంబగు నీలాచలమ్మున
నలువకుఁ బ్రత్యక్షకలనఁ బొసఁగి
పురుషోత్తమాఖ్య నద్భుత మహత్త్వంబునఁ
గను పట్టి, వినుతించి వనజభవుఁడు
బహు నివేదనములు విహితోపచారముల్
గావించి లోకైక పావనమగు
నా క్షేత్రమున నెవ్వ రంతర జాతి భే
దము లెంచిరేని యిడుములు గాంతు

తే.గీ. రనుచు భగవదనుజ్ఞ నెయ్యమునఁ గాంచె
నచటి జలనిధి నెక్కాలమైనఁ గ్రుంక
శుభము లిహపరసౌఖ్యముల్ విభవ మెసఁగు
నందుఁ గలదొక్క సరసి పుణ్యతను మెఱసి.

మ. దళమై యంతటఁ బద్మకల్ప సమయాంతంబందుఁ బుణ్యాస్పద
స్థల మిచ్చోనని యాత్మలోఁ దలఁచి యింద్రద్యుమ్న భూపాలుఁ డి
చ్చల నీలాచల పుణ్యతీర్థమున నాశ్చర్యమ్ముగాఁ గాకి క్రుం
కి లసద్వైఖరి రాజహంసమగుటల్ గీర్తింప వించు న్వెసన్.

కం. నీలాచల విభుఁ గొల్వఁగ
హాళిం జనుదెంచి విష్ణు నచ్చటి గిరిపై
నాలోకింపఁగ లేమిన్
జాలా సంతాపమంది జనవిభుఁ డంతన్.

మ. తపముం జేయఁగఁ బద్మకల్ప మగుడంతన్ ధారుణీ చక్ర ప
ల్లి పయోరాశి మునుంగఁగా నృపతి లీల న్నీలశైలమ్మునన్
నిపుణుండై కమలాక్షుఁ జక్రధరు వర్ణించెం దపశ్చర్య చే
నపుడా శ్వేతవరాహ కల్పమగుచో నా ధారుణీ భర్తతోన్.

కం. సురలదె "యంబుధి లోనన్
దరంగములఁ గూడి రత్నదారువు వచ్చెన్
హరికరుణ గా నెఱుంగుచు
స్థిరమతిఁ దన్మూర్తిఁ దానఁ జేయుము భక్తిన్"

సీ. అని పల్కుటయు నట్ల యవనీశ్వరుఁడు దరి
చేరిన దారువు నారసి కడు
సంతసమ్మునఁ దెచ్చి యెంతటి పుణ్యుఁడో
దీన నేనవ్విష్ణు దేవుఁ జేయ,
నని చింతనము నేయ హరి యటు కొక్కవ
ర్ధంగి యై వచ్చి పొసంగఁ జేయు
దా వరణమ్ములో నది నేయునంతకుఁ
జూడకు మని పల్కి వేడుకలరఁ

తే. గీ. బెక్కు దినములు నేయుచోఁ బేర్మిఁగర ప
దాంగుళము లానఁ గూర్చుని యపుడు నృపతి
తొంగిచూచిన, నతఁడు తొలంగి చనియె
యపుడు వగనొందు నృపతితో నభవాణి.

కం. వాసిన్ బలభద్ర సుభ
ద్రా సహితు జగత్పతిని ముదంబున నిల్పం
గా, సమకొను మటు లుండుట
కా సరసిజనాభునకుఁ బ్రియం బన, నతఁడున్.

వ. తద్దారు శేషంబునఁ బురుషస్తంభంబ నా నేసిన స్తంభంబును దద్విగ్రహంబులును నగ్గిరియందు నునిచి యప్పుడు—

చం. నలువ యెఱింగి తెల్పిన దినంబున శ్రీధరునిన్ బ్రతిష్ఠ యే
సలిపెద నంచు నచ్చటికిఁ జయ్యనఁ బోవఁగ దేవ మౌని తో
నెలమి వసించియున్న పరమేష్ఠి నృపాలునిఁ జూచి యో తపో
బలయుత! యీశురాక యిటు బ్రస్ఫుటమయ్యె మదీయ హృద్గతిన్.

ఉ. నీ విటువచ్చునంతన యనింద్యచరిత్ర! యనేక కాలముల్
పోవ, విదర్భరాజు హరిఁ బూనిక నీలగిరిన్ బ్రతిష్ఠ మే
ధానిధి చేసి తత్పరము దా పరిపాలన నేయుచున్నవాఁ
డో విమలాక్ష! సౌ, నపుడు నుర్వివిభుండు విధాతతో ననున్.

కం. ఏ నానరించిన దేవుని
నేనె ప్రతిష్ఠింతు నుకృత మీపె! మహాత్మా
ధీనుత యని ప్రమొక్కిన చో
నా నారదుఁ బంపె నట్టి యనువొనరింపన్.

చం. అతఁడు తపోబలమ్మున గజాశ్వరథావళిఁ జేసి వైరి భూ
పతిఁ దఱిమించి వేఱె గృహపంక్తు లొనర్చి జగత్పతిన్ రమా
యుతు నటనిల్పఁ బో, వలవదుండెద నిచ్చట నంచు సత్కృపా
మతి విలసిల్ల నచ్యుతుఁడు మానవనాథునితో ముదంబునన్,

సీ. పలుకు డింద్రద్యుమ్నుఁడలఘుచింత వహింప,
నీవు కట్టిన గృహ నివహమునను
బ్రతి హాయనమ్ము నేర్పడ సప్తరాత్రముల్
వసియింతు, సేవించు వార లచట
మద్దర్శన ఫలం బమరఁగఁ గైకొందురు
నని, భగవంతుఁ డిట్లాడి పతిత
పావనుఁడౌ జగత్పతి డోలికా యంత్ర
మా రథోత్సవము జ్యేష్ఠాభిషేక

తే.గీ. మాదియైనట్టి విభవములతఁ డొనర్పఁ
బ్రబలి దారుపర బ్రహ్మ భవ్య నిగమ
వాక్య వైఖరిఁ గను పట్టె వసుధ యందు
నట్టి పురుషోత్తముని సేవ యమృతపదము.

కం. ముదమున భూపతి గ్రుంకిడ
నది యింద్రద్యుమ్న సరసి యనఁదగు ప్రిళయం
బాదవ వటుపత్ర శయనునిఁ
గదియం జని కాంచెనట మృకండజుఁ డెలమిన్.

కం. వినుఁ డచ్చట మార్కండే
య నిరూఢాఖ్యాతి నర్థ మనువగు సుకృతం
బనఘం బత్యద్భుత మా
వనధి దరిన్ నీల శైల వైభవ మరయన్.

తే.గీ. అచట మృతిఁ జెందు జంతుకాయములు పూతి
గంధరహితము ల్ శంఖచక్ర ప్రచిహ్న
తాస్థి పంక్తులునగు నట్టి యద్భుతములు
గలవె ! యొందేని మోక్ష మార్గమ్ము నరయ,

తే.గీ. సింహగిరి యందుఁ దగు మహాసింహుఁ డనఁగ
శ్వేత శైలమ్మునందు నృసింహ రూపి
యా యహోబల గరుడ శైలాగ్రముల ను
దనరు దహనీయకశిపు మర్దనుఁ డనఁగ,

మ. భవనాశీ నది పాపహారి యగు తత్ప్రాపనిన్ దద్దుకున్
నవరూపంబుల నారసింహులు జనానందమ్ముగా నుగ్ర రూ
ప వరజ్వాలలు గల్గువారు గలరా పట్లన్ రహస్యమ్ము లౌ
నవదాతాబ్జదళాక్షు దివ్యకథ లాహా ! యెన్నఁగా శక్యమే !

:

మ. ఘటికాద్రిన్ దపమాచరించు మునులం గావన్ సమీరాత్మజున్
బటుసత్త్వాన్వితు నిల్పి సప్తఋషులన్ బాలింపఁ బ్రత్యక్షమై
నటునన్ శ్రీ నరసింహదేవుఁడు బుధానందమ్ముగాఁ జెల్వగున్
దృటికాలమ్ము వసించు మానవులు తృప్తిన్ గాంతు రద్ధారుణిన్.

సీ. అనఘుఁడౌ గౌతముండా శ్రీమాంతరమునఁ
చిత్రితినుల పూజ పేర్మిఁ జేయ
నీవార సస్యమ్ము నెమ్మిఁ బోగ్రఁగి యొనర్చు
దినము మధ్యందినమానకు నౌదవు
తన్మహత్త్వమునకుఁ దాళకిందుగ్రఁడు పశు
వై వచ్చి మేసి సంయమి పరుండు
తృణముచే నదలింప ధృతిచెడి కూలినఁ
గటకటపడి మునిగణపరులకుఁ

ఆ.వె. దెలుప శంభుశిరము నెలవగు గంగ ని
యాత్యపమీఁదఁ దెమ్ము హత్యతొలఁగు
ననుడు మౌనియట్లు, నా సహ్యగిరి యందు
శివుగురించి తపము నేయుటయును.

సీ. హరుఁడు ప్రత్యక్షమై యతని కిష్టమొనర్ప
గంగఁ బూనుతెలంగెలుంగ లేమి.
నౌదుంబరపు వేళ్ల నందమై నాసికా
బిలముల నల్లన మెలఁగ విడువ
నచ్చోటు సహ్యాద్రి త్ర్యంబకంబనఁదగు
నాగంగయుఁ బ్రవాహ మడర వెడలె
... ... ... ... ...
... ... ... ... ...

తే.గీ. గంగ కటమున్న వచ్చుటఁ గలిగె వృద్ధ
గంగ యనుపేరు గౌతము కతనఁ జేసి
గౌతమీనామ, మయ్యావు నైకొనుట ను
వినుతి గోదావరీ నామమును బొసంగె.

కం. భాగీరథి జాహ్నవి యన
నా గంగాతటిని కాశియందు వెలసి తా
నా గౌతమిఁ గలియున్ సిం
హాగతుఁడై గురుఁడు మెలయ నయ్యబ్ధమునన్.

ఆ.వె. రక్తరుచిని బుక్కురత్రయంబున నాసి
కా త్రియంబకంబు గదిరి జలధిc
గలియు వృద్ధిగంగ జలము లంతర్వేది
దనుక నుండు సురలు మునులు పొగడ.

వ. అట్టియెడc గ్రుంకులిడు జనులైన నిహపర సుఖంబులం బడయుదురు. తర్పణమ్ములొనర్పc దత్పితరు లక్షయపదవిం జెందుదురు. ఇప్పుణ్యనది యుభయ తటంబుల బహుదివ్యస్థలంబులు గలవు. గరుడనదీసంగమంబున వాసర యనందగు నచట సరస్వతీ భజనంబు విద్యాప్రదంబగు, గౌతముండు కుశచేc బశువు నడంచినయెడc గుశతర్పణంబను పుణ్యస్థలంబయ్యె. మునిగణంబులారాధింప నందతికి నన్నిరూపులై విరూపాక్షుండు ప్రత్యక్షుంబైన కతంబునc గోటిలింగస్థానంబనం బరగు. సకల వేదోపనిషత్సారంబులగు మంత్రంబుల మునివారంబులు నారాయణుc గైవారంబు నేయుటంజేసి మంత్రకూటంబును, ప్రణీతాసంగమంబునc గాలగళుండుండుటంజేసి కాళేశ్వరం బనందనరు, నారామచంద్రుండు సీతాసమేతుండై పంచవటంబున నుండుట భద్రాచలంబనం దదీయవిహారచిహ్నంబులిప్పుడుం గనంబడు. పదంపడి సీతావియోగంబున శపియించి దేవమునిప్రార్థితుండై కబరీ తీర్థసంగతిం బవిత్రంబగునని గోదావరి ననుగ్రహించి నిజధనుష్కోటిచే మార్గం బేర్పరించిన నంచితంబుగ రామప్రభావసూచకంబై కబరి గౌతమిం గలసినయెడ యతిసుకృతప్రదమగు మఱియు సరసిజభవసవనస్థానంబగు ధర్మపురి రామేశ్వరసన్నిధి బ్రహ్మ తీర్థ యమ కోత్రిధా శేషహ్రదాది పుణ్యలాంఛనంబులం బరగి యుండు.—

కం. ఆ ధర్మపురిమహత్త్వము
సాధు స్తవనీయ మమిత శాశ్వత మగుటన్
వేధయును దెలియ నేరం
డాధరc దగు యోగనృహరి యంచిత లీలన్.

కం. నందిత విబుధుండురయోగా
నందనృసింహుండు బుధజనప్రియుండై యా
నంద ఫలప్రదవిభవా
మందవిహారతc బొసంగు మహనీయరుచిన్.

కం. ధృతి మలిన హరియగుటన్
కృతశాకం బనగ వెలయc గేవలభూసం
గతుండగుచుc బాపహరుండన
నతిశయుండగు సేవక ప్రజాభీష్టదుండై.

కం. లలితాంధ్రభూమి శ్రీ కా
కుళమున నంధ్రపతి యనఁగ గోవిందుఁడు ని
ర్మల చర్యఁదనరు తైర్థిక
ఫలరూపంబగుచు భువనభాసుర మహిమన్.

చం. ఇలఁగడు పాపసంగతులు హింసకులున్ ఖలితుల్ తమంత దా
రలవడ నాస్థలంబు గన, నందు వసించిన, పుణ్యమూర్తులై
వెలయఁగఁ బాండురంగమున విఠ్ఠలనామ మురారి యొప్పఁ ద
ల్లలిత మహత్త్వ మెన్నఁగఁ గళానిధిజూటున కైనశక్యమే!

చం. తనుభజియించు శేషు నిల ధారుణిభృద్వర రూప మొందఁగా
ననిలుని వాదుచే నొదవు నట్టులొనర్చి రమాసఖుండు శ్రీ
వనిత తపమ్ము మెచ్చి నుతవైఖరి వక్షమునన్ ధరించె భ
క్త నికరసౌఖ్యదాయి యనఁగాఁ దగు వేంకటనాథుఁ డయ్యెడన్.

సీ. అంజనధర గరుడాహార్య వృషశైల
నారాయణాద్రి కనక శిఖరులు
నీలాద్రి చింతామణి గిరి వైకుంఠాద్రి
వారాహ వృషశైలమేరు గిరులు
సింహాద్రి తీర్థాద్రి శేషాద్రి పుష్కరా
చల వేంకటాద్రులు నెలమి శ్రీని
వాసాద్రి శ్రీశైల భాసుర సంజ్ఞల
గుణకృతనామముల్ కోట్లుగలఁది.

తే.గీ. కడఁగి పాతకచయములు గాల్చువలన
నమృత మైశ్వర్యము నొసంగు నంచువలన
వేంకటాచల నామంబు వెలసె మిగుల
నచటఁ గల్గు ప్రధానతీర్థాళి వినుఁడు.

ఆ.వె. స్వామిపుష్కరిణియు స్కందధారయు దేవ
తీర్థ పాపహరణ తీర్థములును
దురితదూరమైన తుంబురుతీర్థ మా
కాశగంగ యనఁబ్రకాశకములు.

వ. గిరిపాదంబునఁ జక్రతీర్థాద్యష్టాదశతీర్థంబులును మార్కండేయపాండవతీర్థంబులును, అరుంధతీతీర్థంబును మఱియును—

కం. ఇవి మొదలగు శుభవిభవా
త్యవిరళ సార్ధ త్రికోటి యగు తీర్థములన్
నవకాంచన తరుకుసుమో
ద్భవ గరిమన్ మేరుసమతఁ దద్గిరి యమరున్,

కం. విరివియు నిడివియుఁ బొడవును
తిరమొప్పఁగ నేడునెనుబదియు నాలుగు రెం
డురుతర యోజనముల చే
నిరవొందున్ దత్ప్రభావమెన్నఁగవశమే.

కం. శ్రీ వేంకటగిరి మహిమం
బా వేల్పుఁ బెద్దయైన నభినుతి సేయం
గా వెరవెఱుఁగండెంతయు
శ్రీవైకుంఠంబె యది విశేషఫలదమై.

సీ. మున్న శ్రీవైకుంఠమునఁ గేగి నారదుం
డట నుండి క్రిష్ణుఁడ నరుగుదెంచి
తన కెదురైనట్టి మునికదంబముఁ జూచి
వినుఁడు రమాసఖుం డనఘమూర్తి
దేవుఁడు వైకుంఠ దివ్యవిమానాధి
రూఢుఁడై విరజయు రుచిరసరసి
గతిఁ దన్ను భజియింపఁగా శేషగిరి మీఁద
నున్నవాఁడని తెల్ప విన్నయట్టి

తే.గీ. సనక శుక వాసుదేవాది సంఘమీంద్రు
ఉత్సవంబున నట కేగి యుచిత రీతి
నా జనార్దను భజియించి రట్టి విష్ణు
సేవ లిహపర సౌఖ్య శుభావహములు.

కం. గంగాది దివ్య తీర్థము
లంగజహరముఖ్యదేవతాళియుఁ దచ్ఛై
లాంగణమున వసియించు ను
సంగతి హరిపాదభజనఁ జరితార్థకమై.

కం. గిరి కభిముఖమై మ్రొక్కిన
సరసత జనవినుతి సేయ సకలశుభంబుల్
పరికింతు రనిన హరిఁగను
పరమ మహాపుణ్యమెన్న బ్రహ్మకుఁ దరమే!

శా. క్షీరాంభోధి జనించి యంచిత తపశ్శ్రీ వేంకటాధీశ్వరున్
గారాబంబునఁ బెండ్లియాడుటకునై కల్యాణ పద్మాకరో
దారాంచత్తట కుంజపుంజ విలసత్పాటీర వాటీ కుటీ
ధారాధార సుగంధ బంధుర తను వ్యాపారహేలాగతిన్,

కం. వలను గ నలమేల్మంగన్
గలువుల చెలిఁ బెండ్లియాడి కంజదళాక్షుం
డలరుం జెలువగు సొబగున
నిలపైఁ గల్యాణ వేంకటేశ్వరుఁడనఁగన్.

వ. తత్కారణంబున శ్రీవేంకటపతి రమా సక్తుఁడనఁ బరగు.

తే. యాదవాద్రియు నారాయణాద్రి యనఁగ
నమరు నగ్గిరి మూని జవనానాను
రక్తిఁ బొలుపొందియుండు నారాయణుండు
తత్పదాంభోజభజన మత్యంతశుభము.

కం. తిరునారాయణ పుర మనఁ
బరగిన తద్యాత్రిఁ గల్గు పాండుర కాంతి
స్ఫురదురు మృద్ధారణ మన
నరులకు నారోగ్య మఘవినాశనము నగున్.

సీ. నలువ యజ్ఞము సేయ వెలయు సత్యవ్రత
క్షేత్రమ్మునన్ హస్తిశిఖరి మీఁద
వేగవత్యుత్తరభాగావళిన్ ధాతృ
వరుఁడైన తద్యజ్ఞవాటమునను
వారిపోశల్చి నా కాంచి నబ్జాక్షమూర్తులు
కమలాక్షుఁడు యథోక్తకారి మఱియుఁ
బరమేశ్వరుండును పాండవదూత మ
ధూన్మథన నృసింహులాగి ద్రివిక్ర
ముండు నయ్యష్టభుజుండు శ్రీవాళ వ
ర్ణుండు దీపాఖుండు నిండు వేడ్క

తే గీ. నుండుదు రయోధ్య కాశియు నొప్పు కాంచి
మొదలుగా సప్తపురముల విదితసుకృతి
మహిమ లత్యద్భుతంబులు మదనవైరి
వెలయుఁ గామాక్షితోఁ గూడి వేడ్క నచట.

కం. వినుఁడట గృధ్రసరస్తట
మున మున్ను జటాయువునకు మోక్షప్రదుఁడై
తనరారు విజయరాఘవుఁ
డనుపమధృతి వెలయు సేవకానందకలిన్.

మ. స్తుత సమ్యగ్గుణ! శాలిహోత్రుఁడు తపస్స్ఫూర్తిన్ భజింపన్ బ్రక
ల్పితలీలన్ విపులాంశజన్ గనకవల్లిన్ బెండ్లియై సంతతా
తతహృత్తాప వినాశనాఖ్యవరతీర్థ స్వార్థచారిత్రుఁడై
ధృతమాహాత్మ్యుఁడు వీరరాఘవుఁడు నాదీపించు వీక్షాటవిన్.

కం. శేషాద్రిఁ దుంగశయనుఁడు
ఖ్యాతి గజస్థలమునన్ గజార్తిఘ్నుండున్
భాతిగ బలిపురిలో సం
ప్రీతి మహాబలుఁడు నుండు శ్రీకరలీలన్.

తే.గీ. భక్తిసారమ్మునన్ జగత్పతి వెలుంగు
నైంద్రమున దేవదేవేశుఁ డనఁబొసంగు
మహితమున పద్మనేత్రుఁడు రహిఁ జెలంగు
స్వర్ణమందిరభూమి సువర్ణుఁ డమరు.

సీ. ఝిల్లికావనమున శ్రీముష్ణదమ్మున?
సారమౌ మణిముక్తతీరభూమి
వృద్ధాచలముచెంత వెస నిత్యపుష్కరి
ణీతటమ్మున శుభఖ్యాతి మెఱయ
మునులెల్లఁ దపములిమ్ముగఁ జేయవారల
రహిఁ బ్రోవ శ్వేతవరాహమూర్తి
దనుజు హిరణ్యాక్షుఁ దునుమంగ శంఖచ
క్రకరముల్ పిఱిఁదిచక్కటిని దాఁచి

తే.గీ. వాని నటుఁగూల్చిధరఁదాల్చి మానితముగఁ
జరణయుగి రసాతల మురస్థలమునొకటు
కుల్పగించుచుఁదల్లీల కొమరుమిగుల
నున్నవాఁడిప్పుడిందఱాచిన్నలెఱుఁగ.

కం. శ్రీముష్ణమహత్త్వంబా
తామరసజుఁడింపుతో సదా కొనియాడున్
ధీమజ్జన సుకృతఫలం
బామహి నశ్వత్థసేవ లతిసుఖదంబుల్.

కం. ఏ దినమైనన్ వారం
బేదైనన్ రాత్రియయిన నే వేళైనన్
మోదంబున భజియించిన
నా దివ్యాశ్వత్థమొసగునఖిలశుభంబుల్.

తే.గీ. నాభి పద్మోద్భవుం డగు నలినజునకు
హంసమై తత్త్వబోధన మమరఁజేసి
ఘోటకాకృతివేదముల్ గూర్చినొసఁగ
నాచతుర్ముఖుఁ డబ్జాక్షునభినుతించి.

శా. నైజాకారముఁ జూపవే!యనుడు నానందాత్ముఁడై శౌరి వి
భ్రాజత్కల్గల వైకుంఠధామయుతుఁడై పక్షీంద్రనాగేంద్రులున్
దేజోయుక్తుఁడు సైన్యపాలకుఁడు నర్థిన్ నిత్యులున్ గొల్వ ల
క్ష్మీ జీమూత శిరోజ, నీల, ధర, నెమ్మిం జేరి సేవింపఁగన్.

తే.గీ. ప్రణవమయ వి[తా ?] నప[టము ?] ఁజతుర్వేద
రూపశృంగయుక్తి నేపుమీఱి
నట్టి సెజ్జలోన నబ్జజుఁ డలరంగఁ
గానుపించె వేల్పుగములు పొగడ.

వ. అట్టి శ్రీరంగవిభునిం బ్రార్థించి నిజార్చనలు గైకొనుటకు గృహదేవతగా నలువ నిలుపుకొనియె నంత.—

ఉ. గంగకు సహ్యనందనకుఁ గల్గిన వాదమువల్లఁ గోప ము
ప్పొంగఁ గవేరకన్య కడుఁబూన్కిఁ దపంబొనరింప మెచ్చి శ్రీ
రంగ విభుండువచ్చిన వరంబుగ వేఁడె, నిజోదరైక సీ
మం గుదురై వియన్నదికి మక్కువ నెక్కువ సేసియుండఁగన్.

చం. అనహరి చంద్రపుష్కరిణి కవ్వల నివ్వల నీ ప్రవాహముల్
దనరఁగనుండు మే నచటఁ దార్కొని నిల్చెద నంచుఁ బల్కె న
ట్లన నటధర్మ వర్ముఁడు దయాపరు శ్రీహరిఁ గూర్చి నిష్ఠ నొం
పొనరఁ దపమ్ము సేయ హరియుం బొడసూపి నృపాలుతోడుతన్.

వ. కాలాంతరమ్మున నచ్చట వసియించెద ననియె నంత—

సీ. విను త్రిరాత్రుల జాహ్నవీనది యొగి పంచ
రాత్రు లర్కజ సప్తరాత్రుల యొడ
గౌతమి రేపతి ఖ్యాతి నాలుగురాత్రు
లను జన దుఃఖమ్ము లను హరించు
నా కవేర కుమారి యాక్షణమ్మునఁ గ్రుంకు
లిడు వారి పాపమ్ము లెడలఁజేయు
నట్టి కావేరి మధ్యావనిఁ జంద్రుండు
హరిఁ గూర్చి నిరశనుఁడగుచు ఘోర

తే.గీ. తపము గావింప మురదైత్య దమనుఁ డలరి
నీవలె తపంబు గావింప నేర రెవ్వ
రనుచుఁ బ్రత్యక్షమైన యబ్జాక్షునకు న
మస్కృతులు సన్నుతులు సేసి మహితభక్తి.

కం. నా పేరట నెల్లప్పుడు
నీ పుష్కరిణీ పరమ్ము నింపొందంగా
నో పరమపురుష! వరమీ
వే, పూనిక నిచట నిల్వవే యన వేడ్కన్,

వ. అట్లయని వరంబొసంగి యంతర్హితుండయ్యె నంతకుమున్న—

మ. తపమొప్పంగని బ్రహ్మదేవుఁడు పరంధామున్ సదా పూజ నా
ద్యపరవామ్ములఁ దృప్తుఁజేసి యతఁడెంతే వేడ్క నిక్ష్వాకు పన్
నృపతి శ్రేష్ఠున కిచ్చెఁ దత్కులజులా నీరేజపత్రాక్షు న
చ్చపు భక్తిన్ భజియింప రాఘవుఁడు తచ్చారిత్ర సంయుక్తుఁడై,

కం. పూజలు సేయుచు దానవ
రాజైన విభీషణునకు రమణ నొసంగన్
దేజోధనుఁడా సెజ్జ మ
హారాజను వనమాలి గొంచు నురుతరభక్తిన్.

కం. లంకకుఁ బోవఁగఁగని యా
పంకజనయనుండు లేమి భారతవర్షం
బింక పసలే దనుచు గరు
డాంకుని హరి నెంచి రంత నమరులు మునులున్

సీ. అంత విభీషణుఁడా శౌరిఁ దెచ్చుట
ధర్మవర్మఁ డెఱిఁగి తా నెదురుగఁ
జని సహ్యజా మధ్య సైకత వాసుని
గావించి యర్చనల్ పావనాన్న
పాన నైవేద్యముల్ మానితగతిఁ జేయ
నా రాత్రియుండి దైత్యాధినేత
మఱునాఁడు సెజ్జ సంభ్రమున నెత్తఁబోఁ
గా వేరియున్ శీతకరుఁడు ధర్మ

వర్మయాను వేఁడు వరములు పేర్మి సురల
తలఁపఁ బరికించి శ్రీరంగధాముఁ డచట
నిలచి తరలక చెంత చింతిలెడు దైత్య
విభుని నూఱడఁ బల్కుచు వేడ్కతోడ.

ఉ. అంత మురాంతకుండు దనుజాధిపు నిత్యము గొల్వవచ్చు న
ట్లొంతయు వేడ్కతో ననిచి యేపున నచ్చటి ధర్మవర్మకున్
సంతస మొప్ప నవ్యశుభసౌఖ్యము లిచ్చి సమస్తలోకులున్
మంతుకు నెక్క సేవల సమంచితభక్తి భజింపవర్తిలెన్.

కం. శ్రీరంగ రంగ యని మన
సారంగఁ దలంచు జనుల నమరగఁ బ్రోచున్
సారంగ వరదుఁ డగు నా
శ్రీరంగవిభుండు విబుధ సేవితుఁ డగుచున్.

కం. క్షేత్రప్రదక్షిణా ధ్వప
విత్ర స్థిరతీర్థ నవకలిందు గదమునో ?
మిత్ర స్వర్ణాంగులు
హరి చిత్రాకృతు లగుదురందుఁ జెలు వెసఁగంగన్.

సీ. ధరణి సోమకులుండు ధర్మకేతనుఁ డందు
నశువర్గ మొందె రంగార్చనమున
గ్రామయాచక పాతకతఁ బతితుం డొక
విప్రుండు మృతుఁడైన వేడ్కవాని
వెలఁది జారిణియైన వీతసద్గుణుఁ డొక్కఁ
డుదయించి బ్రుచ్చునై యుర్వియందుఁ
దిరుగుచు రంగమందిరముఁ గన్గొని స్వామి
సొమ్ములు దొంగిలఁజూచి తోడి

తే.గీ. దొంగలును దాను డిగ్గియఁ దొంగి గుఱుతు
ల మర రంగాధిపునిఁ జూచి యటఁ బ్రసాద
మొనర భుజియించి తలివేచికొని కవేర
కన్యకా పులినోర్వి దాఁగంగ నంత.

ఉ. వెల్లువ వచ్చి చుట్టుకొని వేగమునన్ బలునీఁటు ముంచినన్
గల్లరిదేహముల్ విడిచి కమ్రవిమానగులై జగంబులం
దెల్ల సుఖంబు లం గనఁగ నింపుగ వారలకిచ్చె నంత శ్రీ
వల్లభుఁడాత్మ దివ్యపదవాసము భాసుర సార సత్కృపన్.

ఆ.వె. బంధుమంతుఁ డనెడి పార్థివుఁడటఁ బూర్వ
భవమునందు విష్ణుభవన మార్జ
నంబు సేయ ఫలమునఁ జక్రవర్తియై
రంగభూమి పెంపు రమ వరించె.

కం. కావేరి విరజ రంగము
శ్రీ వైకుంఠంబు దలఁప శ్రీరంగ విభుం
డా వాసుదేవుఁ డతనికి
నా వాసంబైన సెజ్జ యా ప్రణవ మిలన్.

కం. ద్వీపాంతర దేశాంతరు
లౌ పాతకులైనఁ దద్దిశాభిముఖ శుభ
వ్యాపారగులై మ్రొక్కఁ ద
యా పరుఁడగు రంగభర్త యభిమత మొసఁగున్.

తే.గీ. చంద్రపుష్కరిణీ సహ్యజా నిమజ్జ
నముల జనకోటి కన్యతీర్థములు దలఁచు
టపుడు లీ రెంటు నెట్టి తీర్థాళిలైనఁ
దలఁపఁ బుణ్యంబులొదవు సుధారమహిమ.

కం. ధారుణి నరుఁడై పుట్టియు
శ్రీరంగనివాసు శేషశిఖరి నివాసున్
జేరి భజింపక యుండిన
నారకపరుఁ డతఁడు నెన్నినాళ్లకు నైనన్

కం. పట్టుగ నెచ్చట దానముఁ
బట్టిన నఘ మొదవు రంగపతి నిలయమునన్
బట్టిన నిచ్చినఁ బుణ్యము
గట్టిగ లభియించు జన నికరమున కెల్లన్.

సీ. హరిఁగూర్చి చంద్రుఁడత్యంత తపమ్ము గా
వించిన గురుశాప వికల మణఁగ
నిజ శంఖతీర్థము నీరజారి శిరమ్ము
పైఁ జల్లి శాంతి శ్రీపతి యొసంగు
టది శంఖతీర్థమా నిటఁ గ్రుంక సిరు లొందు
నని శ్రీనివాసుఁ డయ్యవని నిల్వ
నద్భుత శ్రీనివాస క్షేత్రమన సహ్య
కన్య దక్షిణతటీగరము మెఱసి

తే.గీ. మున్ను రాహూదులా తీర్థమునను గ్రుంకి
సర్వసర్వంసహాధార చరితులైరి
సంయమీశ్వరు లటు శేషసరసి యందుఁ
దపము గావించి యెంతయు ధన్యులైరి.

కం. ఉద్దాలకుఁడుం శంఖుఁడు
నద్దనుజారాతిఁ గొల్తు రహరహమును న
య్యుద్దిక నిరుపార్శ్వములన్
దద్దయుఁ గావేరి ప్రబల త న్వహియించెన్.

కం. ఆపూర్ణ శాంతరూప
శ్రీ పటిమన్ మిగుల వెలసె శ్రీరంగపురిన్
దీపించు భక్తవత్సలుఁ
డై పూర్ణస్వామి దేవతావళి గొల్వన్.

తే.గీ. వైభవాన్వితమైనట్టి వ్యాఘ్ర నగరిఁ
బంకజాక్షుండు దగు మహాబాహుఁ డనఁగ
మిగులఁ జెలువగు నాకాశ నగరభూమి
మురవిదారి చెలంగు శ్రీ హరి యనంగ.

సీ. వారక యుత్పలావర్తంబునన్ శౌరి
మణి కూటమున నుండు మణివిభుండు.
భక్తస్థలంబున భక్తిప్రధానుండు
మెఱయుఁ గృష్ణక్షేత్ర సరణి విష్ణుఁ
డొనరు శ్వేతహ్రదంబున శాంతమూర్తియు
రహి నగ్నినగరి సురప్రియుండు
వైకుంఠమున మాధవస్వామి పురుషోత్త
మమున భక్తసఖుండు నమరియుండు

తే.గీ భార్గవస్థానమున నుండు భర్గుఁడనఁగఁ
జక్రతీర్థమునన్ సుదర్శనుఁడు నంది
పురి మహానంది కృష్ణకుల్య రుచిర ధరఁ
దగు మహోత్సవుఁడెంతయు ధన్యలీల,

శా. కావేరీ తటినీ తటమ్మున జగత్కల్యాణదంబున్ మహా
త్తై వెల్గొందు రథంబుపై సకలదివ్యశ్రేణి కీర్తింపగాఁ
బ్రావీణ్య స్థితి శార్ఙ్గపాణి వెలయున్ భాషాధిప స్తుత్య వ్యా
ఖ్యావాసంబగు కుంభకోణమున భక్తాభీష్టద సంధాయియై.

తే.గీ. చక్రపాణియు నాఁగ నచ్చటనె మెలఁగు
గంగ తనయందుడిందు పంకంబు లడఁగ
నచటి తీర్థంబునకు వచ్చుననిన, నచటి
మహిమ లెఁక వేఱ నెన్నెడి మాటలేల !

కం. ఇతరస్థలముల పాపము
లతులిత పుణ్యస్థలముల నడఁగు నచటి విక్
ధృతిఁబాయుఁ గాశిలోపల
చ్యుతమగు నది కుంభకోణ శుభతీర్థమునన్.

తే.గీ. అందుఁ గుంభేశ విశ్వేశులాది గాఁగ
నైదు శంభునివాసములమరు నచటి
స్నానపానంబు లిహపరసాధకములు
శార్ఙ్గపాణి పదార్చన జన్మఫలము.

సీ. శ్రీరంగనిలయమ్ము చెంత నుత్తరమున
నుత్తముఁ డనఁగడు నొప్పుమీఱు
విలసితమగు కపిస్థల పుణ్యభూమినిఁ
గూర్మిని గజరక్షకుండు మెఱయు
పావనం బగునట్టి పార్థస్థలంబునఁ
జెలఁగు వషట్కారుఁడలఘు మూర్తి
చిత్రకూటమ్మున శివనాట్యవీక్షణ
రహిఁబొల్చు గోవిందరాజ శౌరి

తే.గీ. విబుధసంసేవ్య మైనట్టి వృషపురమున
శ్రీమహితుఁడా వృషాశ్రయ స్వామి వెలయు
సంగమ గ్రామసీమ నసంగుఁ డమరుఁ
జారుమణి మంటపమున మల్లారి యుండు.

కం. సింహక్షేత్రమున మహా
సింహుఁడు శరణమున దనుజసింధుర విదళ
త్సింహుఁడు శరణాఖ్యుఁడు ఘో
రాంహోదూర ప్రసిద్ధి నతిశయ మందున్

కం. ధీరతి నిబిడన్ నిబడా
కారుఁడు ధానుష్కపురి జగత్పతి గోష్ఠా
గారత గోపతి కురుకన్ ?
శ్రీ రమణీపతి వసించుఁ జిరతర మహిమన్.

మ. అతులాలోకోజ్జ్వల సుందరేశ్వరుఁడు మీనాక్షీ సహాయస్థితిన్
కృతమాలానదిచెంత సంతతము తన్ గీర్తింపఁగా సుందరా
న్వితరూపమ్మున సుందరుం డనఁ దగున్ నీరేజమిత్రాత్మజా
చితదిక్ప్రస్ఫుటమైన యట్టి మధురన్ శ్రీ భూ సతీసేవ్యుఁడై

తే.గీ. దక్షిణోదధి చెంగట దర్భశయన
భూమిశయనాఖ్య మెసఁగ సంపూర్ణమహిమ
నఖిలలోక మనోభీష్టదాతి మహిత
దక్షుఁడై నట్టి శ్రీవత్సవక్షుఁ డమరు

కం. భ్రమరంబున శౌరియనా
నమరుఁ గురంగకమునఁ బూర్ణుఁడనఁ జెలువొందున్
విమలతటీస్థలి విష్ణుఁ
డు మహార్ద్రిన్ గాలమేఘుఁడున్ జెలువొందున్

తే.గీ. పొలుచు వృషభాద్రిపై మహాపుణ్యుఁడనఁగ
సంజ్ఞికం బరమస్వామి సంజ్ఞఁ దనరు
మంగళకమున ధన్వినా మహిమ మీఱు
క్షుద్రమర్త్యాంతరమున నచ్యుతుఁడు మెఱయు.

కం. శ్రీమద్ద్వారంబున నా
తామర సదళాక్షుఁడమరు దాసానన సు
శ్రీమహిమన్ గుణనాథుఁడు
నా మహితాకృతి వహించి నతముని జనుఁడై.

సీ. కౌండిన్యుఁడను విప్రు కాంత సుశీల యా
పద్మనాభ వ్రత పటిమ నల్పి
సకల సద్భూషణ జాలముల్ దాల్చి కాం
పురము సేయఁగ గర్వమునఁ దదంగ
మైన సూత్రంబేల నను చుఁ దత్పతి సతి
సందిటఁ దగు నది సడలఁదీసి
యగ్నిలోఁ బడవేయ నంగన వగనొంది
కడువేగఁ దిగిచి కాఁగైకొనుటయు

ఆ.వె. సకల సిరులు దొలఁగె నయ్య నంతాత్మ వ
లమున నది రంటెంగి బ్రమసి ద్విజుఁడు
పరగ నే ననంత పద్మనాభుని గాంతు
ననుచు నిల్లువెడలి చనియె నియతి.

కం. చనిచని దక్షిణముఖుఁడై
వెనుబడలిక నరుగుచున్న పృథివీసురునకున్
ఘనుఁడైన యయ్యనంతుం
డనువొందఁగ వృద్ధవిప్రుఁడై కనుపట్టెన్.

కం. కనుపట్టి భక్తసులభుఁడు
గనకఁ బన దరిద్రమెల్లఁ గడతొలఁగంగాఁ
దన నిజరూపముఁ జూపిన
వినుతించెన్ ద్విజుఁడు వేయివిధముల భక్తిన్.

వ. ఆ విప్రుని యంసమ్మున నిజకరతలం బభయప్రదానంబుగా నిడి పుస్ఫాళించె నది యాద్యనంతుండగు, నతనికిమున్ను విప్రరూపంబునం గనుపట్టిన యెడ భోగానంతుండయ్యె, నమ్మహిమ తెలియంగ నంగజహర సరసిజాసనుల కలవియగునే! తామ్రపర్ణీతటంబున నిట్లనంతశయనుఁ డమరెనని—

కం. పులకలుఁడు భీష్మునితోడ
జలజాక్షావాస విభవ సన్మహిమంబుల్
తెలిపి శివస్థలగరిమల్
విలసితమతి వినుమటంచు వేడుక ననియెన్,

సీ. పంచతత్త్వంబులు పంచవనంబులు
నై దరణ్యంబులు నా(ది)గాఁగ
గణుతికి మిగుల శంకర నిలయంబులు
గలవందుఁ గాశి శ్రీకంఠు జీవ
మితరమౌ దేశము లెల్లఁ దద్దేహము
లెన్నఁడు లయమొందకున్న కతన
నవిముక్తనగరమ్ము, నానందవనము మ
హా స్మశానంబు శివాలయంబు

తే.గీ. ననఁగఁ దనరు పంచక్రోశ మమితవిభవ
మచట మృతిచెందు క్రిమికీటకాది జంతు
వులకుఁ దారకమనుచు శివుండొసంగి
రుచిర శుభతర నైజసారూప్య మిచ్చు.

కం. ఆ పంచక్రోశధరా
వ్యాపకమౌ తీర్థనికర మభవుని మూర్తుల్
చూపట్టు నసంఖ్యములై
పాపహరము లఖిలలోకపావన మగుచున్.

ఉ. భైరవమూర్తియై శివుఁడు పంచశిరమ్ముల లోన నొండు దో
స్సారతఁ దున్మి తత్కలుషశాన్తికి నందు మెలంగి చేరికన్
మీఱెడు బిందుమాధవ సమీపముఁ జెంది తదీయ దీక్షచేఁ
దీఱఁ గపాలతీర్థమన దేవనదీతట సీమనొప్పుగన్.

వ. అట్టి కాశీస్థలంబున లోలార్క కేశవబిందుమాధవుల నివాసమహిమంబు ననేక తీర్థంబులుం గలవు. గంగాప్రవాహం బుత్తరవాహినియగుట సకల లోకోత్కృష్టం బగు వెండియు——

శా. కేదారం బతిపుణ్యతీర్థపర సంకేతంబు తత్పాన స
మ్మోద స్వాంతులు తృప్తిఁ జెందుదురు సంపూర్ణప్రభా రాశికిన్
బాదై యచ్చట మంచుఁగొండఁ గనుచున్ బాలేందు చూడుండు క్రి
వ్యాదామిత్రసురుల్ తనుం బొగడ తేజంబొప్పు వాత్సల్యతన్.

ఉ. సూరసుతాస్రవంతిదరి సోమశిఖామణి యుండు సర్వదా
తీరయుగమ్ము నందు మునిదేవనికాయము లాశ్రయింపఁగా
గౌరియుఁ దానుఁ బెక్కడలఁ గాలగళుండు వసించు నెంతయున్
గౌరవలీలఁ దన్మహిమ కంజభవుండు నుతింప నింపుగన్.

సీ. గోదావరీ జన్మకుతలమ్మునన్ త్ర్యంబ
కుఁడు ధర్మపురియందుఁ గుంద్మి రామ
లింగంబు కల్యాణ రంగస్థలిన్ గేత
కులు నాగవల్లులు నెలమిఁ బూజ
సలుప నాసంగమేశ్వరుఁడనఁ జెలువొందు
సప్త గోదావరీ సారభూమిఁ
దనరు ద్రాక్షారామమున భీమలింగంబు
నతి పాతకములు పుణ్యముగఁ జేయు

తే.గీ. కృష్ణవేణీ తటమ్మునఁ గృపదలిర్ప
నమరు నమరేశ్వరుండు మహావిభూతిఁ,
దత్తటమ్మున శ్రీగిరి తనరు శిఖర
దర్శనమ్మున మోక్షప్రదాయి యగుచు.

కం. అచ్చటిస్నానము దానము
లుచ్చయ ఫలదములు పావకోజ్జ్వలులమరుల్
సచ్చరితులు మునులా శివు
నచ్చపు భక్తిన్ భజింతు రంచితమతులై॥

కం. తన నీటఁ గ్రుంకువారల
ఘనదురితము లెల్లఁ బుణ్యగణములుగా వే
నొనరించుఁ గృష్ణ యచ్చట
ననువుగఁ బాతాళగంగ యన ననుపమమై.

కం. ఏ రాజు పేరుదలఁచిన
ఘోరాఘములణఁగు రాజకువలయశశియా
శ్రీరాముఁడు నారాయణ
సారాంశభవుఁడు నిజానుజ సహితుఁడగుచున్.

సీ. తుంగభద్రాతీర తుంగభూమిస్థ మ
తంగునిఁ గాంచి సాష్టాంగ మెరఁగి
యుష్మన్నివాసాశ్రమోచిత మగుటు నీ
తటిని పుణ్య ఫలప్రదాయి తలఁప
నిచటి మహత్త్వము లెఱిఁగింపు మనవుడు
రాముని (తో) ముని రాజు పల్కె
ప్రేమ నీనదిఁ గ్రుంకఁ బితరులు దాను స
త్పుణ్య లోకావాప్తిఁ బొలుచు మనుజుఁ.

ఆ. వె. డమరులెల్లమున్ను హరుఁజూడఁగాఁ గోరి
తపము నిచట సేయ స్థాణుఁ డమిత
రూపగతులఁ దోఁచ రూఢి నిట్లనయుంతు
మనుచు సురలు వేఁడు టిష్టమూరి.

కం. ఎనిమిది రూపము లమరఁగ
గనుపట్టెన్ బ్రహ్మశిలను కమలాసనుఁడున్
సనకాదులు నిగమోక్తుల
మునుకచ్చటఁ బొగడినట్టి ముఖ్యాహ్వయతన్.

తే. గీ. శంకర స్థలవాను విశ్వజన సేవ్యు
న విరూపాక్షు సేవించి యభినుతించు
వారల పవర్గ సురుచిరావాను లరయ
... ... ... ...

కం. సురలెల్ల వరములడిగిరి
చిరకాలంబచట నున్కి సేయఁగ హరుఁడున్
ధరనే రాముఁడ నయ్యెద
తరుచర పతులగుడు మీరు దశముఖ వధకున్.

చం. అని వరమిచ్చె భూతపతి యాతఁడె నీ వనిపల్కి క్రమ్మఱన్
మునిపతి రాముతో ననియె మున్ను వసిష్ఠుఁడు దేవయాతినం
దనుఁడు తపంబుచేసి రిటఁ దానమొనర్చినఁ గోటి శంకరున్
స్మరహుఁ ద్రిలోచనుం గనిన శంకరయాతము గాంతు రెవ్వరున్.

వ. అని మునిపతి జనపరున కెఱింగించిన నతండు నచ్చటి కోటిశంకర విరూపాక్ష బ్రహ్మలింగంబుల దర్శించెనని పులహుండు వెండియు శాంతనవున కిట్లనియె.

కం. ఆతత కృష్ణా తటినీ
జాతాంచద్ధేతు సహ్యశైలావనిఁ బ్ర
ఖ్యాతమగు మహాబల శివుఁ
డా తరుణేందుధరుఁ జూడ నమరు శుభమ్ముల్.

కం. ఏక శిలా నగరమ్మునఁ
బ్రాకటముగ స్పర్శవేది భాసం బమరెన్
శ్రీకంఠుఁడు శంభుఁడు లిం
గాకృతి విలసిల్లు సేవకావనుఁ డగుచున్.

ఆ. వె. నంది కొండ పైదు నదులు పినాకినీ
ద్వయము క్షీరనదియుఁ దగు సువర్ణ
ముఖరి బాహునదియుఁ బొడమి తత్తటములఁ
బెక్కు శివునియున్కి లెక్కనలర.

కం. సంగమ కోటీశ్వరముల
రంగగు పుష్పగిరియందు రహిమాలస్థా
నాంగణమున నుత్తర ది
క్సంగ పినాకినిదరిన్ వృషధ్వజుఁడుండున్.

ఆ. వె. ముదముతో సువర్ణముఖరి యుత్తర వాహి
ని యగు నచటఁ గాళ శ్రీయఁదలిర్చు
శాళహస్తియందు లీల సోమాద్రిని
వెలయు శివుఁడు భక్త సులభుఁడగుచు.

కం. పాలేటిగట్టునన్ బటు
హాలాహలగళుఁడు మునుల యాశ్రమముల నా
లీల విరించి పురంబునఁ
బ్రోలుల మేలైన బిల్వపురమున నుండున్.

కం. సిద్ధిద మగు ఋషివింధ్యము
గృధ్రాచల ముఖ్య హరనివేశంబులునన్
శుద్ధమగు దక్షిణాశా
విద్ధ పినాకిని సమీపవిపుల న్వాలయున్.

సీ. నైమిశారణ్య పుణ్యక్షేత్రమునను వే
దారణ్యమున దండకాటవి కూడ,
పంచవటారణ్య వరపుణ్యభూముల
హరుఁడు వసించు మహా మహిమను
జేర్చి ఛాయావన బిల్వవనోశీర
చిరిబిల్వ తాళవిశేష వనుల
దర్శించు జనుల పాతకము లణంచుచు
శితికంఠుఁ డుండు భాసిత నిరూఢి.

తే.గీ. మధురలో సుందరేశ్వర మహితమూర్తి
సరవి దక్షిణకాశి విశ్వపతి తంజ
పురిని బృహదీశ్వరుండు సొంపుగ హరిహర
సముఁడు శంకర నారాయణమున నుండు.

ఆ. వె. సహ్యగిరి నగస్త్య సంయమి తపము గా
వించి తామ్రపర్ణి వెంటఁగొనుచు
మనికిమైన మలయమున గుప్తగామిగా
నొనరఁజేసి మోదమునఁ జెలంగె.

చం. అదియు నిజాంబుపూరముల నాదటఁ ధాన్యముఁబుట్టఁ జేయుచున్
బొదలి సముద్రుఁ జేరు నెడ ముత్తెము బుట్టఁగఁ జేయు తత్తటా
స్పద శివమందిరాళు లసంఖ్యము లెన్నఁగ రాదు నేరి క
భ్యుదయ మహా మహత్త్వము లపూర్వము లాయత తచ్చరిత్రముల్.

కం. వేదగిరి పక్షితీర్థం
బాదట నిజమహిమ తెలియ హరుఁడిం పొందున్
శ్రీ దనరు వేంకటాద్రిన్
బాదుగఁ గపిలేశ్వరుండు ప్రస్ఫుటలీలన్.

సీ. అనిల తత్త్వము కాళహస్తి జ్ఞాన ప్రసూ
నాంబాధిపతి యుండు నచట నెపుడు
నగ్ని తత్త్వంబగు నరుణాచలం బాది
తత్త్వంబు కాంచి సదాశివగృహ,

మఱి పురమ్మును గోకర్ణాలయమును ద్రిమూ
ర్త్యావాసమును జగద్భావ మఖిల
సిద్ధిద లయకాల చిత్కామ పీఠ త
పోమయ తుండీర పురములు దగు

మహిమఁ గన్యా తిరిష్ఠ ? నామమును బదియు
రెండు పేరులఁ జెలువగు పృథివిసతికి
మూర్ధ కేదారమును గనుబొమల నడుమ
కాశి, యోని ప్రదేశమై కాంచి మెఱయు.

ఆ. వె. సహ్యగిరి జనించి శంఖమూలాన్విత
జలధిఁ దరియఁ జొచ్చి కలియుఁదనుక
నఖిల దేవతా ప్రకార పుణ్యస్థలా
ధార నిరతిదగుఁ గవేరకన్య.

శా. ఆ కావేరి తటమ్ము నన్ను ధరాధ్యక్షుండు రాముండు సీ
తాకాంతానుజ యుక్తుఁడై యనల తీర్థంబొప్పఁ గావించె వి
ద్యాకౌతూహలులై మునింగి రట సద్యద్బ్రహ్మ విజ్ఞాన ని
ష్ఠా కాంతుల్ వసియించు మర్త్యులు రమేశస్థానవాసుల్ తగన్.

సీ. దనుజు విభీషణుం గని రాముఁడిట్లను
దశముఖ సాంగత్యతత దురితము
లణఁగ నిచ్చటఁ గ్రుంకుమా యగస్త్య వినిర్మి
తం బైన కావేరి దానధర్మ
ములు కోటి గుణితమౌ ఫలిత మిచ్చునటన్న
నెలమితో నతఁడు కపులును మనుజులు
స్నాన దానమ్ముల భూసుతు లైరట్లు
నవనిజాలక్ష్మణులా చరించి

తే.గీ. రంత గౌతమ పులహ సంయములు గొలువఁ
గలశజుఁడు వచ్చుటయుఁ బూజలలవరింప
నయ్యగస్త్యుఁడు నుతియించి యనఘు రామ
చంద్రుతో నిట్లులను మృదు చతురఘణితి.

ఉ. విప్రులపాలిరాజవు వివేకివి వేల్పవు కర్తవైనచో,
గో విప్రసవమ్ము నేయు మిలఁ గూరరతరాసురమర్దన క్రియా
దిప్రి మహాఘముల్ తొలఁగు ధీవినుతా,! యన నట్లు చేసె ధా
తృ ప్రముఖామరుల్ పొగడ దేవమయుండగు రాముఁడచ్చటన్.

తే. గీ. అట్ల గాయత్రిశిల మున్న యాపుఁజేసి
యచటి మౌనులఁ బూజించి యవని విభుఁడు
దనరు కావేరి దక్షిణోత్తరతటముల
ననుజుఁడును దాను వేర్వేఱ నభవు నునిచి.

సీ. కూర్మి దైత్యులు కపుల్ గోత్రుసవ మొనర్చి
హరుఁ బూజనేసి కృతార్థు లైరి
యపు డగస్త్యుఁడు రాఘవాధిప! వృత్రవ
ధాఘమ్ము వో బ్రహ్మ యనుమ నింద్రుఁ
డమల గాయత్రీ శిలాగ్ర జపమ్ము చేఁ
గావేరిఁ గ్రుంకుడు పాఱ నతను
దత్పాప మెడఁబాసి తగ స్వర్గపాలన
మహిమచే సుజనైకమాన్యుఁ డయ్యె.

ఆ.వె. ననుచుఁ బల్కి రామునయ్యయోధ్యకుఁ బంపి
స్నాన జపములచటఁ దాను మునులు
నాచరించి పుణ్యులై వెండియును రాముఁ
గాంచి రతని పురిని గౌరవమున.

ఉ. ఆనది చెంతనర్కుఁడు మహాతపముల్ శివుఁగూర్చి సేయుచో
నానతవత్సలుండు భవుఁడబ్జ (సఖా ?) పరమిత్త్రునన్నఁ ద
ద్భానుఁడు బ్రహ్మరుద్రహరిభావను వేదమయత్వ మాత్మ ధా
మానుజ పావనీ ? జన సమాజ కృతార్థతయప్డు వేఁడినన్.

ఆ.వె. హరుఁడు నట్టివరము లర్కుని కొసఁగి దా
కర్మనాథ నామకరణనచట
నర్క పుష్కరిణి తటావనిఁ గావేరి
దరి వసించె మునికదంబ మలర.

వ. సకలమునులచటఁ గ్రతువులొనరించుటం జేసి తద్భస్మంబులు రాసులై యున్నవి. అవి ధరించిన మహా పాతకములడంగు.

కం. కావేర్యుత్తర తటమునఁ
బావన హైమవతి గలియు ప్రాంతమునఁ దప
శ్శ్రీ వెలయు కణ్వమునివరు
ధీ వినుతాశ్రమము పొల్చు దివ్యాకరమై.

సీ. వ్యాఘ్రకేతుఁడు హైమవతి పురంబేలుచు
నగ్న్యర్కకుండ మధ్యావనీ స్థ
లంబునఁ జాల యజ్ఞంబులు సేయుచుఁ
గణ్వుని కేనూఱు గ్రామములను
దక్షిణ యొసఁగ నాధన్యుఁడు తన ప్రియ
శిష్యుని నధికారిఁ జేయ నతఁడు
దమ నామఁడా ద్రవ్య (తతి !) వంచన మొనర్చి
యల్పకాలమ్మున యమునిఁ జేర

ఆ.వె. పెక్కు నిరయగతులఁ జిక్కి బ్రహ్మసురుఁ
డగుచు నంత వృషలుఁడై జనించి
కణ్వమౌని యున్కి కడఁ గల్గు కావేరి
మునిఁగి పూర్వ జన్మముల నెఱింగి.

చం. ఘనుఁడగు కణ్వమౌని పదకంజములన్ బ్రణమిల్లి కావవే
యన, నతఁడన్నియుం దెలిసె నైనను శూద్రుఁడ వీ కవేర క
న్య నెసఁగు నీటఁ గ్రుంకి శివునర్చనచేసి ప్రదక్షిణాళి వం
దనములు సల్ప నీ కలుషతాపము తీఱు నటంచుఁ బల్కినన్.

తే.గీ. వాఁడు నలుబది యేనేండ్లు వామదేవుఁ
బూని పూజించి కావేరిఁ దానమాడి
యంతఁ బ్రమథులు సేవింప నభవుఁజెందె
కణ్వముని నెంచి తత్కృపా కలన వలన.

ఆ.వె. అగ్నిదత్తుఁడనెడి యవనీసురుం డందుఁ
గ్రమము తోడఁ దర్పణములు సేయ
ముక్తి కర్హనంచు మొనసి తత్పితరులు
చనిరి మోక్షమునకు ఘనత మెఱయ.

సీ. అది కణ్వమునిభూమి యందుకుఁ జెంగట
వెలయఁ గావేరితోఁ గలసెఁ గపిల
కపిల కోరికలిచ్చుఁ గావేరి యఘ హారి
తలఁచిన ముక్తి ప్రదంబగు నటు
హరిహరబ్రహ్మాదు లమరులు మును లుందు
రచ్చోటఁ దపమున యక్షభర్త
ధనదుఁడై శివసఖిత్వమునందె నయ్యెడ
యాజ్ఞవల్క్యుని సుతుఁడైన చంద్ర

తే.గీ. కాంత విజయ మహామేధు లంతకారి
గుఱిచి తప మొనరించి శంకరుఁడు పరము
లడుగఁ డన మోక్షమిమ్మని యధిక కఠిన
భాషలై వేఁడుటయుఁ బశుపతి కడలక.

కం. పదునాల్గువేల శిష్యులు
పదపడి మీరిపటు ననురభవము లొదవఁ గాఁ
గదనమున మడిసి తుదఁగనుఁ
డ దురితచరితమునఁ దనరి యపవర్గమ్మున్.

కం. అన వారలు ఖరదూషణు
లును త్రిశిరస్కుండు శిష్యులున్ దైత్యులునై
యినకులుఁడు దునుమ మోక్షము
గని రామువ్వూరుఁ గవేరకన్యక చెంతన్.

తే. గీ. దర్పకారి మరుద్గ్రిఁ ? డా దక్షిణమున
మూఁడు గిరులఁ బ్రతిష్ఠించి పూజ సల్పి
రవియు శ్రీరంగ సామీప్యమైన భూమి
రత్నగిరి తూర్పుదెసను విరాజితముగ.

కం. ఈశాన భాగ నేశము
లాశంకర్షు నిలయములు మహాశుభదంబుల్
కాశికిఁ దోఁడై తగు వి
శ్వేశ నివాసములు మూని హితఫలదములై.

కం. కుశలింగము సంపర్తక
పశుపతియును నిఖిలపూజ్య భాసురచర్యల్
విశదమగు గజారణ్యపు
నిశాకరమకుటుని సేవ నియతఫలమగున్.

సీ. శ్రీరంగభూమికిఁ దూరుపుదెస నుంచి
కావేరి శతవిధగతులఁ బ్రబల
నప్పు తత్త్వము శోభనాకరంబై యొప్పు
జంబూసహితమైన జంబుకేశ్వ
రం బహువర్గమయంబైన కుంభేశ
ధామంబు పంచనదంబు బ్రహ్మ
ఘాతాఘహరణ విఖ్యాతి మధ్యార్జున
మెఱపగు మాయూరపురము సిరుల

తే.గీ. వెలయు శ్రీ పంచముఖ హర నిలయములును
భోగమోక్ష ఫలప్రద పుణ్యమయము
లభ్రపురిఁ గల్గు నభఁజూచినంతఁ బొసఁగు
నిహపర సుఖమ్ము లెవ్వరి కేనియైన.

తే.గీ. శంఖ ముఖియనఁ గావేరి జలధిఁ గలియు
నెడలఁ దళుకొత్తు హైమవతీశ్వరుండు
మఱియుఁ గావేరి తటమున నిరవులైన
హరుని నిలయము లవి పెక్కు సురుచిరములు.

కం. ధరణీ జలా నలా నిల
సురవర్త్మ ప్రకటతత్త్వ శోభితములు ను
ర్వరఁ గాంచి, జంబుకేశ్వర
మరుణాద్రియుఁ గాళహస్తి యంబరపురమున్.

తే.గీ. కాశిఁ గాంచిన మధురఁ బ్రకాశలీల
నన్న పూర్ణా విశాలాక్షి యాశ్రితావ
నాతి మతియైన కామాక్షి ఖ్యాత రూప
వతి మహోన్నతి మీనాక్షి యతిశయిల్లు.

కం. జ్ఞానప్రసవాంబయు స
న్మానిత మూకాంబ యధిక మహిమన్ విద్యా
దానాస్పద భ్రమరాంబయు
భూనుతి నంబాత్రయంబు పొలుపగు మిగులన్.

వ. పశ్చిమ దక్షిణ జలధి తీరంబుల నదరూప కావేరీ తటంబులను గోకర్ణ శంకర నారాయణాద్యనేక దేవస్థలంబులు గలవవి యధిక ఫలప్రదములగు మఱియును.

కం. ధర సుబ్రహ్మణ్యంబునఁ
గర మర్థిన్ స్వామిమలను గల్హార గిరిన్
సరసపు మహిమన్వెలయున్
వరుసఁ గుమారత్రయమ్ము వర్ణింపంగన్.

వ. అని తెల్పిన సూతుం గనుంగొని మునులు డమరుక త్రిశూలపాణి యగు త్రిలోచనుం డుమాపతి లింగాకృతి న్వసించుటకుఁ గారణం బెఱింగింపుమనిన, నక్కథికుం డిట్లనియె.

తే.గీ. దారుకావన మునీంద్ర దారకామి
తైన వృషవాహనుని శేఫమవనిఁ బడఁగ
నచటి మునులెల్ల శపియింపనభవు శక్తి
యూతముగా నది ధరఁబడె నతులగరిమ.

చం. కనుఁగొని విన్ననై మునినికాయము పైఁ గినియంగ లేక క్రొ
న్ననసిజమూర్తి యెంతయు ఘనమ్ముగ లింగమునందుఁ జేర్చు శం
భునిఁ గని బ్రహ్మవిష్ణు మునిపుంగవ శక్ర సురాళి వేఁడి కో
లనుపుగఁ బూర్వచర్య నగజాధిపుఁడుండఁగఁజేసి యర్మ్యొడన్.

మ. హరుఁడా లింగమునందుఁ బొందొనరఁగా నాత్మీయతేజమ్ము ని
ర్భర మోహమ్ము వహించియుంచుట, హరి బ్రహ్మేంద్రులు న్మౌనులున్
ధర నీ యాకృతినుండు నీశ్వరుఁడు భక్తశ్రేణి యర్చింప సు
స్థిర సౌఖ్యమ్ము లభీష్టముల్ కరుణతోఁ జేకూర్చుచున్ ధీరతన్.

చం. అని ముని కోటి మున్నుగ సురాళి సన్నుతి సేయ శంకరుం
డనుపమ లీల ధాత్రి శుభదాధిక పుణ్యనదీ తటమ్ములన్
ఘనుల ధరాధరమ్ములను వ్యష్టి సమష్టుల నిష్ఠ నిల్చెఁ డ
న్గను గొనఁ బూజసేసిన సుఖస్థిరులై జను లుల్లసిల్లఁగన్.

ఆ.వె. అనఘ ! పార్థివమున వ్యష్టి సమష్టుల
నైన స్ఫటికరత్న మాననీయ
రజత నూత్న హేమ రచిత లింగాకృతిఁ
బూజసేయఁ గల్గు పుణ్య సమితి.

వ॥ అట్టి లింగాకృతిందగు హరునికి మైనాక మందర మేరు కైలాస గంధమాద
నంబులైదు నత్యంత ప్రియకరావాసమ్ములయ్యె, నందు గంధమాదనమ్మున—

ఉ. రాముఁడు రావణుందునిమి రాజితపుష్పకమెక్కి తమ్ముఁడున్
భూమిజ రాక్షసాద్రిచర ముఖ్యులు గొల్వఁగ వచ్చి ప్రేమతో
నామహి రామలింగము మహాద్భుతవైఖరినిల్పి వింటిచే
నామికఁ గోటి తీర్థము నయంబుగఁజేసె శుభప్రదమ్ముగన్.

సీ. అమరుఁ బ్రభాసతీర్థము లిరువదినాల్గు
నందు ధనుష్కోటి యతిశయిల్లు
కోటి తీర్థమ్ము నెక్కుడు ఫలప్రదమగు
కపిసురనామముల్ గల్గు శంభు
లింగముల్, తీర్థముల్ సంగతిఁ బెక్కగు
నట్టిసేతువుఁ జూచినంత ఘోర
పాతకమ్ము లడంగు నాతీర్థములఁ గ్రుంకి
హరుని సేవించిన యట్టి ఘనుల

తే. మహితసుకృతంబు లింతని మట్టుగలదె !
కాశి రామేశ్వరంబు ప్రఖ్యాత మఖిల
సౌఖ్యదమ్ములు మోక్ష ప్రశస్త పదము
లనుచు సూతుండు మునుల కిట్లనియె మఱియు.

చం. వసుమతి నెన్ననీ భరతవర్ష మశేష విశేష పుణ్యదం
బసమ మధోక్షజార్చన కథానుభవాకర మార్యసంగతం
బు సకల వస్తుభోగపరిపూర్ణము కర్మఫల ప్రదాయి యిం
దు సరవిఁ జేయు తత్ఫలము తోడనె చేకుఱు నెక్కుడై తగన్.

సీ. సత్త్వరజస్తమస్సహితులో జనములు
సాత్త్వికసాత్త్విక సహితమైన
దేవత్వ మొంద నెంతేనిటు సత్కర్మ
మాచరించిన దాన నదియుఁ బొసఁగు
బ్రహ్మవిదాత్ముఁడై పరమేశ్వరునిఁ, గొల్చి
బ్రహ్మపదస్థుఁడై పరిఢవిల్లు
మఱియుఁ గ్రియాయోగ మహనీయ వృత్తిచే
భజియింప ఫలము శ్రీపతియొసంగు

తే.గీ. భాగవత సజ్జనైక సంభాషణముల
స్నాన దాన వ్రతాది విధానములను
హరి హర ప్రతి మార్చనాద్యాగమముల
భరతవర్షజులకు శుభప్రతతు లొందు.

చం. హరిపదసేవ తద్వినుతు లచ్యుతు దివ్యకథానులాపముల్
దొరకనిచోఁ ద్రివిష్టపము దుర్గతి దుర్గతి, విష్ణుకీర్తనం
బరమపదమ్ము గావుతను భారతవర్షము నందుఁబుట్టి త
న్నెఱిఁగి మెలంగకున్న నరులెన్నఁగ వానరముల్ లులాయముల్.

శా. బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రులనఁగాఁ బాటిల్లు వర్ణమ్ములన్
బ్రహ్మోద్యంచిత విద్యలన్ పరకళా పారీణ వేదాంగ వి
ద్బ్రహ్మజ్ఞాన ధురీణతా విభవతన్ ప్రావీణ్య సద్వైఖరిన్
బ్రాహ్మణ్యమ్ము జగత్ప్రసిద్ధమగు శుంభద్దేవతాసామ్యమై.

వ॥ చతుర్వర్ణ్యములందు శ్రేష్ఠులగు భూసురుల గోత్రప్రభావాశ్రమభేదసదాచార క్రమంబులు వినుండు—

సీ. భృగు వీతహవ్యవార్ధ్రియస విష్ణు
వృద్ధన విరూపాక్ష గౌతమ వసిష్ఠ
కపికార్ష్ణిమద వైన్య కణ్వ విశ్వామిత్ర
కశ్యపాగస్త్య మౌద్గల్య హరితు
లత్రి భరద్వాజు లష్టాదశ గణాఢ్యు
లందు దేవతర వత్సాష్టిషేణ
వ్యాసనైతిశాయన జాబాల్యసూవక
ప్రాచీనయోగివిరోచితవటు

తే.గీ. ఔర్వ జమదగ్ని దేవరాతాప్నవాన
మునులు శ్రీవత్స సావర్ణు లానరు మందు
డా భృగుగణమ్ము సప్తదశానురూఢి
సంఖ్యదగు సంయమీంద్రులు జగతి నాఱు.

తే.గీ. మౌక వాధూళు లుపవేద మౌనయాస్క
వీతహవ్యులు నార్ష్టులు వైతహవ్య
గణము త్ర్యార్షేయ మది యేకగణము ప్రవర
కలియునెడల వివాహముల్ గాదు సేయ.

వ॥ యవ్వుతు మిత్రుడు వార్ధ్రియసగణమ్ము

తే.గీ. మసణభద్రణ త్రసదస్యు మౌనులు శర
పౌరుకుత్సోపమితులును బాదరాయ
ణౌపగవిసాంత్య శాములు నరుణ తుండ
సాత్యకులు విష్ణువర్ధనసారగణము

వ॥ అష్టాదంష్ట్రి ముద్గల వృషన్యసులు విరూపాక్షగణమ్ము.

కం. గౌతమయాశ్వబధ్యులు (?)
ప్రాంతిగనౌశిజుడు కక్షువంతుడు బృహదు
క్థాతతులు వామదేవుడు
గౌతమమునిగణము లెన్నగా ధరయందున్

కం. ధర నాభరద్వాను ఘరా
శరులు ప్రమదసంకృతింద్రశకుత్తులు మిత్రా
వరుణోపమన్యు కౌండిన
గురు ద్విపతులు పూతి మాషకుడు వాసిష్ఠుల్

సీ. ఆంగిరసుండు మహాపత్యుండు ఋతుఁడు
కపిసంయమి ప్రభుగణము ధరణి
కాత్స్న్యమదుఁడు శునకక్షి శౌనకుఁడును
విదితమ్ముగాఁ గాత్స్న్య మదగణమ్ము
వైన్యుఁడు పార్థుఁడుర్వరగణ మర్యోను
భృగుగణ కలిత మాజగతి నెన్న
మితి నంగిరుండజామిషుఁడు కణ్వగణమ్ము
నెలమి వృద్ధచ్యుతుం డిధ్మవాహుఁ

తే.గీ. డ యస్యగస్త్యగణమ్మగు నవనియందు
రేఫశాండిల్యనీదృశ (?) కృతులు పూతి
మాష వత్సార దేవలమాను లసితుఁ
డరయఁ గశ్యపగణమునాఁ బరగు ధరణి.

సీ. బాదర బృహదగ్ని బభ్రు లోహితమను
జాలకి చికితులు వాలుకియును
వాపల్గు వను యాజ్ఞవల్క్య కౌశికదేవ
కాలఖవో లూక శామశాయ
నులు దేవరాతుఁడు శలిల శాలంకాయ
శాలావతాగ్నులు ఛందరసుఁడు
నఘమర్ష పూరణ కాష్ఠక శ్రీమత
పారిధావక శృంగ వసస జాత

తే.గీ. పైకహవ్యక ధూమ్రమజ్య లలధనంజ
యుండు రైవశ్రవుండు కకుండు సూను
కైశిరికులును గాధిజగణము మున్వ
దెనిమిదగు సంజ్ఞ మౌనీంద్రు లిద్ధమహిమ.

కం. ముద్గరభర్మ్యాశ్వాంగిర
సద్గురులును తార్క్ష్యనామ సంయమి నరుఁడున్
మౌద్గల్యగణము వాఁటి ల
సద్గతి నాంగీరసుండు చయ్యనఁ గలియున్

సీ. అంబరీషుఁడు యువనాశ్వ కుత్సులు పింగ
దర్భశంభులును మాంధాత హరిత
పరమునిగణము కావాశ్వపవిత్రులు
నచనానసాత్రియులా గరిష్ఠి

యతిథియు నత్రిగణాన్వితు లాంజాయ
నాత్రేయఋషులును బృహస్పతియును
వైక్ల్య ఋగ్వాగ్నులు వాందనకతశృంగి
శైశిరకపి గార్గ్య శౌనకులును

తే.గీ. ఖ్యాతిగల సద్వసుస్తంబ మాతవచను
లా భరద్వాజగణమగునవని, ప్రవర
గణము గలిసినఁ బెండ్లియాడ్లు గాదనుమ్ము.

... ... ... ... ...

తే.గీ. హరితుఁ డాంగిరసుఁడు గూడ నగునుగాని
యన్యయుక్త వివాహమ్ము లఘుము నొందుఁ
బతితవర్తనుఁడనఁగఁ జొప్పడు వరుండు
గాన గణగోత్ర మరయ సౌఖ్యప్రదంబు.

కం. కర మనలునితోడ విరా
ట్పురుషుని సదనమునఁబొడము పుణ్యాధికులున్
నిరుపములగు భూసురు లీ
కరణిన్ గోత్రవిధ మరయఁగాఁ దగువరుసన్.

సీ. ఆశ్వలాయనము ఋగామ్నాయ మమరు బో
ధాయ నాఘేయ కాత్యాయనములు
సరవి హిరణ్య కైశంబు సత్యాషాఢ
మలరు నాపస్తంబ మయ్యజుస్సు
ద్రాహ్యాయనం బనఁదగు సామ మదిసత్త
దాన మష్టబ్రాహ్మణానురూఢి
నైనిమిది సూత్రమ్ము లిల మూఁడు వేదముల్
క్రమమున శాఖలుగలవు సప్త

తే.గీ. సంఖ్య షడశీతి సాహస్రిసంఖ్య లానరఁ
దగు నథర్వణ మెన్న మంత్రి వ్రిసంగ
గతులు నలువదినాల్గు సంస్కారములు ద్వి
ధర్మములు విప్రులకుఁ గులధర్మసరణి.

ఆ.వె. అఖిలదేవమయులు నామ్నాయవేత్తలు
మోదరతులు తీర్థపాదు లనఘు
లతి పవిత్రమూర్తు లవనిదేవత లౌట
విప్రజన్మమరుదు విబుధవినుతి.

ఉ. ఎన్నఁగ జీవసంతతుల నెల్ల జనించికదా మనుష్యుఁడై
యన్నిఁట సంకటస్థితుల నంతఁ దరివర్ణ్య తనూభవత్వతన్
గ్రన్నన విప్రుఁడై పొడమఁగాఁ పరె పుట్టినయంత శూద్రుఁడా,
సన్నుతఁ గర్మముల్ సలుప సద్వినుతిన్ ద్విజుఁడౌ తలంపఁగన్.

కం. వేదములు చదువు విప్రుం
డాదట జ్ఞానాత్ముఁడైన యటు బ్రాహ్మణుఁ డి
ట్లాదరణఁ జ్రియతైక వి
ధోదిత భాగ్యస్వరూప ముర్వీసురుఁడగున్.

తే.గీ. అట్టి భూసురకర్మ మెంతైనఁ గలదు
కాలకర్మ వివేకముల్ గరిమ నెఱిఁగి
మెలఁగ నపవర్గసౌఖ్యమ్ము గలుగుగాక
నితర వృత్తులఁ జిత్సుఖ మేలఁ గలుగు.

వ॥ అట్టి బ్రాహ్మణ స్వరూపంబు వినుండు.

చం. ధరణిసురుం గనుంగొని ముదంబున లేచి నమస్కరించినన్
గర మనురక్తి వస్త్రముఖ గౌరవ వస్తువులిచ్చినన్, మహా
దరమున నన్నపానముల దావలమై పరితృప్తుఁ జేసినన్
నరుల ఫలమ్ము లెల్లగణనన్ మితమానె సురాళికేనియున్.

కం. పెద్దలఁ గని లేవని నరు
నొద్దన్ గల సిరియు నాయు వ్రాగి నెగయున్ దా
నొద్దిక లేచిన నవి యం
బద్దయతో నధిక ॥గుచు సంతస మొసఁగున్.

చం. పొడగనినంతఁ బాపములుపోవు నమస్కృతులాచరించినన్
దొడరు శుభమ్ము పూజలిడఁ దోరపు మోక్షముగల్గు భక్తి వెం
బడిఁ గనకాంబరాదులు కృపామతి, నిచ్చిన ధేనుధాన్యముల్
పుడమియు నిత్తురేనిఁ గ్రతుపూర్ణఫలమ్ములు జెందు హెచ్చుగన్.

కం. పరదైవము లవనీసురు
లరయఁగ నిరోషుఁడైన నఘయుతుఁడైనన్
బరికింపఁదగదు వందన
పరితోషిత వస్తువులకుఁ బాత్రుండగుటన్

ఆ.వె. కాణ బధిర కుబ్జ ఖండరోగ గ్రస్త
విగ్రహులు నైన నెరను లెన్న
జనదు శ్రాద్ధకాల సముపాగతా వని
సురులఁ బూజ సేయ శోభనమ్ము.

తే.గీ. అరయ క్షత్రియ వైశ్య శూద్రాదులైన
యితర వర్ణ్యులు మ్రొక్కకయేని దీవ
నలు పొసంగఁగఁ గాంతు రా ఖలులు నిరయ
వాసులగుదురు దౌర్భాగ్య వర్తనమున.

కం. సభ దేవతాగృహమ్ముల
విభవాస్పదయాగవితతి విప్రునొకరినిన్
విభుఁడని నమస్కరించిన
శుభము దొలఁగు నిర్దయవసతి స్థారిది మొలంగున్.

ఆ.వె. పరుపువారువానిఁ బనిగల్గునాతని | తైలమూర్ధ స్నానదాన నిరతు
నుదకపాత్రిహస్తు నుద్దేశించిన మ్రొక్కు పాతకాస్పదంబు ప్రజలకెందు.

కం. ధనగర్వితునకుఁ బతితున
కనయున కవివేకికిన్ దురాచారునకున్
మును కలుగ మ్రొక్కలిడినన్
ఘనకలుషము లొదవు పుణ్యగణములు సమయున్.

కం. దైవాధీనము జగములు,
దైవము మంత్రములయందుఁ దన్మంత్రము భూ
దైవత వశ్యంబగుటను
దైవము బ్రాహ్మణుఁడె కాక, తక్కరుగలఁడే!

ఉ. విప్రులతోడ బొంకు నవివేకియు, నిచ్చెదనంచు నీని వాఁ
డప్రతిమ ప్రభావుల ననాదృతిమై మది నిందసేయు వాఁ
డప్రియభాషణుండు కలుషాత్ముఁడు వైతరణీ సమగ్ర ఘో
ర ప్రబలీకృతానల పరంపరఁ గాకల నొందు నంతయున్.

శా. లోకాధీశ్వరుఁడైన విష్ణుఁడు సుశ్లోకించు ధాత్రీసురా
నే కాంచత్ప్రతిభల్ ధరాధిపులు నైనన్ భంగులన్ గొల్చి తా
దా! కీర్తుల్ గని తెక్కు గాలములు నీ ధాత్రీతలం బేలి యా
నాకావాసమునం జెలంగిరి జనానందప్రధాన్వితులై.

శా. కోపంబూనిన పర్వతప్రతతి నగ్గల్ సేయుటల్ సత్ప్రసా
దాపూర్ణస్థితి శుష్కవృక్షముల నుద్యత్పల్లవ శ్రీకరా
టోప ప్రక్రియ నుండఁజేయుటలు మట్టున్ మేరయున్ లేనిత
ద్వ్యాపారమ్ములు, వానిలెక్కగొన దేవవ్రాతముల్ చాలునే !

కం. వసుధాసురు నర్చించినఁ
బొసఁగు త్రిలోకాధినాథపూజాఫలమ
ట్లసదృశగతిఁ దన్ముఖమున
వెసఁ దృప్తి వహించు భూతవిసరము హరియున్.

కం. వారల ప్రతిష్ఠవలనన్
సారసనాభాదిదేవసమితిఁ బ్రతిష్ఠల్
కూరిమి సేసిన ఫలమగు
ధారుణి నిహపరసుఖ ప్రదాయకులగుటన్.

మ. గ్రహచారమ్ముల కీడుబాయు శుభముల్ గామ్యార్థముల్ గల్గు దు
ర్గ్రహ పైశాచిక బాధలెల్ల నణఁగున్ బ్రారబ్ధనాశంబగున్
రహి విష్ణుండు ప్రసన్నుఁడౌ యముఁడు చేరన్ రాఁడు, సద్భక్తితో
విహితాంచన్మతి విప్రపూజ సలుపన్ విశ్వేశుఁడింపొందుటన్.

ఆ.వె. సకలవర్ణములకు జననియు జనకుండు
గురుఁడు దైవ మిష్టుఁ డరయ విప్రుఁ
డఖిలభూతసేవ్యు నచ్యుతు నవధావ
తార మెన్నిచూడ ధరణిసురుఁడు.

కం. భావమున విప్రుఁడే నిజ
దైవంబని యొప్పుఁ డెంచు ధన్యుఁడతఁడు నా
నా విధసౌఖ్యములొంది మ
హా [విభవత ?] బ్రహ్మలోక మమరఁగఁ జెందున్.

చం. నయవిదులై గృహోపకరణంబు లొసంగిన నిండులిచ్చినన్
రయమున నన్నవస్త్రశుభరాజిత గంధవిశేషహేమ ర
త్నయుత విభూషలం దనిపినన్ గుసుమంబులు విడ్యమిచ్చినన్
దయ దళుకొత్తఁ బ్రోచిన, ముదంబులుగాంతురు తజ్జనోత్తముల్.

తే.గీ. వారి నవమానమొనరించువాఁడు, వాగు
లాడువాఁడును నిరసించు నట్టివాఁడు
దూషణము సేయువాఁడును దోషయుతు
లగుచు యమబాధ నొందుదు రనుదినమ్ము.

కం. విద్యావంతుండైన న
విద్యాయుతుండైనఁ గూర్చి వృత్తిఁ దిరిగినన్
సద్యశ్శుభదుని ద్విజు నన
వద్యునిగా నెఱుఁగువాఁడు పరసుకృతి యగున్.

చం. ద్విజుఁ గనుగొన్న మోదమునఁ దేలుచు భత్రము లీప్సితార్థముల్
వ్యజనము లన్నపానములవారిత భక్తినొసంగఁగాఁ దనిన్
స్వజనమొనర్చె విప్రుల, విశిష్టుల పూజకునై విధాత మున్
వృజిన మణంచి పుణ్యములు వేసుక గూర్తురు వారలేరికిన్.

కం. వచనములు వజ్రనిభములు
ప్రచుర వచోరచన లమృతరసవంతము లౌ
పచరింప భూమిసురులకు
సుచరిత్రత వానికెనయె! సురలెయ్యెడలన్.

కం. ధారుణ్యమరులఁ బ్రోచిన
వారల పితృపంక్తి తృప్తవర్తనులై వి
స్తారానందసుఖమ్ముల
పారముగావించి మిగులఁ బ్రజలుదు రెందున్.

కం. స్వారాజైనను విప్రుల
గారింప దరిద్రపాప కలితుఁడగున్ ద
ద్దారిద్ర్యాన్వితుఁడైనన్
వారల కృపగల్గఁ ద్రిదశవరుఁ డగు పేర్మిన్.

కం. గో భూ హిరణ్య కన్యా
వైభవ హరిమూర్తిచయము వారికి నొసఁగన్
శ్రీభద్రప్రాభవముల,
నా భూమీసురులకరుణ నతి సుకృతి యగున్.

తే.గీ. అఖిలదానమ్ములకు నెక్కుడైనయట్టి
జ్ఞానదానమ్ము సేయు మహానుభావు
లగుట విప్రుల కొసఁగిన యట్టి దాన
మమిత నిరయాభితరణ మయ్యన్వయులకు.

కం. ఎంతని తెలుపఁగవచ్చు ద
రంతము తన్మహిమ లెన్న నవని సురులకున్
వంతలు మాన్పుచుఁ దత్పద
చింతారతి భక్తిసలుప నేమము లొందవున్.

ఆ.వె. అట్టి యగ్రభవులయందు నాల్గైన యా
శ్రమము లమరు బ్రహ్మచారియు గృహి
వితత వననివాసి యతి యనఁగా, వ్రత
శ్రీలఁ గొనెడి వటుని రీతి వినుము.

సీ. ఉపనయనాది గా వటుతమును ద్రిదిన గా
యత్రి ప్రాజాపత్య మవల వలయు
నాగవ్రత చతుష్కావధిగాఁ దగు
ననఘ వటువ్రతం బట్లినయగు
వరుస సంవత్సర పరిమితంబవి యాచ
రించుట బ్రాహ్మ్యమా నెంచ వేద
సంగ్రహణాంతంబు సలుపు నైష్ఠిక మిట్టి
నాలుగు దెఱఁగుల నయమెలర్ప.

ఆ.వె. వెలయు బ్రహ్మచర్యములు ననిష్ఠిత కృ
త్యాది కర్మనిరతి యదియ వార్త
యజనకర్మయుక్తమగు వస్తుసంపాద్య
మదియ సంచయాఖ్య నమరు మఱియు.

కం. మేలి యయాచ్ఞావ్రతమున్
శాలినమను నాల్గుగతులఁ జను గార్హస్థ్యం
బోలి నికృష్టములగు వా
గ్జాలాహార విఖనస తతి కడు వేడుకలన్.

కం. నూతన ఫల లబ్ధంబు పు
రాతనవస్తువుల విడుచు రహి నైజ ప్ర
ఖ్యాతియగు వాలఖిల్యులు,
ప్రాతఃకాలమున లేచి పరికించి దిశన్.

కం. చనియచట దొరకినవి తె
కొన, నౌదుంబరులు, దాను గోరక నే వ
చ్చినఁదినుయాదృచ్ఛికు లను
వనవాస చతుష్టయంబు వర్తిలు వసుధన్.

సీ. మకుటాశ్రమప్రధాన కుటీచకుండును
శరోన్మదసజ్జన జ్ఞానియైన
యట్టి యశ్వోదుంబరాఖ్యుఁడు కేవల
జ్ఞాన నైష్ఠికత ప్రహస్యానుమాంధుఁ

డటు బ్రహ్మతత్త్వ విద్యాకాంతుఁడైన ని
        శ్శ్రేయసుఁడను యతుల్ చెలఁగ నట్టి
రీతుల బ్రహ్మచారియు గృహస్థుండును వా
        నప్రస్థుఁడును యతి నాల్గువిధము

ఆ.వె. లగుట బ్రహ్మచారి కటు విద్యము గృహస్థు
నకును భిక్ష కాననస్థున కిలు,
యతికి (స్వ) ర్ణ మొసఁగు టత్యంత దురిత మౌ
తత్తదుచిత వస్తుదాన మమరు.

ఆ.వె. వేదమార్గగతులు విడిచి శాబర మంత్ర
తంత్ర నిరతుఁడైన ధరణిసురుఁ డ
నర్హకుం డనంగ మగ్నుఁడౌ పాపక
ర్మములఁ బతితుఁడగుచు మందబుద్ధి.

కం. భార్యాయుతుఁడై పావక
కార్యంబే విప్రుఁడైన క్రమమునఁ జేయం
డార్యత్వరహితుఁ డాతఁ డ
నార్యుఁడు కర్మముల వేదవంతుండైనన్.

సీ. అట్టి చతుర్వర్ణ్యులైన భూసురులు ని
        జాశ్రమాచార నిత్యక్రియాభి
రతులైన వారి శ్రీపతి దయామతిఁ బ్రోచి
        నిర్మలగతి నిచ్చు నిఖిలభూత
సము లతిశాంతులు సత్యవ్రతుల్ పర
        ధనదార విరహితాత్యనఘమతులు
నాశావిహీనులు నతిలోభ మోహ దం
        భ వివర్జితులు ధర్మభద్రయశులు

తే.గీ. మానితామ్నాయ తత్పరులైన వారి
నఖిల భూతాంతరాత్మయు యజ్ఞభర్త
యైన శ్రీవిష్ణుఁ డిష్టదాయకుఁడు నగుచు
సంతసము నొంది రక్షించు సంతతమును.

కం. సంతోషమానసుఁడు వే
దాంతశ్రవణుండు పితృమహావ్రత సపనుం
డంతర్ముఖుఁడగు విప్రు ని
రంతరముక్ బాయకుండు నచ్యుతుఁ డెలమిన్

సీ. యజనయాజనము లధ్యయన మధ్యాపన
        ధృతిదాన దాన ప్రతిగ్రహములు
బ్రాహ్మణ కర్మముల్ బ్రహ్మచారికి గురు
        శుశ్రూష భిక్షాన్నమిశ్రభుక్తి
నిత్యకర్మక్రియా నిరతి యధ్యయనంబు
        శౌచ దమ క్షమాశాంతిగతులు
ననలార్క సేవన మనుదినగురువంద
        నంబు విద్యాసంగ్రహంబు సతులఁ

తే.గీ. గదియుటలు, భాషణములు వీక్షణము మాను
టఖిల వేదాంగములు నేర్చి యాత్మగురుని,
కభిముఖంబగు దక్షిణ లమర నిచ్చి
యతని యనుమతి గృహి యౌట లర్హవృత్తి.

ఉ. మంచివియౌ సమానములు మంగళముల్ విహితార్థవృత్తి న
ధ్యంచిత ఘోషవర్జితములై తగు నక్షరనామధేయముల్
గాంచన దీప్తదేహరుచి కన్నులతేటయు సస్మితాస్యముల్
గొంచెపు మధ్యముల్ సొబగు గొప్ప పిఱుందును గల్గి వెండియున్.

చం. పవడపుచాయలౌ చిఱుతబాగుపదమ్ము లరోమశమ్ములై
రవణము మీఱు గుల్ఫము లరంటు నిద్దపుటూరువుల్ స్మర
శ్రవణశరాసనమ్ము గతిఁ బాటిలు కన్బొమ లింద్రనీలపున్
సవరణిఁ గుంగురుల్ మెఱుఁగు శంఖవిడంబన మొప్పుకంఠమున్.

కం. చెలువలరు ముద్దుఁబలుకులు
తిలపుష్పము బోలునాస తేటగుజెక్కుల్
పలువరుసదట్టము నెఱతి
గలవెంద్రుక లమరు మంచికన్యన్ ధన్యన్.

కం. వరియించి గృహస్థుండై
గురువుల గురుసుతుల నైనఁ గొలిచి యతిథులం
బరిరక్షింపుచుఁ గర్మా
చరణుండై మెలఁగవలయు సాధులు పొగడన్.

సీ. అట్టి భూసురుఁడు బ్రాహ్మ్యమువార్తమున మేలు
        కాంచి కాంచనదుకూలాంచితుఁడు హరి
నాత్మస్వరూపు నిత్యానందు నెన్నుచు
        ధర్మాత్త హృదయమ్ము దనర నర్థ

శౌచములే విడువ విఘ్నములేక ధర్మంబు
చేకుఱుగాన, నిశ్చింతుఁడగుచుఁ
గర మర్థి ధర్మమేమఱక పుణ్యనదీ పు
రారణ్య ముని నృప తీరభాగ

తే.గీ. వరత మహద్వ్రతయుత పతివ్రతల నెంచి
వెలయు పురమైన నరుపది విండ్లపట్టు,
పల్లెయగునేనిఁ బదివిండ్లపట్టు, నిఋతి
భాగమున కేగి యచ్చట బాగుమీఱ.

ఆ.వె. గాలికెదుటఁ ద్రోవ గ్రహతారకలఁ గంచు
గోసుపర్వనిలయ కుంజ జల స
మీపములను సస్యమేదిని రేఁగల
బైట మలము విడువఁ బాడిగాదు.

ఉ. ఊపిరి బిగ్గఁబట్టి తడవుండ కుదఙ్ముఖుఁడై పవల్ల, రే
యోపిక దక్షిణాభిముఖుఁడొప్పఁ దృణావృతమైన ధారుణిన్
జూపడకుండ నిమ్నమునఁ జుట్టు జనావళి లేనిచోట, మూ
ర్ధోపరివస్త్రుఁడై నిజభుజోన్నతి జన్నిద మూదటం దగన్.

తే.గీ. మలవిమోచన మొనరించి కెలన మఱలి
చూడ కొకచేత శేఫంబు కూడఁబెట్టి
పుట్ట మూషకఘాతమ్ము పులినజలము
లను గలది కృష్ణభూముల దినుసుగాక.

కం. తరబడిమృత్తిక శౌచము
కొఱకై వలకేలఁ బూనిగుఱుతుగఁ గొలనుం
దరికేగి దూరముగఁగడు
నిరవుగ వసియించి మృత్స్నమొలమింగొను చున్.

సీ. ఆమలకముపాటి నమర మృత్పిండముల్
గొని గుదమున నైదు నొనర నొకటి
లింగంబున న్వామసంగకరంబున
ముష్కాలు నిరుగేలు మొనయ రెండు
వామపాదమున తేపన్నది వరుసలు
నుభయపాదమ్ముల నొనర రెండు
మాఱులు మేదించి మన్నిడి శౌచమ్ము
గావింపఁగ గృహస్థకర్మమిట్టి

తే.గీ. సరవి కిన్నిటఁదగు బ్రహ్మచారులకును
విధవలకుఁ దద్ద్విగుణముప్పు వినువనస్థ
వితతికిఁ జతుర్గుణంబగు యతులకట్లు
నమరు నందష్టమాంశార్థ మైదువలకు.

కం. ద్వాదశగండూషమ్ముల
మీఁదట జన్నిదము దాల్చి మితివార్చుచు సం
మోదత ములు పొల్పట్టియుఁ
చాదగు జేనంతపుడుకఁ బల్దోముఁదగున్.

కం. ఘన తృణ పర్ణ క్షాళన
మనువగు దర్శముల వైష్ణవాహముల వినా,
వినుఁ [డు ?] ప్పినుమును మాగా
జు నిటిక శిల బూది యుముక శుభములఁ బాపున్.

కం. వలగొను రీతిగఁ దోమ
న్వలయును దర్జనినిఁ దోము వైపది పాపం
బిల నయినహితము రుచ్యము
తలఁపన్ దృఢకరము దంతధావన మెలమిన్.

ఆ.వె. దంతశోధనమున దానమొనర్చుచో
భోజనమున దేవపూజ తఱిని
జపము సలుపునెడల స్మరకేళియప్పుడు
మౌననియతి వలయు మహీసురులకు.

కం. మలనిర్మోచన మనఁగాఁ
గలుష విమోచనమనంగఁ గలదిరు తెఱఁగున్
దలఁచఁగఁ దైలాభ్యంగము
మలహరణస్నాన మనఁగ మహి నెన్నఁదగున్.

కం. పర్వముల షష్ఠిదశముల
నుర్వీధరు తిథిని నూనె యొగినంటిన శ్రీ
ధూర్వహత దొలఁగి యామిఁష
చర్వణ చండాలయోని జనియింతురిలన్.

కం. తలఁగడుగుట పలుదోముట
వలనుగ రవిగురు భృగుకుజ వాసరముల యం
దిల శ్రాద్ధ జన్మదినములఁ
దలఁచఁగ వ్రతవాసరములఁ దగ దఘమగుటన్.

కం. తాపముగాంతియు మృత్యువు
శ్రీపటిమయునదృఢమున్ దరిద్రత కోర్కుల్
ప్రాపించుటలగు రవి మొద
లౌ పర్యయవాసరముల నభ్యంగములన్.

ఆ.వె. మంత్రహీన మదిరా మల విమోచనమనఁ
బరగు మంత్రయుక్తిఁ బ్రబలు నైదు
చెలఁగులగుచు నార్యసరణికిఁ ద్రిషవణ
స్నాన మర్హమా ప్రమాణ రూఢి.

కం. సంకల్పపూర్వకంబుగఁ
బంకహరణ మరయఁ బుణ్యపావనతీర్థం
బింకువ ? తో నదికర్మ ల
తాంకూరవసంతసమయ మాహ్నిక ఫణితిన్.

సీ. కంఠకటిస్నాన కాపిల మంత్ర వ
స్త్రావర్తనములన నైదు విధము
లవియు[శక్త్యుచిత ?] ములగు నాలుగాశ్రమ
ముల వారికర్హమ్ము మూఁడు వేళ
లందుఁ గ్రుంకిడుటలు నాగ్నేయమగు భూతి
చే నగు స్నానమ్ము మానితముగ
నిశియందుఁ గ్రుంకుట నిరయహేతువు మంగ
ళార్థమ్ముగా స్నానమాచరింత

ఆ.వె. పలయునేనిఁ దటిని వారి దివంబునఁ
దెచ్చి స్వర్ణమునిచి యిచ్చఁ గ్రాఁచి
కైన నింటు స్నానమర్హమా పుణ్య, తీ
ర్థములఁ గ్రుంకవలయు దార్ఢ్యగులకు.

కం, స్నానాంగంబగు దైవత
మానిప పితృతర్పణములు మఱిఁ జేయఁదగున్
బూనిన పవిత్రమంగుళి
లేనిది దురితమగు గర్మలీనంబగుటన్.

కం. తడిధోవతి విడువఁగఁదగు
వడిబైటికి వచ్చి నీఁటివైపుగ విడువన్
గడదొలఁగుఁ బుణ్యములు తటి
విడిచినయది భుజము దేర్ప వృథ గ్రుంకిడుటల్.

తే.గీ. ఆర్ద్రవస్త్రమ్ము సడలించునపుడు కటికి
నూర్ధ్వభాగమ్మునం దిగిచుర్వి నిడఁగ
వలయు దిగజార విడిచినఁ గలుషమొదవు
జలము దరిఁజల్ల భూతతృప్తులు ఘటిల్లు.

చం. అజినమునందుఁ బేటి నిడినట్టివి యంశుకముల్ ధరించుటల్
ద్విజులకు నర్హమౌ కలిమి లేకువఁబట్టువియావికంబులున్
రజత సువర్ణ భూషణవిరాజిత వైఖరి యోగ్య మౌటచే
సుజనులు సృష్టిదోషమని చూడ రదెందుఁ బవిత్రమై తగున్.

చం. నుదుటను గోపిచందనము నూత్నగతిన్ ధరియించి నిష్ఠతోఁ
గుదురుగ వార్చునట్టి క్రియకుం దగు కేశవముఖ్యనామముల్
పది షడునాల్గు సంగములఁ బట్టుగ నెట్టుగ నంటు చోటఁ బెం
పొదవఁగ నంగుళమ్ములు సమున్నతిఁ గూర్చువిధమ్ము దెల్పెదన్.

సీ. వ్రేళ్లెల్లదు సమముగావించి ముంచిన నీళ్లు
మాషమగ్నంబగు మాత్రమునిక
గాఁగ గోకర్ణ వికాసత ముమ్మాఱు
తలమార్గమునఁ గ్రోలి తవిలి రెంటఁ
గరమార్జనము సేసి మఱిరెంట నోష్ఠముల్
దడవి చెక్కులరెంటఁ దుడిచి యొకటఁ
జరణద్వయిని జల్లి శిరసంటి తుది వ్రేళ్లె
యిడి నాసక్రిందొంటఁ బిడికిలించి.

తే.గీ. మొనయ నంగుష్ఠ తర్జని ముక్కుఁగోళ్ల
కడ ననామికఁ గన్నులా కరణిఁ జెవులు
కడను బొటమన నాభి వక్షము తలమున
శిరము భుజములఁ దుదివ్రేళ్లచే స్పృశించి.

తే.గీ. ప్రణవపూర్వక వ్యాహృతుల్ వరగ వేద
మాత మూర్ధమ్ముతోఁగూడ మానియగుచు
నపుడు మధ్యమ తర్జని నంటు నీక
కడమ వ్రేళ్లను నాసికఁ గదియఁబట్టి.

కం. ప్రాణన్ ముమ్మాఱు దపఁగఁ
బ్రాణాయామంబనంగఁ బరగు నటులుగా
రాణనొనర్చుచు వాగ్గి
ర్వాణ స్తుతిమార్జనములు వలయుం బిదపన్.

సీ. అష్టాక్షరయుతంబు నంబుదైవత్యంబు
నవపదంబులునైనయవి ద్విరుక్తి
పడునెనిమిదియగు పావకం బొకనాల్గు
హరిపదం బొక రెండు నగ్నిఁ గూడి
తరవతుల్ తుదనుండు నెఱిఁ బదునొక్కఁటు
హృదయంబు మునిసంఖ్య నెసఁగఁగఁ దుదఁ
బదముల రససంఖ్య నొవవు సనేథల ?
శిరసున మార్జన మిరువదియును

తే.గీ. నాల్గుపాదాంతముల మార్జనంబులు దగు
మొదలు నడుమను ఘాతకములు వహించుఁ
దొమ్మిదింటి మీఁద సూర్యోక్తి తొడరి రేపు
జలము మధ్యాహ్నమున నగ్ని సంధ్యయందు.

కం. గుఱిచిన మంత్రంబులచే
నిరవుగఁ బ్రాపింపవలయు నెలమి నుదకముల్
మఱి మార్జనములు పదియే
నరయఁగఁ బదయుక్తి వలయు నామ్నాయగతిన్.

కం. సాయం ప్రాతర్వేళలఁ
బ్రాయశ్చిత్తార్ఘ్యయుగము బరగు న్నాగై
యాయస్త్రము లుపసంహృతి
నాయతమతిఁ జేయవలయు నవనిసురులకున్.

తే. గీ. బ్రహ్మశీర్షమ్ము దండమ్ము పద్మజాస్త్ర
మనఁగ మందేహముఖ్య దైత్యాళి వాహ
నములు శస్త్రాస్త్రములు దైత్యసముదయంబు
నడుప వజ్రోపమమ్ములై యడరు వరుస.

సీ. అదియెట్టులనిన మున్న సురులు సురలును
స్వర్లోకపాలనాచార్య మహిమ
లభిలషించి విరించి నర్థించి నిష్ఠతో
సవనతంత్రమ్ములు సలుప నందు
నసురులు దృఢచిత్తు లగుచుఁ దత్కర్మంబు
గావించి బల్మిచే గర్వులగుచు
స్వర్గమ్ముఁ గైకొన్న సర్వగీర్వాణులు
సరసిజాసనుఁ జేర నరిగి మ్రొక్కి

తే.గీ. యసురు లధికత స్వర్లోకమాక్రమించి
ఇంక వారలఁ గెల్చుట లెట్టులింగొ!
కరుణ మముఁ బ్రోవవే! యన్నఁ గమలభవుఁడు
వారి నందఱి నిజకృపా వారిఁ దేల్చి.

ఉ. వారలు తామసప్రకృతి వైభవమొందిన నేమి యింకిటన్
మీరలు బ్రహ్మచర్యమున మేలిమి తేజముగాంచి దైత్యులన్
మీఱుట కేను దెల్పెద నమేయవిభాన్వితుఁ డర్కుఁ డెంతయున్
ధీరమతిన్ సహాయముగ దెల్లి జయంబు భరింతు రెంతయున్.

శా. నాచే నిర్మితమైన సూత్రమిదిగో నాపేర వర్తింప నెం
తే చాతుర్యత నుత్తరాంసమున వర్తింపంగ సవ్యంబగున్
ప్రాచుర్యంబుగఁ దా నివీతమగు నొప్పన్ గంఠదామస్థితిన్
సూచింపంగ నపసవ్యమా నరునకచ్చో దక్షిణాంసోద్ధృతిన్.

కం. దేవఋషి పితృప్రీతిగ
నీవిధముల నుండు నరుస నింగితకర్త
ప్రావీణ్య స్థితిఁ దత్తే
జోవిలసితులగుచుఁ గనఁడు శుభములు ఘనతన్.

చ. అని పరమేష్ఠి పల్కిన రయంబున దేవత లట్లుచేసి యా
వనజసఖుండు తోడుగ నవార్యుల దైత్యుల గీటణంచి హా
చ్చునఁ ద్రిదివంబు చేకొనిన, సోలుచు దానవులెల్ల నెప్పుడ
య్యును నిఱుసందెలం దొడరి యేఁచుచునుండెద రుగ్రశౌర్యతన్.

ఉ. అత్తఱిఁ గెల్లి దేవతలు నబ్జజుతో వినిపింప ధాతయున్
మత్త నిశాచరప్రహత మంత్రవరంబగు వేదమాతృకన్
హత్తిజపించుచున్ వికసితాంజలిఁ జల్లుతదంబు లాహవో
ద్వృత్తుల దైత్యులం దునుమ వేమఱుఁ దద్వృజినంబు దీఱఁగన్.

కం. ఈయాదిత్యుఁడె బ్రహ్మం
బాయతగతి ననుచుఁ దిరుగుటది తలఁచుచుఁగఁ జాం
ద్రాయణ ఫలదంబై పు
ణ్యాయత్తులఁ జేయు మిమ్ము నని విధియించెన్.

కం. ఆదికారణముగ నేత
ద్విదితోక్త క్రియలొనర్చు విప్రులు మహిమా
స్పదమా తదస్త్రముల నిం
పొదవఁగ నుపసంహరించు టొప్పగు నియతిన్.

తే.గీ. వెస తకారాదిగా మున్ను విడిచినట్టి
యస్త్రగూఢ మహామంత్రమైన లలిత
శుభద గాయత్రిఁ గ్రమ్మఱించుట తు యాది
యైన వర్ణక్రమమ్మున నర్హమగును.

సీ. ఈరీతి గాయత్రి హృదయస్థముగఁ జేసి
చెలఁగి సంధ్యోపాస్తి సలుపవలయు
క్షేత్రజ్ఞు ననుమతిఁ జేకొని యబ్జాస
నాసీనుఁడగుచు దిశాంగణములు
బంధించి పరమాత్మ భవ్యసుషుమ్న చేఁ
గడఁగి బ్రహ్మస్థాన గతునిఁ జేసి
మది నుండినట్టి బ్రహ్మమ్ము శిరుఁడు స్వర్ణ
హారణోరుబాహు పానార్హహృదయు

తే.గీ. నలఘు గురుతల్పగైకదుష్కలుష జఘను
తత్త్వసంయోగ చరణుఁ బాతకచయాంగు
రోమకూపోపపాపు నిరూఢు వృజిన
పురుషు నీలాంగు నంగుష్ఠతర శరీరు.

క. మారుత బీజాక్షరమున
వారక శోషింపఁ జేసి వరశిఖి బీజో
దారత దహించి వెలికిం
దారిచి మదికేయఁ జేయఁ దగు నమృతమునన్.

తే. గీ. అతుల మది సుధాప్లావన మమరఁజేసి
బ్రహ్మసంస్థానగతుఁడగు పరము మరల
నా సుషుమ్నాధ్వమునఁ దెచ్చి యచట నిల్పి
హృదయపద్మస్థు గావించి విదితమతిని.

సీ. ధర్మంబు దానికందంబు జ్ఞానము నాళ
మైశ్వర్యములు నైన్మి దమరు దళము
లవియు దిక్పాలకు లవటువైరాగ్య క
ర్ణిక, కేసరంబులు నఖిలదేవ
గణము తత్కర్ణికాగత రవిబింబంబు
నడుమ చంద్రుఁడు వాని దొడరు వహ్ని
యందుఁ జతుశ్రమమై హేమమయ మురు
రత్నకీలితము విరాజమాన

తే.గీ. మైన పీఠిక నీవారశాగ్రశాక
పరిమితాణు శరీరుఁడు పసిమివన్నె
ననుపమానుండు, శంఖ చక్రాదిశస్త్ర
ధరుఁ డనేక విభూషణాంబర ధరుఁడును.

కం. శ్రీవత్సకౌస్తుభాది మ
హావైభవ భూషణుఁడు రమాన్వితుఁ డురు తే
జోవంతుఁడు మూర్తిత్రయ
భావుఁడు వేదమయుఁడగుచు భావింపఁదగున్.

వ. అతఁడే ప్రణవస్వరూపంబగు నత్తెఱంగెఱింగించెద.

సీ. మఱి ప్రకోష్ఠమ్మును మణిబంధకూర్పర
తలకరాగ్రములు తత్తలము వెనుక
నంటుఁగఁ గరశుద్ధి యగు నంతట నకార
మును నుకార మకారములును గూడఁ
బ్రణవ మట్టి యకారపటిమ ఋక్సంగతి
బ్రహ్మదైవత్యంబు పరగు జాగ్ర
మగు నవస్థయుఁ బ్రథమాంచిత సవనంబు
నాహవనీయాగ్ని యగుచు సురభి

తే.గీ. ముద్ర సృష్టి క్రియయుఁ గర్మముఖ్య విద్య
యగు నుకారము గార్హపత్యాగ్ని విష్ణు
దైవతంబు యజుర్వేద భావి స్వప్న
మగు నవస్థయు యోనిముద్రాంకితంబు.

శా. ఆత్మజ్ఞానము పాలనస్థితి ద్వితీయంబౌ మకారంబు రు
ద్రాత్మీయంబును సామవేదము సుషుప్త్యావస్థయున్ శంఖము
ద్రాత్మస్థానము దక్షిణాగ్నియుఁ దృతీయంబౌ మఖంబొప్పు మా
తౌతాత్మానందవిధానతం దనరు సంహారక్రియారూపమై.

కం. తత్తద్బీజాక్షరముల
హత్తుక పలుకంగఁ దనరునట్టి త్రివర్ణో
పాత్తమగు ప్రణవమంత్రము
చిత్తమ్మునఁ గుదురుగాఁగఁ జేయఁగవలయున్.

తే.గీ. ఇట్టి ప్రణవము జరియింప నెలమి రేపు
మాపు గావించు కలుషముల్ మాయ ప్రతి ది
నంబు తేజంబు బలము నత్యధికమగుచు
నాయువానఁగూర్చు నిది నిక్కమే యొడలను.

కం. ఆదిన్ సుముఖాన్వితము
ద్రాదులు నిర్వదియునాల్గు నంగోపాంగా
పాదితమగు న్యాసంబులు
పాడుగ గాయత్రి హృదయ పఠనము వలయున్.

తే.గీ. మధ్యమునను బదింటికేమఱక నొకటి
తగుఁదురీయ జపింపంగఁ దనరు నిత్య
కర్మఠాధిక భూసుర గణములకును
కవచము సురభి ముద్రాష్టకంబు పిదప.

తే.గీ అల ఋగాదుల నెనిమిదేసక్షరములు
నగుచు నిర్వదినాల్గు గాయత్రి యాయ
థర్వణంబునఁ బదునొంటఁ దగు మరీయ
సాంగ నిగమఫలంబిచ్చు జాపకులకు.

కం. ఎచ్చోట నర్ఘ్యమెత్తిన
నచ్చో గాయత్రి నొడువనగు నుదయముగా
నచ్చో నుత్థిత నినుఁ
డచ్చుగ నుదయించునేని నాసీనుఁడునై.

ఆ.వె. సంధ్యవార్చుచోట సలుపక గాయత్రి
యొండుచోట నేయ నున్కి మఱల
సంధ్య వార్పవలయు శాస్త్రవిధిజ్ఞుల
మతము లిట్లు ద్విజవితతులకెల్ల.

కం. ప్రాతఃకాలంబున న
త్యాతతమతి ప్రాఙ్ముఖుండు నపరపు సంధ్యన్
బ్రీతిన్ బ్రత్యఙ్ముఖుఁడగు
రీతిన్ జపియింపఁదగు గరిష్ఠ స్థిరతన్.

సీ. రమ్య పీఠిక కంటె రాంకవశార్దూల
చర్మ కుశాసన సరణిమేలు
స్ఫటిక రుద్రాక్షాది జపమాలికల కంటె
నంగుళి సంఖ్య శుభాస్పదంబు

లంతకంటె ననామికాంగుళిగాఁ దత్పర్వ
సంఖ్యఁ జేయుట ప్రశస్తంబు లిట్టు
లుత్తమంబగు వేయి నొగి మధ్యమము నూఱు
పదియైన నధమమెన్నది మిగులఁగ

తే.గీ. నెలమి గాయత్రి జపియింప నెసఁగు శుభము
నాల్గుదిక్కుల షోడశున నడుమ క్రిందఁ
క్రమము వసియించు నద్దేవగణములకును
వందనమ్ములుజేసి గోవిందు నెంచి.

కం. ఉత్తమ శిఖరంబుల నును
హత్తరగతిఁ బుట్టి విప్రులభ్యర్థింపన్
జిత్తమ్ము వచ్చు నెడలను
హత్తుగ ధరఁ బర్వతముల నమరుము దేవీ!

కం. అని, వేదమాత! వరదా!
జనని! కృతన్ బ్రహ్మవర్చసము తేజము న
వ్వనజాసన లోకాప్తియు
ఘనత న్మా కొసఁగుమనుచుఁ గడుభక్తిమెయిన్

తే.గీ. గోగణములకు బ్రాహ్మణ కులజులకును
ఘనత శుభమగు ననుచు వందనమొనర్చి
సవితృనకు మ్రొక్కి బ్రహ్మయజ్ఞమున దేవ
మనుజ పితృభూత యజ్ఞక్రమములుఁ జేసి.

వ. కర్మారంభకర్మ సమాప్తుల నాచమనంబు నేయందగు తత్ఫలంబు వినుండు—

కం. పానత్రయమున ధృతి నో
ష్ఠానూన స్పృశత మూర్ధ మంటుటచే నెం
తే నితరాంగ స్పృక్కుల
నా నిరుపమవేద్య ...... లరయ ఫలమగున్.

కం. శారోపాస్తికి మధ్యా
హ్నారూఢిన్ వార్చిసప్తమూన్వోవ పదహా
నూరవర మంత్రతమున నొక
టారయ గాయత్రిచేత నర్ఘ్యద్వయమున్.

కం. ప్రాయశ్చిత్తార్ఘ్యంబును
ధీయుక్తి నొనర్చిన వినుతించిన పిదపన్
గాయత్రిం దుదన్ సేయన్
న్యాయంబగు కర్మరులకు నందితబుద్ధిన్.

కం. హరిపూజ దేవయజ్ఞము
కరమొప్ప నొనర్చి భూతగణతృప్తికిఁ గా
నిరవైన, వైశ్వదేవము
స్థిరమతి సేయంగవలయు స్మృతిముఖఫణితిన్.

సీ. బ్రహ్మయజ్ఞంబది పటుదేవముని పితృ
తృప్త్యర్థి సంకల్ప ధృతి ముఖాంగ
ములు సృజింపుచు వేదములు నాల్గు నుపనిష
త్తులు నిగమాంగమ్ము తెలిమి సూత్ర
మమర మీమాంసాద్వయంబు నధ్యయనంబు
శక్తికిఁ దగినంత చదివి తర్ప
ణములు సేయుచు నాది నంజలి మున్వ్రేళ్ల
సవ్యోపవీతుఁడై సరసిజభవ

తే.గీ. ముఖ్య సురులకు వ్యాసాది మునివరులకు
సరవి శిథిలీ కృతాంజలి సంధి దగవు
పితృవితతి కెల్ల నపసవ్యవృత్తిఁ బెద్ద
వ్రేలిమొదట నొనర్చుట విధిదలంప.

కం. సురపైతృక భూతమనుజ
పరితుష్టికి వైశ్వదేవపటిమన్ లౌక్య
స్ఫురితాగ్ని నితరు లటు గృహ
పరుఁ డౌపాసనమహాగ్ని వడి వేల్వఁదగున్.

సీ. పాసఁగఁ బ్రాణాయామపూర్వక సంకల్ప
మమరఁగ నాత్మశుద్ధ్యర్థ మన్న
శుద్ధ్యర్థ మను పంచసూన నిర్హారణార్థ
మిష్టదైవప్రీతి కొసఁగ నుదక
మంటుచు గృహమున నైన యన్నము దెచ్చి
యచట పాక మొనర్చి నటులఁ జేసి
సాజ్యహానదియుఁ బంచవిభాగములు జేసి
పరిషేచన మొనర్చి ప్రథమ భాగ

తే.గీ. కలిత మార్జన విధములు గల్గు పంచ
సూనపాతక హారణమ్ము నైనయట్టి
విధి పదాహుతు లగ్నిలో వేల్వ వలయుఁ
దత్తదర్హైక మంత్రయుక్తముగ మఱియు.

కం. విను రెండవ పాల వ్యం
జనయుక్తంబన్న మగ్ని సరస నుదీచిన్
దన రార నష్ట భస్మం
బున నిడి సేచనము చేసి పూజక నంతన్.

ఆ.వె. ప్రేమ మొదటిపాలు రెండవ పాలును
గూర్చి పటిమమునను నేర్చి ధర్మ
మున కధర్మమునకు నొనరంగ స్వాహాంత
మనెడి మంత్రసేచనా నురూఢి.

సీ. దానికి నుత్తరధరణి నాప్యాహుతి
పరిషేచనము దాని నైరయ నొస
ధి యట రక్షోజనస్థితి కగు నేకనే
చనము 'గృహ్యోతి' నాసరణి నాల్గు
ధర్మాహుతికిఁ జెంత దక్షిణంబున నేక
పరిషేచనస్థితిఁ బరిఢవించి
యా యధరాకృతి క్రమంబునందుఁ గా
మా ఖ్యాది నాహుతు లవియు నాఁడు,

తే.గీ. వేలువేలున సేచన విధు లొనర్చి
యచటఁ బృథ్వ్యాదిగా బ్రాహ్మణాంతముగను
బదియు నొక్కటిగా జలమొదవఁ జుట్టి
మొదలదాఃకి దక్షిణంబుగ మఱియును.

కం. ప్రాచీనవీతిగ పితృగ
ణోచితముగ నొకటొనర్చి యొగి నపసవ్యా
సేచన మమరుఁ దదుత్తర
హై చెలువగు రుద్రునకు మహాహుతి యొసంగన్.

తే.గీ. అది ప్రదక్షిణ సేచనమాచరించి
రేయిఁ బగలింటఁ గల భూతతృప్తికి బలి
[మిగిలి] నన్నంబు కొన్నిఁటి మీఁద నిడుచు
నమ్మతి నంత నగ్రదానంబు కొఱకు.

క. ప్రాణాయామము సేయుచు
నాణెముగఁ దృతీయభాగ నయగతిఁ ద్రిజగ
త్త్రాణున్నారాయణు సం
ప్రీణన మొనరింపవలయుఁ బృథుకల్పోక్తిన్.

సీ. పరగునట్టి తృతీయ భాగశేషంబున
దేవయజ్ఞమ్ము సెంతేని భౌతి
కంబగు సవనంబు గావింపఁ దనరు ప్రా
ణాయామ సంకల్ప ధీయుతముగ
పరిషేచన క్రియల్ పాటిల్ల నగ్నిలో
దేవతలకు వేల్చి తెఱఁగు నమరు
ననల దక్షిణ భాగమునఁ బితృ ప్రీతిగా
నపసవ్యమున స్వధా యనఁ జతుర్థ

తే.గీ. భాగమునఁ దెచ్చి యిడి షష్ఠి భౌతికమగు
క్రతువున కల తృతీయ భాగమున నెత్తి
రమ్యసూత్రిత శిఖ్యుత్తరమున నునిచి
మనుజసవన మొనర్చు క్రమంబు వలయు.

క. పంచమభాగం బగ్ని ను
దంచితముగ వేల్వ వలయు నమరు విసీతిన్
మించఁగఁ బరిషేచనములు
నెంచఁగ మునురీతిఁ జేసి యెంతయు బ్రీతిన్.

తే. అగుఁ "ప్రజాపతయే" యను నాహుతి త్ర
యంబు నయ్యగ్ని వేల్చి శేషాన్న మెల్ల,
నొగి గృహద్వారమున నిల్చి యుదకయుక్తి
నష్టదిగ్వాయసముల కాహారమిడుచు.

క. వైవస్వత కుల సంభవ
మై వెలసిన శ్యామశబళకాఖ్యానములన్
ఠేవగు శునులకు యమ ష
ద్యా వనమున బలియొసంగ నగు శాస్త్రోక్తిన్

ఆ.వె. భూతికామి పూర్వరీతి, సామ్రాజ్యార్థి
పొలుచు కేతుభంగి, భోగకాంక్షి
చక్రవర్తి పుత్రసంపన్నకుండు వ
లీక గతి బలియిడ లెస్సయగును.

కం. పాద ప్రక్షాళకుఁడై
యాదట వసియించునట్టి యభ్యాగతులన్
బాఁ దోడ్కొని చని యర్చా
పాదకుఁడై భోజనమ్ము పంక్తి నిడఁ దగున్.

వ. అంతకు మున్న యొనర్పం దగు దేవపూజాక్రమంబు వినుండు.

సీ. ఘన శంఖ చక్రలాంఛన మష్టదళ పద్మ
భాసురాలంకార బంధురమును
బహుదివ్య గంధ ధూప ప్రసవామోద
మగునట్టి పీఠి కల్యాణ రజత
తామ్ర శిలా మృత్స్న దారు మయంబుల
నైన శ్రీహరిమూర్తి నావహించి
రంగవల్లీ వితానాంగణము విచిత్ర
విహితమౌ దేవతా గృహమునందుఁ

తే.గీ. బ్రాహ్మణుండును శుచియునై పరమ నియతి
సమతఁ జిత్తంబు హరిపదాబ్జముల నిల్పి
భద్ర సంశోధితాసన ప్రౌఢి నమరి
మాతృకాంగ కరన్యాస రీతి మెఱయ.

ఉ. అచ్చట నష్టదిక్పతుల నావహనం బొనరించి రాక్షసా
త్యచ్ఛయవర్గముల్ దొలఁగ నూర్ధ్వగ దేవత లెల్ల రాఁగ భా
స్వచ్ఛలనాత్తఘంటిక ధ్రువమ్ముగ మ్రోయఁగఁ జేసి దిక్కులన్
హెచ్చు నిజాసనస్థితికి నింతయు బంధనమున్ ఘటింపుచున్.

కం. కలశమునందుఁ ద్రిమూర్తులఁ
గల త్రిదశులఁ దీర్థచయము గలుగన్ మంత్రో
క్తుల నావహించి శంఖము
జలజాహిత దైవతముగ సమకూర్పఁ దగున్.

తే.గీ. శంఖ చక్ర గదాపద్మ శార్ఙ్గ హస్తు
నిందిరా సుందరీ సదా మందిరైక
చారు కౌస్తుభ వక్షు నీరేరుహాక్షు
సవ్య దరహాసవదను ధ్యానం బొనర్చి.

కం. శాంతు నసంతుని లోకైకా
క్రాంతు రమాకాంతు భక్తగణవంతుఁ గళా
వంతు మహోదాంతుఁ గుణ
వంతుని నా వాహనంబు వలయుం జేయన్.

తే.గీ. అఖిల జీవాంతరస్థు మహానుభావు
నణువునకు కొద్దిగొప్పకు నధికమైన
యట్టి విభునకు రత్నసింహాసనంబు
నార్యుఁ డిడ నగు భక్తి తాత్పర్యములను.

కం. ఆద్యుం డాగమచయ సం
వేద్యుఁడు నిజభక్త సుజన వివిధామయ స
ద్వైద్యుఁడగు విష్ణుమూర్తికిఁ
బాద్య సమర్పణము సేయఁ బాడి బుధులకున్.

కం. నీరేజ భవాండమ్ములు
నీరనిమగ్నమగునపుడు నిద్రారతిచే
నారాయణుఁడగు హరికి సు
ధీ రతి నర్ఘ్యంబొసంగు తెఱఁగొప్పమరున్.

కం. ఆ చతురానన రుద్రులు
వాచంయమివరులు నెన్న వాంఛించినచో
వాచామగోచరుండగు
నాచతురున కొసఁగవలయు నాచమనమ్ముల్.

కం. శ్రీసూక్త పురుషసూక్త మ
హాసూక్తములన్ సుధాబ్ధి నంచిత లీలా
భాసురుఁడగు శ్రీ విభునకు
వాసిగ నభిషేచనమ్ము వలయుం జేయన్.

కం. కనకాక్షహరణుఁ గమ్మనిఁ
గనకాన్వితపీఠి నునిచి కనకాంశుకముల్
కనవేడుక గాఁ బెనుజో
క నకుటిలప్రీతి నొప్పుఁగా నిడవలయున్.

ఉ. బంగరు కమ్మనిగ్గుల విభాసితహా దర మౌక్తిక ప్రభా
సంగతయజ్ఞసూత్ర మురుసార మృగీమద కుంకుమార్ద్రితో
త్తుంగ సుగంధి గంధములతోరములై యరుణప్రభాస్థితిన్
రంగగు మేలియక్షతలు రాజితలీల నొసంగఁగాఁ దగున్.

చం. కలువలు చంపకమ్ములును గస్తురి పత్రెలు జాజిపూలు మొ
ల్లలు విరజాజులొప్పు ముకుళమ్ములు పొన్నలు బొండుమల్లియల్
జలజములున్ జివుళ్లు వరసౌరభ సంగతనవ్య పుష్పముల్
వలయు రమాధినాథ పదవారిజ పూజకు భక్తకోటికిన్.

శా. చాలున్ శ్రీహరిపూజ కొక్క తులసీపర్ణంబు సద్భక్తితో
సాలగ్రామముపై నొకండు దళ మెన్చన్ బూజ గావించు నా
శీలౌన్నత్యుఁడు పాతకావళుల నిశ్చింతన్ విసర్జించి త
త్సాలోక్యంబున మించఁ గాంచు విభవాశ్రాంతస్థితిన్ నిత్యుఁడై.

కం. తులసీదళాపచితికిన్
[దులయగునే !] యితరపూజ తోరపు భక్తిన్
గలిగిన సువర్ణపుష్పము
లలవడఁ బూజించుటొప్పు హరి చరణములన్.

తే. గోఘృతంబును సాంబ్రాణి గుగ్గిలమ్ము
నగరు కురువేరు మొదలు దశాంగములను
ధూపముసఁగుచుఁ గర్పూర దీప మిడిన
నిరయబాధలు తొలఁగు వర్జితనియాధి.

ఆ వె. భక్ష్య భోజ్య లేహ్య పానీయ చోష్యమ్ము
లాది గాఁగ బహుపదార్థయుక్త
కనకపాత్రపంక్తి కమలాత్మునకు నివే
దనము సేయ్యవలయు ధన్యమతిని.

కం. హాస్త ప్రక్షాళనము ప్రబ
శస్తగతిం జేసి సుదళ సత్క్రముకమ్ముల్
నిస్తుల చూర్ణమ్మున్ సా
మ్యస్తుతి పాత్రస్థవీడ్య మగు హరికొసఁగన్.

ఆ.వె. అగు ద్రిలోక తిమిర హరణుఁడౌ హరికి నీ
రాజనమ్మునర్చి రమణ వలయు
భాగవతుల కెల్ల భగవత్ప్రసాదమ్ము
తీర్థయుతము గాఁగ ధృతి నొసంగ.

సీ. మహితసౌరభపుష్పమంజరి, తుళసీ ద
ళంబుల మంత్రపుష్పంబొసంగి
న్యాయంబు దప్పక నరపతుల్ భూమిఁ బా
లింపంగ వలయును క్షేమమిగఁ గాల

గతులు దప్పక వాన గల్గఁగా వలయు స
స్యములు పండఁగవలె నధిక శుభద
సౌఖ్యమ్ము లమర దేశమ్ము లుండఁగవలె
గో బ్రాహ్మణులకు నెక్కుడు శుభమ్ము

తే.గీ. ల మరవలెనంచు సాష్టాంగ మాచరించి
నృత్తముల్ సల్పి కీర్తించు నియతివలయు
నచ్యుతుని సన్నిధిన్ బాపహరణమునకు
నంతకంటెను క్రియలు లేవరసిచూడ.

చం. కల కొలఁదిన్ సుగంధి కనకప్రసవాంశుక నృత్తగీత ని
శ్చల బహుభక్ష్యభోజ్యముల సౌరభలేప బహూపచార సం
కలిత మహానురాగమునఁ గంజదళాక్షునిఁ గొల్చువారికిన్
దలఁగు విపద్దశల్ శుభము దాఁకొను సౌఖ్యము లుల్లసిల్లఁగన్.

కం. స్రక్చందనాదు లతి నుతి
వాక్చాతురి మెఱయ భక్తవత్సలుఁడగు స
మ్యక్చరితున కర్పించిన
దిక్చయ పాలైక విభవ ధృతి గాంతు రిలన్ ॥

చం. అనుదిన మర్థి విష్ణుఁడని యంచిత భక్తి నమస్కరించి పూ
జనములొనర్చి చుట్టములు సాధులు బాంధవు లాశ్రితుల్ ముదం
బున వసియింప నచ్చటి విభుత్వముమాని సమస్తవస్తువుల్
దనకును బంక్తికిన్ సమవిధంబున వడ్డన సేయుటొప్పగున్.

తే.గీ. పరఁగ నాత్మార్థ పాకియుఁ బంక్తిభేది
యును బృథక్పాకి బ్రహ్మఘ్నులనఁగఁ దగుట
నట్టి కృత్యము లెడసి శ్రీహరి నివేద
నాన్నము భుజింపఁదగు దామసాళి విడిచి.

కం. అన్నము లోపలి సారం
బెన్నఁగ నమృతమటఁ గలుష మేర్పడ సురయౌ
నన్నమునఁ గలియు సారం
బెన్నఁగ మలమంద్రు శ్రుతి విహిత వాక్యవిదుల్.

కం. హానియు మితాశనుండగు
మానవుఁ డశువర్గమొందు మ [తి] ద్వాత్రింశ
న్మాన కబళోదనుఁడు సుఖి
యౌ న ద్రివారావగాహి యటు ముక్తుఁ డగున్.

కం. ఆపోశన మాపోసన
మేపారఁగ నాసనమ్ము నితరులిడఁ దగున్
శ్రీపతిమకు శోధిన్యబ
లా పదరజములును పోక లలి సిరులెడయున్ ॥

కం. ఉల్లియుఁ దిలపిష్టమ్మును
ముల్లంగి యలాబు హేయభూ జనితంబుల్
వెల్లగు బచ్చలి తామస
ముల్లి నివి త్యజింప వలయు నింగితబుద్ధిన్.

తే. పీటఁ గూర్చుండి పదములు పృథివి నునిచి
యైదు వ్రేళులఁ గబళమ్ము లనువు గాఁగ
రొండమ చెయి నేలనూనక కడ నునుపక
భోజనము చేయఁ దగవగు బుధులకెల్ల.

కం. పరిషేచన మారభ్యము
పారిఁ బ్రాదక్షిణము చిత్రభుక్తు లిడఁదగున్
మఱి యప్రదక్షిణమ్ముగ
నెరయించుట లిష్టభుక్తినియతిఁ దలంపన్.

తే. చిత్రబలిఁ జూచుచు నెవరు భుజింతురేనిఁ
బరగు దోషమ్ము యమనూక్త పతనములను
గాని తీఱదు చిత్రాన్నమూని యవల
మఱఁగు సేయఁగఁ దగు ధరామరులకెల్ల.

కం. కబళ కబళమ్మునకు మతి
ప్రబలఁగ గోవిందనామ పఠనము చేతన్
సొబగొందు మాస నిరశన
ప్రబల వ్రతఫలద మగుచుఁ బరగు బుధులకున్.

చం. మునుమును దియ్యగూర లతిమోదముతో గటు శాకతిక్తముల్
గొనకొని వెన్క నామ్లములు కూర్మిఁ దుదన్ భుజియింప మేలగున్
జనువడఁ బాయసాన్నములు భక్ష్యము లొప్పగు నుప్పిడంబులున్
ఘనతఁ బవిత్రపాణి లలనామణి వడ్డన సేయ మానతన్.

కం. రాత్రిన్ దధియుక్తాన్నము
పాత్రము భోజనము నడుమఁ బానజలమ్ముల్
గాత్రమ్ము పుష్టి సేయున్
ధాత్రిన్ భుక్త్యంత పానతన్ బలము నళ్లన్.

కం. పన్నపుఁ బానము చేతను
నన్నము జీర్ణింపఁ బోవ దధికంబైనన్
దిన్ననగు జాఠరానల
మెన్నిక పలుమాఱు ద్రావ హితవగు భుక్తిన్.

కం. స లవణ జంబీర రసో
జ్జ్వల దేలా తక్ర మమరఁ జతురత భుక్తిన్
జలిపిన వెనుక, ససాక్షిగ
వలవదు భుజియింప హేయవర్తనమగుటన్

సీ. తానైన సతియైనఁ దనసుతులైనను
సద్బంధు శిష్యులు సఖులు శ్రోత్రి
యులు నేయు పాకమ్ము వలనగు భుజియింప
రహి నెందుఁ బరపాకరతుఁడు, నెపుడు
నెచ్చట భుజియింప నిచ్చగించినవాఁడు
నిరయ దుఃఖమ్ములఁ బొరలు మిగుల
భోజనానంతరంబున నుదకము ద్రావ
నమరు తర్జని మధ్యమములనడుమ

తే. వలయు ధరఁబడవిడఁ గారవములసద్వ్ర
తతుల వసియించు పితరుల దరికిఁ జేర
నవ్యగండూషముల క్షాళనంబు నైగ
మోక్తముగఁ జేసి వార్చి యథోచితముగ.

కం. కరములు గడుగక మున్నుగఁ
గర మమరఁగఁ బుక్కిలింపఁగాఁ దగు జలముల్
గరములు మున్నుగఁగడుగఁ బి
తరులకుఁ బుణ్యంపు హాని తప్పదదెందున్.

తే. నాలుగెనిమిది పన్నెండు నోలిఁ బదియు
నాఱుగండూషములు క్రమాచారముగను
మూత్రమల సర్జనమ్ముల భుక్తి పిదప
సురతకృత్యమ్ము పిమ్మట శుచుల కెపుడు.

కం. సారపురాణాగమ సువి
చారముచేఁ బ్రొద్దు జరగ సంధ్యావేళన్
ధీరమతి సంధ్యవార్చి జ
పాద్యాదిన్ మెలఁగవలయు హరిసుతి దనరన్.

కం. కర్మములన్నియుఁ జేసియు
నిర్మలమతి విష్ణుభక్తినిరతుఁడు గామిన్
దుర్మతి దుశ్చర్యుఁడు నా
నర్తిలి లక్ష్మీశుఁ గొల్వనమురున్ శుభముల్.

శా. నిర్వాపంబున సత్పితృప్రతతి నెంతే యజ్ఞకర్మంబులన్
గీర్వాణావళి, సజ్జనాతిథుల భుక్తిన్ వేదపాఠంబునన్
సర్వాంచన్మునులన్ బ్రజాపతులఁ బ్రాజాపత్యరీతిన్ బలిన్
దుర్వారస్థితి భూతకోటి, జనసంతోషంబుగా మైత్రిచేన్.

కం. ముదమొదవ మెలఁగు విప్రుని
కొదవున్ సకలార్థసిద్ధి యురుతరసుకృతా
స్పద దివ్యలోక సౌఖ్యము
లదనందగు బ్రహ్మపదవి యంచిత వృత్తిన్.

సీ. అనఘ వానప్రస్థుఁ డఖిల సంగమ్ములు
విడిచి శుశ్రూషకై వెలఁది వెంట
రా నగ్నిహోత్ర సంరక్షణమున కద్రి
వనులాశ్రమములుగాఁ దనర నటుఁ
గందమూల ఫలాదికము లగ్నిలో వేల్చి
తచ్ఛేష మగ్ని సంతర్పణమున,
నాత్మపోషణమున కనుగుణస్థితిఁ జేసి
నిత్యకర్మాచార నిరతుఁడగుచు,

తే.గీ. బ్రహ్మచర్య వ్రతస్థితిఁ బరగి యజిన
వల్కలంబులు దాల్చి దేవతల పూజ
లేమఱక, భిక్షలిడుచు నెంతేని ద్వంద్వ
ములకు నోర్చి చరించుచు నలఘువృత్తి.

కం. అవసానకాల మొదవిన
నవిరళమగు వహ్ని నాత్మ నారోపణమున్
సవరించి బ్రహ్మనిష్ఠా
ప్రవణుండై యిష్టపదము ప్రాపింపఁ దగున్.

ఉ. అంతట భిక్షుఁడైన రూఢ నాత్మ నిరీహయు నిర్జితేంద్రియా
భ్యంతరవర్తనమ్ము ప్రణవార్థ జపాన్విత నిత్యకర్మముల్
సంతత విష్ణుదేవ పదసారస చింతనమున్ నిరింధనా
త్యంతిక పావకస్థితి మహోద్యమ గల్గిన ముక్తి చేకురున్.

కం. స్నానంబు చతుర్వర్గ ని
దానఫలప్రదము స్నానధర్మనిరతుఁడై
పూనిక భజింపఁ డెవ్వం
డా నరుఁడు మలాశి యనఁగ నవని జరగున్.

కం. గాయత్రిఁబోలు మంత్రం
బేయెడలను లేదు మానసేప్సిత లోక
శ్రీ, యనుభవముల్ మోక్షం
బాయతమగు విష్ణుపదము నై పొలుపమరున్.

ఆ.వె. బ్రహ్మయజ్ఞ మఖిలపాతక హరణంబు
నఖిలదేవతా ప్రియంబు వైశ్వ
దైవమబ్జనాభ ధన్య పదావాప్తి
యతిథిపూజ సుగతి కాకరంబు.

సీ. పల్లవ తృణ దారు పార్థివోపల కృతా
సనము లామయము నిర్ధనము సేయు
బలువగు రత్నకంబళి సర్వకార్యార్థ
సిద్ధిద మపవర్గ చింతనులకు
వ్యాఘ్రచర్మము పావనము కుశాసన
మంశుక మైశ్వర్య మంగుళములు
సంఖ్యకెక్కుడు పర్వసంఖ్య దానికి నెచ్చు
పుత్రజీవియఁ దమ్మి పూసలొకటి

ఆ.వె. స్ఫటిక రాజతోరు [స్వర్ణ] మయమ్ములు
ననఘరత్నమయము లంతకంటె
మోక్షదమ్ము దర్భ ముల్లి రుద్రాక్షలు
వేదమాత నెన్న విప్ర తతికి.

కం. ఇట్టినియమములు మునుపటి
పుట్టువు సత్కర్మతతులు పుణ్యప్రదమై
నెట్టుకొని మరల నవనిన్
బుట్టిన భూసురుల కొదవు బుధనుతగతులున్.

కం. వినుఁ రాజుల కాయుధ జీ
వనముల్ శిష్టావనమ్ము వారక రిపు మ
ర్దన దుష్టనిగ్రహంబులు
జను భూసురరక్షణమ్ము సత్యగుణమ్మున్.

తే.గీ. యజన మధ్యయనమ్ము దానాభిరతియు
నర్హమగు యాజనమ్ము నధ్యాపనమ్ము
దానములు గొంటు నృపతికిం దగవుగాదు
ప్రబలి తామస [రాజస ?] భరితులగుట.

చ. రహిం దళుకొత్తఁగాఁ బ్రజల రంజన సేయుట రాజనామతన్
వహిఁ గను సర్వలోకహితవర్తనకై సృజియించె బ్రహ్మ దు
స్సహ ధరణీ ధరాద్యమిత సంపద సాధు జనావన క్రియా
బహుతర శస్త్రజీవిక కృపాకరభూవర వంశ మిమ్మెయిన్.

సీ. సకలవర్ణాశ్రమాచార ధర్మక్రియా
నిర్ణీతిచాతుర్య నిపుణ మహిమ
దుర్మదోద్ధత ఘోర దుష్టశిక్షా శౌర్య
ధైర్యమహౌదార్య ధన్యగరిమ
నిఖిల దేశిక సుఖాన్విత విచక్షణ కళా
మంత్రి సామంతసామర్థ్య మహిత
ధరణీసుపర్వ నిత్య విధి ప్రపూర్ణ త
త్ఫల భాగ సంగ్రహ విలసితమతి.

తే.గీ. శక్ర యమ వరుణ ధనద సన్నుతాంశ
కలితబహుభోగదండన ఘనకృపా వి
శేష వితరణ గుణగణా శేష లోక
పాలనోత్సవపరులు భూప కులవరులు.

తే.గీ. అట్టి క్షత్రియవంశజు లఖిల భువన
రక్షణాధ్యక్ష సత్ఫలాపేక్ష ధరణి
సురులఁ బోషింప వారి తేజో విభూతి
క్షాత్రబలవర్ధనంబగు సారమహిమ.

కం. వారలకు నలిగిరేనియు
వారని తత్కోపవహ్ని వడిఁ గ్రాఁగుదు రా
నీరమునఁ బుట్టు ననలము
నీరమ్మున నణఁగు నట్టినియతి దలిర్పన్.

ఉ. పాలితలోకుఁడైన నరపాలశిఖామణి యాత్మరక్షకున్
జాలిన భృత్యవర్గముల సారె బహూకరణమ్మొనర్చి వి
ద్యాలలితాత్మ నీతియుతు ధర్మవిచక్షణు స్వామికార్య ని
ష్ఠా లసదప్రమత్తు సరసన్ సచివాగ్రణిఁ జేయఁగావగున్.

ఉ. భూప్రజ భారమెంతయును బూనికతోడ వహించి వారితో
నప్రియముల్ ప్రియోక్తు లటు నాడుటు కొక్కని నేర్పరించి శ
త్రు ప్రశమప్రసంగముల ధూర్వహుఁడై సమ శత్రు మిత్ర శ
క్తి ప్రకృతి ప్రవీణమతిఁ గీర్తి వహించినఁ గాంచు సంపదల్.

ఉ. నమ్మిక పుట్టఁగాఁ గల జనంబులఁ బ్రోచిన కాపు విత్తమ
ట్లమ్ముగఁ గాంచి భూపతికి నూర్జితవైభవ మావహిల్లఁగా
సమ్మతిఁ జేయు నెంతయు వశంవద సద్ధనధాన్యుఁడైనచో
నమ్మహిభర్త దేశముల నన్నిఁటు మేలనఁ బొల్చు నెప్పుడున్.

కం. సత్యంబాయువు నొసఁగును
సత్యమె ధనధాన్యవృద్ధి సమకూర్చు జయా
స్పత్యమ్ము గల్గు దాననె
సత్యమె ధర్మమ్ము కీర్తి సద్వ్రత మెందున్.

సీ. పరశురాముఁడు భూమిపాలుర నందఱ
వధియించి యఖిల సర్వంసహాయును
గశ్యపునకు దానకాంక్ష నిచ్చినయంత
నతఁడు విప్రుల కిచ్చె నవని యెల్ల
భూసురు లది యేలఁ బొత్తు వోవక వైశ్య
శూద్రులు, తత్సతీస్తోమ ధనము
లపహరింపఁగ నంత నయ్యధర్మమునకు
నోర్వక నిలగ్రుంగ నూరువులను

తే.గీ. నెత్తు కశ్యపుఁ గని ధాత్రి కోరఁగి రాజు
నేర్పరింపఁగ వరము దా నెలమి వేడ
నజుని యనుమతి నతఁడట్లు యలవరించె
క్షత్రకులమును ధాత్రిరక్షణమునకును.

కం. కావున భూసురుల న్నిజ
దైవములుగ దలఁచి వర్ణధర్మస్థిరతన్
గావింపవలయు రాజ్యము
పావనమగు దండనీతి పద్ధతి దనరన్.

ఉ. ఆవుల మేపి పాలు గొనునట్టి తెఱంగునఁ దోఁటఁ బెట్టి యా
పూవులు దాల్పు చందమునఁ బొల్తుకఁ గైసానరించి క్రీడలన్
భావ మెలర్పనుండుగతి పట్టుగ భూప్రజఁ బ్రోచి వారిచేఁ
గావలె నన్న దెల్లఁ దగఁ గైకొని భూవిభుఁ డొప్పు నెప్పుడున్.

మ. చదువుల్ సాము పురాణగోష్ఠి ఘనభాస్వద్విప్ర సంరక్షణా
స్పద నానావ్రతదాన విష్ణుపదపూజా శాస్త్రవిజ్ఞానముల్
విదితాజ్ఞావిభవంబు న్యాయములు సద్విద్యాప్రవీణత్వ మ
భ్యుదయానేక విధాన కర్మచయ మొప్పున్ రాజధర్మమ్ములై.

కం. తపములు వ్రతములు యజ్ఞము
లపరిమితము చేయుకంటె నధికము ప్రజలన్
గృప న్యాయమ్మున మనుపుట
యెపుడున్ ద్విజవరుల భక్తి యొడలమి పతికిన్.

సీ. అర్థికోటికిఁ దగినట్టి కోరికలిచ్చి
పరిజనములకు సంబళములొసఁగి
మిత్రుల నెల్ల నమ్మిక ధనాఢ్యులఁజేసి
శత్రుకార్య విచార సరణి తెలిఁగి
ప్రతికార్యమును నీతి మతి సంఘటింపుచుఁ
బ్రాంతవారలను శోభనత మనిచి
చారదృక్తతుల దేశస్వాస్థ్యముల్ గని
సామంత మంత్రుల జాడ లరసి.

తే.గీ. ఘనత నేపట్లఁ దన్నుదాఁ గాచికొనుచు
ధీర విశ్వాసకుల కధికారమిచ్చి
ద్రోహి కుటిలా వివేకుల దూరు సేసి
రాజ్యమేలెడి యాతఁడు రాజవరుఁడు.

కం. వర్తకులకు భూప్రజకున్
గీర్తికి [దగ?] కవులొసంగి క్షితిఁ బేదలఁ . ధ.
వార్తకు నెక్కఁగఁ బ్రోచి సు
వర్తనుఁడగు రాజు భాగ్యవంతుం డెందున్.

కం. వికలాంగుల రక్షింపుచుఁ
బ్రకటితసాహసుల ఘనులఁ బావనకులులన్
సుకరుల సైన్యేశులఁగా
నకలంకత మనుచు నృపతి యతి ధన్యుఁడగున్.

గీ. చోరు లుబ్ధు నవిశ్వాసుఁ జేరనీక
రోగి వృద్ధుని దీను నాదూఢి మనిచి
యాయమున నర్థధనమున కధికముగను
ధనము వెచ్చింపఁ జనదు భూధవున కెందు.

ఇది రాజధర్మంబింకను గ్రమాంతరముల నెఱుంగఁబడు వైశ్యధర్మంబు వివరించెద.

సీ. కృషియు వాణిజ్య సుకృత ధేనుగుప్తముల్
సత్యవాక్యము విప్రజన పదాబ్జ
సేవయు దానమ్ము శ్రీహరి భక్తియు
త్రితయోపాసన శాంతి సకల
శాస్త్రార్థ విజ్ఞాన శమదమ సంగతి
బ్రాహ్మణా చారత పాపభాగ
మొనరఁ గర్మము చేయుటు చిత్తవర్తనమును
నత్యాశ లుడుగుట లమరు వైశ్య

ఆ.వె. కర్మములు దలంపఁగా హరి భజనమ్ము
విప్రభక్తి గల్గి వెలయ వలయు
శూద్రధర్మమునకు భద్రాత్మకమగు త్రి
వర్ణ సేవనంబు వశ్యకరము.

కం. ఆ చాతుర్వర్ణ్యాశ్రమి
తాచారము లాదవుకంటె నతిసులభంబుల్
బ్రాహ్మచర్య శుభప్రదము మ
హావతురతఁ దగు పతివ్రతాచార మిలన్.

సీ. పతిదైవ మనుచు సంతతము దత్సేవ సే
సిన నెల్ల దేవతల్ దనివి గాంతు
రచ్యుతుఁ డప్తైన హర్షించుఁ గావునఁ
బతి తుష్టి సేయుట సతికిఁ దగవు
భర్త సేవకము న్నె పరగ మేల్కొని గృహ
శుద్ధి గావించి భాసుర లలాట
తిలకమ్ము ధరియించి లలిత హరిద్రా వి
లేపనరాజి నయలీల విభుఁడు.

శా. గంగాస్నానము సేతుసేవయును లోకత్రాణదానవ్రతో
త్తుంగప్రక్రియ లాచరింప వెఱయింతుల్ సాధ్వితో సాటియే!
సాంగత్యాధిక భక్తి సుస్థిర హృదబ్జాత క్రియాధారయా
శృంగారాకర భర్తృసేవ వలనన్ జెల్వొందు నెంతేనియున్.

కం. పతిపూజ సకల దేవ
ప్రతతిం బూజించునట్టి ఫలములొసంగున్
బతి కెదు రాడిన దానికి
గతికలదే! నిరయలోకగతి దక్కంగన్.

కం. చెదరనిభక్తిన్ మదిఁగడు
ముదమున ధర్మార్థకామ ముఖ్యార్థమ్ముల్
పొదలఁగఁ బతిసేవయె తగు
సుదతికి మఱియొండుగతుల శుభములు గలవే!

చం. పురుషుఁడు నిద్రమేల్కనుమఁ బుణ్యసులక్షణహీనఁ జూచినన్
దొరకొను కీడు తల్లి సయిదోడులు దక్కఁగ భర్తృహీనయౌ
తరుణి కృతాపగాహయయి తత్పరతన్ ధవు సూర్య భావుఁగా
గుఱిచి నమస్కృతార్ఘ్యములు గోరిక నిచ్చుచు నేకభుక్తయై.

కం. సుతులయను మతిన్ దాన
వ్రతములు గావించుకొనుచు వహి సన్న్యాస
స్థితి యొనడవడికిం దగు
పతి విధవయు సుకృతశీల మహిమన్ జెలఁగున్.

చం. తనయులు లేని యంగన ముదమ్మున భర్తకుఁ బ్రీతిగాఁగ
వ్వనజదళాక్షుఁబూజ లనువారము భూసురతర్పణమ్ము శో
భన ఘనదానధర్మములు పావనసద్వ్రతచర్య నొందినం
దనవిభుఁ గూడి స్వర్గసుఖధన్యత నుండి చరించు నెంచఁగన్.

కం. ప్రౌఢిమ సద్వ్రతనిరతా
రూఢిన్ సార్ధత్రికోటి రోమపరిమితో
ద్గాఢాబ్దంబులు సురపురి
నోఢాంచద్దివ్య భవముల నుండుర్ దిరమై.

కం కలికాలమ్మున స్త్రీ శూ[illegible]
ద్రులు సాధువులనుచు మునులతో వ్యాసుఁడు మున్
దెలిపెఁగదా!...సురతటినీ[illegible]
జలమధ్యస్థితిని సుకృత చరితాస్పదుఁడై.

చం. వినుఁడు ప్రమాదమైనయెడ విప్రులు మున్నుగ నెల్లవారలున్
దనరు నిజోచితక్రియలు దప్పినచో నిశి జాములోపలన్
మునుకొని యన్నియున్ సలుప ముఖ్యముగన్ నిగమోక్తి, నట్లు గా
వునఁ గులధర్మచర్యనలరున్ మతి యొప్పుగ సేయఁగాఁదగున్.

తే. గీ. వేదవేదాంగశాస్త్రముల్ వెలయ దీపి
తాంగములుగాఁగ వెలుఁగొందు నబ్జనాభుఁ
డతని యాజ్ఞోక్తు లఖిలేతిహాస పరణి
గాన జనుల కవశ్యమ్ము కర్మనిరతి.

చం. తన కులధర్మముల్ నెరపఁ దాలిమి మేలిమి లేకయున్నచోఁ
గనులదవాత్ము లోకవిభుఁ గారణకార్యనియామకున్ రమా
రమణుఁ బరేశు నాద్యు మునిరంజనుఁ గీర్తన పూజలన్ జరి
ప్రమహిత సన్నుతిం గొలువ ధన్యత నొందుదు రెందునేనియున్.

చం. హరిశిలయంబు దారువుల నందపు టిట్టిక తాలనైనఁ దా
విరచిత మొప్పఁ జేసి శుభవిశ్రుతుఁడై భజియించు మర్త్యుఁ డా
వరమున విష్ణురూపమునఁ బాటిలు నీ యిహమందు సౌఖ్య భా
సురవర కీర్తులం బొదలి శోభనవైఖరి మీఱు నెంతయున్.

కం. కేశవగృహ మార్జనమునఁ
గ్లేశమ్ముల నెల్లనడచి కృతకృత్యుండై
యాశా విహీనశుభలో
కాశాగత చరితుఁ డగుచు నతి ముద మొందున్

గీ. నిత్య కర్మమ్ములా శ్రమనిరతి వర్ణ
ధర్మ మేమరకున్నట్టి ధర్మరతులు
శరణుఁ జొచ్చిన వారల గరుణ మనుచు
ఘనులు నల భూతహితులు స్వర్గమున నుంద్రు

కం. విధివత్క్రమమున మెలఁగుచుఁ
గథితనిషేధములు మాని కడు సత్యవచః
ప్రథితులగు పుణ్యులుందురు
సుధాశనులు పొగడ వినుము శోభనలీలన్

మ. వ్రతులన్ ప్రోచుచు శౌచయుక్తముగ సద్వాత్సల్యుఁడై బ్రహ్మసం
గతునిన్ శ్రీ విభు నెంచి తన్మయుఁడు గాఁగా సర్వమున్ గాంచు సం
తతమానాథ్యుఁడు యజ్వియున్ దివిషదుద్యల్లోక సౌఖ్యంబులన్
ధృతి సత్యాధిక లోకభోగములు నెంతే గాంచు నత్యున్నతిన్

సీ. సప్తసంతాన భాస్వచ్చారు చరితులు
కదన హంవీరులై యదరుగుండె
పితికి కండయు లేక యరులచే నీల్గిన
ఘనులు సమ్యగ్జ్ఞాన కలన నమరు
వితరణ గుణులు సద్వినుత సత్యవ్రతా
చారులు నియమ ప్రచార హితులు
నుచిత వర్తనులు సర్వోపకారులు ఘన
స్వర్గాది లోకసంచారులగుదు

తే. గీ. రఖిల పుణ్యనదీ భూధరాశ్రమములు
గాంచువారలు సత్యలోకమున నుంద్రు
పుణ్యకాలమ్ము గడవని భూరి సుకృతు
లబ్జభవు నొద్ద నుందు రత్యధికలీల.

కం. ఉపరాగవిషువు లయనము
లుపవాస వ్రతదినమ్ములొగి పర్వములన్
విపుల తర పుణ్యకాలము
లపరిమిత ఫలప్రదమ్ములవగాహమునన్.

సీ. గ్రహణకాలమ్మున గంగగోదావరిఁ
గృష్ణఁ గావేరిఁ గ్రుంకినటు లెచ్చు
జాహ్నవీ సహ్యజా సంగాంబుధుల జగ
న్నాథ సేతువుల స్నానఫల మధిక
మగుకోటి ధేనువు లన్ని కన్యాదాన
ములు సేయ సుకృతమ్ము గలుగు కతన
స్వామి పుష్కరిణిని శశి పుష్కరిణియందు
నిత్య పుష్కరణిని నెరయ శుభము.

ఆ.వె. మఱియు జలధిఁ గలయు మహనీయ నదుల యం
దందొకింత తక్కువగు ఫలమ్ము
దేవఖాతసమితిఁ దెలియనట్లగు నర
ఖాతసరసు లల్పగత ఫలములు.

కం. కూపోదకములఁ గ్రుంకుట
పాపం బుపరాగవేళఁ బరగనశక్తి
వ్యాపారు[లు] తటినీహ్రద
వా [పీ] తీర్థకముల వారిఁ గ్రుంకెడఁగన్.

చం. ఘనతరపుణ్య తీర్థములఁ గాఁగుల [దెచ్చుక] స్నాన కర్మముల్
దన కల కొద్ది దానములు దాలిమి మేలిమి సేయఁగాఁ దగున్
వినఁడటు నంతశోచమిని వెచ్చని నీళ్లని యేని స్నానమున్
దనరఁగ సేయ కున్కి-యగు ధర్మ విరోధము సాధునిందయున్.

తే. గీ. విష్వయన సంక్రమంబుల వెస నుగాదు
లందుఁ బర్వంబులను గ్రుంక నట్టివాఁడు
బహ్మరక్షస్స్వభావమ్ము బరగ మెలఁగు
పతితము ఖిణ్ణదకంబైనఁ బాపమొదవు.

కం. తోయము లెల్లన్ గంగా
తోయము దానములు భూమితులలకు నెనయౌ
నాఁడుడ విప్రులు బ్రహ్మస
మాయతులౌ గ్రహణకాలమగు నెడఁ దలపన్.

సీ. అందు శాఖాత్రయ మనువుగఁ జదివి గ
ర్భాధాన మాది యౌనట్టి వేద
సంస్కారములు గల్గు సద్గుణుఁడతఁడు బ్రా
హ్మణుఁ డాత్మశాఖ తదంగ పంక్తి
సంస్కారయుక్తుఁడై చదివిన యతఁడు వి
ప్రుండ దేమియు లేక పూన్కి సకల
సంస్కారములు గల్గి సత్కర్మరుండైన
యతఁడు ద్విజుండగు నదియు మాని

తే. గీ. కాలము లెఱింగి గాయత్రి మేలి మెసఁగ
జపము సేయుచు నాచార నిపుణుఁడైన
యతఁడు ధారకుఁ డట్టి గాయత్రి యొప్పు
డోపలుకు వాఁడు జాతి మాత్రోపజీవి.

కం. అదిగాక విప్రులన్నఁగఁ
బదివిధములఁ బరగు చంద్రు బంధుర కర్త్రా
స్పదమగు రీతుల గుణముల
విదితముగాఁ దద్విధమ్ము వివరింతుఁదగన్.

సీ. సౌమ్యుఁడై సాత్త్విక సద్గుణుఁడై కర్మ
పరభోగి యతఁడు దేవద్విజుండు
తను పలమటు కోర్చి తనధర్మములు చేయు
పుణ్యుఁడు సంయమ భూసురుండు

సంతానకాముఁడై సత్కర్మనిరతుఁడై
ప్రబలు నాతఁడు విప్రబాడబుండు
నాయుధజీవియై యౌదార్యపరుఁడు స
త్కార్మియౌ నతఁడు క్షత్రద్విజుండు

తే. గీ. వర్తకత నుండు నాతఁడు వైశ్య విప్రుఁ
డరయఁ గృషిసేయు శూద్రధరామరుండు
కలు వగల వాఁడు సంకర బ్రాహ్మణుండు
తిరుగు నెపుడు పిశాచభ్రాంతిసురుండు.

ఉ. మానవచిత్తముల్ గలఁగ మాటికిఁ బల్కుచుఁ గర్మశూన్యుఁడై
దానొరులన్ హసించుచుఁ దబ్బఱలాడుచు నీర్ష్యచే నసూ
యానుభవమ్ము హింసలనయంబిల మానని వాఁడు ధారుణిన్
దానవవిప్రుఁ డెంచ మదిఁ దాలిమి మేలిమియుంగఁ డెర్యాడన్

కం. బరువులె మోయుచు గడుదు
ష్కర కర్మము దవిలి సర్వకంటకవృత్తిన్
బరుషపు మాటలె నిజముగఁ
బరగిన యతఁడవని గార్దభద్విజుఁ డెలిమిన్ ॥

ఆ. వె. కులము విడిచి యన్యకులమునఁ గలసిన
యతఁడు పతితుఁడగు మహాఘమూర్తి
మఱియు నట్టిజాతి మర్గి మెలంగిన
వాఁడు నట్టిజాతి వాఁడు దలఁప॥

కం. సందెల భోజననిద్రలు
నుందెలవలపొందు వేదనుతి పాఠముగా
డెందున్ వృషారోహత
యుందటినిందాఁటికరములూఁదుపిఘమ్ముల్॥

సీ. ఒరునింటఁ గాఁపుర ముండుట కొఱగాదు
పుత్రదారలతోడి పోరుగాదు
ద్విజభృత్య బాంధవ వ్రజ వివాదముగాదు
పతితులతోఁ బ్రతిభాషచనదు
గోమహిషిక్రయకుల వర్తనగాదు

— — — —

దేవతా సన్నిధి దీర్ఘయాత్రలఁ బుణ్య
తీర్థస్థలాదులఁదె యవగమ్యఁ

తే. గీ. జనదు వీడ్యము సుదకవస్త్రములు తన్న
ముంగమొత్తుట తలయంటుటుం బ్రుంఘిపీడ
నంబు శూద్రులచేగాదు నయవిదులకు
గూపజలపాన శౌచముల్ గూడవరయ ॥

ఆ.వె. మూర్ఖులతో వివాదమును గులటా గోష్ఠి
స్థండిలమున భుక్తి శయన దేవ
పూజనములు జపము పూర్ని ధ్యానమురతి
పలుపంజనదు నెట్టి జనులకైన ॥

కం. అందున వేదము శాస్త్రము
పొందెఱుంగుచుం గర్మయుక్తి భువనేశు హరిన్
జెంది భజించు మహాత్ముల
కెందున్ దానంబొసంగ నెసంగన్ శుభముల్ ॥

తే. గీ. గ్రామ నక్షత్రయాచకుల్ కడగు దేవ
లుండు సామాన్య విప్రులు జండకోపి
గాయకుండు సదాగతి ఖలులు పంక్తి
కర్హమగు వారు గారు శాస్త్రమున రూఢి ॥

తే. గీ. శ్రాద్ధముల నిట్టి వారల సంగమునర
దరయ శ్రద్ధ నొనర్పంగానగుటంజేసి
శ్రాద్ధమగు గానసర్వ ప్రచార విధులం
బ్రతి శరత్తునం జేయమి పాపమగును ॥

కం. ఒక నెలకలదనంగానే
ప్రకటిత వస్తువులు గూర్చి షడతుల పొందున్
రకముడిగి బ్రహ్మ విద్యా
ప్రకర వ్రతనియతి మెఱయ భావ్యంబరయన్ ॥

కం. పైతృకము లిట్లునేయంగ
రీతియగున్ గర్త శాస్త్ర వృత్తి సుగుణరూ
పాతిశయ యోగ్యముల శుభ
చాతుర్యుడుం వలయు భోక్త సమ్యక్చర్యన్ ॥

ఆ. వె. పూర్వవయసు, తండ్రి, పాసంగు నధ్యయనము,
సమతుభాంగగరిమ సారనిగమ
కథితనియమవిధము గలవాండు భోక్తయా
భాగ్యయుక్తి శ్రాద్ధయోగ్యుండగుచు ॥

సీ. అమర నమావాస్యలట సంక్రమణములు
మన్వాదివైధృతుల్ మహి యుగాదు
లావ్యతీపాతలు నమ్మహాళయ పక్ష
ఘనగజచ్ఛాయాష్టకమ్ము గూడ
షణ్ణవతిశ్రాద్ధ సంజ్ఞచే నిత్యముల్
నైమిత్తికమ్ము లామ్నాయనియతి
గ్రహణాయనములఁ దీర్ఘంబుల విషువుల
మృతదినములఁ బెట్టు మెసఁగు నిష్ఠ
తే. గీ. నవిహిత సంపద గల్గుచో నైన విస్త
రమ్ము సేయక నియమపూర్వముగ భోక్త
నాగ్నిక్షుబ్ధిత్రు నార్యాగా నరయవలయు
నితర కృత్యుల రోగుల నిడఁగఁ జనదు ॥

సీ. గణుతింప నగ్నౌకరణ పార్వణములు సే
యమిఁ గర్తనిరయచయంబునందుఁ
దగ నిమంత్రితుఁడొందువగ భుక్తిఁగొనినఁద
త్పితరుల వొందు దుర్గతులు పెక్కు
పరదినస్నానతర్పణ హీనతన్ గర్త
పితృతతితో నసద్గతి వసించు
గాయకున్ గృతఘ్నగర్భకు వ్యాధిస్థుఁ
జలితు స్తబ్ధుని మూర్ఖుఁ బాపకర్మి
ఆ. వె. వేదరహితువైద్య విక్రయ క్రయరతు
జాడ్యమూఁగ బంధుజన విరోధు
నశుచి శస్త్రజీవి నంగవైకల్యు దు
ర్గ్రామణి ననధీతుఁగాదు వొడువ.

ఉ. వేదపురాణ శాస్త్రజపవేది లసచ్ఛుచి శ్రోత్రియుండుమ
ర్యాది జితేంద్రియుండనఘుఁడగ్నికుఁడధ్వరి యాత్మతత్త్వసం
వేది విరాగి కర్మఠుడు విశ్రుత సద్గుణి జీవపైతృకుం
డాదట శ్రద్ధ కర్మమున నర్హుడు భుక్తిఁగొనంగ నమ్మియున్ ॥
ఆ. వె. కర్త పాపయుతులఁగనిపల్కఁగారాదు
నలినముఖులతోడ నవ్వరాదు
కుటిలు మాని భైక్షుకున్ బ్రహ్మచారి స
పంక్తినిడి భుజింపఁబాడిగాదు ॥

చ. కడువడి భోక్తనిందితపుఁగైవడి వానినిగాక మేలిమా
నడువగు నట్టివానిగ నవశ్యముగా నియమించి కర్తయున్
గుడుకొకయింత లేక పరితోషిత హృద్గతి నాఁటితోఁద్దినం
బెడపని నిష్ఠ భక్తిదగు నేకమనస్థ్సితి నేకవారముల్ ॥

తే. గీ. క్షౌరమభ్యంగ తాంబూల చర్వణములు
దంతధావన ముడిగి శ్రాద్ధ దినమునను
కర్తయుండుట తగవు భోక్తలకు వలయు
నన్నియుం దద్ది నమ్మున కెన్నిచూడ ॥

కం. తెరువునడత పనిపాటలు
తరుణీ సంగమము మఱియుఁదగు భోజనముల్
పరివర్జితమ్ములగు నిరుఁ
దెఱగుల వారలకు సేయఁదగు పుణ్యమ్ముల్ ॥

కం. ముఱలఁగుడువ వాయసమగు
పొరదిన్ సురతమున గ్రామసూకరమగు న
త్తెఱఁగుల పనులన్ గృధ్రము
కరణిన్ జనియించు భోక్తకర్తయు జగతిన్ ॥

సీ. బహుబీజయుతశాక శంకుత్తలు గొఱకాదు
క్షుద్రధాన్యమ్ముల చొప్పుగాదు
వసుధనెండిన నింద్య వస్తువుల్ కూడవు
పూర్వ సంచితములు పాసఁగవు తగ
నూతసంపాద్య మౌ మహనీయ వస్తువుల్
శాకముల్ నిశ్శబ్ద సరణిఁదిరుగ
పోఁతలు గావించి పొరిఁబొరి బేల్చక
ద్రవయుతమ్ముగఁజేసి రవణమొసఁగ

తే. గీ. నరఁటి పూవు దక్కు నవినాలుగున్ కంద
మూల ఫల మధువులు శాలితండు
లములు చామ లడవి నమరిన శాకముల్
గల్గఁజేయ యోగ్యతలిఁదనర్చు.

కం. అడుగకమున్నె పదార్థము
విడఁగా మౌనమున మంత్ర మేమియుఁబాపై
నొడువక తదుత్తరమ్ములు
తొడిఁబల్కుచు భోక్త నియతితోఁ గుడువఁదగున్ ॥

కం. స్థానమునను౦డు విప్రుఁడు
పూనిక మంత్రములు నోదువఁ బొల్పరి శ్రాద్ధం
బానమగుగాన వేఱొక
మానఘనుఁడు వలయు శ్రాద్ధ మంత్ర పఠనకున్ ॥

కం. అన్నము పరమాన్నము మృదు
సన్నుత భక్ష్యములు శాకసమితియుఁ గ్రమమొ
ప్పన్నెరి నిడఁగాఁదగుసం
పన్నముగా లవణతక్రపరివర్జ్యముగన్ ॥

ఆ. వె. భక్ష్య భక్తసూపపరమాన్నముల మీఁద
నాజ్య పాత్రమును చుటిది యనర్హ
మిడిన ఘృతము సురకు నైన తదన్నము మాంస
సమమటంచుననిరి శాస్త్రవిధులు ॥

కం. తనరెడి యగ్నౌకరణము
కునుకొని పిండప్రదానముల్ బ్రాహ్మణభో
జనముల్ గన్యత్రయ మనఁ
జను నిష్ఫలుఁ వలయు భక్తిసలుపఁగఁబిదపన్ ॥

వ. ఇట్లాగమోక్తంబుగా నొనర్చినఁబితృతృప్తియగు మఱియును.

సీ. ధర్మంబునన్ శశధరుడాత్మ కళలెల్ల
నుడుగ నోషధుల యందుండు గాన
నా దినమ్మునఁగోయుటదిగాదు శాకప
ర్ణమ్ములు మఱిపదార్థమ్ము లెవ్వి
యాఫలఁబిండుట లవని దున్నుట దధి
ద్రమ్పుట కొఱగాదు తద్దినమునఁ
గపిలలఁదగు హవ్య కవ్యంబులకుఁబిదు
కంగ సంకరుల నంటంగఁజనదు

తే. గీ. తిలిరజకులఁగనుగొనఁ జాల బాప
మిట్లు నడువక తప్పినయేని సకల
పితృగణ విఘాతియన నఘవితతి నొంది
నిరయమున నుండు నిజ వంశకరులఁగూడి ॥

ఆ. వె. బహుళ పక్షయుక్తి పాడ్యమి మొదలుగఁ
జంద్రకళలు గొంద్రుసరవి నిచ్చి
నట్టివరుసనువల నడుగు నమావాస్య
నిందుఁడదిరొ కుహువనం దనరును

కం. శీవిగ నొకకళ గ్గసి
సినీవాలీనామదర్శ నిరతిం దగు నా
యా వేళ నోషధీస్పృశ
భావింపగ పాతకంబు ప్రబలంబ బెలుధన్

సీ. వహ్ని సూర్యేంద్రు విశ్వవరుణ దేవ వ
షట్కార నిర్జరస్వాహలఖిల
దేవర్షులజాండును శీవితోయము వాయు
పార్వతుల్ పితరులు పరంగధనద
పశుపతులును బ్రజాపతులను గృష్ణ ప
క్షంబున గ్రహియించి కడంగి శుక్ల
పక్షమ్మునందిత్తురా శుపాకరునకుం
గళలొక్కటొక్కటిగాంగ వరుస

తే. గీ. నొక్కకళచేతం జంద్రుండు చిక్కి సూర్యుం
గలయు నమవస నిట్టిది కారణముగ
నా యమావాస్య నోషధులంటంజనదు
దడవనేరికిం బాపముల్ దప్పులుకతన ॥

ఉ. సంతతివర్ధిలున్ మిగుల సంపదలెచ్చును బ్రహ్మతేజ మెం
తెంతయు మీరు రోగచయ మేంచుణంగున్ మతిగల్గునిత్యమున్
సంతస మొందుగాన సరసమ్మున శ్రాద్ధమొనర్ప ధర్మ మ
త్యంత వివేకమున్నలయు సత్క్రియన్ ధరణీసురాళికిన్ ॥

కం. చాతుర్వర్ణ్యులకిట్టి ద
రీతియగున్ నేయరేని ఋణసంగతులై
పాతకములనుభవింతురుం
గాతరరోగాదిబాధకతలొందవ నిలన్

కం. సుజనస్తుతినేతత్క
ర్మజ ఫలమచ్యుతునికొసంగు రహింగదగు పితృ రూ
పి జనార్దనుండనుత్రుతివా
గ్వ్యాజవైఖరి నెచ్చుతక్కువలుసగుణముగన్.

తే. తవిలి శ్రాద్ధమ్ములిడమి బేతాళుఁడగును
రోగపీడలఁ బొందు విరూఢిసంత
తియును వర్ధిల్లదెంతయుఁ దెలిసి చూడ
నది గృహస్థాశ్రమకర్మ మధికనియతి ॥

వ. అదియు జనార్దన ప్రీతికరంబగుటఁ దద్రూపంబులగు సాలగ్రామ సన్నిధానంబు నత్యుత్తమంబగు ననుడు సాలగ్రామ మూర్తిభేద పూజా ప్రభావ జన్మస్థానంబులు వివరింపవే యనిన శౌనకాదులకు సూతుండిట్లనియె—

చం. హరిపద పూజకై యొదవు నట్టుగఁ బూవులతోఁటలన్ బరా
త్పర హృదయానుమోదమును, భాసురమౌ తులసీవనక్రియన్
నిరతము స్వర్గసత్యసుఖనిశ్చలభోగములొంది పిమ్మటన్
మురహర సన్నిధానమున ముక్తులునై వసియింతురాఘనుల్.

మ. సరసీజాక్షునియొద్దఁ గీర్తనము భాస్వల్లీలఁ గావించి త
ద్వరవాదిత్ర విశేషనాట్య కలనా వైయాత్య సద్భోగ వి
స్ఫురణ ప్రక్రియఁ జేసినట్టి నరు లిచ్ఛాసౌఖ్యముల్ జెంది త
త్పరభోగమ్ములు గాంతురా హరికృపా పారీణభావమ్మునన్ ॥

మత్తకోకిల॥ ఇందిరా విభుమందిరమ్ముల నింపుతో జలసిక్తతన్
సౌందరాధికరంగవల్లులు సాధునందిత సత్క్రియన్
వందనైక పరిక్రమంబుల వాసుదేవు భజించినన్
జెందు నైహిక వాంఛలన్ దుదిఁ జేరునాతఁడు శ్రీవిభున్ ॥

ఆ. వె. పంకజాక్షునునికి పట్టునఁ గొలఁకులు
నుపవనమ్ము లెవ్వరొప్పఁ జేతు
రట్టిపుణ్యులధికు లఖిలలోకమ్ముల
వారి మహిమ లఖిల వైభవములు ॥

చం. గొడుగులు చామరంబులును గొప్పగు తీర్థపు హేమపాత్రముల్
పడగలు నాలవట్టములు పళ్లెరముల్ వరదర్పణంబులున్
సడలని భక్తి శ్రీహరికి శాశ్వతలీల సమర్పణమ్ము లె
ప్పుడు తగఁ జేయు పావనుల పుణ్యము లెల్ల గణింపశక్యమే ॥

తే. గీ. వారిజాక్షుఁ డనంతావతారములను
పాలనోజ్జ్వల విభవమ్ము ప్రబలఁ దాల్చె
నవిశిలాకృతి గండకి నమరె ననుడు
వరమునీంద్రులు తత్ప్రభావములు వేఁడ ॥

కం. అనఘుఁడు సూతుఁడుదయని
ట్లను గండకియనెడు కాంత యందిత నిష్ఠన్
మునుదపము సేసె హరిహర
వనజజులాత్మజులుగాఁగ వాంఛఁదలిర్పన్.

చం. తపమునరించినంత మురదానవహారి విధాతృశంకరుల్
కృపదళుకొత్త వచ్చుటయుఁ గేవల భక్తి నమస్కరించి మీ
రపరిమితానురాగ భరితాత్మకులయ్యు మదీయగర్భమం
దుపుడు జనింపఁగా వలయు నేర్పడనంచు నుతించు నింతికిన్.

కం. త్రిగుణాత్మకులిట్లనిరో
మగువా! ధుని రూపగుసీవు మహి నీయందున్
మువురము బుట్టెద మనుడా
సుగుణాకర గండకీ విశుద్ధాఖ్యయయై ॥

కం. మేరు గిరిదక్షిణమ్మున
సారహరిక్షేత్రభూమిఁ జక్రనదీ తీ
ర్థారూఢిన్ బ్రవహించె సు
ధీరంజన శుభ ఫలప్రదీపితయగుచున్.

తే. గీ. బ్రహ్మనిర్మిత చక్ర సరస్తటోత్త
రమున బహుపుణ్య తీర్థ విరాజితముగ
గరిమ మెరయు మహాశృంగ గిరివరంబు
రాజితంబగు పండ్రెండు యోజనముల ॥

ఉ. ఆగిరినీడలన్నది మహాంబుచరుల్ బ్రసరించు రావులన్
బాగగు చక్రచిహ్నములు భాసురమౌ శిలలున్ ద్రుమంబులున్
నాగ శకుంత కీట మదనాగ మృగావళి తన్నగాగ్రరే
భాగత భూమినిల్చి లసదాకృతు లౌవర చక్రసంగతిన్.

ఉ. అచ్చట నాథమూర్తులు విజార్చకమోక్ష ఫలప్రదాత్ములై
యచ్చుగ నాత్మ చిహ్నముల నర్మిలితోడ శిలానురూపతన్
హెచ్చుగఁ బుట్టిరార్య విన్నుతేప్సితలీల ననేకరూపముల్
మెచ్చుగఁదాల్చి మాధవులు నష్టియ శుభాకృతులెక్కువైతగన్.

సీ. తచ్ఛిలా భేదముల్ ద్వారమానంబులు
గ్రాహ్యమ గ్రాహ్య ప్రకారములును
క్షేత్ర లక్షణములు చిత్రచక్రస్ఫూర్తి
గుఱుతులు వివరింతు సరసిజముఖి

డలరి నారదముని యడిగినఁ దెలియంగఁ
బల్కిన విధమెల్లఁ బ్రౌఢిమమున
స్థలజముల్ జలజముల్ సరవి సాలగ్రామ
నామహా శిలలటు నయముతోడ

తే. గీ. కొండ దండనైన యారడి మెండుజలము
గండకీ నామ చో శిలాకారములగు
నమరు నందున వజ్రకీటములొకటియ
యున్నచోఁ జక్రయుగ్మము చెన్నుమీఱు.

కం. రెండున్న నాల్గు చక్రము
లుండుఁ మఱి యరువదేండ్ల కొగి సూక్ష్మములై
చండాతి తీక్ష్ణముఖముల
నిండిన బహువర్ణ [భేద] నిరతిఁ శిలలఁ ॥

కం. శిలవెలుపల నంటినచోఁ
బొలుపుగ నొక్కొక్క చక్రముఁ బుట్టుఁ గాలో
పలనంటు నొకటి రెండుగ
నలవడు చక్రములుచేయ నంచితరీతిఁ ॥

సీ. బాలచక్రము పుణ్యఫలమిచ్చు యౌవన
మొలమి శుభాశుభ ఫలములొసఁగు
వృద్ధచక్రము పుణ్యవిధమల్ప మతివృద్ధ
మది శుభాశుభమిశ్ర మగుచునుండు
తద్వర్ణ గరిమ రక్తంబైన రాజగు
మధుపింగళమ్ముల మలయుభోగ
మోక్షఫలములు వళ్లదమా నెడ ముక్తి
నిచ్చునివన్నియ పాండురమున

తే. గీ. ధనముచేకుఱు నతిరక్త ధాతుచక్ర
మూర్తి గారాదు పూజా సముజ్జ్వలులకు
కృష్ణవర్ణమ్ములైన శ్రీకృష్ణమూర్తి
సకల సౌభాగ్యసుఖము లర్చకులకొసఁగు ॥

తే. గీ. అందుల హిరణ్య వజ్ర కీలానురచిత
పటిమ మణిచక్రములనంగఁ బద్మములన
భేదములు దెల్పఁగాబడు పేర్మి దనర
స్థలజ జలజమ్ములను సంజ్ఞ జరుగునందు ।

౩౦. స్థలజమ్ము దర్దురంబగు
జలజము కోమలము ననుపుచాయల నమరన్
కలక్షేత్ర నిర్ణయమ్ములు
తెలిపెద వినుఁడింకఁ దేఁట తెల్లము గాఁగన్ ॥

సీ. వాసుదేవము శ్వేత వర్ణాకృతి హరిద్ర
చిత్రిత మా హరిక్షేత్ర మరయ
రహిఁబైఁడి వన్నె హిరణ్యగర్భంబగు
చిరపీతవర్ణమ్ము శ్రీధరమ్ము
నారాయణక్షేత్ర మారయ శ్యామమ్ము
కృష్ణవర్ణంబైన విష్ణువగును
దగు నీలవర్ణమ్ము దామోదరం బట్టి
దనిరుద్ధమెఱమి మధ్వాభ మాధ

తే.గీ. వంబు రక్తంబు సంకర్షణంబు కపిల
వర్ణములు నారసింహంబు, వామనాఖ్య
మగ్నిపూచాయ బహువర్ణ మయ్యనంత
మిట్టిక్షేత్ర ప్రకారమ్ము లెఱుఁగవలయు ॥

ఉ. శ్వేతము గ్నోశ మిచ్చు నతసీద్యుతి లక్ష్మి పొసంగు నీల మ
త్యాతత వృద్ధి శ్యామలము నంచిత కీర్తిద మర్జునంబు రా
జ్యాతిశయమ్ము రక్తమును హైమము పీతము గౌరవర్ణముల్
ప్రీతి ధనంబొసంగు సిరవేర్మిఁ దనర్చు ననేకవర్ణతన్ ॥

తే. గీ. తళుకు మెఱుఁగు గలది దారప్రదంబగు
గ్రాహ్యమింకఁ దెలియఁగా వినుండు.
స్నిగ్ధసూక్ష్మ వృత్త శీతలాంగ సగహ్వ
రములు మస్తకోన్నతములు మేలు ॥

తే. గీ. చారుచక్రవామ చక్రముల్ మధ్య చ
క్రంబు వృత్తవక్రకముల నిభము
లనఘములు దలంచ వనమాలికాయుక్త
మమిత ఫలము గ్రాహ్యమగు మనుండు.

సీ. స్నిగ్ధంబు నిష్టార్థ సిద్ధి సూక్ష్మము దివ్య
ఫలము శీతలము ముత్ప్రదము వృత్త
మమరించు సద్వృత్తి యౌన్నత్యమస్తక
మత్యున్నతి పొసంగు ననఘచారు

వాయుచక్రకములు పరమధ్య చక్రంబు
నతికీర్తి పుత్ర పౌత్రాభివృద్ధి
కరము మోదముగ సగహ్వరముఖీలేష్ట
ద మరియు నవకమలాభ సుమిత

తే గీ. ధాన్యధనధేనువులనిచ్చుఁ దనరుభిన్న
ముఖికముగ్ గొద్దివెడలుపు నతికఠినము
గాని దశపర్గ రాజ్యభోగమ్ములొసఁగు
చక్రపంచక మిహపరసౌఖ్యదంబు ॥

మ. వనమాలాన్వితమైన మూర్తియెడ శ్రీవామాక్షితోనుండు న
వ్వనజాక్షుండటువంటి మూర్తితగు నెవ్వా నింట దారిద్ర్య దు
ష్టనిశాటోరగబాధ, శోక [శసు] కార్శ్యంబుల్ చోరంబోవు, త
జ్జను గేహమ్మున మోక్షమంతమున నిస్సందేహతన్ జేకురున్ ॥

తే గీ. ఆమలక జంబు తుల్యంబులగుచు సూక్ష్మ
చక్రయుగ యుక్తిఁదగుమూర్తి చక్రపాణి
యిందిరా దేవితోనుండు నెంతయెంత
సూక్ష్మ శిలలంత లెంతయు శుభములిచ్చు ॥

కం. క్షీరములఁ దండులమ్ముల
నారాధిగ నుంచి కొల్వ నధికంబైనన్
ధీరులు సాలగ్రామను
లారసి గ్రహియింపవలయు నధిక ప్రీతిన్.

సీ. అగ్రాహ్యము వికరాళాలి కరాళ తి
ర్య గ్వక్త్రి పృథు వక్త్రి మల్పిదిఙ్ము
ఖంబు ల్ధూర్వాధో ముఖంబులు పార్శ్వ వ
క్త్రిము తుండముఖములు కడఁక బద్ధ
చక్రము చక్రంబు చక్ర వక్రము భిన్న
విషము భగ్నమనుక్త వివిధ పంక్తి
చక్రముల్ గలయది సరవి ధూమ్రాభ పిం
గళ కళంక వర్ణములు మధురుచి

తే గీ. భగ్నభగోన్నత బంధుక స్ఫటికదర్దు
రములు సందిగ్ధ వర్ణమ్ము లమిత మల్ప
మధిక మస్తక నిమ్నంబు లమరు సలిల
ధారణములైన మూర్తులు తగదుసుమ్ము.

చం. గుణుతులు లేని రేఖలఁ ద్రికోణములన్ వెస చిహ్నహీనతన్
బరగు చలాసనమ్ము లతిబంధుర దగ్ధత పృష్ఠగూఢతన్
బొరిసగ మున్న తంబులును స్ఫోటములందగ ఛిద్ర పీఠ వి
స్ఫురణముగల్గు మూర్తులవి పూజలు సేయ రిగ్రహకవాంఛితుల్.

ఆ. వె. మిశ్రలక్షణముల మేలి వర్ణముల
లక్షణముల మూర్తిలక్షణములు
క్షేత్రగతులు దెలిసి చెప్పంగఁదగు బుద్ధి
మంతు లింక ద్వారమాన విధము.

కం॥ చుట్టు నొకయష్టమాంశము
పట్టగు ద్వారము శుభము పాతికపాలన్
నెట్టుకొన మధ్యమంబగు
గట్టిగఁ ద్ర్యంశైకమైన కడ వహి దెలియన్.

కం. బహుమూర్తులు దెలియందగు
విహితంబగు లక్షణముల వెస క్షేత్రములన్
రహిమించు వర్ణరూపో
ద్వహముల బుధులైనవారవారితబుద్ధిన్.

సీ. తలఁప మత్స్యాద్యవతారముల్ మది కేశ
వాదులు కపిలుఁడు యజ్ఞదత్త
హయ శింశుమారులు హంస పరమహంస
కూర్మ వైకుంఠ ముకుంద పుండ
రీకాక్షులమరు లక్ష్మీకాంత దేవేశ
వట పత్ర శయన విశ్వంభరులును
సత్యవీర శ్రవస కనకాంబర విశ్వ
రూప తార్క్ష్యధ్వజుల్ రూఢి నమృత
† హరణ చక్రపాణులల బహురూప నా
రాయణము సుదర్శనాభిధంబు
నట జగద్యోని పారిజాతాహ్వయుండ
నంతుఁ డివి హరిమూర్తు లత్యంత మహిమ.

కం. ఇవి యేఁబది యింకన్నిను
శివహరిహర పూర్వులనఁగ శ్రీమూర్తులనన్
భువినారాయణుఁడు స్వయం
భువు చతురాస్యుండనంగఁ బొలుపగుమతియున్.

---

† యెత్తుగీతి సగమాటవెలఁది సగము తేఁటగీతిగా నున్నది.

తే. గీ. అల్ప ఫలంబ ఘ్నుఁ డనఘు ప్రెహాయుఁ డనంగఁ
బురుషుఁడును సూర్యుఁడనఁగ భాసుర నిరాఢి
బహువిధంబుగ మూర్తులు పరిఢవిల్లు

... ... ... ... ...

వ. ఇవి యిరువది రెండును గౌరీనాభ శివనాభాది శివమూర్తి పంచకంబునుం గూడఁగ డెబ్బదియాఱగు నిందొక్కొటి బహుభేదమ్ములగు దత్తల్లక్షణమ్ము లెఱింగించెద

సీ. ఏక చక్రము దెలుపెసఁగు పద్మము పృష్ఠ
వివరమ్ము పరమేష్ఠికివి కాను చిన్నె
లష్ట చక్రములు నాల్గగు వక్త్రములు హరి
ద్వర్ణమ్ము గల్గఁబిలోమహుండు
బలువు హిరణ్యగర్భము వక్త్రమున స్వర్ణ
పటు బిందువులు శుభప్రద మదియును
హేమగర్భుఁడు ద్వారహీత నైల్య శీతల
మూర్తి శుభంబు లిమ్ముగ నొసంగు.

తే. గీ. హ్రస్వవదనమ్ము పృథునాభి - యధికపృథుల
చక్రపార్శ్వగ లాంఛన సరసిజములు
[నా?] ం తరధ్వని స్వర్ణమిశ్రాకృతియును
గలిగిన హిరణ్యగర్భంబు గడు శుభదము.

కం. ద్వారం బీవల నావల
నారూఢిగఁ జంద్రవర్ణమై స్థూలంబై
మీఁ కెడు హిరణ్యగర్భము
సార లసన్మహిని శుభము చాలఁగ నిచ్చున్.

తే. గీ. నలుపు గాఁడు గందమును ద్వారనాసికమున
బిందువు హిరణ్యగర్భ మింపొందు మిన్న
రెండు చక్రంబులున్ బార్శ్వరేఖ లమరు
నాలుగింటఁ జతుర్ముఖలీలమరు.

కం. తలమీఁద వలయరేఖలు
గలుగు నలువు నిడివి నోరుగల్గ స్వయంభూ
జ్వాల సంజ్ఞఁ దనరుఁ బూజా
ఫలమతులముభుక్తి ముక్తి బాగుగ నొసఁగున్.

వ. ఇంక మత్స్యమూర్తుల నెఱింగించెద దీర్ఘాకారంబులును శ్యామలచిత్ర శబ
[ల] వర్ణంబులును పృష్ఠచక్రయుక్తంబులునై మైను తెలుఁగులఁ బరగు నందు.—

సీ. ప్రక్కల శబల శోభన రేఖలనుకుమ
స్నిగ్ధంబు దళు కొత్తఁ జెలఁగునదియు
నట్లయ్యు బిందువులనుపొంద నొక దంష్ట్ర
విషమ చక్రంబుల వెలయునదియు
ముఖమున నొక చక్రమున్గల్గి శ్రీవత్స
బిందు మాలికలఁ జెన్నొందునదియు
కంచుఛాయల మిన్న గల్గి చక్రద్వయ
వదనమ్ము జెలువొందఁ బొదలునదియు

ఆ.వె. నిట్టి చిహ్నములనుబట్టుగుఁ బృష్ఠ ను
షిరము బిందువులను బరగునదియు
మత్స్యమూర్తు లిట్టి మహితాకృతుల నొప్పు
కూర్మ మూర్తులకును గుఱుతులింక.

ఉ. ఉన్నత పృష్ఠ భాగము సముజ్జ్వలబిందులు వర్తులమ్ములున్
మున్నగ శ్వేతవర్ణ ఖురముల్ మకరాకృతులున్ దురంగపుఁ
జిన్నెల రూపముల్ దగ విశేషపు వన్నెలు స్వర్ణరేఖలున్
సన్నుత చాయ మీరయగు చక్రములుండగు కూర్మపంక్తికిన్.

కం. అది మది తెలుఁగుల శ్వేతా
స్పద ఖురమునఁ జక్రకంబు సకల శుభదమౌ
వదనమున రేఖ నిడివిం
గదిసి రవివలయములైదు గలది శుభమగున్.

కం. కనకచ్ఛవియౌస్నిహ్రా
న్నన చందపుఁ జక్రయుగమునయవృత్తంబౌ
ధనధాన్య పుత్ర పౌత్రద
మనఘంబగు కూర్మమూర్తియనుపమలీలన్.

ఆ. వె. మొసలిరూపు నిమ్నమొసఁగిన వదనంబు
నాభి చక్రకంబు శోభనాన
నంబు నలుపు నెఱుపునను బొల్చు నొక్కటి
నలుపు హేమబిందు లోలయు నొకటి.

తే. గీ. వక్ర చక్రము దక్షిణ వదన శంఖ
చక్ర చిహ్నముల్ వృత్తంబు సరసిజాప్త
నిలయములు నైదు తమ్మియుఁ గలది సర్వ
కామదంబగు కూర్మంబుగా నెఱుంగు.

కం. కమలా కృతిదీర్ఘంబై
యమరెడు దక్షిణపు వదనమటు ప్రక్కలఁ గూ
ర్మము గతియు నాభి చక్రం
బమరినఁ గీర్తిదము కూర్మ మారయ నెలమిన్.

మ. అవనిన్ స్థూలము దట్టమున్నలుపు చిత్రాంగంబునుం గూర్మ మి
ట్లు వినోదంబుగ రెండు నొక్కటిగ నుండున్ జంపమై శంఖ చ
క్ర విధంపున్ గుఱిగల్గి నోటి తుదఁ జక్రంబున్న [యా] రీతి కూ
ర్మ వరాహంబతి సౌఖ్యదంబు నిఖిలార్థంబిచ్చు పూజింపఁగన్.

సీ. ఎలమి వరాహ మూర్తుల లక్షణము విను
మగిసె పూచాయ నైల్యంబు శ్యామ
లాకృతి నెఱుపు నల్పమగు వర్ణములు భూ
వలయమ్ము దంష్ట్రిలు గల గుఱుతులు
దీర్ఘాస్యవలయముల్ ధృతిద్వార దేశ చ
క్రములు గల్గినదివరాహ మొకటి
మూఁడు రేఖలు స్థూలమును శక్తి లగ్నంబు
విషమ చక్రము నల్పు విధము నొకటి

తే. గీ. యలకలువ చాయ నిడి [వం?] ద మైననోరు
చరమతనువున జర్ఝరీ స్పష్ట మొకటి
కౌస్తుభము పాదలాంగూలకముల రేఖ
ల మరఁదగు భోగమోక్షదంబైన దొకటిఁ

తే. గీ. అంకుశాకారవదనంబునందుఁ గోఱ
గలది భూప్రద వారాహ మిలను ఖాన
నమ్మపై చాయ సూక్ష్మరంధ్రమునఁ జక్ర
దంష్ట్రి యుగమున్న మూర్తియె ధరణి యొసఁగు.

కం. నిడివి బృహత్కోశంబులు
నడుగులు వాలమ్ము ఛిద్రమగు తనుకాంతుల్
కడురక్త నైల్యములు నై
యొప్పడలన్ విష్టరపుఁగిటి మహీప్రదమరయన్.

తే. గీ. పాడవథో వక్త్రమును నిగ్గులడరు మిసిమి
గలడి ధాన్యవరాహమ్ము చెలువు ముఖము
పెద్దయున్నత మస్త త్రిబింబ సూత్ర్మ
చక్రముల నమృతవరాహసంజ్ఞనమరు.

చం. వలఁపును బచ్చచేఁ బొడవునందగు వెన్న హరి ప్రకాంతి చె
న్నలరునధః ప్రదేశము మహామణి చిహ్నము వైజయంతియున్
సలలిత వక్ష పార్శ్వగత చక్రములుండిన లక్ష్మీపేరిమిన్
గలుగు వరాహమూర్తి సుఖగౌరవ మోక్షము లిచ్చునెంతయున్.

తే. గీ. దీర్ఘమును గోణమును దంష్ట్ర తెల్వి మాలి
కయును శ్వేతవరాహమ్ము ఘనతనాల్గు
చిహ్నముల్ ఘోణి మోక్ష సంసిద్ధిదంబు
బ్రహ్మచారులు పూజించ భాగ్యమరయ.

సీ. నరసింహమూర్తుల నెఱిఁగింతుఁ గపిల వ
ర్ణంబులు దీర్ఘోదరములు గలవి
బహువర్ణ యుక్తముల్ బహుచక్రయుక్తముల్
కలవవి వేర్వేఱుగా వినుండుఁ
గను కొద్ది చక్ర యుగ్మము మాలికయు బాల
నారసింహంబు సంసారహరము
ముఖయుగ్మమున స్థూలమునను విద్యుజ్జిహ్వ
మది లేమినొనఁ గూర్చు ననుదినమ్ము

తే. గీ. దీర్ఘ చక్రము మిన్నలు దీర్ఘమైన
యది విభీషణ మధిక దక్షిణాకరంబు
ముందఱ న్పార్శ్వముల నల్పు మొనయు చక్ర
మును నధోముఖ మది యిచ్చు మోక్ష పదవి.

కం. బహువక్త్రద్వారంబుల
బహువర్ణ బహూదరములఁ బాతాళమగున్
బహు[శోకి] ద రాల్ప చక్రో
ద్వహమునదది కుక్షినృహరి వైఖరి వెలయున్.

తే. గీ. సప్త చక్రము బహుముఖ స్వర్ణమయము
సరదమగు వక్త్రమతి శుభ్ర సర్వముఖము
భిన్న వక్త్రము ఛిద్రములున్న రాక్ష
సాఖ్య నరసింహ మదియిచ్చు నగ్నిభయము.

సీ. రక్తబిందుల విదారణమనఁదగునది
హేమప్రభన్వికృతాస్యమగును
తఱచువక్త్రముల విదాహకమనఁదగు
స్థూలమైనది మహాజ్వాలమగును
సరళదంష్ట్రలఁదగు జ్వాలానృసింహంబు
కాపిలం బెఱుపు చక్రద్వయమునఁ
గడుబద్ధచక్రముల్ కపిలాఖ్యచేనొప్పు
దంష్ట్రాజిహ్వలుదగినదదియౌ

తే.గీ. చాలచక్రంబులో సూక్ష్మచక్రబిలము
గలది లక్ష్మీనృసింహంబు గపిలకాంతి
పాయనోరును బంగరుచాయగలది
యదియయైనను బ్రహ్మచర్యార్హమగును॥

తే.గీ. వామచక్రత్రిబిందువుల్ వఱలునలుపు
చెలఁగుచున్నది లక్ష్మీనృసింహమూర్తి
భుక్తిముక్తి ఫలమ్ములింపుగనొసంగు
రాజితోదారమహిమచేఁదేజమెసఁగ॥

కం. కపిలము త్రిబిందుయుక్తం
బుపమింపఁగఁబంచబిందుయుక్తంబైనన్
నిపుణత యోగానందం
బపరిమితసుఖంబు మోక్షమర్పకులకగున్॥

కం. ఇవి రెండు తక్కఁదక్కిన
యువి వటువులయతులు దక్క నర్చన సేయన్
భువినిగ్రహస్థులుబూనరు
వివిధైహికఫలములిచ్చు విధములుగామిన్॥

సీ. వర్తులమ్ము కొద్దివారవిసూక్ష్మచ
క్రమ్ములుబిందువుల్ గ్రమ్మునప్పు
నగి [సె ?] పూచాయచేనమరు వామనమూర్తు
లాభేదములువినుఁడంచితమతి
వర్తుల హ్రస్వమ్ము వామనమొక్కటి
కడవ పూరూపురేఖలది యొకటి
సితబిందువులనతసీద్యుతినొక్కటి
మాలికాహరి నీల లీల నొకటి

తే.గీ. ఛత్రశిరమును బిందువుల్ స్వర్ణరేణు
భాతి హేమాంగవామన ఖ్యాతినొకటి
ఛత్రమండలబిందువుల్ సరవివక్త్రి
బిందువుల ముని పుష్పంపుటుంద మొకటి॥

కం. నిద్ధమున స్వస్తిచక్రము
తద్దయు గహ్వరము దీర్ఘతండగునోరున్
ముద్దగు రేఖావలయము
లద్దేవుడు భూప్రదాఖ్యమగు వటుండెలమిన్.

కం. నిగ్గున్ సూక్ష్మద్వారను
నగ్గలికన్ స్వర్ణబిందులగు వామనుడ
ట్లిగ్గుగు ఋతులు సూక్ష్మము
నొగ్గంగ నున్నతశిరుండు నొసగుంగోర్కుల్॥

ఆ.వె. నిగ్గుకార్శ్యకంబు నెఱిమధ్యచక్రంబు
సర్వకేష్టదాయియైన మూర్తి
యగునె పూపుచాయయౌ కించిదున్నత
మస్తకంబుమూర్తి మహిమ యతుల॥

సీ. నీలమేఘాకృతిమాలిక సూక్ష్మరం
ధ్రము కుక్షివిరివి రమ్యము దలంప
నీలాభ పద్మంబుమాలిక గల్గు హ్ర
స్వాంగపు మూర్తి శుభదమీచందమరయ
దధిబుద్బుదంబులు దగిలి నీ [లాబ్దంబు]
వడువైనయది దధివామనంబు
స్నిగ్ధంబు వర్తులస్థితి శ్యామరుచి బరు
వైమించునది దధివామనంబు

తే.గీ. హ్రస్వమతిరక్తబిందువులర్కభాతి
చక్రపార్శ్వ స్నిహిత ప్రసూన క్రమంబు
కడపపూరీతి నచ్ఛ్రియగతి దగు దధి
వామనంబర్చకానేక కామదంబు॥

ఉ. బంగరుబిందువుల్ నలుపు పైదగు నిగ్గుల శ్యామవర్ణమున్
దంగగు నాస్యచక్రములు రాజిలగా దధి వామనంబగున్
సంగతి రెండుఖండములసంగతి నిగ్గగు మాల్యబిందువుల్
పొంగుచు సర్వకామ సుఖభూతిద వామన మెంచిచూడగన్॥

తే.గీ. రక్తనీలాభదధి బిందురచితమగుటల
నూర్ధ్వచక్రాగ్రదధి బిందుయుక్తమూర్తి
భూమిదధ్యుక్త గోపాలనామనంబు
మృత్యుదారిద్ర్యహరణమ్ము మేటిశుభము॥

సీ. భృగురామమూర్తులు దగుపలువన్నెల
పరశురేఖలు దంష్ట్రనెరయ బిందు
సంగతి శ్వేతకృష్ణద్యుతులయుణమ్ము
ఛిత్తిచక్రమునిడిబిలము చక్ర
భాగబిందు సదంష్ట్రభాతి రేఖలు పర
శ్వాకృతినున్నట్టి [భద్ర] మూర్తి
రాజులకర్షంబు పూజలకవినెన్నఁ
బరశురేఖాంవోహరతదనరి,

తే.గీ. యన్నిచిన్నెలులేమి శాంతాఖ్యశుభద
మట్లు దూర్వాభమున్నత మగుచు నాభి
రేఖయు మనోజ్ఞ చక్రముల్ రీతినమరు
నదియ జమదగ్ని రామాఖ్యనతిశల్లు

తే.గీ. పీతవర్ణ ధనుర్బాణబిందుయుతము
పరశుచిహ్నంబునగిసె పూపగిది రామ
మూర్తు లపమృత్యుహరణముల్ కీర్తిదమ్ము
లింక శ్రీరామమూర్తుల నెల్లవినుము॥

సీ. కుక్కుటాండమురీతి కోదండగతిఁజాప
బాణతూణీరముల్ రాణమెసఁగ
ధృతిఁబృష్ఠమునఁ బంచ రేఖలుగల్గిన
బాలరామము పుత్రభాగ్యదాయి
శ్యామలోన్నత పృష్ఠసవ్యాపసవ్యతూ
ణీరకల్పద్రుమాన్వితము పిఱిఁది
ఛిద్రమ్ముగలమూర్తి చెలువుగ దాశర
థ్యాహ్వయమదియఁబూర్వానురూఢి

ఆ. వె చాపబాణబిందు సహితమ్ము స్థూలమ్ము
దీర్ఘనాభి చక్రధృతినినదియె
నీలజలదభాతి నెఱివర్తులమ్ముకో
దండరాముననఁగఁదనరియుండు॥

ఉ. నేరెడుపండుబోలితగునీలత వెన్నునుండి నోఁటిదాఁ
కా రుచిరాంకుశాకృతివికాసము కుండలముల్ లలాటరే
ఖారతిహేమచాపమును గల్గినబిందువు కృష్ణక్షేత్రపుఁ
శ్రీరఘురాముఁడో కలినిఁజేరఁగనీయఁడు పుత్రదాయియై॥

తే.గీ. శ్యామమున్నతచరమంబు చాపరేఖ
తెలిమిద్వారంబుఁ బార్శ్వములను రెండు
గలుగ దశకంఠహరణదోర్బలుఁడు రాముఁ
డరివినాశన మొనరించు నంచితముగ॥

తే.గీ. సూక్ష్మకేసరచక్రముల్ సూనదామ
రచితకుండలమగు వీరరామమూర్తి
పార్శ్వఖురములుదలవిల్లు బాణముఁగల
దృష్టరామంబు భుక్తిముక్తిప్రదంబు॥

తే.గీ. రక్తబిందువుతోడఁ జక్రముక రాళ
విదితముఖచాపచిహ్నిత విజయరాము
మేకచక్రంబు ముఖసీమ నెసఁగుకృష్ణ
వర్ణశోభన మొప్పఁగు పావనశుభము॥

కం. నలుపున్న వనమాలిక శో
భిలు భానుత్రయముస్వర్ణబిందువు దలపైఁ
గలజానకీవిభుండిల
వెలయుఁ సకలేప్సితములు వేడ్కనొసంగున్॥

సీ. చాపబాణాంకుశచ్ఛత్ర చామరకేతు
దామమ్ములున్న సీతారఘుపతి
వామహస్తద్వార్స్థ వరచక్రకల్పకా
శోవక్త్రకుండల శ్రీవిలసిత
మదియొసీతారాము మఖిలార్థఫలదంబు
గోఖురపుచ్ఛ సంగుప్తమదియొ
యిట్టిచిహ్నమ్ములనెసఁగు బహిశ్చక్ర
యుతము సీతారామ మతులమదియు

తే.గీ. చారుసవ్యాపసవ్య తూణీరయుగము
సీతచక్రంబుగలయది చెలఁగునతుల
గలగుఱుతులుండె నాల్గుచక్రములనేక
వదనయుక్తచతుశ్చక్ర మదియొఱుంగు॥

శా. ద్వారద్వంద్వము నాల్గుచక్రముల మూర్ధంబొంటి సొంపొందఁదూ
ణీరాద్యాయుధ కల్పచిహ్నములు వర్ణింపంగ ప్రస్ఫుటంబై యొ
దారంబైనది పంచచక్ర మతిమోదం బాయురారోగ్యసు
శ్రీరమ్యాఖిలకామదం బగు మహాశ్రీ బొల్చు తద్దేహముల్॥

తే.గీ. పార్శ్వమున రెండు రెండు నేర్పడఁగ శిరము
నందునొకచక్రమున్నఁ బట్టాభిరామ
మదియ నెన్నఁగ నతివైభవాస్పదంబు
మున్నుఁజెప్పిన చిన్నెల నెన్ని కలర॥

కం. ద్వారద్వయమున నాలుగు
నారయఁజఠరమున శిరమునందున రెండున్
జారుతరచక్రభూషా
ధారత షట్చక్రమరయ దంతిజ చిన్నెల్॥

సీ. ముందఱవదనముల్ మూఁడిటఁ జక్రము
లాయుపార్శ్వమ్ములనమరునొకటి
బాణతూణీరచాపము కల్పకమ్ము సిం
హాసనచిహ్నమ్ములలర సప్త
చక్రపట్టాభిసంజ్ఞంగల రాముఁడు
భీష్టదాయకమట్టి పేరిఁగల్గి
యున్నతచరమంబు చిన్నెలుదగఁబంచ
ముఖసూక్ష్మదశ చక్రములఁబొసంగి

తే.గీ. ఘనశిరఃపార్శ్వ కలితచక్రద్వయమున
నైన గ్రిందటఁ గూర్మచక్రాంకమైన
నమరద్వాదశ చక్రపట్టాభిరామ
మది మనోభీష్టదాయక మఘహరమ్ము॥

కం. తూణీరాకృతిధనువున్
బాణము నానాయుధములు ప్రస్ఫుటమైనన్
నాణెమగు రామకుంజర
ఘాణవమలహరణమగుచు నది జయమొసఁగున్॥

సీ. బలరామమూర్తులయ్యెలవు నీకెఱిఁగింతు
హలముసలముల శ్వేతాభముమర
మధుబిందువులు దమ్మిమూఁడ్కాని వదనంబు
గల్గినమూర్తి సంకర్షణమ్ము
చక్రమ్ము లేకపార్శ్వమ్ము పూర్వభాగ పు
ష్కరము రక్తాభసంకర్షణమ్ము
చక్రయుగ్మము స్వర్ణసంలగ్నవదన పు
ష్కరమున్న నదియె సంకర్షణమ్ము

తే.గీ. హరితలోహితవర్ణమ్ము నెరయ స్థూల
చక్రబలరామ [మన్వయ ?] శాశ్వతంబు
శంఖచక్రగదాకృతుల్ సరవి నదుము
గలిగి కనుపట్టు శుభదసంకర్షణంబు॥

తే.గీ. గొప్పయును దీర్ఘమగు ఛేరు నొప్పగల్గు
చక్రయుగ్మము వేల్పు ముసలహలాది
చిహ్నితంబును కుముదభాసిత నిరూఢ
వదన బలరామ మది వంశవర్ధనమ్ము॥

కం. వామదిశఁజక్రముల్ రే
ఖామానిత దక్షిణాంక ఘనలాంగల ను
శ్రిఖించు శాంతపద్మల
రాముఁడు లాంగలిక ముఖ్యరాముండున గున్॥

కం. అంతయును వరుణచ్ఛవి న
త్యంత లసచ్చక్రయుగ్మమగుచోఁ [దగ] న
య్యాంతిక చక్రములున్నఁజి
రంతనమగు సీరపాణిరామమనఁదగున్॥

సీ. పీతవర్ణము వింటిరీతి వక్త్రము చాప
శరశుచిహ్నముల నేర్పడిన దొకటి
కడళు పూచంద మాకారంబు బిందు చా
పాంబుజ బాణచిహ్నములు పెఱుఁద
ఛద్రంబు పీతాభభద్రరేఖయుఁగల్గు
కీర్తిప్రదము రామమూర్తి యొకటి
షట్చక్ర ముభయపార్శ్వముల నాయుధములు
శోభనవదనముల్ కుకుషిరంబు

తే.గీ. కల్పకంబు నత్యంత వికసనమమరు
రక్తమధునీల వర్ణత్రయయుక్తమూర్తి
మహిమచే నొప్ప నదియె స్వమూర్తి రామ
మిహపరమ్ము లొసంగు శుభేప్సితంబు॥

వ. ఇంక శ్రీకృష్ణమూర్తుల నెఱింగించెద—

ఉ. ఉన్నతమస్తకంబు నలువొప్పగు చక్రయుగంబు బిందువుల్
సన్నుతవేణువేత్ర ఖురసంగతరేఖలు కృష్ణమూర్తు లీ
వన్నె త్రిబిందుయుక్త మనవద్య శుభానన దీర్ఘమున్న యా
చిన్నెల బాలకృష్ణుఁడిల నేమము సంతతియిచ్చు నెచ్చుగన్॥

తే.గీ. పచ్చఁదనమున నీలిమ పార్శ్వభిత్తి
చక్రయుగ్మము వదనంబుసాటి నాభి
పృష్ఠమునఁ గూర్చరేఖ యొప్పిదఁపు వలుఁద
యైనచోఁ బాపహరకృష్ణుఁడనఁగఁదనరు॥

కం. సమచక్రద్వారము కడు
నమరఁగఁ గృష్ణాభశోభనాకృతిఁ గృష్ణుం
డమర శుభంబు లొసంగున్
సుమహితముగఁ బూజకులకు సుస్థిర లీలన్॥

సీ. వదన పతోన్నతి వామపర్యంక కృ
ష్ణాభిరేఖాద్వయ హారి బిందు
మండనుఁ గాళియమర్దనుఁ డనఁదగు
సర్వశాత్రవహారి సౌఖ్యదాయి
సవ్యాపసవ్య భాస్వద్రేఖలున్ బార్శ్వ
ఖురసూక్ష్మ చక్రముల్ మెఱయుమూర్తి
యది ధనంజయవిభుఁడనఁదగి శుభమిచ్చు
రక్త బిందులు శ్యామరచితవర్ణ

తే.గీ. మెసరఁగా నొప్పు దంతి కరోపమాన
రేఖ దక్షిణమున ముష్టిరీతి బిందు
వమరఁ జాణూరమర్దనాఖ్యానకృష్ణుఁ
డమిత సౌభాగ్యమొసరించు నంచితముగ॥

తే.గీ. పార్శ్వవదనమ్ము తగు పూర్వభాగముఖము
శుద్ధనీలాంబరప్రభాశోభి కంస
మర్దనాఖ్యానమది కృష్ణమహితమూర్తి
పూజకాభీష్టదాయులై పొల్పుమీఱు॥

కం. స్థూలము కణయుక్తములగు
మేలిమిచక్రములు సురియ మిసిమి తనరుచుల్
చాలన్ శ్రీవత్సాంకితుఁ
డాలలిత శమంతకారి యశము లొసంగన్ ॥

మ. తనుదీర్ఘంబతికృష్ణవర్ణమును సార్ధంబైన చక్రాళి ప
జ్జను నిమ్నాస్యము గల్గఁ బ్రతదుఁడు శ్రీసంతాన గోపాలుఁడా
నునుపున్ శ్యామము ఛత్రరీత్యరుణబిందుల్గా శిరశిపుష్కరం
బును సూక్ష్మానన సీమ బిందువుల నొప్పున్ గృష్ణుఁడిష్టార్థుఁడై॥

తే.గీ. కుక్కుటాండమురీతి లాంగూల వేణు
డోళికాకుండలమ్ములు మేలి నిగ్గు
పరగ లక్ష్మీ నివాసగోపాలమూర్తి
భాగ్యదాయిని పుణ్యసంప్రాప్తమదియు॥

సీ. దామంబు పంచాయుధమ్ముల చిన్నెలు
భృత సూక్ష్మచక్రముల్ కృష్ణమూర్తి
రహి నిడిరెం బహూదరము వేణువున్ దైర్ఘ్యల్
మధుర శ్రీగోపాల మనఁగఁబరగు
దనరు నైల్యము శృంగదండ పార్శ్వము వేణు
వదనంబు తదగ్రపవల్లభుండు
కుండలమాలికల్ రెండు పార్శ్వమ్ములఁ
దరుయుక్త కార్ష్ణ్యమ్ము మెఱసెనేని

తే.గీ. మదనగోపాలుఁడగు నీలిమంబు నెఱుపు
చెరిసగమ్ము దీర్ఘమును సుషిరము చక్ర
శరశరాసన శంఖలాంఛనము గలుగు
నిట్టిమూర్తులు సకలశుభేష్టదములు॥

కం. వలుఁదయు రాజతబిందులు
తల నిమ్నము నిడివిగల్గు దక్షిణభాగం
బలరన్ గోవర్ధనధరుఁ
డలఘుత నైశ్వర్యదాయియై విలసిల్లున్॥

తే. గీ. అమరఁ బ్రచ్ఛన్న సూక్ష్మచక్రములు మీఁద
వస్త్రచిహ్నము క్రిందట వరుస వృత్త
చారుచిహ్నము వస్త్రాపహారి కృష్ణుఁ
డఖిలకామ్యము లొనఁగూర్చు నర్చకులకు.

క. స్థూల శుభచక్రయుగళుఁడు
మేలి గదాకార మధ్యమిశ్రిత రేఖా
ద్యాల శుభాంగుఁడు కృష్ణుఁడు
సాలఁగ ధనధాన్య విభవ సౌఖ్యములొసఁగున్.

సీ. కలికిమూర్తులు నిల విలసితాకృతి దీర్ఘ
మగు నంకుశాకారమైన నొగు
వనమాలికయుఁగల్గి వరకల్కి మూర్తి నా
నురుశుభసుకృతమ్ము లొనర నిచ్చు
నతిరక్తతన్ సూక్ష్మమగు బిలంబును వెన్క
చక్ర శరాసనాంచత్కృపాణ
[ములఁదనరెడు] మూర్తి కలివినాశనకర
మని యొప్పుగుఁడు శుభములనొసఁగు

తే.గీ. విరివిగల గహ్వరము చక్రవిధము లేమి
పూని నిర్వాణబుద్ధునిగా నెఱుఁగుఁ
డనఘ వినుమింక శ్రీ కేశవాదిమూర్తి
భేదములు దేటపడఁగఁ బ్రమోదమెసఁగ.

క. కనకరచిత బిందువులన్
ఘనమై సూక్ష్మమగు చక్రకము శ్యామంబున్
వనమాలికచేఁ గేశవ
మనఘా తుష్టికోటి యుక్తమదిశుభదమగున్.

సీ. నారాయణమ్ములు నాభిచక్రమ్ములు
న్నతములు వలుఁదలు నలుపులెలమి
కనకచూలికయు రేఖాత్రయయుత మున్న
తం బపమృత్యువిదారణమ్ము
స్థూలచక్రంబులు మేలి శ్యామాభయు
ననువైన దఖిల శోభనకరంబు
నేకచక్రము గానుగాకువర్ణము స్వర్ణ
కాయము వీరనారాయణమ్ము

తే.గీ. సుముఖశోభన మధ్యచక్రములు కటుక
హార తాటంకయుతము మాయాభిధంబు
నగుచుఁ బూజాభిరతులకు ననవరతము
నాయురారోగ్య మొసఁగు నారాయణమ్ము.

క. పీతాభమేకచక్రా
ఖ్యాతధ్వజ వజ్రచిహ్నమా లక్ష్మిము
ఖ్యాతత నారాయణ సు
స్థితగు చక్రద్వయమున నది శుభ మొసఁగున్.

సీ. వామచక్రంబు, పూర్వాగ్ర చిహ్నిత పద్మ
మమర శ్రీ నారాయణాఖ్యమదియు
ఖగచక్ర ముఖ్యరేఖలు వామచక్రముల్
రమఁ గూడియుండు నారాయణుండు
పంచాయుధంబులు పద్మగదా వామ
చిహ్నముల్ శ్రీ లక్ష్మి చెలఁగు గలుగఁ
గ్రమమున నేకచక్రము ద్విచక్రమునఁ ద్రి
చక్ర చతుశ్చక్ర సంజ్ఞలందగు

తే.గీ. రమణ లక్ష్మీశయుక్త నారాయణములు
మఱియు నొకటైన నాల్గైన మహితచక్ర
ములు గుఱుతులుండి కొలఁదిమై వెలయుమూర్తిఁ
జూచినంతనె చేకుఱు శోభనములు.

శా. ఛత్రాకార దృఢమ్ము లొప్పగు చతుశ్చక్రమ్ములున్ స్నిగ్ధముల్
చిత్రాసాస్త్రన్వితముల్ ద్రిదినిమ్న ము ధ్వజశ్రీవత్సనామాంకముల్
పాత్రంబై తగు గోఖురంబుల లసద్భద్రాసన స్థైర్య మి
ధ్ధాత్రిన్ మూర్తులకెల్ల నుత్తమమునాఁ దళ్కొత్తు శ్రీయుక్తమై.

క. నేరేడుఁ బంటిరూపున
నామాధిగ నెల్ల చిన్నెలమరిన లక్ష్మీ
నారాయణ మనఁదగు నది
యారసి కనుగొనినయంత నఘములు దొలఁగున్.

సీ. మున్ను జెప్పిన చిహ్నములు గలయవియు ల
క్ష్మీయను యుక్తనారాయణాహ్వయములు
గల వెన్నియైన రేఖలు మూఁడుగల్గిన
పృష్ఠగర్తమున నొప్పెసఁగు వామ

వర్తులమ్ముగ నొక పక్షిపర రేఖ నాగభో
గమున శ్వేతమగు రేఖలను రెంటి
సౌరిది నాలుగు రెండు సుషిర గంభీరమ్ము
లున్న చక్రమ్ము గాయున్న నెల్లి

తే. గీ. భుక్తిముక్తి ప్రదమ్ములౌ పూజకులకు
నలరు లక్ష్మ్యనుయుక్త నారాయణములు
వరశుభంబట్టి మూర్తులు దొరకెనేని
వెలఁగి సాక్షాత్కరించు లక్ష్మీవిభుండు

క. స్థితమధ్య చక్రములు ని
క్గతిశయమున మధువిభన్ మహాశ్రేయస్సం
గతి మాధవమూర్తియగున్
యతులకుఁ బూజార్హమగుచు సంచిత మహితున్.

ఆ. వె. నెరయువర్తులమ్ము నిగ్గు గదాచక్ర
పద్మమతుల వాను భోగనిరతి
కుసుమతులున్న మూర్తి గోవిందుఁడిబులుండి
పంచవదనయుక్తిఁ బరగునదియె.

తే. గీ. వామచక్ర బృహద్ద్వారవర్తులములు
కపిలరుచి మధ్యనిమ్నంబుగలుగు విష్ణుఁ
డభుల నాయుధమాలిక లమర కాంత
కుసుమ రుచి విష్ణుఁడిష్టార్థ విసరమొసఁగు.

సీ. బటువు కృష్ణాభ శోభనతయునుం గల్గి
విష్ణుమూర్తియనంగ వెలయు నొకటి
స్థూలచక్రంబైన లీల క్షత్రియులకు
శుభమిచ్చునట్టి విష్ణుండు మఱియు
మెఱుపులీనెడు మొగమెఱుపు మొల్లము విల్లు
తలగలమూర్తి సంతతశుభదము
బటువు చక్రంబు శోభనమగు గదయును
బిఱుఁదఁగల్గఁగ విష్ణుఁడరయ నదియు

ఆ. వె. ఘనత నేకచక్రమును మహాద్భుత తేజ
మమితశాంతి వైభవములు మిగుల
శుభములిచ్చు మధునిషూదన మూర్తియై
విను త్రివిక్రమముల విధములింత.

తే.గీ. మూఁడు కోణమ్ములన్ జక్రములు దనరుట
కలిగినఁ ద్రివిక్రమంబు నా వెలయు నధిక
యత్నమునఁ బూజనీయ మయ్యవనిసురుల
కఖిల సౌభాగ్యదాయక మగుటఁ జేసి.

క. గద వామమునన్ దక్షిణ
పుదెస నగ యుఁగల త్రివిక్రముఁడు, శ్యామంబై
నది దీర్ఘము దామాబ్జ
స్పదమైనఁ ద్రివిక్రమంబు చతురతఁ దెలియన్.

శా. చక్రం బొక్కటి మూర్ధ్నిసీమఁ గడు శస్తం బేకభాగంబునన్
జక్రద్వంద్వము కుక్కుటాండనిభ మెంచన్ బుష్కరం బబ్జమున్
జక్రంబున్ గద లాంగలంబు ధ్వజమంచన్నిమ్నముల్ గల్గి ని
ర్వక్రంబైనఁ ద్రివిక్రమం బమరు దీవ్యద్వైభవాధారమై.

సీ. మును సృష్ట వామనమూర్తు లెన్నికఁ దెల్పితి
శ్రీధర మూర్తుల చిన్నె వినుము
నీప సమ్రమాపరే ఖాపంచకము మధ్య
చక్ర పద్మములు సూక్ష్మమగు నోరు
తగు శ్యామలాభ శ్రీధరమూర్తి మఱియు ని
మ్నావర్తశిరము హ్రస్వాకృతియును
సిద్ధిదంబగు నిట్టి శ్రీధరమూర్తి మా
ర్గాభయు విపుల చక్రాంక మదియు

తే.గీ. హ్రస్వమతి వర్తులంబు పీతాభదామ
చిహ్నము ప్రసంగమూర్తి యే శ్రీధరమ్ము
సర్వశా ప్రదానైక పూర్వహమ్ము
విను హృషీకేశమూర్తుల విధము లింక.

తే.గీ. అర్ధ చంద్రాకృతియు రేఖలైదు కడప
పూవు ఛాయ హృషీకేశమూర్తి యమరు
నీల రుచి కేసరమ్ములు నిడివి కేస
రములు నూర్ధ్వపదారుల నమరు నదియు.

క. పద్మములునైదున్ మరియు
గ్రద శకమున్ శ్యామలాభ గల్గి రుచిరమై
మృదుశీతలమై మిన్నలఁ
బొదలు హృషీకేశమూర్తి బుధశుభదంబై.

సీ. పద్మనాభము నేర్పఱిచెద నంతద్వి
వనమాలికలును శ్రీవత్సచిహ్న
మమరినఁ బద్మనాభమది శాత్రవహారి
జంబూఫలవిభాలసత్త్వమును
నాభిచక్రము పద్మనాభమా విపరీత
మైన హలాయుధమనెడి మూర్తి
స్థూలచక్రముల నైంతో లలితాకృతి
నాభ్యున్నతియుఁ బద్మనాభ మగుచు

తే.గీ. సుదుటఁదెల్పగు రేఖయు విదిత హేమ
చక్రములు గల్గినన్ నిగ్గు సంతు చాయ
నలవడఁగ బద్మనాభమై వెలయునింక
నెలమి దామోదరాకృతుల్ తెలియ వినుము

క. స్థూలంబు మధ్య చక్రము
మాలిక సూక్ష్మనసంబు ఱఱి దూర్వాభో
ద్వేలత దామోదరమునఁ
గాలిదగి శుభము లొసఁగు కడు వర్చనచే.

క. ఈ లీల మధ్యరేఖలఁ
గాలఘన ప్రభయుఁగల్గఁగా నడియయగున్
స్థూలము కాపిలకార్ష్ణ్యము
లోలిన్ దామోదరము మహాత్మ్వ మొసఁగున్.

క. గద దక్షిణమున వర్తుల
విదితము తిలకంబు సూక్ష్మవిధవక్త్రము రాం
పాదవఁగ దామోదరమగు
ముదమున సంకర్షణముల మున్వింటి గదా.

సీ. వాసుదేవుఁడు శ్వేతవర్ణము సుచక్ర
ముల నొప్పుమూర్తి నిశ్చల శుభదము
శంఖాయుధము బిందుభాతియు నాభిచ
క్రము శాంత వాసుదేవము దలంచు
పోక కైపడి హ్రస్వమును వర్తులద్వార
చక్రము తన్నామసంజ్ఞ నమరు
పిఱుఁదు ఛిద్రంబును బిందువు శ్వేతనా
గ లలాటమున మూర్తిగా నెఱుఁగు.

తే.గీ. పెద్ద రేఖలు పద్మంబు పేర్మి నమరు
వాసుదేవాఖ్యుఁడపమృత్యువారణుండు
కలువరేకొప్పు దీర్ఘ చక్రములు గలుగు
వాసుదేవుఁడు సకలార్థ వైభవదుఁడు.

తే.గీ. పీతవర్ణంబు సుషిరముల్ పెక్కు సూక్ష్మ
చక్ర దీర్ఘా కృతుల్ గల్గి సరస నొకటి
దీర్ఘచక్రము బిందువుల్ తెలుపు నలుపు
గలుగు ప్రద్యుమ్నమూర్తి సౌఖ్యప్రదమ్ము.

మ. వనమాలాంబుజముల్ జపాకుసుమ సద్వర్ణంబు దైర్ఘ్యంబుగా
నొనరన్ సూక్ష్మములైన చక్రములఁ బ్రద్యుమ్నాఖ్య మీ లక్షణం
బున సూక్ష్మంబగు చక్ర యుగ్మములచే ముఖ్యంబు బంగారు రే
ఖ నయంబౌ ననిరుద్ధమూర్తి నెఱుఁగంగావచ్చు మేధానిధీ !

సీ. ధృతి ఛిద్రవర్తులంబు దీర్ఘ నైల్యాకృతి
మైనది యనిరుద్ధుఁడని యెఱుంగు
రేఖాద్వయద్వార పృష్ఠ పద్మాంకిత
హ్రస్వచక్రంబు కృష్ణాభ చణక
కుసుమాకృతియుఁ జక్రకోణమ్ము గల్గిన
యనిరుద్ధమది విభవాస్పదమ్ము
ద్వారసంకీర్ణమ్ము వనజచిహ్నము కృష్ణ
వర్ణానిరుద్ధంబు వాంఛితదము

తే.గీ. వర్తులము పీతవర్ణమ్ము వదన సీమ
యందు రేఖలు వెన్నునఁ బురుహరేఖ
నమరు ననిరుద్ధుఁ డిచ్చు నిష్టార్థ చయము
నింకఁ బురుషోత్తమాకృతు లెల్ల వినుఁడు.

క. అతసీ ప్రభ బిందు విభూ
షితముక్తా ధ్వజ పారిజాత చిహ్నిత వజ్ర
ద్యుతి వర్తనముల్ శోభన
గతిఁ బురుషోత్తమము భాగ్యకలనఁ నొసంగున్.

తే.గీ. ద్వార చక్రములంకుశోదార పాశ
ములు వెలిని లోనఁ బైన సొంపలర రెండు
వదనములు సుఖగాననాదాప్తి చాప
చిహ్నములు పురుషోత్తమ స్థితి వహించు.

కం. ద్వారమున రెండు చక్రము
లారయ బిందువుల నలుపులట సితతనుచ
క్రాకారధియుఁ బురుషోత్తమ
మై రహిఁదగు సౌఖ్యదాయియై యెల్లెడలన్.

ఆ.వె. అగిసెపూవు పసపుటాకు మైకాంతియు
బిందు శోభితంబు నొంప నదియె
స్వర్ణ చక్రమస్త చక్రములది పురు
షోత్తమంబు మోక్ష మొసఁగు నెలమి.

కం. శిరమున ననంత రేఖయు
వరచక్రము నల్పు కృష్ణవర్తులములచేఁ
బురుషోత్తమమూర్తియగున్
గరమర్థిన్ భుక్తిముక్తిగల్గఁగఁజేయున్.

కం. అతి కృష్ణరక్త రేఖా
న్వితమై కాపిలము గొంత నెరయఁగ సూక్ష్మ
స్థితి చక్రం బొక్కటి సం
గతమైన నధోక్షజమ్ము కడుఁ జెన్నొందున్.

తే.గీ. హ్రస్వ చక్రంబు మధువర్ణ మధికమ్ముదుల
వర్ణమున్ బార్శ్వబిందువుల్ వరుస గల్గు
నదియె యచ్యుతమగు నైష్ఠికార్చితంబు
నిహపరసుఖమ్ము లెప్పుడు నిచ్చుకతన.

చం. పరఁగఁగ నాల్గు నాల్గుభయ పార్శ్వగ చక్రము లేక వక్త్ర మం
దిరవుగ నైదు నాయుధము లేర్పడు చిహ్నల ఛత్రకేతు భా
స్వర ముసలాంకుశంబులును జారుతరంబగు వజ్రరేఖచే
నరుదగు నచ్యుతంబు మునులర్చన సేయ నొసంగు మోక్షమున్.

తే.గీ. చంద్రనిభ వనమాలికా సౌరచక్ర
మమరు శ్లక్ష్ణంబు నచ్యుతంబనఁగఁ బరగు
కడక చెవిలోన నాల్గు చక్రములు సూక్ష్మ
రంధ్ర వైశిత్యములచ్యుతు రహిఁదనర్చు.

కం. ద్వారద్వయమునఁ జక్రము
లారయ నాలుగు సమంబులైయుండినచో
నారయ జనార్దనంబగు
ధారుణి నర్చనలఁ బుత్రదాయి తలంపన్.

క౦. శ్యామలత శిరోవర్ణం
బామిక గల్గిన జనార్దనాహ్వయుఁడెలమిన్
శ్రీమించు వాసుదేవ
స్వామి యొసంగిన ఫలమ్ము చతురత నిచ్చున్.

తే. గీ. పూర్వ పశ్చిమ భాగాస్య పుణ్యమూర్తి
యురివినాశి జనార్దనంబనఁగఁదనరు.
మాలికయు శిలలోత్పలలీల గలుగు
నదియును జనార్దనంబన విదితమయ్యె.

క౦. నీల సుస్థూలాకృతియున్
మాలిక చక్రాబ్జ శంఖమానిత వదన వ్
మేలిమి సితకరశీతల
లీల జనార్దనము శుభఫలితమై వెలయున్.

తే. గీ. వదన షట్కంబు చక్రముల్ పదియు రెండు
పద్మమాలిక గలది జనార్దనంబు
కలువ పూచాయ నుట్టంబు చెలువు మెుగము
గల జనార్దన మఖిల సౌఖ్యప్రదంబు.

సీ. బంతివర్ణముగు హ్రస్వ ముహిత చక్రములు కో
మల పార్శ్వ చక్రముల్ గలిగి యల్ప
వదనంబు హరిమూర్తి విదిత గదాశంఖ
చక్ర రేఖలు నల్పుచాయ మేను
దనరి నుపేంద్రుండు వినిపించితి న్మున్నె
కృష్ణమూర్తుల రూపకీర్తనమ్ము
లింక హయగ్రీవు నెఱిఁగింతు రక్త సీ
తాభమిశ్రము నంకుశాకృతియును.

తే.గీ. పద్మచక్రముత్ రేఖ పార్శ్వ కుండ
లములుగల్గి హయగ్రీవ మనురు భోగ
మోక్ష విద్యాస్పదుండునై ముదములొసఁగు
నుతియుఁదద్భేదములు వినఁ దెలుకతోడ.

తే.గీ. పద్మజంబూ ఫలాకార భాసురంబు
నంకు శాకారవదన మత్యంత దీర్ఘ
బింబులున్న హయగ్రీవ మెుందఁగపిల
వర్ణులకు విద్య యొసఁగు నశ్వముఖుఁడెలమి.

తే.గీ. ఐదు రేఖలు మధు బిందువడరుఁ జరమ
నైల్యమైన హయగ్రీవనామ మట్లు
హయముఖము పుస్తకాంకంబు నబ్జముద్ర
మాలికయుఁ గల్గునదియ యమ్మహితమూర్తి.

కం. నిడివిమెడ యథోవక్త్రము
కడు కొంచెంబశ్వగళుఁడు గడుమోహనుఁడై డొ
ప్పెడు నైల్యము నంకుశపుఁ
బడుఁ హయగ్రీవుఁ డొసఁగు వరవిద్య తగన్.

ఆ. వె. రక్తపీతవర్ణ రతి ద్వారవామున చ
క్రంబు సృక్స్రువంబు గడఁక దక్షి
ణమునఁ గల్గు మూర్తి యమరు యజ్ఞాఖ్యచే
భవ్య సవన విపుల ఫలదుఁ డగుచు.

కం. పీతారుణ సిత వర్ణము
లాతతి జట యక్షమాల యత్యున్నత దం
ష్ట్రాతిశయత దత్తాత్రే
యాఖ్యత శుభమూర్తి యిచ్చునతి సౌఖ్యంబున్.

కం. అరయం గపిలాననగ
హ్వార మున్నత పుచ్ఛ చక్ర మది జగదఖిలా
ధ్ధరణమగు శింశుమారకు
ధరణిన్ సకలార్థ సిద్ధిదము మనుజులకున్.

కం. పరుషత బహు చక్రంబుల
మురు వొప్పెడు నైదు వదనములు గల్గిన యా
హరి విశ్వరూప్యనంతుం
డిరవుగ సంతాన వృద్ధి నిచ్చున్ ఘనతన్.

కం. పారావతోపమంబై
సారపు బహు చక్రములును స్వచ్ఛ సకల మూ
ర్త్యారూఢాంకమ్ముల వ
ద్ధారమణుఁడు విశ్వరూపితగ శుభ మొసఁగున్.

ఆ. వె. సూక్ష్మ చక్రములను శుభపృథులాస్యమ్ము
వరసుదామ కృష్ణ వర్ణములును
లలిఁ దలిర్చు మూర్తి లక్ష్మీపతిఖ్యాతుఁ
డఖిల శుభములిచ్చు ననవరతము.

ఆ.వె. ముఖమునందుఁ బార్శ్వమున నైన మాయూర
గళమురీతి చిన్నె గల్గినట్టి
లలితమూర్తి యదియు లక్ష్మీపతిఖ్యాతి
యఖిల సౌఖ్యమిచ్చు నర్చకులకు.

కం. అల నానావర్ణములన్
జెలువరులచు నాగభోగ సేవితుఁడైనన్
విలసిత లక్ష్మీకాంతుం
డిల నుత్తమమది గ్రహించు టెంతయు నొప్పున్.

సీ. సూక్ష్మచక్రము గౌర సూక్ష్మరేఖయును దూ
ర్వాభ యుద్వృద్గల శ్యామగు వెడల్పు
పాసఁగియున్నఁ బురాణపురుషోత్తముఁడు వట
పత్రశాయి దలంప బహువుమిన్న
నిడివియు వటచిహ్న మడరఁ బైచక్రముల్
వామచక్రము మణివర్ణమమరి
తమ్మిఁబోలిన గహ్వరమ్ము చెంగటఁ బద్మ
రేఖలు మఱియష్టరేఖలు దగి

తే.గీ. మాలికయుఁగల్గి శ్యామకోమలతఁ దనరు
సఖ్యవైకుంఠమూర్తి పార్శ్వమునఁ జరమ
మునను నయనద్వయంబున్న పుండరీక
నేత్రుఁడిచ్చు వశంకర చిత్రమహిమ.

కం. శిరమున బంగరుకొమ్మును
బలవర్తుల కేసరములు పటుచక్రగత
స్థిరకృష్ణరేఖ బిందుల
గరుడధ్వజమూర్తి నిగ్గు కలిమి యొసంగున్

కం. ఖ్యాతిఁ బసిమిగోరోచన
భాతిన్ వర్తులపుఁ జక్ర పటిమ మమరినన్
రీతి బహువర్ణమైనన్
పీతాంబరధరుఁ డుసిరులఁ బేర్మి నొసంగున్.

తే.గీ. వర్తులము హవ్యచక్రముల్ స్వర్ణబిందు
యుక్తమగునట్టిమూర్తి మహోజ్జ్వలగతి
సత్యవీరశ్రవాంచిత సంజ్ఞ నమరు
సర్వసౌభాగ్యదాయియై సారమహిమ.

సీ. ప్రహస్వాస్యనీలోత్పలాభాతివర్తుల
మైనచో నమృతాపహరణమూర్తి
మున్న త్రివదనముల్ వెన్న నొకనోరు
చక్రపాణి త్రిలోకచక్రదుండు
ఒకటుళచక్రముల నభ్యంతరచక్రంబు
గూఢి మాల్యము బహుగూపి శుభద
మేకచక్రాసన మెసఁగు శుభ్రము పుండ
రీకుండు మోక్షమర్మిలి నొసంగు

తే॥గీ॥ ప్రాంతచక్రమ్ములున్నచోఁ బారిజాత
హరణుఁడర్థుఁడు బ్రహ్మచర్యాశుచితికి
దక్షిణావర్తములరు ప్రసగ్ద్వారచక్ర
రక్తిమను జగతో ద్యని రహిఁబొసంగు.

ఆ.వె. నలుపు ద్వార చక్రములు వర్తులమునిగ్గు
వన్వయాఖ్యుఁడిచ్చు నర్చకులకు
ధనము ధాన్యచయము ఘనరత్నభూషణ
పుత్రపౌత్రవృద్ధి పొల్పుమీఱ.

సీ. ద్వారస్థచక్రముల్ దగువదునాలుగు
బిలములు పర్ణముల్ పలుదెఱఁగులు
స్థితనాగభోగనేష్టితము ధ్వజాకార
చిరరేఖ స్థూలదీర్ఘరుచిమూర్తి
యగు ననంతుండెన్నిదైనను బదియైన
బదుమూఁడు నేడునుబదియునాల్గు
నైన చక్రములననంతుండు శుభమిచ్చు
కమలంబు శంఖచక్రములునాల్గు

తే॥గీ॥ గదలుగల్గిన సర్వకామదుఁడనంతుఁ
డతుల శోభనపూర్ణ చంద్రాకృతియును
మోక్షమిచ్చును గలుము లిమ్ముగ ననంతుఁ
డదిరా సూత్మకృతిని సుఖనావహిల్లు.

కం. ఇరువది నాలుగు చక్రము
లరయఁగఁ బన్నెండ్రు నొరులబ్జముశంఖం
బిరవొందఁగాలబుగ్గలు
సరి విశ్వంభరుఁడు నాల్గుచక్రములున్నన్.

కం. శ్యామలము నాల్గుచక్రము
లామిక విశ్వంభరాఖ్యుఁడతిసౌఖ్యదుఁడౌ
ప్రేమన్ ద్వాదశచక్రము
హేమూర్తియె సూర్యనాముఁడై విలసిల్లున్.

తే.గీ. పద్మపత్రాకృతియుఁ బైఁడిభాతి కలిగి
యరయ లోఁతగుచక్రముల్ హైహయుఁడగు
ఘనత రెక్కలు రెండున్న గరుడమూర్తి
కలియు విషమును బోకార్చు గౌరవమున.

తే.గీ. పీఠమట్టుగ వలయముల్ పేర్మిరెండు
మూఁడునాలుగునైదును బైఁడినిగ్గు
గలిగి శుభచక్రముల వర్ణముల కలయిక
గలుగఁగా శేషుఁడెనిమిది కలుములొసఁగు.

సీ. నలుపును శిరసునగల యేకచక్రంబు
తగుఁబాపహరణ సుదర్శనంబు
తమ్మిరూపెలుపుఁబెద్దయు నోరునిమ్న నా
భి మహిత పూజ్యమై యమరియుండు
కపిలమై స్థూలచక్రంబున్న తము పూజి
తంబు నృసింహసుదర్శనంబు
కడునల్ప నగుచు రేఖాక్రమమున్న ని
త్యసుఖద విష్ణుసుదర్శనంబు

తే॥గీ॥ చాల్పు వర్తులద్వార పృష్ఠద్విచక్ర
ధార్యమైనది శుద్ధసుదర్శనంబు
ధరణిఁదగునిట్లు పెక్కు సుదర్శనములు
మూర్తులెన్నేని నవిలేక పూజదగదు.

వ॥ దక్షిణావర్తసుదర్శన శంఖంబు లపూర్వంబులవి భాగ్యవంతులకు లభియించు, ఏకచక్రంబులు సుదర్శనబలరామకృష్ణమూర్తులు. ద్విచక్రంబులు సర్వసాధారణంబులు, త్రిచక్రంబులు, పురుషోత్తమాచ్యుత త్రివిక్రమశింశుమారమత్స్య సీతారామ మూర్తులు చతుశ్చక్రంబులు, హరిహరసీతారామ జనార్దన విశ్వంభర కంసమర్దన గోపాల లక్ష్మీనారాయణమ్ములు పంచచక్రంబులు, వాసుదేవ పట్టాభిరామ హృషీకేశ మూర్తులు షట్చక్రమ్ములు, సీతారామసామ్రాజ్యరామ లక్ష్మీనారాయణ సంకర్షణ మూర్తులు సప్తచక్రమ్ములు, పట్టాభిరామవరాహనృసింహమూర్తులష్టచక్రమ్ములు,

పురుషోత్తమ చతుర్ముఖ నృసింహంబులు సప్త చక్రంబులు, నారసింహానంత బహురూప మూర్తులు దశచక్రంబులు, హృషీకేశ వామనానంతమూర్తులేకాదశ చక్రమ్ములు. అనంత ప్రద్యుమ్నమూర్తులు ద్వాదశచక్రమ్ములు, పట్టాభిరాము సూర్యానంత బహురూపి విశ్వరూపమూర్తులు మఱియు బహుచక్రంబులు, పరమాత్మస్వరూపంబుగా నెఱుంగుమని భగవంతుండు గరుడని కెఱింగించెనని విరించి విపంచీమౌని కానతిచ్చెనని సూతుండు శౌనకాదుల కిట్లనియె.

శా. సాలగ్రామశిలోదకంబు నరుదెంచన్ గ్రోలినం బాపముల్
తూలున్ సౌఖ్యములొందుఁ బీడ తొలఁగున్ దోడ్తో సిరుల్ చెల్వగున్
లీలన్ మోక్షముగల్గు నీకరిత వర్ణింపఁగఁ దత్త్వైతృకుల్
చాలా సౌఖ్యముగాంతురయ్యమృత వాసస్థైర్యమేపారఁగన్.

శా. విద్యోతమ్ముగ వాసుదేవుఁడమరున్ విప్రాలికిన్ బూజగున్
ఖద్యోతాబ్జకులైకభూషణుల కెన్నన్ శేషుఁడర్హుండగున్
ప్రద్యుమ్నుండగు వైశ్యసంతతికి నాపాదోద్భవశ్రేణికిన్
దద్యోగ్యంబనిరుద్ధమూర్తి శుభసంధానైకపూజార్హతన్.

కం. ఎన్నని యోగ్యమర్చన
కెన్నఁగ విప్రులకు రాజులిల మూర్తుల మూఁ
డున్నెఱి వైశ్యులు రెంటన్
బన్నుగ శూద్రులకు నొకఁడు భావ్యంబరయన్.

ఆ.వె. అతిరహస్యమైనయట్టి యా శ్రీమూర్తి
విలసనమ్ముకొంత పలికితినిది
యెవ్వరేని చదువ నెలమితో విన్నవారయ
నఖిలసౌఖ్యచయము లమరఁగల్గు.

సీ. అట్టి శ్రీమూర్తుల కాకరంబైన హ
రిక్షేత్రదర్శన ముఱియమగు
ఫలములు లభియించుఁబదపడి మదినెన్నఁ
బయనమై యోజనపంచకమ్ము
నరుగ దశాశ్వమేధాధ్వర ఫలమగు
దలఁచినఁ బితృసంతతులును దుష్టిఁ
బొందుదు రప్రాప్యభూరి పదమ్మున
శ్రీమూర్తి నర్చన నేయవలయు

తే॥గీ॥ దినము తత్తీర్థకణము గ్రోలిన యతండు
శిరమునం జల్లుకొనువాఁడు మెఱయు సకల
తీర్థసుస్నానఫలమంది దేవదేవు
విష్ణుసన్నిధిఁ బ్రాపించు వేడ్కతోడ.

కం. సాలగ్రామపు దానం
బీలోకము లెల్ల దానమిచ్చిన ఫలమా
సాలోక్యహేతువందిన
శీలాఢ్యుని పితరులెల్లఁ జెలఁగుదు రెందున్.

చం. హరిపరమైకరూపముగ నంచితమూర్తులు నాల్గురెండు భా
సురహరిపూజనాన్వితు విశుద్ధమనస్కునిఁ జూచి దాన మా
దరమున నిచ్చి పూజన ముదారత సేయఁగఁ బంపఁ దీర్థముల్
శిరమున జిహ్వనిండ గుణశేఖరుఁ డొందు నభీష్టవస్తువుల్.

తే॥గీ॥ దినముఁ దత్తీర్థములు గ్రోలుఘనులు విష్ణు
మందిరావాసులగుదురు మహిమతోడ
గంగ కరుగ గలేని స్న్యాసాంగులకును
నానదీస్నానఫలమొందు నదువలన.
తే॥గీ॥ నాలుగెనిమిదిఁ బండ్రెండు మేలిభక్తి
నిరువదియునాల్గు పూజింప సిద్ధుఁడగును
పురుషసూక్తాభిషేక మా హరి స్వరూప
మొసఁగు సందియ మెన్నరాదు చిత్తవృత్తి.

కం. ఈ గణుతి మూర్తులుండెడి
యాగృహములు దివ్యనిధులు హరిపదతీర్థం
బౌ గదతత్తీర్థము తగ
నాగుణనిధి భక్తియుక్తు లలవడఁ గాంచున్.

వ॥ తత్సన్నిధి శ్రాద్ధంబు పితరుల కక్షయఫలావాప్తియగు, తద్దర్శన స్పర్శన పూజలమిత సౌభాగ్యకరంబులు.

కం. క్రతుదాన హోమకర్మ
వ్రత జప సన్మంత్ర తంత్ర వర్తనములు స
న్మతిఁ దత్సన్నిధిఁ జేసిన
నతిఫలదములగుచు నతని కపవర్గమగున్.

తే. గీ. హరి నివేదాన్నభుక్తిచే నధికుఁడగుట
శక్తిగొలఁది తదర్చన సౌఖ్యమొదవు
నెచట శ్రీమూర్తులుండు నయ్యెడల భూత
చోరరాజ భయమ్ములు చేరవెందు.

మ. కనఁ బూజించినఁ బూజసల్పఘనులన్ గారామునన్ బ్రోచినన్
విని మోదమ్మునునొంద మ్రొక్కులిడినన్ వేడ్కన్నుతుల్ సేయ న
మ్మనుజుండీశ్వరుఁడౌ శివాకృతుల సాయుజ్యంబైనఁదన్నాభపూ
జ, నభీష్టార్థమునొంది పాపములు వో శశ్వద్గతిన్ వర్తిలున్.

మ. హరియే శంభుఁడు బ్రహ్మశక్రముఖదివ్యానీకముల్ విష్ణుఁడా
హరియే లోకచయమ్ములై తనరు నయ్యబ్జాక్షుఁడే సర్వమున్
హరియే కావునఁ దత్స్వరూపమున నొప్పునట్టి శ్రీమూర్తిఁ ద
త్పరతన్ బూజలు సల్పఁగా నిహపరప్రఖ్యాతులన్ గూర్చెడున్.

కం. హరి యితఁడు హరుఁడితండని
పరికించెడు భేదబుద్ధి పాపాత్ముఁడు దు
స్తర ఘోర నిరయ మొందున్
హరియానతి భూతసంప్లవావధిగాఁగన్.

వ. కావున సకలదేవాత్మకుండు శ్రీమన్నారాయణుండని యప్పరమేశ్వరు నెంచి తలంచి తులస్యాదియోగ్యవస్తుధూపదీపాద్యుపచారార్చనములం గృతార్థులు కావలయునని సూతుం గనుంగొని శౌనకాదులు తులసీగోభూదాన వ్రతమాహాత్మ్యంబులు క్రమంబునం దెలుపుమని వినయవచనులై యడుగుటయును—

ఉత్సాహ. రాజహంసనేత్ర! మౌనిరాజపూజనప్రియా!
రాజరాజమిత్రమిత్ర! రాజితాశ్రయాశ్రయా!
భూజనేష్టదాయకాతి పూర్ణసద్దయోదయా!
భూజరాజనేజ శేషభూమిభృద్వసిక్రియా!

కం. ఖరకరవైశ్వానరహిమ
కరనయనాంబర చరప్రకరనుత! చామీ
కరచామరదండమణి
స్థిరతోభయభాగ! శేషశిఖరిసురాగా!

తోటకం. జనకామిత కామిత కారణ కా
నవవారణవా గవనాదరణా!
అనపాయకృపా! సునయాతిగయా
వినతాజనతాధిప! వేంకటపా.

గద్య॥ ఇది శ్రీమదలమేల్మంగా వేంకటేశ్వర వరప్రసాదాశు కవితా విచిత్ర మహింశాళి అప్పకొండార్యపుత్ర సకలసుకవిస్తోత్ర సుమతి వేంకటపతిసహాయ తేఁకుమళ్లాన్వయపాథోధి పూర్ణసుధాకర తిమ్మమాంబా కప్రసనామాత్య కుమార సకల విద్వజ్జనాధార శ్రీవత్సగోత్ర, ఆపస్తంబసూత్ర సత్కవిప్రమోదానుసంధాయి రంగశాయి ప్రణీతంబైన శ్రీవాణీవిలాస వనమాలిక యను ప్రబంధంబునందు, అష్టోత్తరశత విష్ణుస్థల మహత్త్వంబును, పుణ్యనదీ సంబంధమును శివస్థల, మహత్త్వలింగాకార పూజాఫలంబులును, బ్రాహ్మణవంశ కీర్తన గోత్రగణ నిరూపణంబును, వర్ణాశ్రమాంతరభేదసదాచారవిధులును, పాపపుర దాహనప్లావన ప్రాణాయామ లక్షణంబులును, గాయత్రీ మహాత్మ్యార్ఘ్య ప్రభావ యజ్ఞోపవీత సంభవంబులును, వైశ్వదేవప్రకరణ దేవపూజావిధులును, భోజన ప్రకరణంబును క్షత్రవైశ్యశూద్రజాతిధర్మ పతివ్రతాలక్షణంబులును విధవాచారగణనంబును పుణ్యకాలదాన నిరూపణంబులును, దశవిధ బ్రాహ్మణ లక్షణంబులును సముచ్చయ ధర్మంబులును షణ్ణవతి శ్రాద్ధనైమిత్తిక కాలకర్తృభోక్తృవస్తు యోగ్యాయోగ్యనిరూపణంబులును హరిపూజా వైభవంబును సాలగ్రామ గ్రావ్యావతారమూర్తి కేశవాది బహువిధ మూర్తి శివనాభాది లక్షణలాంఛనంబులును దీర్ఘవైభవంబును ననుకథలంగల ద్వితీయాశ్వాసము.—

# తృతీయాశ్వాసము

శ్రీమదలమేలుమంగా
రామాహృదయాంబుజాతరమ్య వికసన
ప్రేమాస్పదమిత్ర ! వ్యా
యామ క్షణకరణ ! వేంకటాచలరమణా !

వ. దేవా ! అవధరింపు మస్సూతకుండు శౌనకాదులకుం దులసీమాహాత్మ్యం బిట్లని చెప్పందొడంగె—

సీ. అరయ ద్వాదశుల క్షీరాభిషేకము సేయు
    ననఘుఁడు దలఁచ నవ్వనజభవుఁడు
తత్సన్నిధిని గర్మతంత్రముల్గావించు
    నతఁడె మహాదేవుఁడనంతవాఁకు
తత్ప్రదేశమున వాద్యములు వైభవములు
    గావించునతఁడు స్వర్గప్రభుండు
రహి షోడశోపచారములఁ దత్పూజలు
    సలుపునాతఁడె విష్ణుసన్నిభుండు

తే॥గీ॥ నృత్తగీతమ్ము లచ్చట నేర్పుమీఱ
సేయునాతని ఫలమెన్న నాయతమగు
నవని శ్రీమూర్తిపూజల కధికమైన
కర్మములు లేవు ధర్మైక కర్మఠులకు.

కం. దుష్టుఁడె శిష్టుఁడు దుష్కుల
కష్టుఁడె సత్కులుఁడు పాపి ఘన పుణ్యుఁడగున్
దృష్టపు హరిమూర్తుల వి
స్పష్టముగాఁ దులసిపూజ సల్పినమాత్రన్.

సీ. ఎండలఁ జను జనులండి సేదలు దీఱ
    వనముగావించు పావనచరితుఁడు
పశురక్షకై జీర్ణపద్మాకరమ్ము గ్ర
    మ్మఱ శుభస్థితిఁజేయు మహితసుకృతి
హరిహర దేవాలయంబులుగావించి
    విభవముల్ నడిపించు విశదబుద్ధి
పుడమి వేలుపులకు వడుగులు పెండ్లిండ్లు
    ధీరతఁజేయు సుధీవినుతుఁడు

తే.గీ. వేదలకు నర్థములొసంగు పృథులకీర్తి
ధరణి సత్సంతతింగాంచు ధార్మికుండు
చెలగి హరిమూర్తిపూజలు సేయునట్టి
శిష్టజనములఁబోలమి సిద్ధమరయ.

ఉ. కావున నృత్తగీతములు గౌరవకీర్తనముల్ ఘటిల్ల నా
నావిధభక్తి నచ్యుతుననారతముజ్ భజియించు మర్త్యుఁడే
శ్రీవిలసిల్లఁగా నిహముఁజిన్మదముజ్ సుఖవృత్తిగాంచు నా
దేవుని సత్కృపామహిమ దివ్యతరప్రకటీకృతప్రథజ్.

కం. హరికింప్రియను సుధాసా
గర జనితంబైన తులసి కమనీయగతిజ్
ధర బృందావన సంజ్ఞన్
బరగుట కిటివాస మొకటి పలికెదఁ దెలియజ్.

తే.గీ. శ్రాద్ధకాలమ్ము తులసిచే జగతిసురుల
నర్చనమొనర్చు నతఁడొందు నధిక పదవి
హరితిథిజ్ ద్వాదశినిఁ బుణ్యమైన హరి
ములను హరిపూజ గావింపఁ గలుగు శుభము.

కం. తులసీ పత్త్రసనమ్ముల
నిలవైష్ణవ సమితియందు నీశ్వరుఁడుండుజ్
తులసిజ్ జాహ్నవిఁ దలఁచినఁ
దొలఁగుజ్ దుస్స్వప్నగతుల దోషములెల్లజ్.

వ. తత్ప్రభావేతిహాసంబు వినుండు

తే॥గీ॥ చంద్రశేఖరు సేవకు నింద్రుఁడొక్క
నాఁడు రా ద్వారపాలకు పోఁడిమమర
భవుఁడె యిదివేళగాదని ప్రభుతఁ బలుక
నతనిఁగాదని చనెడి యయ్యమరవిభుని.

కం. చేనుండు దండ మానిక
గా నిడి వలదనుచు నాఁగఁ గ్రతుభుక్పతినా
తోనేనా ! యీాపంతము
మాను వశావళియటంచు మదమునజనఁగజ్.

మ. అనఘుండీశుఁడు ద్వ్యాష్టస్వరూపమున దేవాధీశుదర్పమ్ము మా
న్పనిజాకారము మానియున్న కతనన్ బాకారి నీక్షించి పోఁ
జనునే! నీకన నెంత! సంతతము నాసక్తిన్ మహాదేవునిం
గన నిర్మించిన వారలిందు శతసంఖ్యల్ గాచియుండన్ గదన్.

చం. అనవిని వజ్రమెత్తి తెగటార్తునొ! వేగఁ దొలంగిపోయెదో!
యనఁ జెఱునవ్వు నవ్వి యహహా! బళి నీవననేమి నీదుచే
ననువగు వజ్రనేమి! యిటులాడెడి మాటలు మాని క్రమ్మఱన్
జనుమను డామరప్రభుఁడు సడ్డయొనర్పక త్రోఁచిపోవఁగన్.

కం. పిఱుఁదికిఁ ద్రోఁచిన నాతనిఁ
గర వజ్రంబెత్తి దేవగణపతి వ్రేయన్
హరుఁడురక నిజాకృతిఁ జె
చ్చెఱ కనుదెఱువంగ బూన శైలజపలికెన్.

ఉ. నీదగునాజ్ఞచే నితఁడు నిర్జరపాలకుఁడున్ దిగీశుఁడై
పాదుగ లోకరక్షణకుఁ బాల్పడియుండి తఁడిందు డిందినన్
మీఁదటనొక్కఁడట్టిపని మేకొనకున్కి జగమ్ము వీతమ
ర్యాదఁ బొసంగుగానఁ గరుణాకర! యాతనిఁ బ్రోవుమిత్తఱిన్.

మ. అనినం దాలిమినొంది యో గిరిజ! యీ యర్చిష్మదుగ్రమ్ము చా
ల్చినఁ గాకెవ్వరొ రిత్తవోవదిది యిచ్చన్నాఁగ దాక్షాయణీ
వనితారత్నము ప్రార్థనల్ [దగనొనర్పన్] దేవతా శైల భూ
వనజాప్తాబ్ధుల జ్వాలఁ బట్టుఁడనఁగా వారోర్వలేకున్నెడన్.

తే.గీ. జలధిఁ బ్రార్థించి జ్వాల తజ్జలధి నిడిన
బంధురబలుండు సుతుఁడు జలంధరాఖ్యుఁ
డుదయమందిన వానికయ్యుదధి సకల
విద్యలట నేర్ప నేర్చె నవ్వీరవరుఁడు.

చం. సకలకళాప్రవీణుఁడతిసత్త్వసమేతుఁడునై సముద్రు ను
త్సుకమతిఁ జూచి ధాత్రిఁ గలచోటులఁ గ్రుమ్మఱి వత్తునన్నఁ బు
త్రకు నటు సేయుమంచనుప దానవకోటులఁ గూడి శూలమున్
బ్రకటితలీలఁ బట్టి భవభాసితుఁడై ధరసంచరింపుచున్.

ఉ. లోకులు చూచి భీతిల నలూనగతిం దివిఁ జేరి యచ్చటన్
నాకనివాసులం గెలిచి నాణెముగా సురరాడ్గృహమ్మునన్
శ్రీకరవైభవ స్థితులు జేకొని యచ్చరలెల్లఁ గొల్వ సా
లాకమనీయవైఖరి జలంధరుఁ డా మయపుత్రి నత్తఱిన్.

కం. బృందానామఁ బతివ్రత
నందంబుగ రూపయౌవనాన్వితశీలా
నందన్ బరిణయమై చెలు
వంది సుఖంబుండె దైత్యులందఱు గొలువన్.

ఉ. అప్పుడు దేవతల్ వనుల నద్రులఁ గ్రుమ్మరుచున్న నారదుం
డొప్పుగ వారిఁ గన్గొని యథోచితసత్కృతు లొంద సంతతం
బిప్పగిదిన్ జలంధరుఁ డహీనబలస్థితి నేచుచున్న యా
చొప్పులు దెల్పి వాసవుఁడు చోద్యముగా మునితోడ నిట్లనున్.

చం. హరిహర పద్మగర్భులకు నాదట నీ తెఱఁగెల్లఁ దెల్పఁబో
దురు మున రాక్షసుం డధిక దుర్మతి యుద్ధము వచ్చెనంచు పెన్
వెరపున నుండువారి మము విశ్వమయుల్ కరికింపలేరె మా
తెఱఁగు జలంధరోద్ధతియు దేవమునీంద్ర ! యదృష్టమేమొకో!

ఉ. నా విని మంచిదయ్య సురనాథ వసింపుము దేవకోటియున్
నీవిటు నిప్పుడే నసుర నిష్ఠుర సత్త్వమణంగఁ జేసెదన్
భావ మెలర్పనంచుఁ జని పద్మజసూనుఁడు స్వర్గసీమ నా
నావిధ భోగి నయ్యసురనాథునిఁ జేరిన వాఁడు నత్తఱిన్.

శా. ప్రత్యుత్థానము చేసి పూజలిడి శుంభత్పీఠిపై నుంచినన్
దైత్యేంద్రుం గని మౌనిపల్కె వినుమీ ! త్రైలోక్యమందున్ భవత్
ప్రత్యామ్నాయ బలాతిశౌర్యయుతులన్ భావింప నత్యద్భుతం
బత్యౌత్సుక్యము ధైర్యహార యన వాఁడమ్మౌనితో నిట్లనున్.

ఉ. కంటివి నీవు వేడుకలుగాఁ బదునాలుగు లోకముల్ ముదం
బంటఁగ మత్సమానబలునందుఁ గనుంగొననట్టి, సిక్కమే
వెంటలనైన మేఁటియగు వీరుఁడు గల్గినఁ దెల్పుమన్న ము
క్కంటికి నీకు నెక్కటిగఁ గయ్యముగల్గెడు నంచు నెంచెదన్.

కం. నీ విభవమునకు మహిమకుఁ
గావలయుం గౌరిదేవిగాఁ గల్గినచో
శ్రీవెలయ త్రిభువనములకును
దేవుఁడ వీఁక నీవె కావె దీపితశక్తిన్.

చం. అన విని మేలు మేలనుచు నాదట దైత్య బలమ్ము గొల్వఁగా
దనుజుఁడు స్వర్గముల్ వెడలి దారన రా నతఁడంత నేఁగి శం
భునిఁ గని యా జలంధరుఁడు పోరికి వచ్చుట దెల్పి వేఁగ దై
త్యునిఁ దెగటార్చి చాల దయతో జగముల్ మనఁగా నొనర్పవే !

మ. అనునంతన్ భ్రమథాళిఁ బిల్చి పటుదైత్యానీకమున్ ద్రుంపఁగాఁ
జనుచున్నన్ వడి దైత్యులా గిరివరస్థానమ్ములం గ్రమ్మఁగన్
గని యుద్ధంబొనరింప దానవులు వీఁకన్ రాక్షసాధీశుఁడా
ఘనసైన్యంబుఁ బురస్కరించికొని వీఁకన్ దాఁకె శైవావళిన్.

లయగ్రాహి. బంధుర బలుండగు జలంధరుఁడు ఘాటిగ మ
దాంధ జయదార్భటి వసుంధరదలంకన్
సింధురశతాంగ భటసైంధవ బలావళులఁ
గంధులు గలంగ నిజబాంధవులు దాన
య్యంధక విరోధిబలముం ధరణిఁ గూల్పఁదను
సంధు లెడలంగ శితికంధరుని భృత్యుల్
సందులఁ జనన్ శుభధురంధరుఁడు శంభుఁ డమృ
తాంధస హితాతి గరిమం ధృతి దలిర్పన్.

ఉ. శూలము గేలఁ బూని జిగిసొంపలరన్ దెలిగిబ్బ నెక్కి దై
త్యాళి వసుంధరన్ గెడపినంత జలంధరుఁ డీశుఁ దాఁకినన్
మేలిమి శూరతన్ హరుఁ డమేయబలస్థితిఁ జూప వాఁడు ను
ద్వేలతఁ బోరె వేల్పుగమి వీరు[లు]వీరల సారెచూడఁగన్.

చం. మఱియు జలంధరుండు పలుమాయలు పన్ని యనేకబాణముల్
బరపిన మోహనాస్త్రనిభవభాసురకామినులాటపాటలన్
నెరపఁగఁ జూచుచుండె మది నివ్వెఱ శంకరుఁ డంత దేవతల్
వెరచి ముకుందుఁ జేరి మొఱఁ బెట్టిన వించు మురారి ధీరతన్.

ఉ. లాలితమాయనచ్చుగ జలంధర రూపము దాల్చి సైన్యము
ల్లోలిఁ జెలంగఁ గేతన శుభోజ్జ్వలవాజిమదేభ సంఘముల్
గ్రాల మహేశ్వరుం గెలిచి గౌరవమొప్పఁగ వచ్చె నంచు నా
ప్రోలునఁ జాటఁగాఁ బనిచె భూరితరాంచిత వైభవస్థితిన్.

కం. సర్వ జగదంతరాత్మయు
సర్వేశ్వరుఁ డఖిలమయుఁడు సాక్షియునగు
య్యుర్వీధరునకు దైత్యులఁ
బర్విడు నిజమాయమోహ పఱుచుట లరుదే!

సీ. ఇట్లు దైత్యుల భ్రమయించుచు స్వర్లోక
భాసురంబగు దైత్య భవనసీమ
దద్భార్యయైన బృందాకాంత నివసించు
నంతఃపురమ్మున కరిగి విష్ణుఁ

డమలినశయ్య నొయ్యనఁ దరుణీమణుల్
సేవయొనర్పఁగాఁ జేరి మీఁటి
బృందతో సరసంపు టందచందమ్ముల
బాహ్యరతుల్ సల్పఁ బ్రౌఢి తెలసి.

తే. గీ. యా పతివ్రత హరియాటలాత్మఁ దెలిసి
పలికెఁ ద్రైలోక్యసంభావ్య భద్ర! నీవు
యిటుల మర్యాదఁ దప్పిన నేమి సేయ
వచ్చు శపియించుచుంట్నామే! వాసుదేవ!

చం. అని వనితాశిరోమణి రయంబున లేచి శుచివ్రతచారిణై
తనుగతకుండలీస్థిత నిదాన మహానలమాత్తకుంభకం
బునఁ బురిగొల్ప గాత్రమటు బూదిగఁ గూలిన విష్ణుఁ డంతయున్
గనుగొని మోహమాపని వికారమునం దవిలున్న యంతటన్.

తే. గీ. క్షీరసాగరకన్యక చేరవచ్చి
బృందరూపమ్ము గైకొని పేర్మి విభుని
కట్టెదుట భస్మరాశిపైఁ గదలకున్కి
గాంచి హర్షించి హరి రమఁ గౌఁగిలించి

చం. తెలివి పొసంగఁగా నిజసతిం గనుగొంచు వసింపు మిందు ని
శ్చలమతి వృక్షరూపమున సర్వజనస్తుత పావనాంగివై
తులసి యనాగ నెల్ల విబుధుల్ భజియింపఁగ నెందుఁ దద్దళం
బుల నను బూజ నేసి భువిఁ బుణ్యము గాంతురు మర్త్యులెంతయున్.

కం. మత్ప్రియ వగుటన్ నీవే
తత్ప్రకటార్చావతార ధన్యశిలాసం
పత్ప్రభల ధరణి నమరిన
మత్ప్రచుర్యాంగ సంగమమున నలరుమీ!

సీ. లలితచిహ్నముల సాలగ్రామరూపంబు
గైకొన్న నన్ను విశ్వాసచిత్తు
లై యొక్కదళమున నర్చింప రెంట ద
శత్రయంబునఁ జతుష్పత్రయుక్తి
నైదింట నర్చించునట్టివారికి హిర
ణ్యాస్తేయ గురుతల్పగాఘ మద్య
పరబ్రహ్మహత్యాక సంపర్కాదివృజిన పం
కము దొలంగు నిచ్చలు నవేశ

తే॥గీ॥ పత్రములఁ బూజసేయు సత్పాత్రులరొడ
ధర మహాపాతకోపపాతకములణఁగి
యిహపరసుఖంబులు పొసంగ దిహిఁదనర్చి
దివ్యపదమొందుటలకు సందియములేల.

మ. తులసీపర్ణయుగంబు మత్తనుశిలోత్తుంగ ప్రసంగంబు నా
జల మెవ్వారలు గోలుచుండుదురు నిచ్చల్ వారిభాగ్యంబు శ్రీ
లలనా! లెక్కయిడంగ నేనెఱుఁగ లీలాయత్స్వరూపైక్య ని
శ్చలభోగాన్వితు లౌదు రాజనులు భాస్వద్దివ్యదేహాఢ్యులై.

కం. ఆజన్మకృత మహాఘ స
మాజములణఁగించు వ్యాధి మదములబాపున్
శ్రీజయమగు తులసీయు
గ్భాగ్జన్మస్వచనాంబురతి మనుజులకున్.

వ. అని యానతిచ్చి లక్ష్మీసహితుండై నారాయణుండాదు వసియించె నంత జలంధరు మాయదలఁగుటయు శివుండు వాని వధియించి సురల కభయంబొసంగి కైలాసంబున వసియించె నట్టి భస్మంబు వేదికగాఁ బ్రోఁది దనరు లక్ష్మీస్వరూపంబగు తులసీ మహిమ వినుండు—

సీ. దుర్వారభక్తి చాతుర్మాస్యలన్ ద్వాద
శుల నమృతాబ్ధిజ తులసి కెలమి
నర్చనల్ గావించి యత్యుత్సవములతోఁ
జూపట్టఁగా షోడశోపచార
మదవాక్యనతుల తేవంగొల్చు రట్టివా
రచ్యుత సమరూపులగుదు రెందు
ధాత్రీతరుచ్ఛాయఁదగు తులసీ ప్రద
క్షిణము సేయ ముక్తిరమ గల్గు

తే॥గీ॥ వేడ్క బృందావనమ్ము గావించితగ న
లంకరించిన స్వర్గపాలకత పొసఁగు
కర్ణమునఁ బత్రమొక్కటఁ ఘనుఁడు మెఱయు
నవ్యయానంద సంభాసమైనచోట.

కం. అలవడఁ జరమావస్థన్
దళమొక్కటి జిహ్వనునుచు ధన్యుఁడు హరితోఁ
గలయుం గల్మషియైనం
గలదే తన్మహిమయితర కర్మములందున్.

తే॥గీ॥ ఇట్టి యద్భుత వృత్తికి నెన్నికలరఁ
గలదు మున్ గథయొక్కటి కలుషవృత్తిఁ
దిరుగు జీవాళిఁ గఱకుటుంపుఱఁదునుముచుఁ
బుట్టుమొదలుగ నొక బోయ దిట్టయగుచు.

ఉ. పుట్టిననాఁటఁగోలె చలపాఱి మృగమ్ముల సంహరించుచున్
నెట్టుగ జీవహింస లతినిందితవృత్తి నొనర్చి పాపముల్
పట్టుగ నొక్కనాఁడు మృగపంక్తి లభింపమి నాశ మీఱఁగా
నట్టడవిం జరింపుచు మనంబునఁ జింతలవంతనొందుచున్.

శా. ఆలుం బిడ్డలు పుత్రు లాసపడి యాహారమ్ము వేఁదెచ్చునాఁ
జాలా నమ్మికగాంచియున్న యెడ మాంసంబేమియున్ లేనిచో
నేలీలన్ భరియించువారు క్షుధ చేనింకే యుపాయంబొకో
వాలాయంబని ప్రొద్దుగ్రుంకుటయు భావంబెంతయున్ గుందఁగన్.

కం. కట్టియ లొకమోపైనా
బట్టుక యది విక్రయించి పైకంబును చే
పట్టుక నేఁడిలు జరిపెద
నిట్టులు మఱి రేపుచూత మెల్లవిధంబుల్.

చం. అని మది నిశ్చయింపుచు రయంబునఁ గట్టెలమోపుగట్టి యె
య్యనఁ దలనుంచి పోవునెడ నద్భుతలీల ఘనాభ్రమచ్చటన్
మునుకొని చిన్కిపిమ్మట నమోఘమహాకణ యుక్తమైన వాఁ
డనువగు త్రోవఁదప్పి భయమందుచుఁ గానన భూమిఁబోవఁగన్.

ఆ.వె. మిట్టపల్లమనెడి మేఱయెఱ్ఱడక ప్ర
వాహమడర నడవ వైపుగామి
నొక్కమిట్ట పొదల చక్కటికై చేరి
మోపువైచి కంపమునవసించి.

కం. తాఁదెచ్చిన మోపుపయిన్
బాదుగఁ దల యునిచి చాల బడలినకతనన్
హా! దైవమ యని వగచుచు
నాదురితాత్ముఁడు నిదుర నల్లనసోలెన్.

ఉ. సోలినయంతఁ గట్టియలఁ జుట్టుకయుండిన ఘోరసర్పమా
పాలను సంటినన్ నిదురపాల్పడి యంతటఁ బెద్దనిద్దురన్
గూలినఁ గాలకింకరులు కొట్టుచుఁ దిట్టుచుఁ గట్టివైచి యా
భీలతఁ గొంచుపోవునెడఁ బేర్మిరమాధిపు దూతలత్తఱిన్.

శా. అడ్డంబోయ్యనవచ్చి యామ్యభటులాలై ద్రొక్క భర్జించి యీ
యొడ్డారంపు టధర్మమేమిటికి మాయొద్దన్ విడుండీతనిన్
ఎడ్డెల్లాన రహస్య ధర్మములు నెంతేబుద్ధి చింతింప కీ
దొడ్డాపుణ్యుని బాధపెట్టఁదగునా! దుర్మార్గులై సారెకున్.

కం. అనవుడు నిటలాంజలులై
యనఘాత్మకులార! పుట్టినప్పటి గోలెన్
దినదినము జీవహింసలు
పనిగా నిటు సర్వదుష్ట పాపసహితుఁడై.

ఉ. దేహము వీడె వీని నతిదీర్ఘతమిస్రనిపాతుఁ జేయ సం
దేహమె! ధర్మమింతగలదే కలుషాత్ముని కన్న వారితో
నా హరిదూత లిట్లనిరి యట్టిద వీని విహారమైన మీ
రూహనెఱుంగలేరు సుకృతోచితకర్మ నిరూపణక్రియల్.

సీ. వంటుకట్టియలలో నంటుగాఁ దులసి కా
ష్ఠంబొక్కటున్న సంస్పర్శమాత్రుఁ
డై పవ్వళించి యాయహి విషవహ్నికేఁ
గ్రాఁగి యిట్లగుటఁ దత్కాష్ఠ మంగ
మంటియుండుటఁజేసి యధికుఁడు వీఁడు వై
కుంఠ నివాసయోగ్యుఁడు దలంప
నంత్యకాలమ్మున హరినెంచువారలు
తులసి దళంబైనఁ దులసికాష్ఠ

తే.గీ. మైనఁ దాల్తురువారలయ్యచ్యుతాను
లోకవాసార్హు లటుగాన శ్రీకరముగ
.................. ..........
నితని భజియించి విడిచిపొండిప్పుడనిన.

కం. వనమాలి భృత్యులకు బో
య నెలమి నప్పనముజేసి యటఁ దులసీపా
వనమహిమ లెఱుఁగఁగాఁ దమ
మనములఁ దలపోసి శ్రీరమావిభు భటులన్.

చ॥ కనుగొని కాలకింకరులు గౌరవసన్మతి నంత్యకాలమం
దనుపమపుణ్యదంబయినయా తులసీదళముల్ ధరించినన్
ఘనసుకృతంబుగల్గు నొడికంబుగ నజ్ఞతఁ గ్రూరకర్ముఁడీ
యనతనుఁ డంటినన్ సుకృతియౌటకుఁ గారణమేమి తెల్పరే!

తే.గీ. అనుచుహరి మాతలనిరి యాయామ్యులకును
మున్నజామీళుఁ బట్టి మీరున్నయప్పు
డెఱుకలేమిడి హరినామమెన్న ఫలము
వింటిరేకద తత్కథ కంటిరిపుడు.

కం. ఆరీతి నతుల తులసీ
ధారణ సంస్పర్శనములు ధన్యశ్రేయో
ధారణముగఁ దన్మహిమ మ
పారంబగునైనఁ గొంతపలికెద మెలమిన్.

సీ. నదులచెంగటుల వనంబులఁ గోలఁకుల
దరుల హ్రదంబుల దాపునందుఁ
దులసిఁ బ్రతిష్ఠించి యలరించి దేవపూ
జల కొదవించిన సకలదాన
ఫలవైభవంబులు బహుయజ్ఞ సుకృతంబు
గాంచి లోకముల సౌఖ్యంబునొంది
దివ్యదేహముల సందీపిత విభవము
లన్నియు ననుభవమైన పిదప.

ఆ వె. సత్యలోకమున బిసరుహ సంభవునిచేఁ
బూజలంది యవల భువనవంద్యు
నచ్యుతున్ భజింతురతని సన్నిధియందుఁ
దత్స్వరూపగరిమఁదనరి వరుస.

కం. మఱియు మరీచికి గరుడుం
డెఱిఁగించిన తెఱఁగు దేవఋషికిని విష్ణుం
డొరపుగ నానతియిచ్చిన
కరణి నదివినుండు తులసి గౌరవమహిమన్.

మ. చెవిఁ దత్కాష్ఠపు ప్రోఁగులిడ్డదళముల్ చెల్వొందఁగాఁ దాల్చినన్
భువి బృందావన మే నొనర్తు ననుచుంబూనంగ వేనట్లు నే
య విలాసమ్ముగఁ జూచి మ్రొక్కులిడ జన్మాద్యైక సాంగత్యమా
వివిధాఘమ్ములుబాసి విష్ణుపదవిన్ వేడ్కన్ వసింపందగున్.

కం. తులసీదళమున హరిపద
జలములు దలఁజల్లుకొనెడి చతురుల కులకో
ట్లు లఘుపదవి వసియింతురు
తొలఁగున్ బ్రహ్మవధ ముఖ్య దురితము లెల్లన్.

కం. ద్వాదశులఁ దద్దళమ్ములఁ
బాదుగ హరిపూజసల్పఁ బటుదీపముల
త్త్యాదరతన్ దులసికి నిడ
మోదముతో విష్ణులోకమున వసియించున్.

సీ. కార్తిక శుక్లపక్ష ద్వాదశిన్ విష్ణు
దళములఁ బూజింపఁ దత్ప్రదక్షి
ణము దదలంకరణములు గావించిన
బహుజన్మకృత ఘోరపాతకములఁ
బాసి దివ్య విమాన భాసురారోహిత
సకలలోకమ్ములు సంచరించుఁ
దన్మూలమృత్తికఁ దగఫాలమునఁ దాల్చు
వారి పుణ్యమ్ము లవ్వారి దలఁపఁ

తే.గీ. దులసి భక్షింపఁ బరువిడు దురితచయము
తులసిఁ బోషింప విష్ణు సంతుష్టియగును
దులసి వలగొన సుకృతముల్ గలుగు జాలఁ
దులసికిన్ మ్రొక్కు ఫలములు దెలియఁదరమె.

ఆ.వె. తులసి మొదలికసవు దొలఁగింపఁ దత్సంఖ్య
నైన జన్మచయ మహోఘమెల్ల
యముఁడె తొలఁగఁద్రోయు నంబువుల్ నించిన
యతని పితరులుందురతులగతుల.

కం. జపములలో గాయత్రియు
నుపవాసములన్ హరిప్రియోచితదినముః
గృప సకల ధర్మముల ఫల
మపరిమితంబల్ల తులసినను నర్చనలన్.

వ. అని చెప్పి సూతుండు వెండియు మునులకు నిట్లనియె—

ఆ.వె. అట్టి తులసి భక్తి నర్చనగావించి
దీపమిడిన ఫలము దేవుఁడెఱుఁగు
నైనఁ దన్మహత్త్వ మదివినుఁడెఱిఁగిఁతు
భానురేతిహాస ఘటిమ నెరయ.

కం. కాశీశుఁడు నిజసతితో
నా శశి యయ్యింద్రుఁ డెట్టులట్టుల న భోగా
వేశ మహాసౌఖ్యానుభ
వాశయుఁడై యుండె లలితయను సతి దానున్.

శా. ఆ కాశీశు సతుల్ లసత్సుతులాయ్యారంపు టాకారముల్
రాకాచంద్ర నిభాననమ్ములు విహార ప్రక్రియల్ గల్గు దా
రేకాధిక్య సహస్ర సంఖ్యమదిఁ గ్రో ధైర్యాదులన్నాని తా
రా కంజాననఁ గొల్తురెప్పుడు మహోత్సాహైక సంసక్తతన్.

ఆ.వె. సవతి మత్సరంబు సాలించి నెనరున
నపుడు లలితఁజేరి యబ్జముఖులు
భక్తిదయయుఁ గల్గి పరిచర్య సేయుచు
నిట్టులనిరి మోదమెసక మెసఁగ.

చం. జనపతి విన్న మన్ననలు సల్పఁగ వాఁకిటి పెద్దతెల్ల నిన్
గనిమని కొల్వ భృత్యు లతి గౌరవ లీలభజింప బాంధవుల్
మనవులు దెల్ప నైజముగ మానిని నోములనేమినోఁచితో
వినఁగడు వేడుకయ్యె ఫణివేణి! యెఱుంగఁగఁ దెల్పవే యనన్.

కం. ఏ మందటమును నీపై
ప్రేమయె కానొండు దెలుఁగు బిమ్మిటి నీర్ష్యా
సామగ్రిఁ బూనమెన్నఁడు
కామిని! నీనోముఫలముఁ గౌరవమేమో.

తే. ఎప్పుడిటవర్తులానరించు టెబ్బు దీప
ములు రమానాథ గృహమున నిలుపఁబనుచు
టింతియే కాని మఱి కృత్యమేమి లేదు
నీకు సౌభాగ్యమేమిట నెరయఁగల్గె.

చం. తెలుపుమటన్న యాలలిత తేఁట మిటారపు లేఁత నవ్వుతోఁ
బలికె నవంతిదేశమున భాసుర కారుమతీ తటమ్మునన్
గలదొక దేవతాగృహము క్రమువిశంకట సాల గోపురో
జ్జ్వల బహుచిత్ర శోభితము సారవనావృతమై తనర్చుచున్.

ఉ. వాద్య మృదంగ రావకుల వారసఖీ నటనస్ఫుట క్రియా
హృద్యతర ప్రవర్తనల నెంతయు ధూపసుగంధ బంధుర
ప్రోద్యదనేక చిత్రముల భూరి వితాన సుమాభిరామమై
యాద్యుఁడనంతుఁ డుండుటకు నర్హమునై తగునై భవంబునన్.

సీ. అట్టి విష్ణునకు నిత్యంబొక వైశ్యుఁడ
    త్యంత విభుతఁ బూజనాది విధులు
గావింపుచున్నచోఁ గార్తికమాసమ్ము
    వచ్చిన దీపముల్ వరుస నెరయ
సన్నిధినుంచు నిచ్చలు రేలు బవలును
    వెలుఁగఁగ నొనరించి వేడ్కలొదవ
నఖిల వైభవములు ననువునఁ జేయుచుఁ
    బౌర్ణమిరాఁత నట్టి భంగిఁ జేసి

తే.గీ. వేఁకువను నిద్రఁ జెందిన వేళ శ్రీశు
నెదుట దీపమ్ములటుఁ గాంతిహీనమగుచు
వర్తి సమయము వచ్చుచో వైవెఱింగి
యచట మూషికమై యున్న యట్టి నేను
నది గ్రహింపఁదలంచి జాత్యానురూఢి.

కం. ప్రమిదె నడినున్న వర్తినిఁ
గ్రమమున దంష్ట్రికులఁ దిగిచి కైకొనుచో నం
దమరిన మార్జాలము త
త్సమయము దఱివేచి నేర్పు సమకొనుకడఁకన్.

ఉ. ముంగలికాళ్ల భూమిపయి మోపఁగనీయక సాచి వి
వంగి క్రమక్రమమ్మునను వచ్చి మఱుంగున డాఁగి పొంచి—
చంగున దాఁటి పట్టిన భృశంబగు వర్తినిఁ బాత్రనుంచినన్
బొంగి వెలుంగ శౌరి ముఖపూర్ణ రుచుల్ గనుపించె సొంపుగన్.

చం. వినుఁడటువంటి పుణ్యమున విస్మృత మూషిక దేహవర్జనన్
దనరఁగ వైభవ స్థితులు దార్కొన రాజకుమారినై కడున్
ఘనుఁడగు కాశికావిభుని కామినినై బహుభోగయుక్తిచే
దినమును దీపపంక్తులిటు దేవునికే నిడఁ జేయుదుం దగన్.

కం. ఎలుకనయియుండి వర్తిగ
నిలఁ జేసిన పుణ్యఫలము జెలువము ప్రాజ్ఞ
న్న లలిత చర్యల తెలివిడి
యలవడు విభవము సురూప మమరఁగ గంటిన్

ఆ.వె. యిప్పుడిట్లు భక్తి యొసఁగిన యొకచే
దినము లక్ష సంఖ్య దీప పంక్తి
యిందిరేశునెదుట నిడుటకు సిద్ధించె
దీపదాన మహిమఁ దెలియఁడిట్లు.

కం. అని లలిత సవతులకుఁ దా
ననువుగ బోధించె ననుచు నా సూతుండ
మ్మునులఁ గనుంగొని మఱియు
న్వినుఁడని యిట్లనియె దీప విధి ఫలమెలమిన్.

శా. సింధుప్రస్ఫురదంతరీపక చతుస్సీమావనీపాలనో
త్సంధానామిత శౌర్య ధైర్యకలనా చాతుర్యతన్ బద్మినీ
బంధూద్యత్కుల శేఖరుండగుచు శుంభల్లీలలన్ బొల్చె న
మ్మాంధాతృక్షితి పాలమౌళి శుభధామంబౌ నయోధ్యాపురిన్.

కం. కులగురుఁడు వసిష్ఠుఁడు ముద
మలరంగాఁ దెల్పినట్టియంచిత నీతిన్
వెలయఁగ భూప్రజ నేలుచుఁ
గుల ధర్మము పూర్ణ మహిమకున్నిల్కడఁగా.

ఆ.వె. రమణ నశ్వమేధ రాజసూయాదులు
పెక్కుఁ జేసి యచటఁ బృథ్వీసురుల
సకల వస్తుతతుల సంపూర్ణకాములఁ
జేసె విశద కీర్తి భాసురముగ.

ఉ. నీరదవేణి సాధ్వి శుభనిర్మల చారుతరాంగి భద్ర నా
వారిజగంధి యాత్మసతి వారక సేవయొనర్ప నాప్తులున్
గూరిమి పుత్రుఁడైన ముచికుందుఁడు నల్లుఁడు సౌభరిప్రవమే
ధారసికాగ్రగణ్యుఁడు నుదారతఁ గొల్వ సుఖాసన స్థితిన్

కం. ఉన్నంత వసిష్ఠుఁడురా,
సన్నుతమతి నర్ఘ్యపాద్యసత్కృతులొనరన్
మన్నించి భద్రపీఠమ
హొన్నతగతి మెఱయమానినొయ్యనఁ గనుచున్.

కం. మఱిలోన నతీతానా
గతచర్యలు వర్తమానగతియున్ దెలియన్
జతురులగు వారి మిము నే
ధృతి నొక సందేహమడుగఁ దివురుదు నెపుడున్,

ఉ. ఏమితపంబొ సద్వ్రతములేమొ లసత్సుకృతంబు లెవ్వియో
యేమహిమంపు దానములొ! యే నొనరించితి నింత ద్వీపయు
గ్భూమియు నెల్ల నేల బహుభోగములొందఁగ రూపయౌవన
శ్రీమహిమందలిర్ప గుణ సింధువు భద్ర భజింపనియ్యెడన్.

మ. తెలియంబల్కుమటన్న భద్రయను పాతివ్రత్య చారిత్ర ని
శ్చల సాష్టాంగమొనర్చి నాదుమది నీ సందేహమే వేడఁగాఁ
దలఁతున్ మత్పతి యిప్పు డిట్లనె యతీంద్రా! సంత సంజప్యా ను
జ్జ్వలతేజోధన! యానతీవలయుఁ బ్రాగ్జన్మప్రకారమ్ములన్.

కం. అనవిని మునిమదమున నెన
రొనఁగ దంపతుల బంధులొనర గఁనిటులొ
ప్పనె లెస్సగ నడిగితివది
వినుఁడని యిట్లనియెఁ బూర్వ వృత్తాంతమ్మున్.

సీ॥ పొలఁతి మీరిరువురు పూర్వజన్మంబున
శూద్రులయ్యెడ శోణభద్రతీర
భూమి దంపతులయ్యుఁ బేమనుండంగ దు
శ్చరితుఁడై యితఁడు నిశ్చలమహాఘ
కర్మంబులొనరింపఁగని బంధువులు వెళ్ల
నడిచిన నా యూరు వెడలివచ్చి
యడవిలో నొక్క దేవాలయంబున నిల్వ
నచ్చటి యర్చకు లాదరించి

ఆ.వె. రొక్కపూట కన్న మొదవఁ గట్టడసేయఁ
గడమపూట కెందు నడిగికొనుచుఁ
బూలతోఁటఁబనులు పూని సేయుచు విష్ణు
సిద్ధబుద్ధిగలిగి చెలఁగుదనర॥

ఉ॥ అచ్చటనుండునట్టి యొడ పాళి నొకానొకనాఁటి పూఁవునన్
దెచ్చిన యన్నమింపలర దేవుని సన్నిధి భక్తిసల్పఁబో
హెచ్చగు తైలహీనత రహించఁగ కొత్తని దీపపుష్టికై
పొచ్చెములేకఁ బోసికొనఁబూనిన నూనియ చెంతనించినన్.

కం॥ ఛిద్రంబగు మర్యాదనో
భద్రా! నీవింత చించి పటువర్తిగ ని
క్షిద్రస్ఫూర్తినొనర్చుచుఁ
హ్రదిచిన నది వెలిఁగె హరిముఖాలోకగతిన్.

ఉ॥ తత్సుకృతంబునన్ భవదుదార సబోధన విష్ణుఁగొల్చియ
త్యుత్సుకతన్ మహావిభవ మూహాఁబొసంగఁగఁగోరి యిట్లుసం
వత్సరరాజ వైభవవిభన్ జెలు వొందితి రాముకుంద భా
స్వత్సుమదామదీపముల చందములిట్టి వటించుఁబల్కినన్.

తే॥ గీ॥ దైవమనుకూలమైన చోఁదానొనర్చు
కర్మములొకింత ఫలమధికము బొసంగు
దైవమేప్రతికూలమై దనరఁగర్మ
ఫలములల్పంబులని రాజు పడఁతిదాను.

వ॥ హరిన్ భజియించి యతికృతార్థులైరిద్ది దీపదాన ఫల ప్రభావంబు——

సీ॥ పుణ్యతీర్థమ్ములఁబుణ్య స్థలమ్ములఁ
బుణ్యకాలమ్ములఁబుణ్యసూర్య
శనిరోహిణీ బుధాశ్వినుల యోగములఁ బం
చామృతస్నాన ముఖ్యార్చనముల
హరిహరభేదమ్ము లాత్మనెంచకసుర
భిళ కుసుమమ్ముల వేయఁబూజ
సల్పిన నుభయ వంశములతో నెల్ల లో
కముల సౌఖ్యము లొంది కాంచుముక్తి.

తే.గీ. నూనెనిష్టార్థములు గల్గు పూనినేఁత
దీపమిడఁ బాపహరమగు తెలివి కార్తి
కమున మాఘమ్మునన్ విప్రగణము లలర
భోజనంబిడు నతఁడొందుఁ బుణ్యపదవి॥

కం॥ హరిహర దేవాలయములు
ధరణింగట్టింతు రేని ధాతృపురిన్ సు
స్థిరులగుచు విష్ణుదేవుని
చరణములొందుదురు సుకృతసామర్థ్యమునన్.

కం॥ కలవాఁడు తాఁతఁ గట్టఁగఁ
నిల మృత్తికచే దరిద్రుఁడేపునఁజేయన్
గలుగున్ సమమగు ఫలములుఁ
విలసితకీర్తులు వొసంగు విశ్రుతలీలన్

తే॥గీ॥ ద్విజులవటువులు పెండ్లిండ్లు వేడ్క నేయు
నతని సుకృతంబు మిక్కిలి యధిక మరయ
పూర్వజన్మ విశేష సత్పుణ్యమహిమఁ
గాక లభియించునే యట్టి కర్మములను.

సీ॥ కామకాంతుండను క్ష్మాతలాధీశ్వరుం
డశ్వమేధశతమ్ము లాచరించి
పుత్రులులేమినప్పుడు చింతనొంది యిం
ద్రునికడకేగి మన్ననలుగాంచి
సంతతి నడిగిన శక్రుండు దిక్పాలు
రట్లన యన నృపుండజునికడకుఁ
జనివేడుదమటంచుఁజని దిక్పతులుదాను
నబ్జజుఁబ్రార్థింప నాతఁడవని
తే.గీ సురల నుప నీతులఁగఁజేసి గరిమతో వి
వాహములుజేసినన్ బుత్రవంతులగుదు
రనిన ధరణీశుఁడట్లన యాచరించి
కడఁక ధర్మవ్రతాహ్వయుఁ గొడుకుఁగనియె॥

చం॥ పితరులు ముక్తిఁజెందఁ గడుఁబేర్మి గుణస్థితుఁ బుత్రుఁగాంచి స
ద్గతి నతిధర్మముల్ సలిపెఁగాంతల సన్నిధినొక్కయబ్ధి? మీ
యతులచరిత్రమెన్న సుగుణాన్వితులౌ తనయుల్ జనింతురా
శతధృతి విష్ణుచే వినిన చందమునుమ్మిది నిక్కమెన్నఁగన్.

సీ॥ ధరణిదివిజునికిఁ దలసూనెయంటినఁ
గలుగు గంగాస్నానఫలముపాద
మర్దనసేయ సమస్తతీర్థస్నాన
ఫలమగు వేణ్ణీళ్ల జలకమార్చ
భోజనంబిడిన నబ్బు నఖిలదానఫ
లంబులు శయనస్థలములొసంగ
నశ్వమేధఫలమ్ములగు రోగములుమాను
నచ్యుత పదమగు నావునొసఁగ.

ఆ॥వె॥ నపరిమితఫలమ్ములనుపుగ నుభయతో
ముఖి నొసంగెనేని ముక్తిగలుగు
నంత్యదశల రోగియగునెడ గోదాన
మజపదవికి నధ్వమమర నొసఁగు॥

తే॥గీ॥ పుణ్యవేళల ధేనువుఁ బొసఁగ నొసఁగ
సకలదాన ఫలమ్ములు సంభవించు
పాదుకాచ్ఛత్ర వస్త్రముల్ పరగ దాన
మిడిన స్వర్లోక సౌఖ్యము లెల్లఁ గలుగు॥

తే॥గీ॥ చీనిచీనాంబరమ్ములు చిత్రవస్త్ర
చయము నొసంగిన హరిపదసంగతుఁడగు
మహిష మేష గజాశ్వ సద్విహిత దాన
తతుల నపమృత్యుభయము దుర్గతులు దొలఁగు.

కం॥ వనజజకులులకుఁ గృష్ణా
జినమిచ్చిన నాయువేచ్చుఁ జెడు రోగమ్ముల్
ఘనవృషభ దానమునన
య్యనిమిషలోకమ్ము లొదవు నధిక స్ఫూర్తిన్.

ఆ॥ వె॥ దాతు లోహ కాంస్య తామ్ర రజత హేమ
పాత్రపంక్తి స్వాదుపానయుక్తి
దానమిచ్చునతఁడు దగు నెల్లలోకమ్ము
లను బ్రమోద మొసఁగ ననుదినమ్ము.

కం॥ యతికిం గాషాయమ్ములు
నతివృద్ధుఁడు కృపణుఁడైన యతనికి వస్త్ర
ప్రతతియు రోగికి మందును
ధృతి నిచ్చిన యతఁడు విష్ణుదేవునిఁ జెందున్॥

సీ॥ వెండియు బంగరు వెస వరారోగ్యమైనఁ
దక్కిన యవి పలత్రయము నైన
దానమిచ్చినవాఁడు తగు రుద్రు చెంగటఁ
బ్రీతి నాషాఢ కార్తికముల యందుఁ
బూర్ణిమాహముల నాఁబోతుల విడిచినఁ
దత్పితరులు శివస్థానమున వ
సింతురు బహువిధస్థిరత దున్నిన యెద్దుఁ
గరమర్థి హై నిడఁగనినఁ బుత్ర
తే.గీ. పౌత్రవృద్ధియు ననువగు పాడియావు
నైన నమరంగ నీనిన యావు నైనను
నైన, నొసఁగిన స్వర్లోకమమరఁ గల్గు
విత్తనంబిడ్డ చేసియు వెలయు శుభము॥

క౦. చూలాలికి శిశువులకుం
బాలాసఁగినయాతఁడుండు పాలకడలిపై
మేలుదధితక్రగుడములఁ
బాలికాఽధికులకు నొసఁగఁ బటుశుభమెసఁగున్.

సీ. చైత్రవైశాఖమాసములను గంధంబు
పరిమళోదకములు పానకములు
మేలిఫలమ్ములు నాళికేరాంబువు
లొసఁగ [నా ?] క సుఖమ్ములొందవు వరుసఁ
బుష్యమాసమ్మున భూరివస్త్రమ్ములు
జ్యేష్ఠమాసమున మచ్చికల మక్కు
పెద్దకుఁదగ నీళ్ళనిడుట మహాపుణ్య
మన్నిటం గడుమేటి యవనిసురుఁడు

ఆ. వె. గాన వారిఁ దిట్టఁ గలుషమ్ములొందవు ద
త్పోషణమునఁగల్గు పుణ్యచయము
హరికి ద్విజుల యందు నపరిమితస్నేహ
మగుట విప్రసేవ యమితఫలము॥

ఆ. వె. ఫలసుగంధ ధాన్య పటు శాకలవణాది
దానసమితి సౌఖ్యదాయకంబు
నిన్ని దానములకు నెచ్చు సాలగ్రామ
దాన మదియెఱుంగ ధాత తరమె॥

క౦. ఎచ్చటసాలగ్రామము
లచ్చుగ వసియించు నిధులు నత్యుత్తమ తీ
ర్థోచ్చయపుణ్యస్థలములు
హెచ్చుగ నచ్చోటు ననిరి హితమతి విబుధుల్॥

ఆ.వె. అఖిలలోకదానమైన శ్రీమూర్తి దా
నంబు సాటిగాదు నవ్యరత్న
దానచయము కలుషతతిఁబాపు నఘవర్గ
దాయి విష్ణుమూర్తిదాన మరయ॥

సీ. మహి దేవతాగృహమార్జన మల్కుట
ముగ్గులువెట్టుట ముఖ్యవస్త్ర
ములనలంకరణక్రియలు ధూపదీపోప
చారముల్ సుకృత [ సం ] సానరకరములగు

నందుఁ బ్రదక్షిణ మభివందనంబులు
నవ్యయపదశాంతులగుచుఁ బదియు
రెండు గావించుటు రీతి శంకరునొద్ద
సోమసూత్రము దాఁటరామి నిజము.

తే.గీ. హరునికభిషేక మొనరించుటధిక పదవి
వాద్యరవయుక్తి భజియించు వాంఛలొందవు
వినుతికెక్కు ధ్వజస్తంభమునుపఁ జత్ర
వర్తియగు విష్ణుశంకరావాసములను॥

సీ. తనగృహంబున నిత్యమును దేవపూజాగ్ని
పూజాపరుండైన పుణ్యరతుఁడు
నిత్యసంతోషియు సత్యవాక్యౌదార్య
భోగనిరతుఁడు విరాగుఁడమలుఁ
డఖిలధర్మశుభోగాసక్తచిత్తుఁడు
విద్యచే బ్రతికెడి విప్రవరుఁడు
శౌర్యజీవనుఁడైన క్షత్రియుండును సత్య
వాణిజ్యజీవన వైశ్యవరుఁడు

తే.గీ. కృషులజీవించు శూద్రుండు కీర్తనీయ
వర్తనులు పుణ్యలోకనివాసులగుదు
రలమితో శ్రోత్రియాన్న భోక్తలకు మఱియు
శ్రోత్రియత్వభవమ్ము లెచ్చుగ లభించు॥

తే. గీ. జ్ఞాని పౌరాణికుఁడు ధర్మశాస్త్రవేది
ప్రాజ్ఞుఁడున్ విష్ణుభక్తుఁడౌ బ్రాహ్మణుండు
శ్రోత్రియుండగు నతఁడు సత్పాత్రమగుట
నతని కొసఁగిన దాన మత్యధికఫలము॥

కం. విను నిగమార్థప్రతిపా
దనమైన పురాణతతి సతత మతినిష్ఠన్
వినినం జదివిన పుణ్యుల
కనఘగతులు గల్గు సందియము లేదెందున్.

తే. గీ. అబ్జపత్రాక్షు నిలయంబునందు రాత్రి
వినినఁ బగలింటి పాతకవితతి దొలఁగు
పగలు వినుసేని రాత్రింటి పాప మణఁగు
భాసురపురాణ శ్రవణంబు ధర్మదంబు.

సీ. చంద్రమఃసుండు వస్త్రింబున రుద్రుండు
గోదానమున మేఁటి గుఱ్ఱమొసఁగ
వరుణుండు పరమేష్ఠి పురుషదానంబున
మనుపుత్రల్పంబీయ ఘనుడు త్వష్ట
యజదానమున గొఱ్ఱె నర్యముండు ఖరముల
వేసడంబుల నీయ వెలయునిబుతి
గజముచే హిమగిరి గంధదానంబున
గంధర్వతతు లలంకారదాన

తే.గీ. మున సురాంగన లోదనమున విరించి
విద్యచే వాణి బండిచే వేడ్క నంగి
రసుఁడు జలధి యుపకముచే రథము నొసఁగ
నగ్ని దేవుఁడు సంప్రీతులగుదు రెపుడు ॥

వ. ధాన్యదానంబున విశ్వేదేవతలు తృప్తులగుదురు. ఇవి చిత్రదాన విధంబులు. ఇంక ధర్మజునకు శ్రీకృష్ణదేవుండానతిచ్చిన విధంబున మహాదానఫలంబు లెఱిం గించెద—

ఉ. ధర్మజుతోడఁ గృష్ణుఁడను ధర్మపుబుద్ధి తిరంబుగాఁగ నీ
వర్మిలి నెల్ల శాస్త్రములు నారసిచేయుదు వందుదాన స
ద్ధర్మములన్ విశేషమగుధర్మము మానవనాథ! భూమి యా
పేర్మిని ధాత్రిదానమునఁ బృథ్విఁ కిరాజగుచున్ బ్రవర్తిలున్.

తే.గీ. సస్యయుతభూమినిచ్చినఁ జంద్రసూర్య
తారలున్నంతకాలము ధన్యపుణ్య
గతుల వసియించు నాతండు గ్రతుశతంబు
నేయు ఫలమొంది లోకులు చెలఁగి పొగడ.

చ. కృతమొకవిప్రపర్యుఁడు ప్రకీర్తిత నైగమశాస్త్రవేది సం
తతశుచి నిత్యసన్మదనిదాన చరిత్రుఁడు కర్తయుండునై
సతియుసుతుల్ భజింప గృహసంగతధర్మమునన్ బ్రవర్తిలన్
మతికలఁగంగఁదత్పతి సమ్యగపు లేవడి పీడనందుచున్.

వ. తన పతింజేరి యిట్లనియె.

మ. చతురామ్నాయ నియుక్తకర్మపరతన్ సంపూర్ణభావైక సం
గతిఁజెన్నొందినని న్వరించియును దాకష్టంబునొందంగఁ జూ
చితివేళా, పొరుగిండ్లకామినులు వాసిన్ వెండిబంగారు లం
చితిలీలన్ ధరియింప నట్లునికి రెట్టించెంబింత చింతింపుమా!

ఉ. అనవుడు మాధవవృత్తి నిటులాడఁగఁ జెల్లునె వారువారు నే
సిన సుకృతంబు లెంతయు వశీకృతమై ఫలమీక తక్కునే!
వనిత! భవత్పురాకృత మవశ్యముగా భుజియింపకేలఁ బా
యు! నళిననాభుఁగొల్చి సిరులొందెద పొందుగ నింకమీఁదటన్.

సీ. అని పల్కి వ్రతము నేయఁగ దేవతాధిపుఁ
డది విఘాతము సేయ నప్సరసలఁ
బంపిన నాటలపాటలఁ జెంగట
మెలఁగంగ నతఁడు నిశ్చలత నునికి
నమరేంద్రుఁడంతయు [నబ్జజునకుఁ] జెల్ప
నాతఁడు శ్రీధరు ననుమతమున
సకలసంపదలిచ్చి చనవున నింటికిఁ
జనుమన్న వచ్చి నిచ్చలు స్వకర్మ

తే.గీ. పరత నతిథుల నరయంగ భామ ననుచు
నదిమదంబున మున్నెవ్వారైన మమ్ముఁ
బ్రోవఁగలిగెరె యని దుష్టబుద్ధి మంచి
తీర్థమును నీయ దడిగిన దీనులకును.

ఉ. అంతటఁగల్గు సంపద రయంబున దొంగలపాలుగాఁగఁ దా
చింతిలి ధర్మమేమఱితినీ! నిను బాసెద నంచుఁబల్కి న
శ్శాంతునిఁ జాలవేడికొని కామిని తా మును చెప్పినట్టుగా
నెంతయుఁజేయఁ దక్కుధనమెల్ల వ్యయంబగుడున్ గృహస్థుఁడున్.

కం. అనుకూలభార్యయును స
జ్జనసంగతి మేటివిద్య సత్సంతియున్
గనని గృహస్థు వసింపఁగ
వనమే మేలింటి నలఁగి వర్తిలుకంటెన్.

కం. అనియిల్లుదక్కఁ దక్కిన
ధన మతిథుల పాలుచేసి తగనుండఁగ మి
న్నున భూమి దానమున నీ
కనువగు సిరులొందవుననిన యా వాక్యములన్.

ఆ. వె. దత్తుఁడాతఁడా గృహక్షేత్రముల దాన
మిచ్చి కల్మిఁగాంచి సచ్చరిత్ర
వర్తనముల మిగుల వైభవములఁగాంచి
యిహపరముల సౌఖ్యమెల్లమి వొందె.

కం. నను గూర్చి పుణ్యకాలం
బున నన్నము వెట్టు ఘనులు భూదానము నే
సిన సుమతు లెల్ల సుకృతులు
అనుపగ గనియుంద్రు మత్పదావాసమునన్.

సీ. ధర్మముల్ దాఁ జేయ దగ నితరులచేతఁ
జేయింపఁ జేయఁ జూచి ముదమందఁ
గలవు నానావిధ విలసితభోగమ్ము
అపవర్గమును విను యమతనూజ!
యుభయతారకమగు నుర్విదానంబు స
త్పాత్రంబు నాఁదగు బ్రాహ్మణునకు
నిచ్చిన పుణ్యాత్ముఁ డిచ్చట వైకుంఠ
పురి విష్ణుసామీప్యగరిమ నమరు

తే.గీ. పరులొసంగినఁ బాలింపఁ బ్రబలు దానొ
సంగుకంటెను నినుమడౌ సత్ఫలంబు
దానిఁ బాలింపకుండినన్ దానొసంగు
టదియు నిష్ఫలమగు ధర్మవిదితసరణి ॥

తే.గీ. దానమున స్వర్గభోగముల్ దనరు పాల
నమున నచ్యుతపదవియే యమరు గానఁ
బాలనము సేయు పుణ్యంబు పాటియగునె
దానములు పెక్కు సేయఁ దద్ధర్మ మరయ.

కం. భూసురుల కిడిన ధారుణి
కాసపడిన కుమతి నారకావాసి యగున్
భూసురభూమియె తోఁబు
ట్టౌ సర్వనృపుల కననుభవాస్పద మగుటన్.

కం. సుక్షేత్రదాతలకు నఖి
లక్షేమశుభంబులున్ విలాసము సుఖము
న్యక్షేత్రదాత పశువై
యీక్షితి జడజన్మమొంది హీనత పొలఁగున్.

తే.గీ. జ్ఞానదంబు సరస్వతీదాన మరయ
నది మహోన్నతవైకుంఠపదవి నిచ్చు
విద్యఁ జెప్పుట పుస్తకవితతి యొసఁగు
టెలమి దానంబు నాఁదగు విలసితముగ.

క. మేలగుధాన్యము విద్యా
శాలియగు మహీసురునకు సన్మతినొసఁగన్
శ్రీ లలితధాన్య ధనపతి
యై లావణ్యమునుబొందు నంచితచర్యన్.

తే. గీ. పూవులు సుగంధచయము తాంబూలములును
వ్యజనములు దానమిచ్చినవాఁడు కలిమి
గలిగి బహుభోగయుక్తుఁడై వెలయఁబుట్టు
[ఛత్ర ?] దానమ్ముచే పరిష్ఠతవహించు.

కం. తేరులు పరికరములు నిడ
నారూఢిన్ వన్నెగాంచి యాత్మజపౌత్ర
శ్రీరమ్యుఁడగుచు మెఱయున్
వారక పాదుకలొసంగ వరభాగ్యుఁడగున్.

సీ. చలికాలమింధనంబులు విప్రులకొసంగఁ
గాయ మయ్యగ్ని సత్కాంతినెసఁగు
కన్యామణిస్వర్ణ ఘనదానముల మించి
సతి భామ భూషణ వితతిఁగాంచు
వన్నెకోకలు రత్నవరభూషణము లీయ
రూపవైభవశుభారూఢుఁ డగును
సర్షప తిల పాయస కృపీట దానాళి
నురువిభవైశ్వర్యయుక్తి నమరు.

తే.గీ. మఱియు సద్ధర్మ కైంకర్యమహిమ విప్ర
దేవ సంతుష్టిగావించు ధీరవరులు
చక్కదనమును దృఢమును సౌఖ్యమొంది
యాయురభివృద్ధిచే మింతు రవనియందు.

వ. హవ్యకవ్యకారణంబులును సకలజనాధారంబులును నగు సురభిగణంబుల దానంబత్యుత్తమఫలదంబు నిహపరసాధకంబు నగుంగావునఁ దన్మాహాత్మ్యంబును వివరించెద.

చ. మారుఁడు సతీవియుక్తవికలాత్మతచే దపమాచరింపఁ ద
ద్వరతపవంత పుట్టియిడ వారిజసంభవనిర్మితంబు భూ
సురసుర వర్ధనీయ పరిశోభితమై తగుధేనువా జటా
ధరము తృణౌఘబుద్ధి విగఁబట్టి తెమల్పఁగ నుగ్రుఁడుగ్రతన్.

ఉ. చిచ్చఱకంటఁ జూచుటయుఁ జెల్వగు మై కమలంగ లేవ నే
కచ్చటఁగూలఁజూచి కమలాసనుఁడామహిమానియుక్తుఁడై
వచ్చినమస్కరించి గిరివల్లభ! యాజ్యముద్రావి దేవతల్
హెచ్చుగనిట్లు సేసిరిదియొల్లిన వారలతృప్తి కెట్లొకో.

మ. అనుడెంతేదయతోడఁ జేతనిమురన్ హర్షంబుగా నాశ్రు చ
య్యన భగ్నాంబకవహ్ని ధూమపరిలిప్తాంకాతి గాత్రంబునన్
దనరంగాఁ గపిలాఖ్యధేనువర మాద్యంబయ్యె దేవేశుఁ డా
డిన ముఖ్యస్థితినొప్పె మానుటమరుల్ డెందమ్ములన్ మెచ్చఁగన్.

మ. అపరాధక్షమచేసికోవలయు నంచాయావులంతంతనం
దపునందిన్ మదనారికిచ్చుటయు నాథర్షుండు సత్యాఢ్యుఁడై
యపుడొప్పారఁగ వానిఁ గేతువును వాహంబున్ మహాప్రేమ న
చ్చపుసఖ్యుండునుగాఁగఁ దాఁగయికొనెన్ శంభుండు సంరంభియై.

సీ. చ్యవనుండు ప్రాదినీజలములఁ గ్రుంకిడి
తపము సేయఁగ జాలధరుఁడొకండు
వలవేసికట్టి భూవరుఁడగు మాంధాత
యొద్దకుఁ దెచ్చిన నుర్విభుఁడు
నెప్పటిచోటున నిడుమన్న నమ్ముని
వీనికిబదులిచ్చి విడువుమ! నను
నూరకచనఁగ రాదో నృప! యనుడు వ
స్తువులెన్నియిడ నవి తులకురామి.

తే. గీ. నంతఁగరజాతుఁడను ముని యావునిడఁగ
సవతు వచ్చును నా నట్లు సల్పె విభుఁడు
గాన నిల హవ్యకవ్య విధానములకు
నర్హమగు తత్ప్రభావ మనంత మరయ.

సీ. గోదానమహిమ లెక్కుడవ సుకర్మాఢ్యుఁడౌ
విప్రుఁడుగార్హస్థ్యవృత్తమాని
ముదిమిచేఁదపము సొంపొదవఁ జేయుచు సిద్ధి
నొంది యింద్రుని కడనుండ నప్పు
డమరేంద్రుదూతలయ్యమరేశుతో యమ
భటులిందులకువచ్చుఁ బాపనులకు
నడ్డమ్ము వచ్చి తదావాసమునకుఁ గై
కొని చనిరనగనునని మిషపతి.

ఆ. వె. యఘముఁబాలఁజేసి యావునిచ్చినవార
లర్కభవునిఁజూచి యమరపురికి
వచ్చువారుగాని యచ్చటనుండరు
ధేనుదానఫలము తెలియఁడిట్లు.

క. అపమృత్యు వారణమను న
చ్చపుబల్కును ద్విజుఁడు విని నిజప్రభువుల కి
ట్లుపదేశమిత్తునని ది
వ్యపుయానము నెక్కివచ్చె యశరీరి క్రియన్.

ఆ. వె. స్వర్గమభిలషించు సాధువుల్ గోదాన
పరులుగాఁగవలయు దోలకనిరొండ
నెర సువర్ణమైన నిష్కద్వయంబిచ్చి
యట్టిఫలముగాంతు రనుచుఁజనిన.

కం. వారలు తద్బాంధవులున్
ధీరత గోదానవృత్తిఁ దెలిపొందిరి యి
ద్ధారుణి దేవ ప్రీతిద
మారయ నదిగాక యొండులగునె యరయఁగన్.

తే. గీ. పుణ్యకాలమ్ములన్ గుణగణ్యమైన
సాధుధేనువు దానంబు సల్పునేని
దాని రోమంబులెన్ని తత్సంఖ్య దివ్య
వర్షములు స్వర్గమున వైభవమున నమరు.

కం. చరమంబునఁ దద్దానము
పెరపునఁ గావించునేని విను యమపురపై
తరణీ తరణమ్మున సుర
పుర భోగము లొందు నధిక పుణ్యస్ఫురణన్.

కం. అనిమిషులకు హవ్యంబును
ఘనమౌని పితరులకు నెల్లఁ గవ్యము వారి నం
చును దామరసభవుండిల
ననుపమముగ ధేనుగణము నమర సృజించెన్.

కం. ధేనువులున్ బ్రాహ్మణులున్
బూనిక నొక రూప విశద పుణ్యస్ఫురణన్
ధీనుతగతి నవలోకన
దానార్చన విధులు జనుల ధన్యులఁ జేయున్.

తే. గీ. సరవి గోబ్రాహ్మణులఁ దృప్తిసలుపు నతఁడు
సత్యవాదియు నిఖిలాత్మసముఁడు నౌగ
నిరతుఁ డోదనదాతయుఁ బరమసుకృతులు
వంశపావనుల పవర్గవల్లభులును.

కం. శ్రోత్రియుఁడు గుటుంబియు నగ్ని
హోత్రిసురు వేదకి వేద్యాదానమొసఁగు స
త్పాత్రుఁడు నుభయ కులంబులు
చిత్రగతిన్ సత్యలోక సీమ వసించున్.

చం. వలపునఁ జాలమేపులును వారియుఁ గల్గఁగ రక్షణక్రియా
పరత నొలంగినన్ ఖలులు బల్విడిఁ దోలుకుపోవుచో ధురం
ధరబల శౌర్యతం దతిమి తాలిమి గ్రమ్మఱదెంచినన్ మహా
మరపురభోగ సంపదలు మక్కువగాంచి చరించు నెంతయున్.

కం. ధేనువులకు విప్రులకుం
గానెమ్మిఁ బోసంగు రణముఖంబునఁ దెగు న
మ్మానధనాఢ్యునిఁ గైకొని
పూనికతో నప్సరసలు భోగింతు రటన్.

చం. పతి హిత వృత్తికై పొలియు భంగికి నెక్కుడు విప్రరక్షణ
స్థితిఁ దెగటారుటల్, మిగులఁ జేకుఱు పుణ్యము గోహితార్థమై
ధృతి నని నీల్గు నాతనికి దివ్య సుఖమ్ముల వేమిదొడ్డ! గో
స్థిత భవనమ్మున న్మెలఁగు ధీరతఁ గల్పశతమ్ములున్నతిన్.

మ. పదియాఁవుల్ గడు వేసవిన్ గడుపునింపన్ బావిఁ గల్పించు స
న్మద చారిత్రుఁడు మేపువెట్టు ఘనసౌమ్యస్థైర్య హృత్పుష్టుఁ డా
ప్పిదపున్ [గో ?] భువనంబునన్ జలనిధుల్ పృథ్వీదిశాక్రాంత మా
టది గన్గొంచుఁ జరించుసంతతశుభాహ్లాద ప్రసాదాకృతిన్.

సీ. ఉపవాసములఁ దీసియున్నచో వానలఁ
దాడియఁబెట్టిన వ్యాధి దడవినప్పు
డరసి ప్రోవకయున్న నతితృష్ణ బడలింప
పడుకచో సమముగఁబరగఁజేయ
కునికి యాఁ గుఱ్ఱల దినమును బాలచేఁ
దనుపక యున్నఁ దత్పాతకంబు
విల నెన్నవశమె నిచ్చలు బఱుపీడచే
నిరయంబున న్వాఁడు నిరతనార్తి

తే.గీ. కోరలఁబొదలుచు బాధలఁ బఱచు యముని
భటుల బ్రతిమాలు నతిదీన భాషణముల
ధేనుపోషణమున కెచ్చుదీర్ఘసుకృత
మరయఁ దప్పిడనముకంటె దురితమెద్ది !.

కం. దానము సేసినవానియ
నూనఫలంబులకు లెక్కయున్నదె తద్గో
మానేక వర్షసంఖ్యను
ధేనులి గోలోకవాసధృతిఁ జెలువలరున్.

ఉ. కొమ్ములయందమున్ సొబగుగుత్తియు సద్గుణయుక్తమున్ సుధా
సమ్మదమాధురీ రసవిశాలత దీర్ఘతవాలమొప్పఁగా
నొప్పగునావు వేదయు నిజోచిత కర్మియు శ్రోత్రియుండు నా
నమ్మహిదేవునర్చనలనారసి యిచ్చిన మేలు చేకురున్.

కం. పాత్రునకిచ్చిన సబల
సుక్షేత్రాంకుర రీతి వృద్ధిఁ జెలఁగు ఫలము దు
ష్పాత్రున కిచ్చిన నూషర
ధాత్రీ స్థితబీజగతి వృథయగున్ ఫలముల్.

చం. కపిలల నిచ్చు నేని నధికంబగు పుణ్యము దేవతోపయో
గ్య పరిణతిం దనర్చు నగు నా సురభీఘృత దుగ్ధముల్ తదీ
య పరత లేక తానె కొనునట్టి దురాత్ముల శ్రాద్ధదేవుఁడ
న్యపరిమితైక బాధల మహోగ్రద లొందఁగఁ జేయునెప్పుడున్.

తే. గీ. ఉభయతో ముఖి విప్రుని కొసఁగ నుభయ
వంశ తారక మగును దుర్వార మహిమ
తండ్రి కడవారు పదియగు తరములట్లు
తల్లికడ వారు దివ్య పదస్థులుగను.

తే.గీ. శిశువుగలవాఁడు యాగముల్ సేయువాఁడు
దేవ పూజా విధేయుండు తెరువులనొడ
వెలయఁ జలి పందిరులు పెట్టి ఫలము లొసఁగ
నావునిచ్చినవాఁడు పుణ్యాత్ములరయ.

కం. కులహీనునికిన్ లోభికి
నలవడ మూర్ఖునికిఁ గపటియగువానికిఁ బం
చలున కనాచారికిడం
గలఁగఁ దతికష్టనిరయగతులబ్బెఁగున్.

కం. ఎప్పుడైన నన్నదానం
బపరిమిత ఫలాస్పదంబు హర్షంబును సత్
కృపదళ కొత్తఁగనిడినన్
విపులయశః పుత్రపౌత్రవిభవములొదవున్.

సీ. ఉద్భిద సంజ్ఞచే నొప్పగు దరుగుల్మ
లతలు స్వేదభవసంగతులఁ గ్రిములు
దంశాదులండజతతి జలచరపక్షి
చయము, జరాయుజ సమితి మాన
వులు పశుసంతతి యిలఁ బుణ్యమహిమచే
దివిఁ బుట్టుదురు నరుల్ దేవతలనఁ
బ్రకటిత పాంచ భౌతికములన్నియునట్టు
లగుట దేహములు కర్మానుసరణి

తే. గీ. స్థావరములెల్ల నట్లగు స్థావరముల
నన్నములు పుట్టు జనమెల్లనవి మెసంగు
నుర్విజలములఁ దడిసి వాయువున నావ
రింపఁబడి విత్తుదానంకురింపఁ దొడరు.

ఉ. వెండియు నీఁట నాన నలవిత్తున నాళమునందుఁ బర్ణముల్
గాండము దానియందుఁ గడఁకన్ వెసమూలముగల్గి పూవుఁగుం
బండులు వెన్కలన్ బొడమ వాటిలు సస్యములున్ ద్రుమంబులై
యుండఁగ జంతుసంతతి నిజోచితభుక్తిఁ దనర్చి వర్ధిలున్.

ఆ. వె. ప్రాగములను దుపయుఁ బటుతుషక్షీరముల్
క్షీరయుక్తిఁ బొడమి చెలఁగు తండు
లములు దాన సస్యమమరు నోషధుల వ
ర్తనములిట్లు శాస్త్రధర్మగతుల.

సీ. యవలాదిశాలిపర్యంతమ్ము సప్తద
శకము ప్రఖ్యాతమై సరవి నోష
ధులునాఁగ మెఱయు నవ్వాలివెల్లత్తుద్రాక్ష్యఁ
బోలుపుగాఁదండులములు పొసఁగిన
యన్నంబు దేహాన నటఁ బక్వమై సప్త
ధాతుసంతతి వృద్ధిఁదనరఁజేయు
నవి నాడీ తతిఁజెంది యా ప్రాణవాయ్వాది
గతులచే వడి బహిర్గతములగుచు

తే.గీ. సారమంతయు శుక్లమై మీఁది జన్మ
హేతుకరమగునది సృష్టిహేతువగుట
నన్నమే బ్రహ్మమనుచు వేదార్థ విదులు
పలుకుదురుగానఁ దద్దానపటిమ హెచ్చు.

కం. ప్రాణాధారముగా ని
ర్మాణముగావించె ధాతమహి నన్నమునన్
ప్రాణము లిచ్చుట లెక్కవ
త్రాణతఁ దత్క్రియకు నెక్కుడానము గలదే.

కం. జపములు తపములు హోమము
లుపవాస క్రతు చయంబు లొదవించు ఫలం
బుపమింపఁదగునె యన్నద
విపుల మహాసుకృతమునకు విశ్రుతలీలన్.

చం. దినమనమన్నదానమున దేవతలందఱు దృప్తినొంది పా
వన శుభమిత్తు రార్యు లనవద్యులు నా నుతియింతు రెంతయున్
వినుతిఁ దదీయ వంశజులు విశ్రుత ధాతృపదమ్ముగాంతు రా
ఘనులకు సాటిలేరచటఁ గంజదళాక్షుని రూపమొందుటన్.

మ. వినుమో ధర్మజ యన్నదానము జగద్విఖ్యాతమున్ దృప్తిదం
బనఘం బాత్మహితంబు ముత్కరము విప్రాఢ్యుండు మున్ బుత్రకుత్
మనుమల్ కాంతయు సర్వవస్తువులు సౌమ్యస్ఫూర్తియుంగల్గి ధీ
రనులై భక్తము బెట్టి నిత్యము సుపర్వశ్రేణి వర్ణింపఁగన్.

సీ. అతని మనశ్శుద్ధి యరయ శచీభర్త
జడివాన గురిసి బెగడు గలచియు
తానప్పుడొక వృద్ధ ధరణీసుపర్వుఁడై
చనుదెంచి భుక్తి వేడినఁ జెలంగి
రమ్మని యర్చించి రమణిఁ బాకము సేయ
ననిచి తద్గోష్ఠి గృహస్థుఁ డున్న
యత్తఱి దేవతలందఱు విప్రులై
యన్నంబు వలెనంచు నడుగుటయును

ఆ. వె. వీరలడయ భుక్తి విధమొల్లనంచు ముక్
వృద్ధు పల్కు బాస విడమి వంతు
కట్టియలకు లేమిఁ గాంత చింతిల చీర
లెల్లనూనె నద్ది యిచ్చి విభుఁడు.

శా. అందుం బాకము గాక దేవతల మాయన్ జిక్కినన్ గాంతయున్
గుందన్ బాదము లగ్నిలోన నిడు మోహోన్మాయ్యయన్ సాధ్వియ
ట్లుం దెల్వొందుచు వంటసేయుటయు లీలన్ దగ్ధపుం దెల్లవా
రిం దెచ్చెన్ వెసఁ బంక్తికై నపుడు సంప్రీతాత్ముఁడై యత్తరిన్.

కం. పెంకోడలు గ్రాఁగి వెసధర
ణిం దొరఁగిన సాధ్విఁ జూచి నైరిశోకమునన్
గుందుచు గృహపతి పడ్డన
కుందోడరిన నింతియిడక కూడదటన్నన్

తే. గీ. అతఁడు వంటయింటికరిగి చిక్కిన సాధ్విఁ
జూచి మూర్ఛవోవ సుదతి లేచి
యింద్రుకరుణవలన నిడఁగ భోజనము గా
వించి సురలు విభునిఁ బిలువు మనుడు.

క॥ అతిథులు భుక్తిం గొనిరో
చతురా ! రమ్మనుడు నతఁడు సంతసమున సం
స్తుతులమర వచ్చి యా దే
వతలకు నుపచారరీతి వార్తలు నొడివెన్.

ఉ. దానికి సంతసింపుచు శతక్రతుఁడా మిథునంబు నెంచి మీ
రానిక మత్పదంబున మహామహిమంబున నుండి యంత వా
క్యానను వెంతనుండఁ గల యద్భుత కర్మలటంచు వారి స
న్మానపుఁ గోర్కి లిచ్చి సురమండలితో దివికేగె వేడుకన్.

తే. గీ. పూని హీనుఁడు కోరిన యేనిఁ గరుణ
దనర నాతిథ్య మొనరింపఁ దగవు బడలి
యన్న మడుగఁ బరితపించు టర్హమగునె
శాస్త్రి కోవిదులైనట్టి సజ్జనులకు.

కం. పెట్టమిని దరిద్రుండై
పుట్టుం బాపములె సేయు పూని యితరులన్
బట్టుగ వేదున్ జులుకన
దొట్టఁగ భువినంతకంటె దోషముగలదే

ఉ. దానములందు మేటి శుభదాననిధానము దేవ మోద సం
ధానము ముక్తికాంత పరిధానము సన్నుతధర్మ సంతతా
ధానము సర్వలోకగతిధాన మనూన రసాన్నదానమా
మానిత ధర్మవేదులగు మానవకోటుల కెన్ని చూడఁగన్.

ఆ. వె. అన్నదానమాది యఖిలదానములకుఁ
దృప్తిఁజేయఁగానఁ దృష్ణ మఱియు
జారఁజేయు నుదకదానముల్ గాన న
న్నోదకముల సాటి యొకటిగలదె !

కం. దట్టపుఁ జలిపందిరులన్
బట్టగు శీతలజలంబు పరిమళయుక్తిన్
బెట్టగు వేసవి నిచ్చిన
యట్టి మహాముఖుఁడు వరుణు నాకృతి వెలయున్.

కం. ఏ జాతివానికైనా
రాజితమతి నన్నమిడ సురల్ మునులున్ ని
ర్వ్యాజోపకారకరుణో
ద్వేజిత మన్నింతు రతని విభవప్రదునై.

కం. ఇంపుగ "నన్నస్య క్షుధి
తంపాత్రమ్మ"నెడి మేటిధర్మోక్తిఁ దగన్
బెంపలరు నన్నదాతకు
సంపత్సౌభాగ్యభోగ సంతతులొందవున్.

వ. అని వాసుదేవుండు కౌంతేయాగ్రజున కెఱింగించెనని సూతుండు వెం
శౌనకాదుల కిట్లనియె—

కం. పాడుగ నిందులకై కల
దాపట నితిహాసమొకటి యమధర్మజ సం
వాదము, గజపురిరాజ్య
శ్రీదనరుచు భరతవంశ శేఖరుఁడెలమిన్.

మ. ఒకనాఁడాగమ కృత్యముల్ విదితధర్మోపాయ కర్మంబులున్
ప్రకటస్ఫూర్తినొనర్చి విప్రజనముల్ పంక్తిన్ వసింపన్ రుచి
ప్రకరంబుల్ దళుకొత్త హేమమయపుంపాత్రంబులన్ భక్ష్యభో
జ్యకరంభంబులునించినట్టియెడ నిచ్చన్ ధర్మజుఁడువ్యగ్రతన్

కం. చండాలాకృతిఁ గైకొని
మెండుగఁ జాపలకు హేయమేళన నిజగా
త్రుండగుచు వచ్చి వాకిటి
తండన్యసియించి యాచటి ద్వారికులన్.

చం. కనుగొని ధర్మసూతి కెఱుఁగన్వినిపింపుడు నాదురాక నా
విని యిది దేవతార్చనకు వేళ భుజించిన యంతఁగొల్వులో
నను బొడఁగందుఁగాక యనినన్ గడుశోకము దెచ్చుకోలుగాఁ
జనుగద రాచపుత్త్రుకకు చాలదె యింతటి నిష్ఠలందొకన్.

కం. రాజ్య ప్రతిపాలన గుణ
పూజ్యము గావించి దినము భూసురకర్మ
ప్రాజ్యత మెలఁగిన ధర్మ
త్యాజ్యంబగు నంచునాత్మఁ దలఁచఁడొ వినఁడో.

సీ. అని పెక్కుమాటల నాతని సన్నిధి
గాంచి కష్టంబు తనకంటె నెవ్వ
రనిపాతకుల దెల్పవిని మెచ్చి మంచిదె
యాఁకలి గొనినాఁడ నన్నమిడఁగఁ
బంపవే యనరాజు బ్రాహ్మణుల్ భుజియించు
పిమ్మట ననవుడు పేర్మిధర్మ
శాస్త్రార్థములు దెల్పి సమకొల్పియిడరాగ
నవనీశ్వరులయన్న మధికకలుష

తే.గీ. మరయ వైద్యుల పదువురి యఘముసూన
రియు దదీయుల [దండతి] దియు ధ్వజియు ?
నట్లు వేశ్యయు వేశ్యలదంతయైన
పాతకపురూప మెన్న నృపాలుఁడనుఁడు.

ఉ. కుంది వివర్ణుఁడైన నృపకుంజరుఁగన్గొని బోయవాఁడొకం
డందముగాఁగ విప్రవరు నాఁకలిఁ దేనియ చామబియ్యమిం
పొందఁగనిచ్చి తీర్చు ఫలముర్వికి నెల్ల విభుండుగాఁగఁ బు
ట్టుం దగునాఁటి విప్రుఁడుకిడంగి పతివ్రత యోర్తుఁ బంపఁగన్.

ఆ.వె. అన్నదానమహిమ లడిగిన నారాజ
శిశువునాఁటి తెఱఁగు సెప్పియంత
యింతయన్యెనెంత యొంతగునో యది
తెలిసికొమ్మటంచుఁ బలికె ననఘు !

కం. కావున నీవున్ ధరణీ
దేవతలకు నన్నమిడుట ధృతసుకృత శుభ
శ్రీవెలయుదువని చనిరో
భావనమగు నన్నదాన పద్ధతులిట్టుల్.

తే. గీ. చౌలమున ద్వాదశుల షోడశమునఁ గుడుచు
నతని పాతకమింతన నలవియగునె
పురుషుఁడే కామభుక్తిచేఁ దరుణియగుచు
బుట్టునే జంతువునైనఁ బూనిపిదప.

కం. సుతుఁడు యతియైనచో నా
సతి పురుషుండగుచుఁ బుట్టు సతియగుఁ బురుషుం
డతిఘోరైకామాన్నా
ద్భుతభుక్త మహాఘమున విబుధనుతులారా !

సీ. బ్రాహ్మ్యంబలంకార భాసితయగుకన్య
ధారవోయుట త్రిసప్తకులజులకు
మోక్షదంబగు యజ్ఞములకు ఋత్విగ్దక్షి
ణ యొసంగ దైవ్యమనంగఁ దనరు
నది ద్వ్యసప్తకులుల కపవర్గమొనఁగూర్చు
గోమిథునక్రయ హోమమునకు
నొసఁగ నార్షంబది యొసఁగు నేడుదరాల
వారికి ముక్తి దుర్వారగరిమ

తే.గీ. నొండొరులకు బదుల్ కన్య నొసఁగుటదియె
పరగు సంతాన కారణ పదమనంగ
నదియుఁ ద్రిపురుష మోక్షదమగుట ధరణి
సురులకివి నాల్గుయోగ్యమౌ పరిణయములు.

కం. మఱి గాంధర్వము రాక్షస
మరయఁగ రాజులకుఁ జెల్లు నవియుంగూడన్
గుఱివైశ్యుల కాసురమగు
నెఱిఁ బైశాచికము శూద్ర వివాహమునకగున్.

కం. ఉభయకులపవిత్రం బతి
శుభఫలదము నైనకన్య శోభనరేఖా
విభవము కులశీలము స
త్ప్రభుతయుఁగల మునికొసంగ భాగ్యములమరున్.

కం. ఇనమండలపరిమిత మిల
ననుపుగఁ బ్రతివర్గమొకటి యవల నిడంగా
జనుకాలము కన్యాప్రదుఁ
డమరమహోగములనందు నంచితమహిమన్.

కం. కులమును రూపము శీలము
కలిమియు విద్యయును బ్రతిభ గల వరునకు వేఁ
జెలువ నొసంగుట పుణ్యం
బిలఁ బుణ్యదినాళి నిచ్చుఁ బెంతయు నొప్పన్.

ఆ.వె. పుణ్యతీర్థపుణ్య భూముల గ్రహణంబు
నయనవిషువులైన యట్టియెడల
ఘనతఁ జేయునట్టి కన్యకాదానంబు
సార ముభయవంశ తారకంబు.

సీ. కౌండిన్యకులుఁడొక్క పండితాగ్రేసరుం
డవనీసురుండు వేదాంతవేది
శిష్యులతో వనసీమకుఁ జని కంద
మూలఫలాలి కిమ్ములఁ దిరుగుచుఁ
ద్రోవఁ గానక ఘోరమహావనంబునఁ బడి
యటనొక్క కూపమధ్యమునఁ బాహి
పాహియన్ బల్కులు పలుమఱు వినిచేరఁ
బోయి యెవ్వరు లేమి బుద్ధికలఁగి

తే.గీ. మఱలి రా మొదలిటి మాడ్కి మాటలు విని
తిరిగి చూచుచునటఁ గాంచి నెరయు ధూమ
మతఁడు మీరెవ్వరనుడు మీ పితరులమిట
యనుచుఁ బల్కినఁ గడు విస్మితాస్యుఁడగుచు.

కం. మీరిచట నిట్టులుండఁగఁ
గారణమేమనుడు మాకుఁ గల కులభవులె
వ్వారలు పుణ్యదమగు నా
చారమున మెలంగమిన్ గృశస్థితి వలనెన్.

శా. గంగాస్నానము సేతుసేవయును శ్రీకాంతార్చనల్ పుణ్యతీ
ర్థాంగాగాహన దానధర్మములు సేయన్ లేరు నీవైన స
త్సాంగత్యంబునఁ గన్యఁ బాత్రునకవశ్యంబిచ్చితేనిన్ మహో
త్తుంగఖ్యాతుల మాకు సద్గతులు జెందున్ వేఁగఁగావింపవే!

ఆ.వె. పితరుల కపవర్గ గతిగల్గఁ గన్యాప్ర
దానమొకటి దక్క మాననీయ
మితరకర్మచయము లెందు లేవాత్మజ
నైన ద్రవ్యదాన మైన మేలు.

కం. పేదలగు విప్రులకుఁ బెం
డ్లాదరమునఁ జేయ లెస్స యందున దోడై
నాదయఁ దోడ్పడ మేలగు
శ్రీదనరుఁ బిత్ర్యాణ మది యశేషముగు దగన్.

చం. అనవుడు నట్లకాక యని యాయవనీసురుఁ డాత్మకన్యకన్
ఘనుఁడగు బ్రహ్మచారికి సుఖస్థితి నిచ్చి సమస్తపుణ్యముల్
గని మనెఁ దత్పితృప్రతతిగాంచె సముంచిత దివ్యలోకముల్
మనుజవరేణ్య! తచ్చరితమంజుల పుణ్యద మెంచినన్వినన్

కం. కలవారు దానధర్మా
కలనన్ బుణ్యమ్ముగంద్రుడు గడు దారిద్రుల్
గల రమిత పుణ్యలోకం
బుల నుండఁగ, నుదక మొసఁగి భూరిస్ఫురణన్.

కం. అన్నమున కెచ్చు తృష్ణా
పన్నుల ప్రాణములు నిల్పు పానీయము లి
ట్లున్నన్ దానికిఁ దులయౌ
సన్నుత దానములులేవు సాధువిచారా!

సీ. భాసురంబైనట్టి బదరికాశ్రమమున
వెలయు సుశీలుఁడన్ విప్రవరుఁడు
శీతలజలములు నేర్చి యందఱకిచ్చు
ప్రియపత్నియును దానుఁ బ్రీతితోడ
ఘనతని శోధనకింద్రుఁడటు వానలేమిఁ జే
సిన ద్విజుండు తపంబుచేత విష్ణు
కరుణనచ్చట బావిగావించి యానీట
నందఱి బడలిక లణఁచనంత.

తే.గీ. నమరులును దాను సురపతియందు దినము
నీళ్లు మిగులకయుండ నగ్నియును గ్రోల
వేసరక నిచ్చు కాగుల వెలితిదీఱ
భార్యతోడ్పడ నెప్పుడా బ్రాహ్మణుండు.

కం. అనలుని దోడ్కొని యొకనాఁ
డనిమిషపతి వచ్చి జలము లన్నియు త్రావన్
వనమాలి నెంచి విప్రుడు
తనియఁగ నయ్యగ్ని నీళ్లు త్రావించెఁ దగన్.

తే. గీ. అంతట నవగ్రహమ్ముల నటుకుఁబంప
తారలా జలమానుచో దానగుతిసె
ఘనత హరిభక్త ధర్మవిఘ్నములు సేయ
నజ హర పురందరులకైన నలవియగునె.

కం. నెమ్మినుశీలుని దివికిఁ
రమ్మనుటయుఁ దైర్థికులును రహి నిచటిఘనుల్
ఇమ్మహిఁ గనువారలు మో
క్షమ్మునఁ దనరంగ వరము చతురత వేఁడెన్.

ఆ. వె. అటులనిచ్చి విష్ణుఁడా విప్రమిథునంబు
నమర నునిచె నవ్యయపద సీమ
గాన నుదకధ్యాన మాన మేదానంబు
గాన మనుచుధర్మ సూనుతోడ.

వ. తెల్పి వెండియుఁ బుండరీకాక్షుం డిట్లనియె.

కం. భద్రకుఁడను విప్రుఁడు ని
క్షిద్రాఘాచారకృత్య నిరతుఁడు మాక్షాశ్రీ
భద్రగుణాన్వితుఁడు సో
పద్రవ కర్ముఁడు నగుచుఁ బరగెన్ ధరణిన్.

చం. పతితుఁడతండు యౌవనవిభాసితుఁడై సొగసుల్ ఘటించి వా
రతరుణులం బరాంగనల రట్టున గుట్టిడలంగఁగూడి సం
చిత ధనమెల్లఁ బెట్టి కల చేనులునమ్మక పూసబొట్టు దు
ర్మతి వెసవెచ్చఁబెట్టి పలుమాయల నప్పులు దీసివేసటన్.

ఉ. ముచ్చదనానకుం దొడరి మూఢతఁ దద్ధనమెల్ల వేశ్యకై
యిచ్చుచు నంగ మచ్చములవెల్ల బయల్పడ నిల్వనోడి య
య్యెచ్చెపు [హుం] తకాఁడు భయమొందుచు దూరపుభూమి కేగి కాఁ
డచ్చటఁ బోఁతునెద్దు ములుచై హరియించి స్వకీయభూమికిన్.

కం. వచ్చినఁ గని బంధుజనుల్
దచ్చనలాడుటయుఁ దీర్థతటిఁ గనుగొనుచో
నచ్చోనిచ్చిరి వీటిని
నచ్చగఁగృషి నేసి బ్రతుకుమని యని కొంకన్.

సీ. పితృలైన చుట్టములకైన గార్హస్థ్య
 మునసుండుమని పల్కనమతించి
దుక్కనంజోకలెత్తుక నెద్దు నెనుఁబోతు
 దోలుక యొక గుట్టచేల నడిమి
బీటుకొట్టుగఁ గొట్టి బెట్టుగఁ బగలింటి
 దనుక దున్నఁగదున్న ధరణిఁబడిన
దండించెదవు దీని పొందుగ మీఁద న
 నిత్యదేహమునకై నిష్ఠురాఘ

తే.గీ. తతులొనర్చెదవిట్లైన బ్రతుకుగలదె
యనుచు నయ్యెద్దు ధర్మశాస్త్రోక్తిఁబలుక
మ్రొక్కినిష్కృతి చెప్పవే నిక్కువముగ
నట్టులొనరింతు ననుడు నయ్యనడుహమ్ము.

తే. దానములు ధర్మములును సత్సంగతులును
బుణ్యకథవినికి గల్గినఁ బొలియునఘములు
లనుడు నట్లయొనర్తు మీ రరుగుఁడేచటి
కేని ననుభద్రకునిఁజూచి యెద్దు పలికె.

కం. నీకున్ననుకటి పుట్టున
నీ కొని విక్రయమ్మునే మీవలె వేఁ
గైకొనుము విక్రయంబున
నీ కడనొక శూద్రుఁడమ్ము నిది యనునంతన్.

ఉ. శూద్రుఁడొకండువచ్చినుడి చొప్పున మూఁడువరాలొసంగినన్
భద్రకుఁడిచ్చి యెద్దు నొడిభంగి మెలంగి కృతార్థుఁడయ్యె నా
శూద్రుఁడు వాని రెంటిఁగొని సొంపమరన్ బెనబెట్టి యింటిలో
భద్రముగాఁగఁగట్టనవి చానె శరీరములుచ్చి బిగ్గిలన్.

తే.గీ. శూద్రుఁడదిచూచి దుఃఖింప శుభవిమాన
మునఁ దనరి బుణమెడలెనోయనఘ! యింక
రమ్ము సురపురి కనుచు సారగతి ముఖ్య
రరిగి రా దివ్యయానస్థులగుచునపుడు.

ఉ. పొంగుచు భద్రకుండు గడు పుణ్యములొందె మహాత్మసంగతిన్
భంగతనొద్దఁ బోతు బుణభారమునన్ బలు పాటుబొందె నే
యంగునకైన నప్పు కలుపాకరమట్టులఁ ద్రావునేఁటికం
తెంగడు మేలుగూర దిన రీతి దొరంగు బుణంబు వెంపునన్.

కం. జనకుండు ఋణమొసర్పఁగఁ
దనయులకున్ శాస్త్రవుఁడగు ధనమొసఁగూర్పన్
విను దైవోపముఁడగు శా,
స్త్రి నియాధిక్ ఋణముదాస్యతన్ ఘటియించున్.

ఉ. కలఁడొక విప్రపుంగవుఁడు కౌశికనాముఁడు శాస్త్రివేది ని
శ్చల సుకృతాస్పదుండనఘచర్యుఁడు వేరము వర్ధివాసి వి
ద్యల గృషిగూర్చి కాలధనధాన్యము లాకృతవేళ వానికిన్
దెలియగు సత్యశీలుఁడటుఁ జిక్కె దరిద్రతఁ బీడితాత్ముఁడై.

కం. దీనత రా ధన మవసర
మైనప్పుడొసంగు మటంచు నడుగఁడు లోభం
బానక సెనరున నెయ్యెడ
నైనా లేదనక మోహమమరఁగఁ గరుణన్.

సీ. అంత నయ్యిద్దఱు యమభటుల్ గొనిపోవఁ
జని కౌశికుండందు సత్యశీలుఁ
గనుగొని యమునితో ననఘాత్మ! నాచేత
ధనమెంతయేనియుఁ గొనియితండు
మగుడనీయక బొంకెఁ దగవేది నమ్మిన
వారి వంచింపుచే పౌరుషంబు
పాలింపుఁడన సత్యశీలుఁ డామఁని దీర్తు
నను నెడఁ గలహమ్ములయ్యె, నంతఁ

ఆ.వె. గరవువచ్చె సుతుఁడు పరభూమికిం జనెఁ
జనఁగ నొకటి కొకటి సాగదయ్యె
నప్పుదీఅదనుడు యముఁడుగ్రకోపుఁడై
యతని సుతుఁడ వగుమటంచు నొడివె.

చం. ఇది కమలాసనుండు వచియించినధర్మమటంచుఁ బల్కె సొం
పొదవఁగ నప్పుదీసి రయమొప్పఁగ నీయమి నందునిందు దుః
ఖదశయాశాని సౌఖ్యములుగల్గవు గాన ఋణంబు కష్టమా
మదిఁ దలపోసి శిష్టులవి మాని మెలంగుదు రింగితస్థితిన్.

వ. ఇట్టి పాతకులు సత్సంగతివలనం బ్రబలి కృతసుకృతులగుదురవ్విధం బెఱింగించెద.

తే.గీ. ధరణి నక్షత్రవర్మ నాఁదనరు రాజు
బలయుతుఁడు మూర్ఖుఁడదయుండు పాపకర్మ
యగుచుమ్రుచ్చులఁ గొండీల నాదరించి
పరధనస్త్రీల హరియించుఁ గరుణలేక.

కం. ఎక్కువ సాధుల నెల్లన్
నిక్కువముగ బాధపెట్టు నీతిరహితుఁడై
చుక్కలకెక్కువయగు నా
తక్కరి పాతకము లెన్నఁదరమె! ధరిత్రిన్.

సీ. ధృతినొకనాఁడు విదేహపురికివచ్చి
యంబుజాక్షుని మందిరంబుగాంచి
తానొక్కఁడటకేగి ధనభూషణాంబరం
బులు సూచి దొంగిలఁబూని యచటి
యోగి విఘాతి యౌనో యంచు వధియింపఁ
బడఁద్రోసి యసి పూఁచి పట్టుటయును
నిరపరాధిఁ దపస్విని న్దయపోకార్చి
తునుమఁగనేల! శత్రువులనైన

తే.గీ. వేఁడికొనఁగ వధింపరుర్వీరమణులు
దార బిడ్డలు చుట్టముల్ దానుగూర్చి
నట్టి యర్థమ్ము భుజియింతు రతికలుషము
దాననుభవించుఁ జూ! భవాంతరమునందు.

ఉ. వానికి దుర్గతుల్గల వవశ్యముగా ననిపల్కె దైవమా!
పూని సమస్తమున్ విడిచి బుద్ధిరమాధిప పాదపద్మ సం
ధానతనుండు వారలకుఁ దాదృశదుష్కృత కర్మమొందఁగా
నానతె! యంచు విష్ణు మదినారయుచున్నెడ వాఁడు నత్తఱిన్.

శా. సత్సాంగత్యము విష్ణుసంగతియు నెంచన్ గల్గుటన్ క్రోధమున్
మాత్సర్యంబును మాని యోగివరు సన్మానించి ప్రార్థించుచున్
మత్సంపాదిత పాపముల్ దొలఁగఁ బ్రేమన్నన్ను మన్నింపవే!
వాత్సల్యాంబుధివన్న యోగి దయఁ గ్రేవన్నేడు ధాత్రీశుతోన్.

కం. హరిసేవన్ సత్సంగతి
దురితము లెడఁబాయుననుడు దోడనె యఘ సం
భరితాంతరి కరణోజ్జ్వల —
తరతాపానలమువలన దగ్ధుండయ్యెన్.

తే.గీ. అట్లు గ్రాఁగినయతనిపైనబ్జనాభ
దివ్యపాదోదకముఁజల్లి దివ్యుఁడగుచు
యోగిఁగొనియాడి పూసోనలానరఁ గుఱిసి
మహితగతి నొప్పెసాంగత్య మహితగతిని.

సీ. చెరువుగట్టించినఁ జేరు పుణ్యంబులు
పథికులు నీరానఁబాపహరము
కులజుల కాదవునిశ్చల లోక సౌఖ్యముల్
తట్టెడు మన్నైనఁ గట్టఁబెట్ట
నాతఁడా చంద్రార్క మమరలోకముఁజెందు
ప్రబలింప నినుమడిఫలమదీని

ఆ.వె. కొలఁక లో[illegible]క కిటి యొన్మనిభము మంత్రి
రాజు నియ్యార్యరును దివి నోజ మనిరి
కొలన బావిని నూఁతిచేఁగల ఫలములు
సగము సగములు నగు నూఁతిసాటి కాల్వ.

కం. చతురత వనమొనరించిన
యతని పితరులుందురెపుడు నమరావతిలో
క్షితిఁదత్ఫలగతిఁ బశుప
క్షితతుల జీవనములగుట శ్రేయస్కరమై.

ఆ.వె. రావి వేము మఱ్ఱి రహి నొక్కటొకటి మా
రేడు వెలగలు నుసిరికలు మూఁటి
మూఁటిఁ జూతనవకముల్ దశతింత్రిణుల్
ప్రబలఁజేయ బ్రహ్మపదముఁజెందు.

కం. హరిభక్తులైనవారికిఁ
ఘోరయవు దారిద్ర్యరోగ పుంజమ్ములు న
య్యరవిందనయనుపై మది
తిరముగ నొనరించి నతఁడె ధీరుండరయన్.

సీ. తల్లిదండ్రుల సేవ దయఁజేసిన యతండు
హరిపూజ దినము నేమము నియతుఁడు
సత్యవ్రతస్థుఁడౌ సజ్జన వినుతుండు
సర్వ భూతదయా విశారదుండు

నశయంబు హరికథల్ వినుచుండు నాతండు
జ్ఞానబోధన కళామాననీయుఁ
డతులితసద్గోష్ఠి చతురాత్ముఁడగువాఁడు
నావులింతలు తుమ్మునడరదగ్గు

ఆ.వె. నపుడు విష్ణుఁదలఁచు ననఘు సద్గుణశాలి
సాధ్వీచర్య నమరు జలజముఖియు
పేర్మి జలజనాథు ప్రియమగువారలు
వారిఁజూడ నఘముదీఱు నిజము.

కం. జల మధికాయాపు నర్థము
నలవగు దేహమును గాలయాపన భక్తిన్
మెలఁకువ నిద్రను గడు చం
చలమగు నివి నాల్గునెన్న సత్యముగామిన్.

ఆ.వె. తనదు నీషణములఁ దాపత్రయంబుల
విషయయుక్తి మిగులవెతలఁబడెడి
యతఁడు విష్ణుఁగొల్వ నాత్మఁదలంచునె!
సంగరహితుఁడైన జనుఁడుగాక.

కం. ఏ దాన ధర్మములు హరి
పై దృఢమగు భక్తి నిల్పు పావనమతిదౌ
యా దానధర్మఫలములు
శ్రీ దయితప్రీతిఁజేయఁజేకుఱు శుభముల్.

సీ. తపము శౌచంబును దయయు సత్యంబును
ధర్మదేవతకుఁ బాదంబులగుటఁ
గృతయుగాదిగ నాల్గుగతులు ముఖ్యములగు
నందుఁ దపంబు మే లరయ నెపుడు
గలియుగమ్మున నందుకలవడ నోపమి
ననశనవ్రతము తద్ఘనత కెక్కు
నందు శ్రీహరివాసరాంచద్వ్రతంబు మ
హాసుకృతంబు కొంతొనువృత్తి

తే.గీ. కదియు హరికీర్తనంబు గీతానువాద
మమరతటినీజల స్నానమర్హతమము
లగుటఁ గలికాలమునకు నిట్లలవడు జను
లవ్య యానంద మొందుదు రందునిందు.

కం. పక్ష ప్రాయశ్చిత్త మ
ఘౌఘజనప్రీతికరము దురితహరము స
ర్వ క్షేమంకర ముత్తమ
మక్షయ పద దాయకమ్ము హరిదిన మెలమిన్.

కం. వ్రతములలో హరిదివస
వ్రతముత్తమమగుట భక్తవర్ణనముదగున్
గతిరహితము భుజియించిన
మతిరహితులకెల్ల శాస్త్రమతముదలంపన్.

కం. హరిదినముల రాతిరి జా
గరణము ద్వాదశుల దశమిఁగడునిష్ఠల నొ
గిర మొకపూటఁ గుడుచుట
మురహరుకీర్తనము వలయు మోక్షార్థులకున్.

సీ. నదులలో నెల్ల జాహ్నవి శైలములలోన
మేరువు సుఖములలో రహి దగు
జ్ఞానంబు దేవతాగణములోపల విష్ణుఁ
డల గ్రహంబులలోన నబ్జహితుఁడు
చిలువకులమ్ములో శేషుఁడు పక్షుల
యందు సుపర్ణుండు నఖిలలోక
ముల సత్యలోకంబు మునులలో వ్యాసుండు
ఘనసిద్ధవరులలోఁ గపిలయోగి

తే.గీ. వర్షములలోన భారతవర్ష ముదధు
లందు క్షీరాబ్ధి పలుకులయందు సత్య
మధికమగు నట్లు వ్రతముల హరిదినంబు
శ్రేష్ఠమై యొప్పు శాస్త్రార్థ సిద్ధమగుచు ॥

కం. హరివాసరమునఁదులసీ
వరపత్రోదకము ద్రావ ద్వాదశి భక్తి
స్థిరతన్ దద్దళభక్షణ
నరుడగు కైవల్య పదమునందఁగఁ జేయున్ ॥

కం. ఉపవాసమునకు నోపని
యపుడొక పూటన్ భుజింప నట్టిఫలంబౌ
నెపుడేకాదశి విష్ణుని
విభుల పురోభాగవసతి విపుల ఫలమగున్ ॥

తే॥గీ॥ అనశన వ్రతపరమైన యట్టిదొకటి
కలుగు నితిహాస మాశ్చర్య కరము క్షత్ర
బంధు చరితంబు శ్రేయోనుబంధురంబు
వినుడు చెప్పెద నెంతయు విశదముగను ॥

సీ॥ అవనీసురవినింద్యుఁ డతిహేయ చరితుఁడు
విశ్వాస ఘాతకి విగతబుద్ధి
దబ్బఱకాఁడు మాతా పితృద్రోహి హిం
సాపరుండాద్య హేమాపహారి
గురుతల్పగమనుండు పరపీడనుండన
నేకదుష్కర్మియై మొసఁగునట్టి
క్షత్రబంధుఁడు జనాసహ్యుఁడై విడనాడఁ
బడి యడవులలోన విడువఁ బడుచు
తే॥గీ॥ కడుపుఁ బోసుక తిరుగన కాఱడవికి
శాక్యముని త్రోవఁ దప్పిమహోగ్రతర ని
దాఘ పీడిత శుష్కీకృతతనుఁడగుచు
సంచలంబున నందందఁ జనుచు నటకు ॥

ఉ॥ వచ్చుచు ముందటన్మెలఁగు వానిని బోయనిఁ బోని క్రూరు న
త్యుచ్చయ పాతకుంగని, తనూష్మత నాలుక యెండియుండ నో
ర్విచ్చుచునీళ్లు చూపుమన, వీఱిడి యయ్యును క్షత్రబంధుఁడా
సచ్చరితుల్ కృపారుచిరసారసుదృక్కులఁ జూచి చెంగటన్ ॥
మ॥ కుముదాంభోరుహయుక్త చక్రబకరాట్కాజన్తౌన్నత్యవి
భ్రమ మందార మరందకందలిత శుంభచ్ఛైక సైక ప్రవా
దము దాధారము దృష్ట్యగోచర మహోద్దైర్ఘ్యోరు విస్తారమున్
గమలాగారము జేరఁ దోడ్కొనిచనన్ గారామున న్నానియున్ ॥

కం॥ జలములలోఁబడి వడి మును
కల గండూషముల మఱియు త్రిశోనముల ను
మ్మలికఁ బెడఁ బాసి పొట్టకుఁ
గొలఁది మిగుల నీరు ద్రావి కుతుకాన్వితుఁడై ॥
ఉ॥ అంతకుమున్న వాఁడు వినయంబున సైకతజాత జాతభూ
తాంతర పుంజ కుంజ కిసలాంచిత సుస్థిరశయ్యఁ జేయఁ దా
నెంతయు వేడ్కనందు వసియించి తదీయ చరిత్రవించు వి
భ్రాంతునిఁ జేరఁ బిల్చి దయవుట్టఁగ నెట్టుగ మాని యిట్లనున్ ॥

ఆ॥ వె॥ క్షత్రమిత్ర! ఘోరసంసారహరము సు
కృతము నైన విష్ణు కీర్తనంబు
మరువకున్న నీకు మహిత భద్రములగు
ననుచుఁ దెల్పెనిమొనతఁడు త్రోవ ॥

ఉ॥ వాఁడు తదుక్తి దప్ప కనివారితబుద్ధి హరిన్నుతింపుచున్
బోఁడిమి విష్ణువాసరము పూనికతో నుపవాస వృత్తిచే
కూడఁగ హింస మాని యాటఁ గొన్ని దినమ్ముల నంతఁ గాలునిం
గూడి మఱొండు జన్మమునఁ గూరిమి భూసురవర్యుఁ డై తగన్ ॥

క॥ జనియించి సద్గుణంబుల
కనువై హరివాసర వ్రతారాధిని మున్
జననము దెల్పెన్ వ్రతమ
ట్లన సల్పియతండు మోక్షలక్ష్మిం జెందెన్ ॥

చ॥ బహుతర పాతకాస్పదు లపార జడాత్ములు శాంతి హీనులున్
వహి నతిహేయకర్మను లవారిత దౌష్ట్యులు మూఢ కర్ములున్
రహి హరివాసర వ్రతపరాయణు లై నెడఁ బావనాత్ములై
యహిపశయాళుఁడై మెఱయు నచ్యుతు చెంత వసింతు రెంతయున్ ॥

క॥ ఆగామి సంచితంబులు
బాగగు ప్రారబ్ధమైనఁ బాయున్ సుగతుల్
భోగములున్ సమకూరున్
శ్రీగరిమన్ దద్వ్రతంబుస్థిరమతిఁదలపన్

క॥ వేదములకంటె శాస్త్రము
లాదటఁ దల్లికిని మేఁటియగు గురువున్ స
త్యాదితధర్మామితల
క్ష్మాదరనిరశనము కంటెనగునె వ్రతంబుల్ ॥

మ॥ మునురుక్మాంగదుఁడన్ ధరావిభుఁడు సమ్మోదాత్ముఁడై యుండి సో
పున మౌనీంద్రులు రాఁగ మ్రొక్కి విధి వత్పూర్వార్చనల్ సల్పియా
ఘనులారా ! యిల నే వ్రతంబనఘవిఖ్యాతిం బ్రవర్తిల్లు ము
క్తి నొనంగూర్చు నెఱుంగఁ బల్కుఁడన నెంతే మెచ్చి వారందఱున్ ॥

క॥ హరివాసరవ్రతంబఘ
హరణము మోక్ష ప్రదంబు నని సన్మతులన్
బరిశీలిత శాస్త్రార్థ
వరులు వివరింప ధరణిధవుఁడా రీతిన్ ॥

చం॥ దశమిని నేకభుక్తమును ద్వాదశి నక్తిన సల్పి కల్మషో
పశమన విష్ణువాసరము భాసుర విధ్యుపవాస సత్క్రియా
వశత నొనర్పుచున్ బ్రజల వైపుగ నట్లొనరించఁ బంప నం
త శమనలోక మంతయు గతస్థితిఁ బొల్పెడ శూన్యయాతనన్ ॥

ఉ॥ అంతకుఁడంత ధాతకుఁ బదాగతి దెల్ప నతండు మోహినీ
కాంతను విష్ణు వారిగ వికాసతఁ బంపిన మందరాద్రియం
దింతి వసింప వేఁట తమి నేడ్తెఱ వచ్చి ధరావిభుండు త
త్కాంతకు దాసయిచ్చి నిజధామముఁ జేర్చె మనోజబాధచేన్ ॥

చం॥ అదియును గొన్ని నాళ్లకు వ్రతాచరణమ్మున లేచి పోవు న
భ్యుదయ గుణాభిరాము నృపు పూనిక మాన్ప నతండు పుత్రసం
పదలును ధాత్రి యీ వ్రతము భంగి ప్రియంబొనరింపవన్న న
మ్ముదిత కుమారు ద్రుంపుమనఁ బూనె విభుండు వ్రతాభిమానియై ॥

తే॥ అపుడు పక్షీంద్రవాహుఁడై యజ్ఞనాథుఁ
డవనివిభుఁ దత్సుతునిఁ బ్రోచి యతివ మోహి
నికినిఁ ద్వాదశి పగలిఁటు నిద్రవోవు
వారి ఫలముల పాలిచ్చి వసుధ నుంచె

కం॥ ఇది రుక్మాంగదుఁ డెంతయు
ముదమునఁ దద్వ్రతము సల్పి ముఖ్యగతి మహా
భ్యుదయము బొందిన చరితము
చదివిన వినఁ గల్గు నుభయసౌఖ్యము లెలమిన్ ॥

తే॥ గీ॥ అట్టి హరివాసరంబున నన్నయుక్తి
నిలిచి యఖిలాఘములు భోక్తృకులము జెందు
పాతకుల కెందునిష్కృతి పరగు నాఁటి
భోక్త కెందును బాపంబు పోదుగాని ॥

కం॥ వ్రతములలో నత్యుత్తమ
మతులిత మఖవర్గదాయి యా మరునాఁ డం
చితమతి విప్రుల కన్నము
చతురత నిడ పుణ్యమెన్నఁ జాలరు విబుధుల్ ॥

సీ॥ మఱియును జయంతుల తెఱఁగు చైత్రసితప
క్ష చతుర్దశిన్ మాత్స్య జన్మ దినము
జ్యేష్ఠాసిత ద్వాదశిన్ గమఠ జయంతి
యొగిఁ జైత్రశుద్ధ త్రయోదశిని వ

రామానుజయంతి నరమృగ జయంతి వై
శాఖసిత చతుర్దశ దినమున, న
భస్సిత ద్వాదశిఁ బటువామనజయంతి
ధృతి మార్గ కృష్ణ ద్వితీయఁ బరశు

తే॥ గీ॥ రామదేవ జయంతి చైత్రసితనవమి
మాధవసిత తృతీయ రామబలరామ
జననముల్ శ్రావణ సితాష్టమిని నభశితు
రోద్వితీయఁ గృష్ణ కలికి రూపజములు॥

కం॥ ఇవి దశ జయంతులు న్నిఁగ
సువిధిఁ గల్పోక్తరీతి మహి సల్పఁదగున్
భువి రామకృష్ణ వామన
మవిరళ నరహరి జయంతు లవిలంఘ్యమ్ముల్॥

ఆ॥ వె॥ ఆచరింపకున్న నఘములు దఱచగు
నాఁటి భుక్తి నిరయవాటిఁ జేర్చు
ప్రత్యవాయమగుట పరికించి పెద్దలు
దక్షులీవ్రతములు దవిలియుంద్రు

ఉ॥ ఉష్ణగభస్తితేజమున నుర్విజనస్తుతులొంది పిమ్మటన్
విష్ణుసమీపవర్తియగు వేదముఖామర వంద్యమాన రో
చిష్ణుత, భక్తితోనఁ గులశీలుఁడు పాపియునైన నొక్క శ్రీ
కృష్ణజయంతి సువ్రతము కీర్తిత సత్క్రియ సల్పెనేనియున్॥

కం॥ ఆదినమున భుజియించిన
యాదురితాత్మకుఁడు ఘోరమగునిరయములన్
బాదగునని నారదుఁడ
త్యాదరత సనత్కుమారుఁడడుగఁ దెల్పెన్॥

తే॥ గీ॥ జపతపోదాన హోమాది చర్యలెల్లఁ
గోటిగుణితఫలప్రదపాటవమగు
నాజయంతులఁ జేయుట లనఘులకును
ధన్యమహిమ లెక్కయిడఁగ వాగ్ధవుని వశమె।

సీ॥ చంద్రకాంతుఁడు నాఁగ జగదీశు డొకఁడశ్వ
మేధముల్ నలుబది మేధఁ జేసి
పదివేల్ శరత్తులు పటుధర్మగతి రాజ్య
మొనరించి సుతకాంక్ష వనజభవునిఁ.

గూర్చి తపంబు మక్కువఁ జేయ నలువయే
వరము గోరెద వన్న వాఁడు సుతుఁడు
గావలెనను టయుఁ గమలజుండు జయంతు
లాచరింపుము పుత్త్రులమిత రాజ్య

ఆ॥వె॥ పదము గల్గ ననుడు, పార్థివుఁడట్లన
నల్పి రాజ్య పుత్రచయము సిరులు
గాంచియంత విష్ణుకడ మెలంగె మహా వి
భూతి నెరయ ఖ్యాతి నీతి నెరయ॥

కం॥ జన్మాష్టమి కామితదము
సన్మహిమ జయంతి పొందు సంపత్ప్రదమా
సన్మునివాగీరిత మే
తన్మహిమ తెలుంగునే విధాత తలంపన్॥

ఆ॥ వె॥ మున్ను నృపులు సంయమలు నాచరించి కృ
తార్థులైరి కృష్ణుఁడాదిదేవుఁ
డవతరించు దినములవి యొల్లఁ గల్గొ వ్రత
గతుల నాచరింపఁ గల్గు శుభము॥

సీ॥ జగతిపై నాశ్వయుజబహుళ వరచతు
ర్దశినాడు సత్కర్మధర్మనిరతి
పురుషసూక్తమున నంబుజనాభునకు షోడ
శోపచారములఁ బూజోపయుక్తి
తైల దీపము లిడఁ దగనశ్వమేధాది
సవనఫలంబులు సంభవించు
హరి నరకాసురుఁ బొరిగొని వరమిచ్చె
నీ చతుర్దశి, వెస నెవ్వరేని

తే.గీ. నతిముదంబున నభ్యంజనాది చర్య
నాస్థయుతులై యొనర్చిన నఘము లణఁగ
మహి సుకృతమొందు నటు గాన మంగళంబు
లాచరించిన మేలగు నభవు కృపను॥

కం॥ కార్తికమున దీపము హరి
మూర్తులసన్నిధిని నిడిన మోక్షము గల్గున్
గీర్తింప్రాతస్స్నానము
వార్తకు నెక్కుంగ సౌఖ్యవైభవ మొసఁగున్ ॥

వ. కార్తిక మాఘ వైశాఖ స్నానంబులత్యుత్తమంబులగు ఫలంబు, లందుఁ గార్తికసితద్వాదశి హరి తులసీపూజనోత్సవ క్రియలు మోక్షప్రదం బంతరిక్షదీపంబు లధిక తేజఃప్రదంబును ముక్తిప్రదంబునునగు దన్మాసశశివాసరోపవాస నక్తకాల భోజనంబులును హరిహరపూజనంబు లుభయసౌఖ్యకారణంబులునగు నేతత్ప్రకారాచారపరులగు వరమునిధరణీధవులనేకు లఖిలార్థంబులనుం గాంచి రట్టికార్తిక మార్గశిరముల నరుణోదయసమయస్నానదాన దేవతార్చనోత్సవమహిమలపారంబులు మార్గశిరంబున నుషఃకాల దీపదానముద్గాన్ననివేదన కీర్తనలవలనఁ బరమేశ్వరుండు దృప్తుండగు వెండియు.

ఉ. దాన మురాసురారి ప్రమదంబునఁ గోరికలిచ్చుఁబుష్యస
స్నానత మాఘమాసముల మానితఁ గ్రుంకిడి విష్ణుపూజన
ధ్యానములన్ ద్విజావళికుదారత భోజనమిడ్డ ముక్తుఁడౌ
భానుదినంబులా నెలఁ బ్రభాతములంచిత పుణ్యయుక్తమున్.

కం. మాఘస్నాన ఫలంబుల
మోఘము మున్నా వశిష్ఠముని దిలీప
శ్రీఘనుఁ డడిగిన వేఁడుక
నా గుణనిధి దెలిపినవిధ మదియొట్లనినన్.

సీ. వలలురుల్ జివురుగండెలు పోగుకట్టెలు
జాగిలమ్ములు పెక్కు డేగపదుపుఁ
జోపుడుకోలలు భోగ నేజలు బలు
బల్లెముల్ తడికలు బల్లగోల
లరిదివిల్లమ్ములు నాయత్తపాటును
గలవేఁటకాండ్రును ముంగలను నడువ
ధృతిమై నయోధ్యాధిపతిదిలీపుఁడు వేఁట
వెడలి పర్వతగుహా విపినములను.

తే. గీ. మృగఖగంబులఁ దున్ముచు మెలఁగియచట
లేఁటినొక్కటిఁ గాంచి యింకేటివేఁట !
బట్టెదను దీనిననుచు వెంబడిఁబరువిడ
మాయమై మౌని యగుచు నమ్మహా విభునకు
దయ కటాక్షంబుతోడ నయ్యతివరుండు.

చ౽. కనుగొని రాతిరిన్ నిదురగానక మేన్ శ్రమమొంద వేఁట వి
న్నను వగునే దిలీప ! మకరాన్వితుఁడై రవియున్న మాస మిం
దనుపమనిష్ఠఁ గ్రుంకిడుట లర్హమటన్న దదీయ ధర్మమున్
వినికొందనాఁగ స్నానవిధి వేళ కథల్ రచియింపగూడునే !

కం. భూనాథ ! నీవు గ్రుంకిడ
రా నదికిన్ మీఁద మౌనిరాజు వసిష్ఠున్
ధీనుత ! వేడుము మాఘ
స్నానఫలంబతఁడు నీకుసకలము దెల్పున్.

చ. అనిముని యేఁగినంతన జనాధిపుఁడాత్మగృహంబుఁ జేరి తాఁ
జనిన తెఱంగు వేఁటనగు చందము నాప్తులతోడఁ దెల్పుచున్
గనకరథంబు నెక్కి మణికాంచన కేతుసితాతపత్ర శో
భనరుచిరాకృతిన్ ధరణిపాలుఁడు వెల్వడి ధీసమగ్రుఁడై.

తే. గీ. అలవసిష్ఠాశ్రమమునకు నరిగి వంద
నార్చనమ్ములొసంగి సంయమియొసంగు
నట్టియాతిథ్య సత్కారమనుభవించి
భక్తి మాఘావగాహన ఫలములడుగ.

సీ. మునికుల్యు జనవర ! వినుము మాఘస్నాన
ఫలమజునకునైనఁ బలుకఁదరమె
తగు నన్నదానాదిదానముల్ వ్రతములు
సవనముల్ సేయక స్వర్గభోగ
మనుభవింపఁగఁగోరు ననఘు లహో ఘుమా
మాఘావగాహన మహిమ గాంతు
రమర వైశాఖిఁజాంద్రాయణ కృచ్ఛ్రవ
తాదులు గార్తికమందు హేమ

ఆ. వె. ములు సుమార్గశీర్షమున జపవిధములు
మఱచు జనులు మాఘమాసమజ్జ
నమునఁ దత్ఫలంబు క్రమమునఁ గాంతురు
శోక్యలాభ ముక్తి కుదురుకొనును.

కం. శచియు నరుంధతి [ప్రా] గ్జ
న్మచరిత్రల మాఘమజ్జనము నేసి కదా
శుచులగుచు మహామహిమ
ప్రచురతఁ దగి రమిత సుకృతఫల మది తలఁచన్.

సీ. మాఘమాసంబున మహితోత్సవములతో
హరిపూజయును నతు లతిథిపూజ
లామ్నాయపారాయణాది సత్కర్మము
లధికఫలస్థితి నమరు స్వర్గ
మున స్థిరముగ నుండు వినుమన్య ధర్మముల్,
భువి పునర్జన్మ హేతువులు దలఁప
ప్రతి హోమజపదాన వరధర్మములకంటె
నది పునీతులఁ జేయు నఖిలజనుల.

తే.గీ. నదులఁ బుణ్యస్థలంబుల నొదవుమజ్జ
నమున నుభయకులంబుల నమరు సప్త
సంఖ్యవారలఁ గూడి మోక్షంబుఁ జెందు
నని వసిష్ఠుండు మఱియు నిట్లనియెఁ బతికి.

కం. భూమిన్ ద్వాదశవర్ష
క్షామమునన్ సహ్యవింధ్యసంధుల దేశం
బోమమి మును జను లెడలిరి
భూమీరుహ సస్యచయము పొలుపరుకతనన్.

కం. ఆ కరువున క్షుత్పీడా
వ్యాకులుఁడై భృగువు శిష్యవర్గముతో నా
నాకానన శైలములా
లోకింపుచు వచ్చి యడవిలో నొకచోటన్.

చం. తరుసుమ కుంజపుంజములఁ దామరలం గలమేల్ కొలంకులన్
గురుతటినీనియుక్తమణికూటము నా గిరి నొండు గాంచి యం
దిరవొనరించె మున్ బడలి కెల్లను దీఱ మునీంద్రచంద్రుఁడా
దరమునఁ గందమూల ఘుఫలావళి నాఁకలి మాన్చి వేఁడుకన్.

సీ. అచ్చటికొక్క విద్యాధరుండేతెంచి
వందనంబిడి మునివరునిఁ బొగడి
తనకాంత సకలవిద్యా వయోరూప
గాంభీర్యకలాప, యో నార్యవర్య!
వ్యాఘ్రాననంబున వర్తింపుచున్నాఁడ
తలఁప దుష్కర్మతతుల ననుడును
హాళి మాఘమునఁ దైలాభ్యంగ మొనరించు
కొనిన పాపమున నిట్లనుపుపడితి.

తే.గీ. నవుడు వేఁకువఁ గ్రుంకిడుటమర దేహ
మొనరియును బాప మిటులయ్యె వినుమిచటను
మాఘమజ్జన మొనరింప మంచిముఖము
కలుగునన వాఁడటులఁ జేసి కాంచె సుఖము.

తే. గీ. ఐలుడను రాజు కడు నసహ్యమగు రూపు
వంతుఁడై మాఘసుస్నాన మహిమవలన
నలరువిలుకాని చెలువున వెలసె ననుచు
నా దిలీపునితో మునియనియె మఱియు.

కం. కృతయుగమున మునివర్యుఁడు
చతురాననుమానసమున జనియించిన స
న్మతి మేధాధృతి కుత్సుం
డతులితతపమునఁ దలిర్చె నతి తేజమునన్.

చం. అతనితనూభవుండు నిగమాంతవిదుండు మహాతపస్వి సం
తతమృదుభాషి కర్దమసుతావర గర్భసుధాకరుండు వి
శ్రుతుఁడగు వత్సమౌని శ్రుతిసూక్తవిధిన్ బటుచర్యనుండి యం
చితధృతి సహ్యభూధరము చెంగట పశ్చిమసీమ నేపునన్.

కం. సదవృత్తిఁ దనరు కావే
ర్యుదకంబునఁ గ్రుంకులిడుచు నురునిశ్చలతా
స్పదనిష్ఠారతిఁ దపమిం
పొదవఁగఁ గావించె నతఁడు పూర్ణప్రౌఢిన్.

ఉ. ఆయెడఁ జిత్తశుద్ధిఁ గని యమ్మునిశేఖరుఁ డాసమీప నా
రాయణశైలభూమి సుకరంబగు భద్రసరస్తటంబునన్
బాయక యోగమార్గమునఁ బద్మదళాక్షు భజింపుచుం దపం
బాయతనిష్ఠఁ జేయుచు సమాధిరతిన్ వసియింప నత్తఱిన్.

కం. మృగములు శృంగాగ్రంబుల
సుగుణుండౌ మౌని మేను సొంపున నొరయన్.
మృగశృంగుఁడగుచు హరిపైఁ
దగిలిన చిత్తమున నతఁడు తప మొనరింపన్.

సీ. ప్రత్యక్షమై కృపాపరుఁ డంబుజాక్షుండు
దండప్రణామ సంస్తవము లమరఁ
గావించి యపవర్గ కామియౌ వత్సుని
బహుళజ్ఞాన మొనరించి విహితవృత్తి

గార్హస్థ్యధర్మసంగతినుండి యటమీఁద
మముఁజేరుదనుచుఁబల్కి కమలనాభు
నానతి మృగశృంగుఁడను నామము వహించి
కల్యాణతీర్థావగాహుఁడగుచు

తే.గీ. భోజపురిఁజేరియట జననీజనకుల
కచ్యుతోక్తులెఱింగించి యధికభక్తి
సేయు దనయునితో మునిశ్రేష్ఠుఁడైన
వత్సుఁడిట్లని యిమ్మదిఁగూర్మి దనర.

కం. సుమహితగతిమాఘస్నా
నముఁజేసిన నీదుకోర్కి నారాయణుఁడ
ర్యమతేజ! యొసఁగుటరుదే
క్రమమున నని సుతుని మెచ్చి గారవమునరన్.

సీ. అంతనచ్చట ధ్యాని యాత్మజ సౌందర్య
ఖని సువృత్తానామ యనుగుజెలులు
దానుమాఘమున నత్తటి సహ్యజామధ్య
తీర్థావగాహన స్థిరతమంచి
వరుని నర్థించిపావని యొకనాఁడందుఁ
గ్రుంకిడివచ్చుచోఁ గుంజరంబు
పైకిరా భీత్యవస్థఁబడి సఖీ
యుతముగ వృతినొంద నురువిషాద.

తే.గీ. కలితులైతల్లిదండ్రులు లక్కడికిఁజేరి
వగవఁ గావేరిఁ గ్రుంకిడివచ్చుచున్న
యట్టిమృగశృంగుఁ డవ్విధంబంత యెఱిఁగి
యాదరణ వారి నూరార్చి యనియె నిట్లు.

కం. ధృతి మీకుమారికను నే
బ్రతికించెద ననుచుఁబల్కి పటువేదోక్త
స్థితి మృత్యుసూక్త పఠనా
రతిఁగావేరిజల స్థిరతనుండు నెడన్.

ఉ. కన్నెల మున్ను బాధిఁబడఁగాఁగమకించిన భద్రనాగము
సన్నుతచర్యపైఁగవిసి చంచలమొందకయున్న యమ్మునిన్
దిన్నఁగమూర్ఛనుంచుకొని తెచ్చుచుఁ దత్తను సంగతిన్ శుభా
త్యున్నతిఁదెల్వి చెంది నెనరొప్పఁగ వత్సునితోడ నిట్లనున్

సీ. కరహాటపురనిషధనగరి విశ్వగుప్తుని
తనయుఁడ వైశ్యుఁడ ధర్మగుప్తుఁ
డనువాఁడ ధర్మ మైనటులబేరములాడి
కోటిధనముగూర్చి కొడుకుపాలు
సగమిచ్చి తక్కిన సగమున సకల ధ
ర్మములు సేయుచునుందు రహి నచటికిఁ
గాపాలికుఁడు వచ్చి కల్లరి రసవాద
మొనరించిధన మెల్లఁ గొనిన లేమి

తే.గీ. నొందియును బటి ధర్మములొత్తిపెట్టి
కడుపుబోసుక నుండగ గొడుకు దూర
మరిగి బేరములాడఁ బరాన్ననిరతి
రోగమునఁ ధనువెడయ నీ రూపమంది.

వ. భవత్తను సంస్పర్శంబున జ్ఞానంబుగల్గెనని కొనియాడునగ్రజంబునకు నమ్ముని దశదిన మాఘస్నానఫలంబు లొసంగిన నదియు దివ్యదేహంబున సురపురికరిగె. క్రమ్మఱ నమ్ముని యమ్మహనీయజలమధ్యంబున మృత్యుసూక్తయమస్తోత్ర పఠనందనర నతనికి యముండు ప్రత్యక్షంబై మునికన్యకల బ్రతికించి చనియె. మృగశృంగుం డొనరించిన యమస్తుతి పఠించినఁ గృష్ణాంగారక చతుర్దశీ తర్పణం బొనరించినను నపమృత్యుభయ రహితులగుదురు తత్పితరులు పుణ్యలోకంబుల సుఖింతురని చెప్పి యుతథ్యుండు మున్నె వాగ్దత్తలైన యమ్మానినులఁ బరిగ్రహింపుమని వత్సునిం బ్రార్థించె, నక్కన్యలు దము వేఁడిన బంధువులకు యమలోకపుణ్య పాపానుభవజన కథనంబు వివరించిరనిన, వసిష్ఠునకు యమలోకంబునకు నరిగిన తరుణులు మరలివచ్చుట యెట్టిది యరుదనిన ధరణిపతికి మునివరుం డిట్లనియె.

కం. నిష్కంటకుఁడును నిజహృ
త్పుష్కరకీలితరమా విభుఁడు బుధనుత స
త్పుష్కరచరిత్రుఁ డగుచున్
బుష్కరుఁడను నొక్క విప్రపుంగవుఁడమరున్.

సీ. మఱియొక్కద్విజుఁడు పుష్కరనామకునఁ దత్స
మీప దేశమ్మున మెలఁగుచున్క
నతఁడెవ్వఁడమ్మని యముఁడానతియిచ్చిన
భటులు ఘోరమున నాతఁడు పుణ్యుఁ

గొనిపోయి వైవస్వతుని చెంతనిడ లేచి
మ్రొక్కి కింకరులపై మురియఁగనిసి
కొనిపోండితనిఁ బుష్కరుని వానిఁ దెమ్మన్న
నరకకూపంబులఁ బొరలు పాప

తే.గీ. కర్మజనశోకములు వాని కరుణవారి
విడువుమని వేఁడికొని తెల్పి విడువమనినఁ
బుష్కరుఁడు విష్ణుఁ గేశవు భువనవంద్యు
వాసుదేవునిఁ గీర్తించె భాసురముగ.

కం. వారలు నరకోత్తీర్ణము
హారుచిరశరీరులగుచు నమరులఁ గలయన్
గ్రూరమతి యముఁడు భాసురు
ధీరాగ్రణిఁ జూచి పల్కెఁ దెగువ దలిర్పన్.

చం. నిరతము శ్రద్ధ భక్తియును నిశ్చలచిత్తము గల్గి నెవ్వరే
హరిఁ గొనియాడ వారల మహాఘము వాయును భక్తిహీనతన్
బరులను నెంచు నజ్ఞులకు భ్రాంతులకున్ ఫలమబ్బ మంచు న
త్తరణితనూభవుండు విదితంబుగఁ బల్కుచు వెండియిట్లనున్.

కం. నారకులు దాము చేసిన
ఘోరాఘము నెల్లనొందువఁ గూరిమి మీఱన్
వారల హరి నెన్నఁగఁ బలు
మాఱును బ్రేరేచితీవు మంజులఫణితిన్.

వ. తన్మహిమవలన ముక్తులైరటుగావున భక్తిహీనులు కీర్తనశ్రవణంబుల ననల్ప ఫలులగుదురని యతని బహూకరించి నిన్ను దలఁచువారలకు మధ్యయంబు లేదని యనిచిన బుష్కరుండు భూమండలంబున సుఖంబుండెనని వెండియు నిట్లనియె.

మ. మును శ్రీరాముఁడు రాజ్యమేలుతఱి సమ్మోదాత్ములై భూప్రజల్
మనుచో విప్రకుమారుఁ డీల్గుటయు రామస్వామి వేఁ బుష్కరం
బున నుండంతటఁ జూచి [శూద్రుఁడు] తపంబుం జేయఁగా దత్క్రియల్
గని వానిం దెగటార్చి వేడ్క బ్రతుకంగాఁ జేసెఁ దచ్ఛాబకున్.

సీ. మకరమాసపుఁ బూర్ణిమను నా ప్రభాస తీ
ర్థ నిమజ్జన క్రియఁ దవిలి యన్న
సాందీపుసుతుని గడిందినక్రము మ్రింగ
నంత శ్రీకృష్ణుని నఖిలవిద్య

లెఱిఁగించి దక్షిణ యాశోలుగా నిజ
సుతునిఁ దెమ్మనుడు నచ్యుతుఁడుకడఁగి
క్రమమున యముని ధిక్కారంబొనర్చి త
త్సుతునిఁగ్రమ్మఱఁ దెచ్చెనతులితధృతి

ఆ.వె. నయిన యముని పురికినరిగిన వారలు
మహితవర్ణనముల మహికివత్తు
రదియు మాఖ మజ్జనాంచిత ఫలములు
వినుమటంచు మౌనివిభుఁడుసుతియు.

వ. సువృత్తాసురసావిమలాకమలాఖ్యలంగలచెలులనలువురనేకముగా ముహూర్తంబున వరియింపుమను నుచుత్థ్యవచనంబులకు ననుమానించు కుత్సవత్సులకు వ్యాసుం డిట్లనియె. మున్ను దక్షపుత్రికల సప్తవింశతిసంఖ్యగల చెలులఁ గలుపలచెలివరియించె మఱియును.

చం. అదియనుగాక సౌభరి మహామహుఁడాయమునాతటంబునన్
బదిలముగాఁగ గ్రుంకిడితపంబొనరించెను ద్వాదశాబ్దముల్
కుదురుఁగ నంతనందుఁ దళుకుంజిగి బెళ్కులమీను పుత్రపౌ
త్రదయుతలన్ జెలుల్ గడుముదంబున దోల మెలంగఁ జూచుచున్.

ఉ. తాను గృహస్థధర్మమున ధాత్రివసింపఁదలంచి లేచి వి
ద్యానిధి యయ్యయోధ్య యువనాశ్వకుమారునిఁజేరి తత్తనూ
జానివహంబులో నొక విశాలసితాంబుజనేత్ర వేఁడినన్
మానవభర్త యీ ముసలిమౌనికిదెక్కడి యాసపుట్టెఁబో.

కం. ఇతనిఁగనుంగొని చూడ్కికి
హితవని వరియింప రెవ్వరేమిటి కీటు మ
త్సుతలధికరూపశీలా
న్వితలీకొనఁజూతురితని నియలిఁదలంచున్.

తే.గీ. ఇయ్యమనుడును శపియించునేమొ కన్య
కామణులునేబదుగురును గల్గ వారి
యందు నెవ్వతె వలెనను నట్టిదాని
నితనికిచ్చెదనని నిశ్చయించి విభుఁడు॥

కం. అంతఃపురమున కరుగుము
కాంతలు నినువలతురేవిఁ గడువడినిత్తున్
చింతింపకుమని యనిచిన
కా తొత్తుఁడు మౌనిమిగుల సౌందర్యముతోన్.

మ. చనినన్ మారుఁడో ! యక్షరాజసుతుఁడో ! శక్రాత్మజాతుండో ! వీఁ
డనుచున్ రాజకుమారికామణులు మోదాన్వితలై సేన యీ
తనికిన్ బత్నిని సీతఁ డేవిభుఁడు నాత్మస్వామి యంచుం దఱిన్
మునినర్థించిన రాజొసంగె సుతలన్ మోదంబు సంధిల్లఁగన్.

వ॥ అశ్లోకమువూార్థంబున నందఱనన్నిరూపంబులం బరిగ్రహించి యుచిత భోగ భాగ్య సౌధారామభూషణాంబరవస్తువులం దనర ననేక పుత్రపుత్రికాపౌత్రసంపత్సమృద్ధినతిశయిల్లె. వెల్లగుయమునాజలంబునఁ జలంబునఁ బంద్రెండులు మాఘస్నానం బొనరించిన సుకృతంబున నంతటి ప్రభావంబునమరె, తచ్చరిత్రఁ దలంచిన సంతాన సంపత్సమృద్ధులొదవునని వ్యాసుండు దెల్పినఁగుత్సుండావత్సుని నలువురులలనలం బాణిగ్రహణంబున నర్పణఁజేసినఁ దత్సతీరత్నంబులు పరమపతివ్రతలగుటఁ బూర్ణగార్హస్థ్యధర్మంబులం దనరి నందనులంగాంచి రందుసువృత్తకు మృకండుండు జనియించి ముద్గలపుత్రియగు మరుద్వతిన్ వరించి పుత్రకాంక్షియై యగతికులకు గతి కాశియగుటఁ దల్లులు నిల్లాలునుం దాను నచటికింజని యందాత్మనామంబుల ఢుంఠిగణవిభు చెంగట లింగప్రతిష్ఠలు గావించి యంచిత వ్రతస్థితిఁ బంచశరవైరిం గుఱించి వసించినంత—

ఆ.వె. ఆమృకండుమునికి నచట మార్కండేయుఁ
డనఘుమూర్తి పొడమె హరుని కరుణ
నచటి బుధులుశాస్త్రిమరసి పదాఱేడు
లాయువనిరి యతనికాయతముగ.

కం. అదివిని మదివగపున సుతుఁ
బదిలముగా శివుఁడు భక్తపాలనుఁడతిసం
పతలాయువొసఁగునవ్విభు
పదములుభజియింపు మీవుబాళిఁదలిర్పన్.

సీ. అష్టమాబ్దమున శిలాదపుత్రుఁడుమృతుఁ
డైనఁ బునర్జీవిగానొనర్చి
గాలపాశవిముక్తుఁగాఁ జేసి శ్వేతకే
తుని సుకృతాఢ్యుగా నొనరఁజేసె
లలిమీఁదహాలాహలము గంఠమున నిల్పి
సకలచరాచర చయముమనిచె
కమలాక్షుమెచ్చి చక్రంబిచ్చి యతని కా
లముగానితునిమొ జలంధరు వడి

ఆ.వె. మఱియుఁ గొల్చుజనుల మనిచె ననేకుల
నభవుఁడీశుఁడాఢ్యుఁడతని భజన
వలన నాయువొందు మిలనంచు దీవించి
తనయుఁబంచె దేవతలు నుతింప.

వ. అనిన జలంధరు కథ వినవలతుననిన దిలీపునకు వసిష్ఠుండిట్లనియె. హిరణ్యాండను దనుజునకు దశముండతనికి సూకరుండతనికి వనజభవ వరంబున జలంధరుండు పుట్టి యతండు నలువవరంబులొంది మిన్నందె. సురలందఱును హరిహరులంగూడి మేరుగిరిని మానససరస్సున వసింప నప్పుడప్పుండరీకాక్షుండు మానసంబున శూలంబు నిర్మించె. పంచవదనుండును బాదాంగుష్ఠ రేఖం గాలాత్మకంబును సహస్రారంబునగు చక్రంబు నిర్మించి హరినేత్రాబ్జపూజనకుఁగాఁ జక్రంబొసంగి నూఱేడులు వెదకుచు నారద ప్రేరితుండై తమపైకివచ్చు జలంధరునింగూల్చె నయ్యీశ్వరుండు త్రిపురంబులణంచె, నట్టి శంకరుం గొలుపుమని తనయునంపిచిన జనకునానతి గోదావరీ దక్షిణతటంబున శివునర్చనాస్తోత్రంబులఁ దనుపుచు సమాధినిష్ఠనుండునంత.—

తే.గీ. బ్రహ్మయును హరులును శంభుఁ బ్రస్తుతించి
యతని మున్నేము చిరజీవివగుమటంచు
దీవెనలొసంగితిమిగాన ! దేవదేవ
యది యథార్థము సేయవే యనుచు వేఁడ.

కం. అత్తఱిఁ బదియాఱేడులు
హత్తిమృకండాత్మజునకునగుటయుఁ గాలుం
డొత్తిగళసీమఁ బాశము
గుత్తముగా వైచి తిగిచికొన మునిసుతుఁడున్.

తే.గీ. శివపదధ్యానమంతయు సేయుదనుక
దాళుకొమ్మని హరుని సదాశివుభవు
బహువిధంబులనుతియించు భద్రగణము మృ
కండుసూనునిఁ జూచి యాకాలుఁడనియె.

ఉ. మీఁదటికైన కార్యములు మేకొని మున్నలుగంగ సేయు మ
ర్యాదలు మానఁగాఁదగునె యక్కట మర్త్యులకున్ స్వతంత్రతసం
పాదితమాయువందునికి పాడియె! యెప్పటియత్నమప్పుడే
కాదిక నేల రమ్మనుచుఁ గంఠము రజ్జువుబట్టి యీడ్చినన్.

చం. హరుఁబరమాత్మునిన్ బహువిధాగమసూక్తుల సన్నుతింప నా
తరుణశశాంకమౌళియును దానును అంకెలగిబ్బినక్క భూ
సురకృతలింగము న్వెడలి శూలము గేల నమర్చి కాలునిన్
జరణహతిన్ ధరంబడఁగ సాధ్వసమొందగఁ జేసి హుంకృతిన్.

కం. అంతట సమాధిఁ దెలిసి పు
రాంతకు గిరిజాసహాయు నాద్యు నభవుఁ గా
ళాంతకు ననంతు నభవు ని
రంతర శివకరు నుతించె నమ్మునిసుతుఁడున్.

కం. యముఁ డేమి సేయు దుష్క
ర్మము లేమి యొనర్చు హరు నుమాధవునిన్ శ్రీ
రమణసఖు సదాశివు భవు
నమరవినుతు భక్తిఁ గొల్చునట్టి జనములన్.

సీ. ఘనుఁడైనయట్టి మార్కండేయుఁ డొనరించు
శంకరస్తవ మది చదువ వినిన
యమబాధ లొంద వెందైన భూజనుల క
ట్లా యము దండించి యమిసుతునకుఁ
జిరకాల జీవిత్వ మిరవొందఁగా నిచ్చి
హరుఁడు తత్కృత [లింగ] మందు నిలిచెఁ
దల్లిదండ్రులకు ముదంబొదవ నిజాశ్ర
మముఁ జేరియతఁ డుండె మహిమ మెఱయ

తే.గీ. జాహ్నవీ గౌతములయందు సరవి మాఘ
మజ్జనం బొనరించిన మహిమలిట్టు
లొప్పకండు తనూజున కనువుపడియెఁ
గానమాఘావగాహ మనూన ఫలము.

వ॥ అదియుఁ బుణ్యతీర్థతరంగిణులకంటె మహానదులయందత్యుత్తమంబు దానికంటె మానసతీర్థంబతిసుకృతప్రదంబది దానజపతపోయజ్ఞదమశమవిషయానాసక్తియుక్తంబును గురుమాతృపితృశుశ్రూషాంతశ్శుద్ధిసత్యభూతదయామనోవాక్కాయకర్మైక్యత్వాది సద్గుణ భరితంబునగుట నదియ తీర్థోత్తమంబు నంతర్మలశోధనంబునని తెల్పి వసిష్ఠుండు వెండియునిట్లనియె——

సీ. ధర్మపాలుండెల్ల ధర్మంబులాచరించె
బహుతరైశ్వర్య సంపత్ప్రభల ను
శ్రుతిపాలుఁడను విప్రుఁడతుల దారిద్ర్యంబు
నణంచి తీర్థాచరణాభ్యుదయాన్వ
మాఘమజ్జనత నామలకేత్ప—— —— చా
దర శాక కూష్మాండతండులములు
లోహామరిజతపాత్రలు భూమి దానంబు
సత్యుత్తమఫలమ్ములగుచు నొదవు

తే.గీ. స్వర్గ సౌఖ్యములమరు నిశ్చలత ననుచు
నారదుఁడు చెప్పె నంగధారారమణున
కతఁడు గేదారమున నిటులాచరించి
బ్రహ్మ పదమొందెఁ బురుషార్థ భద్రదంబు
మాఘమజ్జనమంచు సమ్యానిశులికె

కం. పంచమహాపాతకములు
సంచిత మాగామికలుష చయము లణంగున్
మించుఁగృతఘ్నాఘమునం
దెంచక ప్రారబ్ధమైన నెడయుం దానన్.

సీ. అకలంకమను గ్రామమందు సువృత్తుఁడన్
విప్రుఁడు పాతక విరతిఁ దవిలి
కడువృద్ధుఁడై వివేకము గల్గి నర్మదఁ
బది దినములు మాఘ మొదవ గ్రుంకి
తన్మహిమం బుణ్యతరలోకముల నుండి
మనుజుఁడై క్రమ్మఱ మకరమాస
మునఁ బ్రయాగ స్నానమొనరఁ జేయుచు బ్రహ్మ
కడఁద్రికల్పములుండి శాశ్వతిఁ బొడమి

ఆ.వె. యెవటి మోక్షమందె నంతకంటెను భాగ్య
మెట్టి జనులకైన నెద్ది కాన
మాఘ మజ్జనంబు మఱచు వారలఁ జెందు
గ్రుంకులిడి డిజనుల వంకమెల్ల.

కం॥ వాపీ హ్రదప్రవాహము
లోపినచో ఫలములొసఁగు నుత్తమముగ నే
రూపమున్నైన నింటఁ
గూపజల స్నానమైనఁ గొదవ దలంపన్ ॥

వ. జలాభావంబగు నెడను ధృతఘటజల స్నానంబర్హంబు. అతిపన్నధృత జలంబ యోగ్యంబగు, నశక్తుండగునేనిఁ బ్రతినిధి ధౌత వస్త్రయుగ్మయుక్తకుశా [ంకు?] రంబు విప్రునిచే స్నానమొనరింపంజేసి యతని కుటుంబపోషణంబు నతనికి మధురాహారం బులుదన్నాసనంబెల్ల ననుపుపఱిచి మాసాంతరంబున ధేనుదానంబతని కొసంగునేని నిను మడిసుకృతంబు నొందు మాఘశుద్ధైకాదశి నుపవసించునేని నేకాబ్ద హరివాసరవ్రతా చరిత సుకృతం బొందవు మున్ను ఋమునికి నయ్యేకాదశి మాత్రంబు ఫలహారియై యాచరిం చితివేని సంవత్సర హరివాసరము లుపవసించిన ఫలముగునని ధామ్యుఁడానతిచ్చెగావున జాతుర్భుక్త వర్జితంబును హరిదివసాహోరాత్ర జాగరణ ప్రతిమారాధనంబులును ద్వాదశిఁ బ్రతి మాదాన విప్రభోజనంబు మోక్షప్రదంబులు శివరాత్రి నంతకంటె నెచ్చు. ఏ తద్దినవ్యయయుక్తి.

సీ. ... ...
... ...
... ...
... ...
... పత్రులు దొరకమి
నుపవసింపుచు నంద యొదుగ నొక్క
కొలనఁ దాపముదీఱఁ గ్రుంకిడి చెంగట
బిల్వభూజ ముక్రిందఁ బేర్మినుండు

తే.గీ. నట్టి లింగము మీద నయ్యాకు చాటు
చేసి[కొని నిల్చి] నీరానఁ జేరువాని
దునుమ మేల్కొని యేమియు దొరకకునికి
వేవ నిట్టుల నిజ పూర్వవృత్తి నుండి ॥

కం॥ అంతంబున శివకింకరు
లంతక భటవితతిఁదఱిమి హర్షమున శివా
కాంతుని చెంతకుఁ జేర్పగ
నంతయు శివరాత్రి మహిమ యగుటటనండెన్ ॥

వ॥ అని శివరాత్రివ్రతవిధియుఁ దన్మహాత్మ్యంబును దెల్పి మున్ను భృగు పుత్త్రి యగు రుచిక బాల్యమునన విధవయై ఘోరతపయాది నియమవ్రతస్థయగుచు వింధ్యగిరి

నలుబది వత్సరములు మాఘ స్నానంబొనరించి తత్సుకృతమున నలువచేఁ దిలోత్తమయనఁ నిర్మింపంబడి దేవలోక నివాసినియయ్యె నట్టి మాఘ మాహాత్మ్యం బడిగిన దత్తాత్రేయుండు కార్తవీర్యార్జునున కిట్లనియె.—

తే.గీ. హేమకుండలుం డను వైశ్యుఁడెన్నియేని
కోట్ల ధనమొనఁగూర్చి యొక్కఁడగు ధర్మ
మార్గమున వార్ధకమున నేమరక సకల
దానధర్మము లొనరించె ధర్మవృత్తి ॥

సీ. అంత నాతండు సురాలయంబున కేగ
దత్సుతులిర్వురు దద్ధనంబు
పోఁ గొట్టుకొని పచ్చిబోయల చందానఁ
బలువిడి దొంగిలఁ బామొకరునిఁ
బులియొక్కరునిఁ బట్టి పొలియింప యముఁ జేరి
రందొక్కరుండు మాఘావగాహి
గావున [హరి మాత పోవు] దోడ్కొని విను
మనసు మాలాపత్యమును మరొన్న

తే.గీ. భక్తి సతత పరాన్నైక భక్తి శూద్ర
జనములకు వండిపెట్టుట సారతీర్థ
ములు దరిని దానమొందుట వెలయ ధర్మ
విక్రయము ధూర్గతులఁ ద్రోయు విధము లనుచు ॥

వ. మఱియు ననేకధర్మంబు లెఱిఁగింపుచు గంగాస్నానంబును దులసీ గోపీ చందన ధారణంబులును బ్రాణాయమంబున కెనయగు నవి సకల పాతకముల భస్మీకరించు ద్వాదశ సాల గ్రామార్చన కోటిలింగముల జలములఁ బూజించు ఫల మగునని తెల్పి నీవేనిమిదవ జన్మంబున నలుగురు బ్రహ్మజ్ఞాననిష్ఠుల నతిథి పూజలఁద్రృప్తులం జేసితివా ఫలం బొసంగి న నీతోఁబుట్టువునకు సుగతి గల్గునన నతండటులనిచ్చిన నయ్యిరువురు హరిలోకంబున నుండిరని దత్తాత్రేయుండు గార్త వీర్యునకిట్లనియె.—

కం. క్షౌరము నభ్యంగంబును
నారీసంగమము పరోదనము దినుటయునున్
గారాదుష్టోదకవా
ప్యారోధ తటాక నదుల నధికము ఫలమున్ ॥

తే. గీ. మకరమునను బ్రయాగని మజ్జనంబు
నేయుసుకృతంబు లెక్కింపఁ జిత్రగుప్తుఁ
డైన నేరఁడు రాజసూయాశ్వమేధ
ఫలములింద్ర చతుర్ముఖ పదవు లొదవు ॥

సీ. కాంచనమాలి నాఁగల్గు నచ్చర కాంత
దినము ప్రయాగను దీర్ఘమాడి
చను నైడ మాఘమాసమున నట్లె యొనర్చి
శివదర్శమునకై చెలఁగి వెండి
కొండకుఁ బోవుచోఁ జండాసురుఁ డొకండు
తద్వస్త్రజలకణస్పర్శ వలన
ద్రోవనుండు నతండు దుష్ట భావము మాని,
కాశి మున్ ద్విజుఁడ, దుష్కర్మ నిరతి

తే.గీ. రాక్షసుఁడనయ్యె నీవల్ల రాజితమతి
నైతి నీ వెవ్వరన, సుమేధాత్మజాత
నధిక సౌందర్య గర్వంబు లడర వార
కాంతనైతి గళింగ ఘూర్మ్యంతరమున ॥

ఆ. వె. అటులనుండి ముదిసి యవనీసురుం డొకఁ
డానతీయగా బ్రయాగ తీర్థ
మజ్జనంబొనర్చి మహిమ నచ్చరనయ్యె
నిపుడు నిత్యవిధిగ నిటు లొనర్తు

కం. అనియార్తుఁడైన వానికిఁ
దనదొక నెలఫలమొసంగఁ దన్మహిమన్ వాఁ
డనుపమవిమానమున దివిఁ
కినిఁజనియెన్ దానిఁ బొగడి కీర్తితతనుఁడై.

చ. పిడికిటిలోని కౌను గడు బెద్దపిఱుందును గీలుగంటునర్క
బెడగగు వెన్నెఱుల్ వలుదబింకపుఁ జన్నులు చక్కి మిక్కిలిన్
దడిసినపైఁట కొంగులదాని వరాంశుకుక నిర్గతాంబువుల్
బడ నసురుండు వేల్పగుట భద్రము మాఘనిమజ్జనంబిలన్.

వ. అని దత్తాత్రేయుండు గార్తవీర్యున కెఱింగించుటలు దెల్పి వసిష్ఠుని జనవి భునికిట్లనియె : మున్ను ప్రమోహినీ సుశీలా, సుస్వరా సుదారా చంద్రికా నామంబులు గల యచ్చరలు సౌందర్య గర్వంబున సుర్విం దిరుగుచు నొకకాలనికేలన నిత్య కర్మాచరణ నిరతుండగు బ్రహ్మచారింగని యంగజ శరపీడితలై యాలింగనం బొనర్చి యతనిశాపంబునఁ బిశాచంబులై యతనినట్లన శపియించి తదనుగ్రహంబున బహుకాలంబునకు రోమశుంగని తమ తెఱంగెఱింగించి ప్రార్థించిన నతండు వారలకిట్లనియె :—

సీ. వినుఁడు దేవద్యుతియనెడు విప్రుఁడు సదా
చారసంపదలఁ బంచశిఖి మధ్య
మునఁ దపంబొనరించి వనమాలి పొడసూప
వరమొందె మాయానివారణముగ
నచటువనము నొప్ప నత్తఱి ద్రవిడేశుఁ
డగు చిత్రసేనుఁడు యజ్ఞచయము
గావించి సుకృతముల్ గాంచియుఁ బాషండ
బోధచే సాధుల బాధపఱుప

తే.గీ. నతని సీమ యనావృష్టి నణఁగ, నడవి
జడిసి దేహమ్ము విడిచి పిశాచమగుచు
వఱలి దేవద్యుతి వసించు వనము జేరి
యతని కృపనొంది ప్రార్థింప యమివరుండు ॥

కం. కేరళదేశమున దురా
చారి వసువునాఁగ ద్విజుఁడు క్ష్మామండలి సం
చారమొనర్చుచు మృతుఁడై
కాఱియఁ బడి ప్రేతమయ్యె కర్మము లేమిన్ ॥

చం. అటుకొక విప్రవర్యుఁడు ప్రయాగను గంగను గ్రుంకి వచ్చుచున్
దిటవగువంశ పాత్రములఁ దెచ్చుతదంబువులాను తృష్ణ చే
నటఁ బొడసూపి యాద్విజుని కడ్డము వచ్చి భవద్గ్రహీతమా
పటు వియదాపగాంబువులఁ బాపుము దాహము నీవతీఱఁగన్ ॥

సీ. అనుడు విద్యాధిపుఁడను రాజు బ్రాహ్మణ
వన ఫల భక్షణవలనఁ బ్లవగ
మై పురోహితుఁడు మున్న తఁ డిచ్చు దానాళి
యందుఁ బంచద్రవ్య మపహరించి
పారస పక్షియై నారితోఁ బుట్టు కాం
స్యమ్ము ముచ్చిలించుట పారసియయి
యుండఁగ మర్కటుం బొడిసి పట్టి నఁదమ
పూర్వజన్మ క్రమంబులు దెలిపిన

ఆ.వె. సారసంబు దెల్పె నీరీతి విని నాఁడ
దాహమణఁచినన్ను ధన్యుఁజేయ
పవని సురుఁడనర్హ యాచనమునను బి
శాచమగుచు గంగజలము సోఁక

వ. పునీతుడయ్యెఁగావున ననవది యొక్కింత వేఁడెద నని నవ్విప్రుండు గంగాతీర్థంబొసంగఁ బ్రేతత్వ విముక్తుండై యతని దీవించి త్రిదివమునకరిగెనని దేవద్యుతి రాజ పిశాచమును బ్రయాగకనిచిన నతండు నత్తీర్థస్నాతుండై కృతార్థుండయ్యెనని రోమశుండచ్చరలను బ్రహ్మచారినిన్ గంగాస్నానం బొనర్ప ననుగ్రహించి వారలటులొనర్చి పూర్వశరీరులైనయెడ వారలం దోడ్కొని సకల తీర్థాచరణ సేయించి యక్కన్యకల నవ్వటునికి వివాహం బొనరించిన నమ్మునికృపను సుఖంబుండిరిట్టిది మాఘస్నాన మహిమయని వసిష్ఠుం డానతిచ్చిన దిలీపమహీపుండందువలన నమితతేజస్వియయ్యెనని సూతుండు శౌనకాదుల కిట్లనియె.—

కం. ధీనుతి ఫాల్గుణ పౌర్ణమి
మానిత పూజల వసంత మాధవుఁడగు త
చ్ఛ్రీనాయకుఁ గొల్చిన శుభ
మానరులకుఁ గల్గుఁ గల్మషమంతయుఁ బాయున్ ॥

తే. గీ. చైత్రవైశాఖ రాకల సారసాక్షు
పూజ బ్రాహ్మణ జనులకు భోజనములు
భవ్యశీతల గుడజల పానకాద్య
జనములున్ ఛత్రము లొసంగ సౌఖ్య మొదవు.

తే.గీ. జ్యేష్ఠ పౌర్ణమి నొనరించు గోష్ఠ పూజ
గోపపతి సంతసము నొంది కోర్కెలిచ్చు
నమరు నాషాఢమున ద్వాదశాహములను
శాకవర్జన మొనరింపఁ జాల మేలు.

కం. శ్రావణ భాద్రపదంబుల
శ్రీవిభు పూజయును వ్రతవిశేషము శనివా
రావని విబుధాభ్యంజన
మీవిధములు సల్పవిష్ణుఁడిచ్చున్ శుభముల్.

కం. పాతములం బర మాన్నపు
దాతై శ్రవణములనన్నదానము ద్విజసం
ప్రీతిగ జేసిన మేలగు
రాతిరి రవివాసరముల రాదు భజింపన్ ॥

తే. గీ. కంజహితవారముల లేపకడల గ్రుంకు
టమరనదిఁ గ్రుంకులిడు పుణ్యమమరఁ గల్గు
పర్వముల భానువాసర పాతములను
రాత్రి భోజన మఘమగు ప్రజల కెందు.

సీ. సతులు భర్తలతోడ సల్పఁగఁ దగువ్రత
సమితి చాతుర్మాస్యచాలఁ గలదు
శ్రావణశుద్ధ దశమి మొదల్ కార్తిక
మునఁ బ్రథమద్వాదశి నెరయఁగఁ
గలహరి వాసరంబుల నుపవాసంబు
హితమతి దశమి యందేక భుక్తి
ద్వాదశి హరిపూజ ధరణీసురపర్వ భో
జనమును గావించి వెనుకభర్త

తే.గీ. భోజనము సేయు పిమ్మటఁ బోలఁతి భుక్తి
గొనుట దగు నిత్యమగు వ్రతంబనఘ మిష్ట
దాయకము కార్తికమున శ్రీధరుని పూజ
లిహపరసుఖంబులొనఁగూర్చు నెవరికైన.

కం. ఇది చాతుర్మాస్యవ్రత
మదనఁ గుశీరమున నర్కుఁ డధివసియింపన్
మొదటి భృగు వారమున నిం
పొదవఁగ లక్ష్మీశు పూజ లొసఁగుఁ శుభముల్.

వ. ఇదియు లక్ష్మీ నారాయణ వ్రతంబు కల్పోక్తాచరణ సకలాభీష్టప్రదంబు శ్రావణపూర్ణిమాపురో భృగువాసరంబు వరలక్ష్మీ వ్రతంబు నట్టిదియ యాశ్వయుజ శుద్ధ ప్రతిపదాది నవమీ పర్యంతంబు లక్ష్మీ సరస్వతీ దుర్గా పూజలు సిరుల కిరవగు మఱియును.

ఆ.వె. చైత్ర పూర్ణిమయును శ్రావణామావాస్య
కార్తికాది పక్షకలితసప్త
మియును బద్ధ కల్పమితి శ్వేతవారాహ
ధాత్రికల్పములనఁ దనరు వరుస.

కం. క్షితిఁ గార్తికసితనవమియు
ధృతి వైశాఖసిత తృతీయయు మాఘా
గతదర్శము భాద్రను సం
గతశుద్ధ ద్వాదశియు యుగంబుల కాదుల్.

వ. చైత్రశుద్ధపాడ్యమి సంవత్సరాది యుత్సవకాలంబు తత్తృతీయ సౌభాగ్యదశ నవమిగౌరీవ్రతంబు సప్తమి సంతానసప్తమి యాత్రయోదశి మదనత్రయోదశి వైశాఖంబునఁ బూర్ణిమ మహావైశాఖి జేష్ఠ శుద్ధతృతీయ కదళీగౌరీవ్రతంబు నాషష్ఠి యారణ్యగౌరీవ్రతంబు తద్దశమి పాపహరదశమి ఆషాఢశుద్ధతృతీయ యమృత లక్ష్మీ వ్రతము, ఆ పంచమి స్కంధపంచమి శమీగౌరీవ్రతంబును షష్ఠి కుమారషష్ఠి యేకాదశి ప్రథమగోపద్మవ్రతంబు శ్రావణశుద్ధచతుర్థి నాగచతుర్థి తత్పూర్ణిమాపురో భృగు వాసరంబు వరలక్ష్మీ వ్రతంబు తత్పౌర్ణమి నుపాకర్మంబు తద్బహుళతృతీయ షోడశ గౌరీ వ్రతంబు భాద్రపదశుద్ధచతుర్థి వినాయకచతుర్థి యాపంచమి ఋషిపంచమి యాసప్తమియ ముక్తాభరణసప్తమి అష్టమి జ్యేష్ఠాష్టమి దూర్వాష్టమి లక్ష్మీవ్రతంబు యేకాదశి పరివర్తనైకాదశి యాచతుర్దశి యనంతచతుర్దశి తత్పూర్ణిమ మాహేశ్వర వ్రతంబు తద్బహుళ పక్షంబు మహాలయపక్షంబుఁదృతీయ బృహతీ గౌరీ వ్రతంబు ఆశ్వయుజ శుద్ధ దశమి విజయదశమి తన్మాసంబున రవిహస్తాప్రవేశంబగు నాఁడు హస్తిగౌరీ వ్రతంబు శుక్లపక్షాష్టమి నేమాసంబునైనను బుధవాసరమగు నేని నది బుధాష్టమీ వ్రతంబు ఆశ్వయుజ శుద్ధద్వాదశి గోద్వాదశీవ్రతంబు తత్పూర్ణిమాపురోభానువాసరం బుపాదాన ఫలవ్రతంబు తద్బహుళద్వితీయ చంద్రోదయగౌరీవ్రతంబు చతుర్దశి యమావాస్యలు కేదార గౌరీ వ్రతంబులు కార్తిక శుద్ధ తృతీయ త్రిలోచన గౌరీవ్రతం బాచతుర్థి నాగచతుర్థివ్రతం బాయష్టమి గోష్టాష్టమి యాద్వాదశి యుత్థానద్వాదశియుఁ బూర్ణిమ కార్తిక గౌరీ వ్రతంబు మార్గశిర శుద్ధ ద్వితీయ తింత్రిణీ గౌరీ వ్రతంబు ఆతృతీయరంభాతృతీయ యాచతుర్థి వరచతుర్థీ వ్రతం బాపంచమి బదరీగౌరీ వ్రతం బామరునాఁడు సుబ్రహ్మణ్యప్రీతి కరంబగు చాంపేయ షష్ఠి పుష్య బహుళచతుర్థి దూర్వాగౌరీ వ్రతంబు ఆదశమి త్రైలోక్య గౌరీవ్రతంబు ... ... ... ...
సావిత్రి గౌరీవ్రతంబు మాఘశుద్ధ ద్వితీయ కైలాసగౌరీవ్రతంబు ఆతృతీయ కుందగౌరీ వ్రతంబు ఆసప్తమి రథసప్తమి సూర్యచంద్రవ్రతంబు నయ్యష్టమి భీష్మాష్టమి యాయేకాదశి తిలపద్మవ్రతంబా బహుళ చతుర్దశి శివరాత్రియగు తత్ప్రభావం బెఱింగించెద.

సీ. శివరాత్రి నుపవాసశీలుఁడై శివపూజ
జాగరణంబును సలుపు పుణ్యుఁ
డవిరళవిభవుఁడై శివరూపము వహించు
పనివోక బోయ యాదినమునందు

వనమృగ హింసకై చని దొరకమిఁ గుండ
వందురిరా నొక్క వ్యాఘ్రమెయిది
గమకించి తూఱినఁ గడుభీతితో బిల్వ
తరువెక్కి పులి క్రింద నిరవుకొనుచు

ఆ.వె. నిద్రలేక రాత్రి నెగులునఁ దచ్ఛాఖ
లందునందు విరుగ నాకు రాలి
శిలలమీఁదఁ బడిన శివపూజ ఫలమబ్బి
యంత్యముననుముక్తి కరిగె నతఁడు.

ఉ. చోరుఁడొకండు శంకరుని సూరెలఁ బొంచి విభూషణోత్కరం
బారయ దీపమెత్తికని యన్నియు మ్రుచ్చిలి పారిపోవఁగా
నారెకు లేయ వాఁడు మృతుఁడై శివరాత్రి గిరీశసేవ చే
కూరిన యట్టి పుణ్యమున గొబ్బున శంకరుఁ జేరె ధీరతన్.

కం. స్త్రీ లైనఁబురుషు లైనన్
మేలిమి నుపచారసరణి మిహికాకరస
న్మాలిన్ బూజించిన శుభ
శీలుర సౌఖ్యములు నెందు శివదివసమునన్.

వ. మఱియుఁ జైత్రశుద్ధ తృతీయయు జ్యేష్ఠపూర్ణిమయు నాషాఢసితనవమియు జ్యేష్ఠబహుళాష్టమియు ఫాల్గుణపూర్ణిమయుఁ గ్రమంబున నుత్తమ శౌచ్య, చాక్షుష, ధర్మసావర్ణి, రుద్రసావర్ణి యింద్రసావర్ణి రైవత బ్రహ్మసావర్ణులనియెడు మన్వాదులు. మఱియు ననేకంబులగు పుణ్యకాలంబులు విమర్శించి తద్విహిత కర్మంబులాచరింపవలయు.

సీ. సత్యంబుచే హరిశ్చంద్రాదిభూపతుల్
కీర్తులు గాంచిరి వార్తకెక్కి
కల్మి నెన్నొందు స్వర్గము గల్గు సంతాన
మభివృద్ధియగు దండ్రి యంబ తోడఁ
బుట్టువుల్ సఖులును బుట్టముల్ గురువులు
దైవంబునదియ సత్యమున కంటె
వ్రతములు లేవు దేవత లెల్ల మెత్తురు
శుభములు జెలునొందు సుమతియైనెడి

ఆ.వె. ద్విజుడు మున్ను శంఖతీర్థతటోపరి
వనమహాశ్రమైకవాసుఁడగుచు
శిష్యులంత నింతఁ జేరిరాఁ గందమూ
లార్థ మడవి కరిగి యచటనచట.

కం. పూవులు గోయుచు నొక్కెడఁ
బోవఁగ నవ్విప్రుమీఁద బులి దుమికి మహీ
దేవుని కుడిచెయి పట్టిన
నా విప్రుఁడు కంప మొంది యంతటఁ బలికెన్.

చం. కమలజ సన్నిభుండతఁడు గౌరవతన్ బులిఁజూచి పల్కె నో
సుమహితసత్త్వ! మత్తనువు శుష్కము మాంసవిహీన మిందుకై
హమిణిక యేల నన్విడుము మంచన నాఁకలి బెట్టుగాఁగ ది
గ్భ్రమ మొనగింపుచున్నయది పట్టితి నిన్విడనేర నింకిటన్.

చం. అనవుడు నగ్నిహోత్రముల నాత్మ వసింపఁగఁ జేసి యింతికిన్
దనయుల కెల్ల శిష్యులకుఁ దాలిమి బుద్ధులు సెప్పి వత్తునో
యనఘ! మదీయ వాక్యగతులంతయు నమ్ముము నెమ్మి మీఱ నా
విని మునితోడ వ్యాఘ్రము మతివిశ్రుత ధర్మతరోక్తి నిట్లనున్.

కం. వత్తువొ రావో! యిది యొక
దత్తోత్తరము నమ్మఁ జాల ధరణీసుర! నా
నత్తఱి పులికిన్ సుమతి మ
హోత్తర నిజసత్య మెఱుఁగ నపుడిట్లనియెన్.

ఆ.వె. ఇప్పుడేను బాపమేమియుఁ జేయ ముక్
ఖాముపలననైన పాపసేమొ
యస్థిరంపు జన్మ మాసించి బొంకిన
బోరిది నిహపరముల సుఖముగలదె.

కం. పాపంబని చింతింపక
యోపిక కృశతనులఁ దాపసోత్తములన్ సద్
వ్యాపారుల నాసించిన
నీపట్లన్ బొంకులాడ నేర్తునె! యనుడున్.

ఆ.వె. పాపమైన నేమి పరికింప నాత్మశ
రీరరక్షణంబు రీతి వలయు
ననెడి ధర్మశాస్త్రి మరయవో వినవొకో.
యనుడు సుమతి యిట్టులని రొ పులికి.

సీ. యింటికిఁ జని వేగమే వత్తు రాకున్నఁ
బంచపాతకుఁడను భ్రాతృహంత
విశ్వాసపాతకి వీటిఁడి మిత్రఘ్నుఁ
డిలఁ గృతఘ్నుఁడు బంధుకుల్ల విఘాతి

గురువంచకుఁడు పడు నిరయముల్ గనువాఁడ
ననియును భర్తృవంచనియుఁ బతికి
మాఱాడు నదియును మోరాడి సతులతోఁ
గలహించునదియును గాంతుఁ డెడయ

ఆ.వె. విధవయయ్యును వల వెంట్రుకల్ గలయది
తొడరి రేపు మాపు గుడుచునదియు
వ్యభిచరించునది యనుభవించు దుర్గతు
లొందు వాఁడ ననియె నుర్వీసురుఁడు.

ఉ. దానికి సమ్మతించి పులి ధాత్రీసురుం బనుపంగ నాతఁడున్
బూనిక నేగి పుత్రులకు బుద్ధులు దెల్పఁగ నింతి భర్తతో
యానలినాక్షు వేడుకొన నప్పుడు వాసవుఁడున్ దిగీశులున్
మానివరేణ్యు నెంచుచు సమస్తసురల్ భజియింప వచ్చుచున్.

కం. సుమతి పులిఁ జేరనరుగఁగ
నమరగురుఁడు హరిహయుండు నప్పుడు పులికిన్
సురలోక మొసఁగి చనుడున్
ధరణీసురుఁడుండె నైజధర్మస్థితులన్.

ఆ.వె. అస్థిరంపు తనువు నాసించి బొంకక
సత్యనిరతి దొరయు సజ్జనుండు
నజ్జభవుని లోకమందె నాసుమతియు
ధర్మ సత్యరతులు ధన్యు లెందు.

కం. శరణాగతులం బ్రోచుట
పరమంబగు ధర్మమట్టి పారీణగుణ
స్థిరుఁడగు శిబిభూరమణుని
చరితము వినుఁడఖిలకలుష చలనోత్కలనన్.

సీ. ఆ ధరణీపతి యాగంబు సేయుచు
నడిగెడి వారికిష్టార్థ మొసఁగ
నమరేంద్రుఁడగ్నియు నతని గుణంబార
యఁగ డేగ గువ్వయు నగుచు నచటఁ
దఱుముడు వడి గువ్వ ధరణీశు శరణన్న
వెరవకుమనుచుఁ బృథ్వీవిభుండు
పొంబడిఁబతి డేగ నే వచ్చె తనకు నా
హారంబు దీని నీయఁగఁ దగు ననఁ

ఆ.వె. తనువునైన నీకుఁ దఱిగిత్తు గాక నా
శరణు జొచ్చినట్టి జంతువు విడ
పాపమగుటఁ జేసి పట్టియ వనుడు దా
నంతతూఁకి మాంసమడిగె డేగ.

చం. అతఁడటు మాన్చి మేన్ దఱిగి యాపట గుహ్యకు మాఱు పెట్టగా
నతిశయమయ్యె గుహ్య, తల యత్తఱి నుంచఁగ నెంచు ధారుణీ
పతి శిబి మెచ్చి యింద్రుఁడును పావకుఁడున్ దమరీతిఁ దెల్పియం
చిత తనువిచ్చుచున్ దివికిఁ జేరిరి ధారుణినాథు డంతటన్.

కం. ఇహభోగాన్వితుఁడై ధర
బహు వర్షములుండి నలువ పజ్జకుఁ జనియెన్
బహుమానాస్పదచరితా
పహ మాశ్రిత రక్షణంబు పరధర్మమిలన్.

కం. వచ్చుచుఁ దెచ్చినయదియున్
జచ్చుచు గొనిపోవునదియు సరవిం గలదే!
యచ్చపుపుణ్యము పాపము
నిచ్చలు నెడబాయ వెచట నిల్చిన యేనిన్.

కం. కీర్తియు ఘనసుకృతం బప
కీర్తియు దుష్కృతము మేలు కీడొనవించున్
వార్త గని రెంటి నడుమన్
గీర్తి వహించుటు లసత్సుకృతము లభించున్.

కం. దయయున్ సత్యము శౌచము
రయమున సంపదలు పెంపు రమ నొసఁగూర్చున్
నయమగు కీర్తులు స్వర్గా
వ్యయదాయికలోకభోగ మనువుగ నొసఁగున్.

ఉ. భూతదయా పరత్వమున బొంకుట సూనృతమట్లు, తద్దయా
నీతపు సత్యమయ్యనృతనీతియ యట్లనుటన్ సమస్తవి
ఖ్యాతశుభప్రదం బోరులకై తగబొంకుట యందుమేటి ప్రా
ణాతురదార సంగ్రహ విధాకృత మెందు మహాఫలంబగున్.

కం. అతివలతోడ నభిమాన
చ్యుతముల నాతురుల తోఁ బలుకు సూరిద్విజగో
ప్రతతిన్ బ్రోవఁగ బొంకుట
క్షితి సత్యముకంటె మేటి శేముషి దలఁపన్.

కం. క్షణ భంగురమై బుద్బుద
గణనంబగు దేహమునకునుగా బొంకక ర
క్షణ మొనరింపవలె నొరుల
గణుతింప నసత్యనీచ కర్మరతులైనన్.

సీ. దేవతలడుగ దధీచి వెన్నెముకిచ్చి
శాశ్వత కీర్తి ప్రసంగిగాఁడె
డేగ కోరిన మేను దీవిఁ గోయుచునిచ్చి
శిబి చిరకీర్తిసుస్థిరుడుగాడె
పద్మనేత్రుఁడు వేడఁ బంచజనుండు గా
త్రంబిచ్చి కీర్తి తత్పరుఁడుగాడె
యింద్రుఁడాసింప మేనెలమితో నొలిచిచ్చి
కర్ణుండు కీర్తి సంగతుఁడు గాఁడె

తే.గీ. యధ్రువమును ననిత్యంబు నల్పమైన
గాత్రముల మీఁది మమత పోకార్చి దివ్య
మతిధ్రువంబగు కీర్తిదేహములు గాంచి
రొరుల కర్థము లిచ్చుటయును ఘనంబె.

కం. ఇంద్రద్యుమ్నుని కీర్తులు
సాంద్రస్థితి కమఠవిభుఁడు చర్చింపఁగ న
య్యింద్రునిపదవికిఁ గ్రమ్మఱ
నింద్రద్యుమ్నుండు చనుటెల్లరు వినరే.

తే.గీ. కడు క్రియాజ్ఞాన పరమయోగముల వలన
హరి భజించిన నిరతనిత్యాశువర్గ
మొనరు గావున భాగవతోపచార
గతులు భక్తికి నెంతయుఁ గారణములు.

సీ. నిర్మత్సరాన్వితుల్ నిర్జితేంద్రియరతుల్
పరహితనిరతులు భాగవతులు
సర్వభూతదయా విశారద మానసుల్
పావన చరితులు భాగవతులు
మదలోభశాంత నిర్మధనస్వభావులు
భవ్యతేజోయుతుల్ భాగవతులు
విషయవిహీనత విష్ణుపాద సరోజ
భక్తిసంగతులు శ్రీ భాగవతులు

తే.గీ. భాసురామ్నాయ సహితులు భాగవతులు
పటుశుభాస్పద వేదగుల్ భాగవతులు
పరమ కీర్తనరాకృతుల్ భాగవతులు
భాగధేయప్రశోభితుల్ భాగవతులు

ఉ. కోరికకోరఁ బోక తమకున్ లభియించిన వస్తు సంతతుల్
శ్రీరమణీధవార్పితము సేయుచుఁ దద్వరదాస్యయుక్తిఁ ద
త్సారని వేదితాన్నములుదారగతిన్ భుజియించు వారలున్
గౌరవతత్కథాశ్రవణకౌతుకచిత్తులు వైష్ణవాగ్రణుల్

కం. పరనిందాసూయాదులు
పరదారధనానురక్తి పర భాషణముల్
పరికింపకె పుడల పరా
త్పర భజనారూఢమతులు భాగవతులిలన్.

ఉ. ధర్మముకంటె లాభమును ధర్మముకంటె శుభంబు నిత్యస
ద్ధర్మముకంటె సద్గతియు ధర్మముకంటెఁ దనూజ బాంధవుల్
ధర్మముకంటెఁ దల్లియును దండ్రియు నెక్కుడుగాఁడటంచు దా
నర్మిలిధర్మమే హరియటంచుఁ బ్రవర్తిలువారు వైష్ణవుల్

చం. సకలశుభంబులిచ్చు గల జాడ్యము లెల్ల హరించు వేదవిత్
ప్రకరనుతుల్ లభింపఁగనుపాయ, మపాయము బాపుచున్ జయ
ప్రకటిత కీర్తి లిచ్చునని పట్టుగధర్మువె విష్ణువంచుఁ దా
రకుటిల వృత్తినుండు విబుధాగ్రణులారయ వైష్ణవోత్తముల్

కం. పరలోకమునకుఁ జుట్టము
పరభయనిర్హరణమమితపాపహరము జ్ఞా
నరుచిరతమమని ధర్మం
బరయఁగ నేమఆని నరుఁడు భాగవతుఁడిలన్.

ఆ.వె. పరమపదము నదియె బాంధవుండు సహాయుఁ
డఖిలసౌఖ్య హేతువగుట నాత్మ
వర్ణ ధర్మగరిమ నిర్ణయం బెడలని
పరమతత్త్వవిదుఁడు భాగవతుఁడు

చం. జగములనన్నిఁ టంగలుగు జంతువులన్ ధరణీరుహాగ భూ
గగన చరాచర ప్రతతిఁ గంజదళేక్షణుఁడుండి తత్క్రియా
భిగణనచే మెలంగునని పేర్మినెఱుంగుచు శక్తియుక్తి ని
ష్ఠగ నతిథిన్ భజించు శుభ మూర్తులు భాగవతుల్ దలంపగన్

చం. అతిథిరూపి విష్ణుఁ డంచుమది నారసి పాద్యము సంగి శాస్త్రియు
క్తత క్షుధఁ దీర్చి సద్వినయ గౌరవ [వృత్తిఁ] బ్రియానురాగ సం
గతనుత భక్తితో మతి జగత్పతిఁ గన్గొని నట్టులుండు భా
సితగుణశాలి భాగవతశేఖరుఁ డెన్న ధరాతలంబునన్

కం. కన సర్వభూతహితమతిఁ
దనరుచు నిర్దోషుఁడై స్వతంత్రము దనపై
నునుపక శ్రీహరిపదస
ద్వనరుహపరతంత్రుఁడతఁడు వైష్ణవుఁడు ధరన్

సీ. నడచుటెల్ల శ్రీనాథ ప్రదక్షిణ
మమరఁ బల్కుటెల్ల హరికథనము
నాసఁ గ్రోలుటలు దన్నవ్యగంధామోద
మాలింపుటలు తత్కథానుసరణి
చూచుటలచ్యుత సురుచిరాకారంబు
లంటుట చక్రి యంగాంగకములఁ
జేయుకర్మము హరి సేవానుచారంబు
తలఁపు కృష్ణ ధ్యానవిలసితంబు

తే.గీ. అనుభవించుట తత్ప్రసాదాతిరుచులు
గాఁగ సకలమ్ము శ్రీ విష్ణుగాఁ దలంచు
ప్రబల సంతోషయుతులు శ్రీభాగవతులు

. . . . . . .

కం. శాంతియు శమదమరుచులున్
దాంతియు సత్యంబు భూతదయయును సుకృతం
బెంతయు వశ్యములుగ స
ర్వాంతస్థుని హరిఁదలంచు నతఁడనఘుఁడిలన్

చం. హరిగృహమార్జనంబు గుసుమార్చనముల్ తగు ఛత్ర [చామర]
స్ఫురదురు కేతుసచ్ఛతము పుణ్యఫలప్రద మిట్టి భక్తి శ్రీ
వరు నుపచార వృత్తుల నవారిత భక్తి భజించునట్టి సు
స్థిరగుణశాలి భాగవతశేఖరుఁ డెన్నఁగ సన్నుతోన్నతిన్

కం. పూవులతో [లె]లు సేయ
శ్రీవిభునర్చనకుఁ దులసి చెల్వగు సుమముల్
పావనత ననుదినంబిడు
నా విమలుండొందు సంతతానందుఁ డగున్.

కం. వ్రతదాన ధర్మ కర్మ
స్థితచర్యల హరికిఁ బ్రీతి సేయుచు భగవ
ద్వ్యతిరిక్త కర్మ వర్జిత
మతియగు భాగవతుఁ డతఁడమానుషలీలన్,

కం. మతినిలుకడ చాలనిచోఁ
బ్రతిమారాధన మొనర్చి భక్తి సలుపుచున్
ధృతిఁ దద్ధారణ గరిమన్
జతురుఁడతఁడు భాగవతుఁడు సజ్జనవినుతిన్

తే.గీ. మఱియు సమిత క్రియాయోగ మహితరీతి
భక్తియొదఁ గుదురొప్పఁగాఁ బ్రబలు ఘనులు
భాగవత శేఖరులు దద్విభవ వితతికి
సములు గారెన్న బ్రహ్మాదు లమితమహిమ

కం. కర్మము లెల్లను శ్రీహరి
కర్పితలోనిచ్చు [నట్టియతఁ] డతి భగవ
ద్ధర్మ పరుండై క్రమగతి
నిర్మల సాలోక్యగరిమ నెరయ న్వెలయున్.

సీ. అనవిని శౌనకాద్యఖిల సన్మునులు సూ
తునిఁ జూచి యేమేమి దుష్కృతముల
పాల్పడి జీవులు పడుదు రధోగతి
యందెట్టు లనుభవమగుట యనుడు
నతఁడిట్టులను నిరయంబుల భేదంబులు
కల్మష జనములక్కడ వసించు
టెల్ల సానందగణేశుఁడన్నని భద్ర
దత్తకు నల పూర్ణ విత్తునకును

ఆ.వె. బోధమిన్నట్టి ఘనుఁడు పొడగని సుగతికి
నిరయగృహములఁ బనిచె నెమ్మి దనరఁ
దేఁటగాఁగనట్టి తెలుఁగు దేజోధను
లార వినుఁడటంచు నాతఁడనియె.

కం. భూమికిఁ జక్కటి క్రిందునఁ
దామస పాతక నివాస ధామములగుచున్
భీమారవయమభటు సా
నామిత బాధలకునెల్ల నాకరమగుచున్

సీ. రౌరవంబును మహారౌరవంబును జ్వల
జ్జ్వాలికా తాల విశసనములును
తప్తకుంభి విపాత లవణ రుధిరోద
వైతరణ్యసి పత్రవనముఖములు
క్రిమిభోజ సందశ కృష్ణ సూత్రంబులు
తృష్ణ లాలాభక్షణోష్ణ శిఖలు
పూయదాహానిలాంబు నిమగ్నములు నధ
శ్శిరము దమము విచియు శ్వభుక్తి

ఆ.వె. కుణపభక్షణంబు ఘోరతామిస్రంబు
కాలసూత్ర సూచికా ముఖములు
పలలభక్షు రుక్త్వపతనముల్ క్షారాంబు
సేచనంబు తైలపాచనమును

ఆ.వె. కాకగృధ్రఘూక కంకఘాతంబులు
తప్తలోహకము వితప్త సైక
తము పురీషగర్త తాపన లిక్షుయం
త్రాది నిరయ కోటులచటఁ గలవు

వ. అవి పాపకర్మోచితానుభవంబులు యాతనానివాసంబులునైయుండు.

ఉ. అచ్చటిక్రోవ రాలిసుము సన్నియుఁ గంటక మాతపంబు న
* త్యచ్ఛయ వేదనాన్వితము నంబువిహీనము గాకగృధ్రదం
ష్ట్రోచ్ఛలితాతిభీకర మృగోజ్జ్వల మ [య్యమ ?] కింకరాత్యసా
మ్యోచ్ఛలితోక్తులన్ గరహలోద్ధృత మర్దన లొందు పాపులున్

కం. బహుభేదయాతనాస్థితి
బహుబాధలు వెక్కునిరయ పంక్తుల బీసల్ ?
బహుగతులఁ జేయుచుందురు
బహుఘోరాకృతులు శమన భటులుద్ధతులై

కం. వేదోదిత కర్మపు మ
ర్యాదలు దిగవిడిచి యన్యమగు దుష్క్రియలన్
బాదగు పాతక జనతతు
లాదటనుండుదురు యమభటావళులేచన్.

* యతిభంగము.

సీ. విగత మర్యాదులు విషయాసక్తులు క్షుద్ర
నికరనాస్తికులు డాంబికకృతఘ్న
విప్రధనాపహ విప్రనిందారతుల్
పుడమిదేవతలతో బొంకుఖలులు
పరుష భాషణులు దబ్బఱలాడు వారలు
పితును లమానులు పెక్కులరచు
నీచులు దేవితల్ సూచి కేతరధను
లెపుడు న సూయచే నెసఁగు వారు

ఆ.వె. ప [రధనైకర ?] తులు ప్రాణిహింసాపరుల్
దేవ నిగమ నింద [నా వహితులు]
నవి యథార్థమనినయట్టి కుత్సితమతుల్
సారె నిరయతతులఁ జేరు ఖలులు

శా. కర్మ భ్రంశకు లార్య విద్విషులు భోగప్రాభవుల్ తుష్కృవా
క్కర్మాలోలురు యోగులన్ యతుల నగ్ర్య బ్రహ్మచర్యవ్రతా ?
వర్మవ్యక్తుల నింద నేయు ఖలులున్ వాగ్దోషకుల్ విష్ణుస
ద్ధర్మాద్యర్చన హీనులుండుదురు బాధల్ నెంద నారాపునన్

తే.గీ. సర్వభూత విశ్వాస విచార రహిత
నిర్దయాన్విత వర్తనుల్ నీతివిగతు
లతిథి విడిచి భుజించిన యధమ గుణులు
దాన విఘ్నకరుల్ నిరయానురతులు

కం. అన్నంబడిగిన విప్రుని
నెన్ని పరీక్షించువాఁడు హితధరణిసురున్
సన్నుత తటాకముల వి
చ్ఛిన్నము గావించు నతఁడు నెందు[నిరయమున్]

సీ. విష కేశ రసములు విక్రయించునతండు
ప్రజల నెందవమానపఱచు నతఁడు
యజ్ఞ విక్రయుఁడు దత్తాపహారియు మాతృ
పితృ విరోధియు నగు ప్రీతి రహితుఁ
డన్యయోని నయోని నల పశుయోనుల
శుక్లంబు విడుచు నిన్నుల మహాఘొ
పర్వంబులను నీళ్లఁ బగటు నింతులఁ బొందు
నతఁడు రజస్వల నంటునతఁడు

తే.గీ. తోఁపులఁ బహ్ని జలములఁ ద్రోవ దేవ
నిలయ గోష్ఠంబులను జేరి జలము మలము
విడుచు వాఁడును భామిని బడయు ధనము
జీవనము జేసికొనువాఁడు జేరునచట

కం. సఖిరక్షింపనివాఁడున్
సఖులన్ హింసించునట్టి జనుఁడతిదీనున్
వికలాంగ వృద్ధ రోగుల
నకుటిలతను బ్రోవ నతఁడు నందు వసించున్

కం. శస్త్రములు నేయువాఁడున్
శస్త్రము లమ్ముడు నతండు శ్వసన హితార్చిన్
శాస్త్రప్రతి పాద్యార్థా
విశ్రుతచర్యుండు చేరలు వెస నిరయములన్

ఆ.వె. మద్యపానగీత వాద్య మాంసవ్రాత
నిత్యరతులు యువతినిన్ మహీసు
రాగ్ని హోత్రకన్య కావని నావుల
నరయలేని ఖలులు నిరయ గతులు

కం. ప్రత్యాశ క్షేత్రగృహా
ర్థత్య కులాచార రహితులాత్మకళత్ర
స్థిత్యర్థమిత్ర ధనహరు
లత్యార్జిత నిరయవాసులగుదురు తెలుపన్

కం. గురుదేవ ద్రవ్యహరా
పరసంపద్వికలహృదయ పాషాణ తరు
స్థిరశంకు హతమార్గా
వరోధులు నిరయనివహావాసులు కడఁకన్

సీ. జపహోమాంచిత దేవతాయజన శాస్త్రదానధర్మోపహా
సపరిత్యాగులు గ్రామయాచకులు నక్షత్రానుయాజ్ఞాంకులా
త్రిపవల్ నిద్రవహించువారు శరణార్థిన్ దుర్బలున్ దుఃఖితున్
గృపతోఁ గావని వారు దుర్గతికి సంకేతస్థు లెల్లప్పుడున్

కం. పరగృహరస ధాన్యధనా
కరవిచ్ఛేదకుఁడు వాదకరణుండు సమ
త్సరుఁడున్ లోభియు వనములు
నఱకి నతఁడు గాఁపు ఘోరనరకంబునకున్

తే.గీ. స్వామికి ద్రోహి మిత్రవంచకుఁడు శరుఁడు
పరగ గర్వియు విశ్వాస ఘాతకుండు
[గరదుఁడున్] గొండెకాఁడటఁ గాణయాచి
యుత్తరింతురు నిరయాళి హత్తిరెపుడు

కం. మఱియుఁగల పాతకముల
కరయిక నిరయములు పెక్కులగు నందందున్
బొరలుదురు పాపకర్ములు
దురితములకు బాధపడక తొలఁగునె! వరుసన్

ఉ. పాతక సంఘమిన్నఁగ నపారములట్టివి సేసి రోగు ల
త్యాతతదుష్టవర్తనులు నల్పశరీరులు క్షీణజీవనుల్
గాతరులంగహీనులునుగా జనియింతు రవెల్లనెన్నఁగా
ధాతయు నోపఁడేమి విదితంబుగఁ గొన్నిఁటి నేర్పరించెదన్

తే.గీ. బ్రహ్మఘాతి క్షయవ్యాధి బాధనొందు
నల సురాపాని దంతరోగాన్వితుఁడగు
స్వర్ణహరణుండు నఖరోగ సంగతుఁడగు
నవని గురుతల్పగుఁడు కుష్ఠ మనుభవించు

కం. గురుతల్పగు గానెఱుఁగుడు
గురువకురగ ? గ్రుడ్డిఁ బిచ్చుకుంటును ధరణిన్
గురునిందించిన వానిగ
నెఱుగుడు మూఁగయగువాని నెంతయుబుద్ధిన్

కం. విలినదొర [గురుజనులను]
బాలనుతై నింద సేయు పాపాత్ములఁగా
నాలోకింపుడు—— కా
రా లకుచ తొలఁగునట్టి యతకుల నెందున్

తే.గీ. గురునపేక్షింపకాతని గుఱి గడచిన
ఖలుఁడు దుర్గంధ కుష్ఠ భగందరముల
పాలబడి చిట్క్యమిత్వ మేర్పడఁ జరించు
గురుని కెమఱాడి పంతరౌ ధరణి తొలఁగు॥

కం. గురువందనంబు సేయమి
శిరమున రోగములు గల్గి శిథిలతఁ బొరలున్
మరితన్ జండాలిన్ బతి
త రజస్వలఁ గలసి మాతనమునఁ బొడమున్

సీ. అగ్నిదాహకుఁడు వస్త్రాది సంగ్రహణుండు
కుష్ఠ రోగంబులఁ గుందుచుండు
వెండిదొంగిలి జాడ్యవృత్తిఁ దామసుఁడగు
కూటసాక్షికిని గీల్క్యానునతండు
నైన ముఖరోగియౌ నిర్దయాత్మకుఁడును
నిష్ఠుర వాక్యుఁడై నెగడు వసుధ
గరదుండు పాండు రోగము నొందు శస్త్రజీ
వికుఁడు నిర్ధనవృత్తి వేదనగును

తే.గీ. పితరులన్ వృద్ధులను రోగ పీడితులను
తపసులన్ శరణాగతార్త జనతతుల
సతి సుతావళి విడిచిన జాడ్యగుణుఁడు
నేత్ర రోగంబులన్ బడి నిరయ మొందు.

ఉ. భూమిసురాగ్రగణ్యునకుఁ బూనిక నిచ్చెద నంచుసీని యా
తామసుఁ డల్పజీవియగు దద్దయు వారల వృత్తులెత్తినన్
బాముగు నేర్లు గుంటలును బాదపముల్ సుమ భూసురాలయ
శ్రీమహిమల్ వినాశముగఁ జేసినవాఁ డనపత్యుఁడౌ వగన్.

చం. శిశుపశుగర్భ హత్యములు జేసిన మూర్ఖుఁడు సంతతిన్ లస
ద్విశదతఁ గాంచియుం బోలియు దీనతనొంది చరించిముప్పునన్
గృశతనుఁడున్ దరిద్రుఁడును కీర్తివిహీనుఁడు నౌ ధరాస్థలిన్
బశుమిథునక్రియన్ గెడయఁ జాపినవాఁడ నపత్యుఁడౌ వగన్.

ఆ.వె. బాలధనము గల్గి సప్తసంతానముల్
ధరణి నెరయఁ జేయుదాల్మి లేని
పామరుండు హేయభవుఁడును గొడ్డుబో
తనఁగఁ బుత్రహీనుఁడై చెలంగు.

తే.గీ. నైష్ఠిక వ్రతసంత్యాగి నలకువ నిలఁ
బడి సదారోగియగు పెక్కుబడతులుండి
వరుస ఋతువేళఁ గలయకుండ లకొలంగి
రొకతె గవయంగ షండత్వమొందనుండు.

చం. తగుమధురాది భక్ష్యములు తావుననుండెడివారి కీక తా
నె గెడసి తిన్నయట్టి యవినీతుఁడు గుల్మపునొవ్వునొందు నా
ష్ఫగు మధుగంధ వస్తువులు నచ్చట నెవ్వరికీని వాఁడు నె
న్నఁగనిఁడు గంధమూషికమనన్ జనియించు [ధరిత్రి] వంచనన్.

కం. ఏలిక పనివంచినచో
నాలస్యతఁ దనదుపనికి నధిపతి కార్యం
బోలి చెడఁజేయు మనుజుఁడు
నా లీల నపుంసకుండు నధముండు నగున్.

సీ. కైతవ వ్యవహారి కడు ఖలోద్ధురుఁడగు
నగ్నిచోరకుఁడు మందాగ్నికుఁడగు
దుర్బల జంతులఁ దొడరి బాధించు వీ
క్షించు నతండంగ కుంచితుఁడగు
తగవునఁ బక్షపాతము పల్కునాతఁడు
మిగుల జిహ్వారోగి యగుచు వగచు
నమరుస్వదత్తాపహారి స్థానభ్రష్టుఁ
డగు కుత్సితోదన మవనిసురుల

తే.గీ. కిడుచుఁదామున్నగా భుజియించు నాతఁ
డగును గళరోగి గంధమాల్యాది యుక్తి
పంచయజ్ఞ పరిత్యాగి మందియగుచు
శ్వానయోనిభవుండునై జాడ్యుఁడగును.

కం. వినుఁడు మధురాది భోజ్యము
లనువుగ నిజభార్యకిడక యతినిర్దయుఁడై
తినువాఁడుగళారోగితఁ
దనరున్ బోళాలి బల్లితనము వహించున్.

తే.గీ. సకల ధనములు సూచించు పాతకుండు
యాచకుఁడు హీనవృత్తియు నగుచు మెలఁగ
క్రోధి చండాలుఁడగు లోభి కూళ పూతి
గంధయుత నాసికుఁడునగు ఘనత దొరఁగి.

కం. శ్రోవలు తప్పఁగఁ జెప్పిన
యావీతిఁడి నేత్రరోగియగు పుస్తకముల్
దావెస దొంగిల మూఁగగు
నావిధమునఁ గంచుదొంగ యంబూదరుఁడా:

కం. ఇనుమెత్తి విరూపకుఁడగు
వనరున్ వాద్యంపు దొంగ వడికండూతిన్
విను పుణ్యక్షేత్రమున
కను వెడలఁగ వక్రనాసుఁడై జనియించున్.

సీ. రూఢి నాచార విరోధి వక్రాస్యుఁడౌ
దాన విరోధి యదత్తుఁడునగు
దేవతాద్విజగురు ధేను ధనాపహా
రకుఁడతి స్థూలగాత్రమున నలయు
నెలమి ధర్మద్వేషి యేకాక్షుఁడగు నీర్ష్య
నతి వికృతాననుఁడగుచుఁ బరగు
నొగి లోహ విక్రయుఁడూర్ధ్వజానుండగు
దాసిఁ బొందిన వక్రతనువు దాల్చు

తే.గీ. దుర్భగాసక్తుఁగృశుఁడగు దొడరు సఖులఁ
బొంద, లేవడివాఁడునై చెందుఁగీడు
మఱియుఁ గాళంబులకుఁ దగుమార్గ రోగ
ములు ప్రవేశించునవి లేమిఁ గలుగు శుభము.

తే.గీ. ప్రజ్వలింపని యగ్నిలోపల హుతమిడ
వృద్ధ గురువుల నతిథుల విడిచి భుక్తి
గొనఁగ గుల్మంబుచే నలఁకువలఁజెందు
కృశతనుండగు దుర్బలవశత నలఁగి.

కం. ధరణీ విభుఁడై యాపర
ధర విప్రుల కొసఁగు పశువు శాంద్రికుఁడునగున్
శరణాగతుఁ బ్రోవని వాఁ
డరయఁగ శార్దూలమగు భయంకరవృత్తిన్.

కం. కూరలు దొంగిలి ప్లవగా
కారుండగు సజ్జనులఁగైతవవిద్యా
కారమున మోసపుచ్చిన
క్రూరుండు సృగాలమగుచుఁ గుటిలత మెలఁగున్.

తే.గీ. వేదశాస్త్రిక్కు లెఱిఁగి తద్విధుల మెలఁగు
వరుస తెలియక మర్యాద విరతుఁడైన
యాతఁడు సుగంధవస్తుభారానుకూల
మైన గార్దభమై పుట్టి యవనిఁ దిరుగు

ఆ. వె. ఆత్మసాక్షిమాని యన్యాంగనాసంగ
మానురతుఁడు లేమి నలమటఁ బడు
నతిథి విడిచి [కుడిచి] నతఁడు కపోలనీ
లత నసహ్యవదనగతి మెలంగు.

ఆ. వె. [తనదు?] మిత్ర సుకృత జనులకుఁ బరుషంపు
పగలఁ గీడు సేయువాఁడు నీచ
వర్ణనుండు కొద్దివాఁడునై యందఱు
రోయఁ జెందు [నట్టి] రోఁత బ్రతుకు.

సీ. సంధ్యల విరహియై సతిఁబొందు నాతఁడు
ధర్షనల్? గురుబంధుజనుల రొండలఁ
గావించు నాతఁడు గడు భ్రంశబుద్ధియౌ
వంటలవాఁడయ్యు వసుధఁ దిరుగు
తనయందు లేని పెద్దతనంబు ప్రకటించు
హేయుండు బాంధవహీనతఁ దగు
నబ్బినదెల్ల రోయక తినువాఁడు మ
హా వ్యాధియుతుఁడు హీనాంగుఁడగును

తే. గీ. పశువు వీఁపునఁ బవళించు పంద [తొంటి ?]
నొప్పివాఁడగు మృతవత్సను క్రియ లమరఁ
బిదుక జాత్యంధుఁడగు నెందుఁ బేర్మి కెక్కు
గొల్లవారింట బంటగు గుజనుఁడగుచు.

తే. గీ. గ్రామ నక్షత్ర యాచకులోము దేవ
లుండు శ్రుతి విక్రయుండు ధ్వజుండు నెన్న
గ్రామచండాల పంచకగణము, లంటఁ
గనిన భాషింపఁ బుణ్యముల్ గడకు దొలఁగు.

కం. మాలనిఁ జాతకిఁ బీనుఁగు
నోలిఁ స్పృశియించెనేని నొనర సచేలో
ద్వేలస్నానము నవల
జ్వాలా స్పర్శనము ఘృతము చవిగొనుటదగుఁ.

తే. గీ. అతుల నేయమి నిరయ విహారియగును
శూద్రుఁ డంటినఁ గ్రుంకిడి చొప్పునొప్పు
సంకమలచారి [కఁట?] నేయ సౌరజపము
భవ్యసత్కర్మ నిరతు లౌ బ్రాహ్మణులకు.

కం. పసి కుక్కుట పండరజో
వనితా పవితాళి? బేడి వ్యభిచారిని నూ
రను దిరుగు పంధినంటుక
మునుఁగకయున్నతఁడు నరకమునఁ బడు వెలుచన్.

సీ. పరధనసుత సతీహరణులు గాఢాంధ
పతితులౌదురు యమభటులు పొడువ
నేలికకున్ గీఁడు లెలమిఁ జేసినఁబడు
మితిలేనియంధతామిస్రవితతి
సుతసతులన్విడి ధృతిఁ దనపొట్టకై
వనరు నాతఁడు రౌరవమునఁ బొరలు
పశుపక్షితతికంబు పాసంబు దొలఁగించు
ముఱుచ కుంభీపాకమునను దప్త

తే.గీ. శిలలపైఁ గ్రాఁగు దల్లిదంష్ట్రములను నిగ్ర
హించినన్ గాలసూత్ర మంధిరవుకొనును
పలు దెఱంగుల జీవుల బాధపఱచు
నరుఁడు శాల్మలి ముండ్లలోఁ దరలఁ డెపుడు.

కం. ధర్మగతిఁదప్పు దుష్కృత
కర్ములు వైతరణిఁ గూలి క్రాఁగుదురు గడున్
నిర్మల నిగమార్ధగతా
కర్మగు లసి పత్రవనులఁ గడఁబడుదురొగిన్.

తే.గీ. దండ్యునినదండ్యునిగ నవదండ్యు దండ్యు
గాఁగ నొనరించుపతి యంత్రకమున నవయుఁ
దమకు నపకృతిలేని జీవములఁ దునుము
ఖలులు తామిస్రకూపదుర్గతుల నుంద్రు.

చం. దినమును బంచయజ్ఞములు దేవనమస్కృతి లేక భుక్తికిన్
జనియెడు వాఁడు పాకముల శాకములన్ దగ పంక్తిభేదమున్
బెనఁచినవాఁడు కీటములు పేర్మితో నుండిన దుర్గతింబడున్
గొనకొని కొండెగాఁడు నఁటుఁ గూపము నంబడి దొర్లు వేదనన్.

కం. ఇలఁ జెలులు పురుషులైనన్
జెలఁగి యగమ్యాగమంబుఁ జేసిన కాకన్
గల యుక్కు తదాకారము
లలవడఁ గావింతురనుదినా లింగనముల్.

మ. వేదము శాంతి శౌచములు విడియు వీడనియట్టివారలున్
క్రోధిగ దుష్టులై వృషలిఁ బొందిన వారలు పూయమూత్రదు
ర్వేదనలొంది త్రావుచును వీఱిడు లొందురు కైతవంబునన్
వాదమెకంబులన్ మనుచు పాపారలున్ శితబాణసంగతిన్.

తే.గీ. డంబమున కథ్వరంబు నిష్ఠాక్రమంబు
తప్పఁగావింప వీచిలోఁ తవిలియడలు (?)
కులసతిని యౌవనంబునఁ గలియనతఁడు
యమభటులు గొట్టి శుక్లకుండమునఁ బొరలు.

కం. గరదుండు త్రోవదోపరి
గురువంచనరతుఁడు వైశ్యకులములను ధనా
హరణుఁడు గృహదాహకుఁడున్
బరుషంబగు వజ్రదంష్ట్రిఁబడుదురు వెలుచన్

కం. ప్రతిపురుషైణేయములుభ
యతోముఖ [గవిని] భాగమనువగుకాలా
న్వితచక్రదానములుగొను
నతఁడవనిన్ బుంస్త్వమొందఁడతి జన్మములన్.

వ. మఱియు ననేకవిధ దురితంబుల కొలఁది నిరయంబులం బొరలుదురందు.—

సీ. కాకగృధ్రములు సూకర సారమేయ శా
ర్దూలముల్ గలఁచునెత్తురులు దొరుగ
నెరచుట్టినినుము నూనియయుక్కు గంబంబు
కాఁకలవేల్తురు గడుమొఱయిడ
నసిపత్రగహ్వరోగ్రావనిరుహముల
కడవైతురింతింత కండ లూరుల
నీసమ్ము చౌడు మూత్రాసవములు పూయ
శుక్లముల్ పోతురచ్చోన బొనల

తే.గీ. నెప్పుడుఁ గానఁగ సంధుల నిడి కమల్తు
రరి (ది ?) లోతగు బావుల నదిమివిడుతు
రిట్టి బాధలఁబడక రమేశు విష్ణుఁ
గొలిచి సుఖమొందఁ దగు మానవులకు నెల్ల.

కం॥ వేదోపనిషత్స్మృతి సం
పాదితధర్మములు కర్మ పద్ధతులన్ మ
ర్యాదలు దెల్పితి నింకను
మోదితశాస్త్రార్థ వృత్తు లురుమతి వినుడీ!

కం. పూర్వోత్తర మీమాంసలు
సర్వోక్తులఁ దర్కదండ శాస్త్రంబులు నం
తర్విధ సాంఖ్యము యోగముఁ
వేర్వేరుగ శాస్త్రషట్క విశ్రుతి నమరున్.

వ. శిక్షావ్యాకరణ ఛందోనిరుక్త జ్యోతిష కల్పనామంబుల వేదపురుషునికి నాసనకర చరణశ్రోత్ర రసనాను రూపంబులగు వేదాంగక్రమం బెఱింగించెద నందు శిక్షా ప్రకరణంబ థిలోక మధిజ్యోతిష మధివిద్యమునధిప్రజంబధ్యాత్మమునన నైదుదెఱంగుల నధికరణంబు లవి భూమ్యగ్ని గురుమాతాగ [ణం ?] బులఁ దెలియందగు నదియెట్లనిన.

సీ. ధరపూర్వ రూప మంబర ముత్తరము బయల్
సంధి సంధానంబు శ్వసనుఁడటుకు
నగ్ని పూర్వాకృతి యాదిత్యుఁ డుత్తర
ముదకంబు సంధివైద్యుత మవలిది
యాచార్యుఁ డొగి పూర్వమాశిష్యుఁ డుత్తర
మటవిద్య యేసంధి యవలవచము
తల్లిపూర్వాకృతి తండ్రియుత్తర ప్రజల్
సంధి ప్రజననంబు సరవినవల

ఆ.వె. క్రింది హనువు పూర్వమందు మీఁదటిదుత్త
రంబువాక్కు సంధిరహిని జిహ్వ
సరసరీతి నొప్పు సంధానమై యధి
లోక మాదిగాఁగ జోఁకవిట్లు.

వ. మఱియు నకారాది షోడశవర్ణములు నచ్చులు స్వరంబులును కకారాది వర్గపంచ కంబు వ్యంజనంబులు హల్లులు స్పర్శలునగు వర్గాంతంబులగు జణనమలు అనునాసికలనం దగు స్పర్శ లిరువదియు ననునాసికలుంగలయవి. యమలచిహ్న ములంబొలుపగు య ర ల వ లు నంతస్థలు శ ష స హ లు సూష్మలనందగు కకిపయను రెండు క్రమంబున జిహ్వా మూలీయా పధ్మానీయంబుల నొసంగునదియునుంగాక.

తే.గీ. తనరుదీర్ఘము రెండు మాత్రలను ప్లుతము
ధృతిఁద్రిమాత్రలు హ్రస్వార్ధ గలిత వ్యంజ
నమగు సంకేత మీక్రియ నమరు లౌకి
కమునకును వైదికమున కైక్యత వహించి.

చం. స్వరములు వ్యంజనంబులను సంజ్ఞల నేఁబది తానకంబులన్
బరగెడు వర్ణముల్ నిగమ పంక్తికి నేఁబది యొండు గాఁగ నే
ర్పులుపఁగ సూక్ష్మయుక్తముగఁ జాటిలుచున్ యమునైదు సంగమున్
గరిమ ననుస్వరంబును హకారమునన్ స్వరభక్తి నాదమున్.

కం. సరవిని బదియునుగూడఁగ
నరువదియొకటగుచు సూక్ష్మలందొక రెండున్
దొరకొను కాలవిశేషత
బెరయఁగ నరువదియు మూఁడు పేర్కొందనతున్.

కం. స్వరములు వర్గాద్యక్షర
సరణియు ద్విజకులమువర్గు ఇత తక్కువి భూ
వరు లంతస్థోత్కరము
త్వరు విట్కుల మాష్మబిందులొగి శూద్రియముల్.

సీ. వెలయవర్ణ క్రమవృత్తి స్వరాత్పర
వ్యంజనమ్ము ద్విత్వమందకగును
నెరిఁద కారపుఁ బొల్లు పరమౌ నకారల
కారంబులును నట్లు గ్గియుండు
నొనరఁగ స్వరములకును బరంబగు వ్యంజ
నములకు ద్విత్వంబులమరియుండు
పొరివకాగము పూర్వమునన్నన్న వ్యంజనం
బులు పరంబులుగాఁగ గల లకార

తే.గీ. మదియుద్విత్వంబునందు నిట్లమరు లక్ష
ణములు పెక్కునిరూపించుఁ గ్రమముతోడ
శిక్ష వ్యాకరణానుగన్థితిఁ దనర్చు
నిగమ పదవర్ణ వాక్యముల్ నెగడనిట్లు.

తే.గీ. అట్టి వర్ణంబులుదయించునట్టి యెడలఁ
బలుకుబడి గోచరంబగు నెలమి మీఱ
నైనఁ గొన్నిఁటి వివరింతుఁ బూనికలర
వాని రీతులు తెలిసికోవలయు బుద్ధి,

కం. రదనోష్ఠజము వకారం
బదనఁ బవర్గువును నచ్చులనఁదగుదీర్ఘా
స్పదములు కారంబును
బెదవుల మొదలంజనించుఁ బేర్మిన్ దనరన్.

ఉ. తాలుజిహ్వామధ్యమోలి నికార మె
కారంబు బుట్టునోకార మోష్ఠ
సామీప్యమున హనుసంధి జిహ్వామూల
మునఁ గవర్గంబు తాలుమూల జిహ్వా
నడుమఁ జవర్గు దంతములఁ దవర్గువు
జనియించు ... ... ...
తాలుజిహ్వామధ్య [తలి ?] యకారము దంత
మూలంబునను రేఫ యాలకార

తే.గీ. మును పకార విసర్జన మొనరు గంఠ
తాళమున ననునాసికల్ నాసికాము
ఖముల సంధిని జనియించు నమరవర్ణ
జన్మవిధ మిట్టి తెలుఁగగు శాస్త్రి సరణి.

తే.గీ. ధృతి నుదాత్తాను దాత్త స్వరితములు ప్ర
చయముగల్గఁగ స్వరముల సంజ్ఞ నచ్చ
లలవడిరా నుచ్చమైన నుదాత్తమయ్యె
నిచయ మనుదాత్తమజ్ఞ స్వరనియతిఁ దనరు

కం. పరగ సమాహారంబది
స్వరితము స్వరితంబువలన సమప్రచయం
బరయఁగ వేదపదక్రమ
నిరతిం జెలు వొందునిది యనిందిత వృత్తిన్.

వ. ఇది శిక్షా ప్రకరణంబింక వ్యాకరణ మార్గం బెఱింగించెద.

సీ. అయిఉణ్ణు నరులుక్కునంగ నే ఓఙ్ఙై
కొచ్చన హయవరడనఁగ లణ్ణు
ఞమఙణనము ఝభఞ్ ఘఢధష్ణ జబగడ
దశుకపయ్ ఖఫఛఠథ చటతవన
శషసరుహల్లన సరి నొప్పు పదునాల్గు
సూత్రము లార్యాకళత్రుహస్త
వనజసంభృతఢక్కవలన నుద్భవమొంది
నలువదియొక్కటై వెలసెఁ గాన
తలనొప్పనీ సూత్రముల నాదివర్ణంబు
లంత్య వర్ణములతో నలరిమధ్య

ఆ.వె. మధ్యములకు [గ్రహణ?] మలరుఁ బ్రత్యాహార
కలన వృద్ధి గుణముగర్గ సుప్తు
తిఙ్కృత్తులనెడి దీపిత శబ్దధా
త్వాదులఖిల సూరులలర మెఱయు.

తే.గీ. ధాతుసూత్ర గణంబులు దగను ణాది
లాగమ ప్రత్యయములు లింగాను శాస
నములు నాదేశములును వాక్యములును గూడ
సరవితోడుత నుపదేశసంజ్ఞఁ దనరు.

సీ. ధాతువుల్ ప్రకృతియౌ దానిపై ప్రాప్తసూ
త్రాదేశములు ప్రత్యయములనఁదగు
మిత్రునిగతిఁ గూడి మెఱయు నాగమ [మది?]
తీరున నడచు నాదేశ మరయఁ
దగనుబంతము దిజంతము గూడఁ బదమగు
బరగఁ గృత్తద్ధితల్ ప్రత్యయమగు
సప్తవిభక్తు లెంచఁగఁ గారకంబులు
ప్రథమాపలుకు సర్గ లపరిమితప

తే.గీ. దంబు లొకటైనచో సమాసంబనఁ దగు
వహి విభక్తులులేని యవ్యయము పదములు
దశల కారాత్మకంబులు ధాతుచయము
లరయ నిదియాది గాఁగ వ్యాకరణమయ్యె

కం. ఛందము లిరువదియాఱగుఁ
నందుల వృత్తములు పుట్టినపరిమితములై
ముందాదిమ కవిబృందము
లందొక కొన్నింటి నొడివి రంచిత ఫణితిన్.

ఆ.వె. గద్య పద్య కావ్యగతుల యందాగద్య
పాదరహితమగుచుఁ బ్రబలునాల్గు
పాదములును వృత్త భేదంబులగు వృత్త
ములను జాతులనఁగ ననఘగతుల

చం. అనువుగ వృత్తముల్ లయసమన్వితముల్ లయనిల్చుచోట్ల బ
య్యనయతి నాఁదర్చు యతులాఁజగలిన్ బదియయ్యె భేదముల్
దనరఁగనిర్వదెన్మిదనఁ దద్దయుఁ జెన్నగు వార్షికాదిస్థా
యొనరు గణస్వరూపము రసోచిత జాతులెఱుంగఁ గాఁదగున్

కం. మొదలన దుమఁదుది నన్నిఁటు
బొదవినగురువులను భజసములు మగణమునౌ
నదన నటులైనలఘువులు
నొదవినయరతలును నగణ మొప్పగువరుసన్

కం. ఒత్తువెన్కనున్న నూఁది పల్కిన దీర్ఘ
యుక్తమైన గురువులున్న వెల్ల
లఘువులరయ నొక్కలఘు వేక మాత్రయౌ
గురువు రెండు మాత్ర లిరవుగాఁగ

కం. జాతులు మాత్రాబద్ధము
లాతత వృత్తములు గణసమాయత్తము లీ
రీతిగ మభజసయ తవలు
ఖ్యాతిగ ఫల నిర్ణయములు గల గణములిలన్

కం. మభయనతలు కృతిమొదలన్
శుభసుఖధనకనక విభవ సుస్థితుల నొసం
గు భువి రజసలవి రుక్ క్షయ
దభయప్రద లాది నిడు నతనికిం బతికిన్

కం. నగసగతగయగరగలనఁ
దగుగురు వెచ్చినను నలము తలము లఘువుచే
గగలలములు గురులఘువులు
[సగురులఘులు] తుదిమొదళ్ల సగణ తగణముల్

సీ. యతనలు జగణంబు నటు భగణంబును
మగణంబురసలు క్రమమున భూమి
సురభూపక కిరాటు శూద్రాంత్య కులజముల్
పటుసిత రక్తముల్ పచ్చశ్యామ
నీల వర్ణంబులు నైతి వరుణేంద్రులం
బరమును రవి శశిధరణి పవన
వహ్ని దైవతములు వాసవాఖ్యను సల
భరతనగ నలంబు లిరవు కొనును

ఆ.వె. నహములినుని గుఱుతు వహి రెక్కఁగఁ బ్రయోగ
సరణి మీఁది వృత్త సముదయమున
మాత్ర తతులచే సమస్థితిఁ దగుపాటి
యితరగణము లెల్ల నిందుఁ దగును

ఆ.వె. సహజయతియు వర్గ స్వర మఖండము బిందు
సంయుత ప్లుతములు సరసయతియు
నటువికల్పమనఁగ నమరుఁ దొమ్మిది విభే
దాను సరణి నిరువదాఱునయ్యె

కం. యతి మొదటి యక్షరంబది
చతురత యతి పిలుఁద నునుప సహజవిరతియౌ
ధృతికచటతపలు వర్గలు
చతురఙఁరములను వర్గ జతయతు లిట్లు

కం. స్వరమిత్వ మేత్వమునకున్
ధరనైత్వము నౌత్వములును దల కట్లకగున్
గరముత్వ మొత్వమునకున్
బరగున్ ఋత్వంబు నిత్వ భావంబగుచున్

ఆ.వె. ప్రాద్యఖండమనఁగఁ బ్రభునామ తాఖండ
మయ్యభిధమనంగ నగునఖండ
మనఁగ నాల్గు రీతులగు ప్ర [ష(౨)] రాదులు
ప్రాది దక్క వాటి పథము లిట్లు

కం. అనునాసికలగు వర్గపు
లనువగు వర్ణమును బిందువైన ననుస్వా
రనియతి బిందువగున్ జం
దన భూజము వెలయు నందనంబుననఁగన్

కం. ధృతి దనరఁగసంయుక్తవి
రతియగు వేంకట విభుండు ప్రభువిలకనుచో
మతిఁదఁలప నిధిరొం రివడియు
క్షితి నా దేశంబు స్వరము వెలువున నమరున్

కం. పిలుచు నెడ సందియంబగు
పలుకున గీతమున శోక భావార్థమునన్
గలయది ప్లుతము త్రి మాత్రలుఁ
దెలియఁగ వృద్ధియును గాకు దీనయమరున్

కం. నిత్య సమాస పదంబుల
నిత్య విరతియమ్మదాదినిరతా భేదా
ద్ధత్యయతు లాయఖండమె
యత్యను పాదమున వెలయు నార్యులు మెచ్చన్

తే.గీ. అయహ చఛజఝశషస లందు యతి సరసత
చక్కటెక్కటి పోలిక సరవి నున్న
మావడులు నావి భాగంబు మఱి వికల్ప
యతులు భేదములగు గావ్యచతురయుక్తి

సీ. ప్రాసవిధంబు లేర్పడు సుకరంబు దు
ష్కర మనుప్రాస వికల్పములును
సమలఘు వెన్నపైత్రి మఱియు ఋప్రాస
యర్ధబిందువు త్రికారాంత్యములును
ధృతిఁ జెలువొందఁగ ద్విత్రిచతు ప్రాస
ముఖపత్త్రితయము నిమ్ముగఁ బొసంగు
లక్షణంబు లివి విలాసమా నాద్యస
త్కవిరచిత ప్రథ గరిమ నమరి

తే.గీ. సులభదుష్కరవర్ణముల్ జొనుపఁ బట్టి
ప్రాసములగు ననుప్రాసపటిమ యతుల
పద్మవికసన మాకృష్ణ సమ్ముఖంబు
ననుట యవికల్ప మనునాసికాంక సరణి

తే.గీ. విద్రిచె దనుజాళి హరి ధర యద్రువనఁగ
సమలఘువు నణలళల ప్రాసంబుపై త్రి
యమృత కమలాక్షి ఋప్రాసమనఁగఁ జెల్లు
పీఁటకిని సాటి యన నర్ధబిందువర్యా

తే.గీ. సంఖ్య గల్త్రికారశబ్దంబది ఋకార
సదృశమై త్రికార సంజ్ఞనమరు
పదము తుదను వర్ణపటిమ నాల్గాకగతి
నేక వర్ణ మంత్య మెంచిచూడ

కం. రెండును మూఁడును నాలుగు
నుండు వరుస వర్ణ పంక్తులుండు పదమ్ముల్
దండిగ ద్విత్రి ప్రాసము
లుండుఁ జతుప్రాసముతుల నుండును గృతులన్

కం. పదివిధముల పొంతువులున్
బదిలమ్ముగ గణము తార పతి తారకుపొం
దడకగ శుభద మూఁగఁ గవి
చదురుగఁ గృతి సేయ నఖిల సౌఖ్యములొదవున్

జయ విజయ శంఖములు మహాశంఖ మహాము
జాములగు రాత్రి రామయేరామ ళ్ళ సుప్తు
ములు ప్రసుప్తియు వరుసన కలుగు మభజ
సనయ [ర?] తము ల కెనిమిది జాములపుడు

కం. అయా కాలము కావ్యము
లాయాగణములను దోషహరణముగ నిడక్
ప్రియగు నెఱుఁగక చెప్పిన
నాయకునకుఁ గీడులగు వినాశము నొదవున్

శా. శ్రీకారంబమృతప్రధానమగుటన్ శ్రీమన్త్రిమూర్త్యాత్మకం
బై కావ్యార్థములిచ్చుటన్ మగణ మాద్యార్థస్థితిన్ గోవిదా
నీకప్రాశత రీక్తిఁ బొల్చు కవులెంతే వేడ్క నిర్దోషభ
ద్రాకల్పంబుగఁ గూర్చి చెప్పుదురు పద్యాం [కంబు?] శుంభత్కృతిన్

కం. అది మొదటి జామునన్ భ
ద్రదముగఁ గృతిజాని నెప్పఁడగు సుకవివరా
స్పదమగుటు మగణ మొక్కడఁ
గదియింతురు పొంతు పెతిఁగిఘనులగుసుకవుల్

శా. అర్యాద్యై యరులేను దీర్ఘముల నాయావర్ణ పంక్త్యట్లయే
కారాదుల్ సుకవర్గ పంచకము జోకన్ యాది షాద్యాదివు
ర్వారాంచద్దశవర్గు లైదు వరుసన్ వాతానలోర్వ్యంబుతే
జోయూర్థిన్దగు దుఃఖవృత్త్య సుఖభాగ్య శ్రీలుదారిద్ర్యముల్

వ. ఇచ్చుగావున క్షితిజలబీజంబులేర్చి పద్యాదుల నిడవలయు మఱియు ననేకవిధభేద వృత్త కావ్యదండకోదాహరణ నాటకాది ప్రకరణంబులందగు నింకనిరుక్తక్రమంబు

సీ. అర్థాంతి కమ్మున నమరు పూర్వోత్తర
బుక్కుల సంధులు పెక్కువగలఁ
గలుగు కాలంబులగతి నిరుక్తము చెల్పు
మహిమదీర్ఘము రెండు మాత్రలు నగు
హ్రస్వంబు నొక మాత్రయట్ల ప్లుతంబు త్రి
మాత్రాన్వితంబుగా మఱియుఁ బొల్ల
లతిలఘువులుదగు నర్ధ మాత్రస్థితి
నివి పదక్రమముల నెసఁగువలను

తే.గీ. తెలిసివర్ణ క్రమంబులు తేటగాఁగ
చాడి పదవర్ణ జటలు నేర్పడఁగ నేర్చు
నతఁడు నియమాధ్యయనశీలుఁ డనఁగఁదనరు
శ్రోత్రియోత్తముఁ డధిక పవిత్రవృత్తి

మ. క్షుతజృంభార్తవులందు చోట సరసుల్ శూద్రుల్ వసింపన్ నిశా
గతులన్ రూఢిఁ బ్రదోషకాలములఁ జోఁకన్ వాక్యానం బల్యకం
చిత పుణ్యావని సాధుదేశిక ముఖశ్రీసూత సమ్యగ్గతిన్
దతభక్తిన్ బఠియింప శోభనములుద్యద్భానుర శ్రేణికిన్

తే.గీ. త్రివిధమై జ్యోతిషము కడుఁ దేజరిల్లు
ప్రథలు గణితము జాతక భాగము ఫల
భాగమును నాఁగ సిద్ధాంతపటిమ గణిత
భాగ మలవడు జాతకప్రథ వినుండు

కం. ఆధానమునకు లగ్నం
బాదటను శుభగ్రహంబులత్యుచ్చయ వీ
క్షాధృతి నుండఁగ మేలగు
పాదుగఁ బుంగ్రహ నిరీక్ష పట్టి జనించున్

ఆ.వె. స్త్రీగ్రహమ్ములున్న స్త్రీ పుట్టు నట్లన
పుంసకంబులున్నఁ బొడమినట్టి
శిశువు లగ్నకాలదశ సున్ద్రము పాప శు
భగ్రహమ్ములట్టి పగదిఁ జేయు

కం. గురురవి భూపుత్రులు తగ
పురుషులు శుక్రుండు శశియు పొలతుకలెన్నన్
దరణిజ బుధులు నపుంసకు
లరయఁగ రాహువును గేతు వవి ఛాయలగున్

సీ. గురుడును శుక్రుఁ డెక్కుడు శుభగ్రహములు
కమలారి పూర్వ పక్షమున నట్లు
బుధుఁడు శుభగ్రహంబులఁ గూడియున్నఁ బ్ర
త్యేకమున్న శుభం బెన్ని చూడ
రవిశని కుజులు క్రూరగ్రహంబులు గురు
శుక్రులు కుజరవుల్ సోమ బుధులు
శనియుఁ జతుర్వర్ణ సంగతుల్ మేషవృ
షభ నక్ర కన్యలు సరవిఁ గర్క

తే.గీ. టమును మీనంబు తులయును గమలమిత్రుఁ
డాదిగ గ్రహంబులకును స్వోచ్చాను రాశి
నుచ్చ కేడింట నీచరై యొదవు గాన
ముఖ్యలగ్నము లాధానములకు శస్త

సీ. తరణికి శశిశుక్రు లరులు బుధుఁడు సముఁ
డితరులు మిత్రులా హిమకరునకు
రవిబుధుల్ మిత్రులు రహి నితరులు సముల్
కుజునకు శన్యర్కగురులు హితులు
బుధుఁడరి శనికవుల్ శౌరి సముల్ బుధునికి
శుక్రార్కు లాప్తులు సోముఁడరి స
ములు తక్కువారు సమున్నతి గురునకుఁ
గవిబుధు లరుల హస్కరజుఁడు సముఁ

తే.గీ. డాప్తు లితరులు శుక్రున కర్కబుధులు
హితులు గురుభూసుతులు సము లితరులరులు
శనికిఁ గవిబుధులాప్తులు సముఁడు గురుఁడు
కుజుఁడు నరులితరులు [చూడ] గుఱుతు లిట్టుల

ఆ.వె. మృగము కర్కటకము మేషవృశ్చికములు
మిథున కన్యలమరు మీనచాప
ములును వృషభతతులు నలకుంభ మకరంబు
లాలయంబుల య్యినాదులకును

కం. స్వక్షేత్రములను శుభమగు
వీక్షన్ స్వోచ్చస్థులగుచు వెలయు గ్రహమ్ముల్
వీక్షింపఁగ నాధానము
దక్షతఁ జేయంగవలయు. దనయులు గల్గన్

సీ. పుంసవనంబునన్ బుత్రుఁపు జనియించు
కొఱకు సేయఁగఁ దగు గరము వేడ్క
మూఁడవ నెలయందుఁ బోఁడిమిఁ జంద్రుండు
శ్రవణపు ఋక్షల సంచరింపఁ
దెలిసిరిక్తలుగాని తిథులను శశిశుక్ర
... ... గురువారములఁ గుశీర
కన్యాది శుభలగ్న కాలంబులను బాపు
లగు గ్రహంబులు త్రిషడాయములను.

ఆ.వె. దగ శుభగ్రహమ్ము లగణితధృతి మంచి
తారావులను మెలంగ దీవి మెఱయ
నాగమోక్తరీతి నాచరింపుట వెన్న
పుట్టు శిశువు వృద్ధిఁ బొందుటకును

కం. నాలుగు నాఱును నెనిమిది
నెలమి మాసములు పుష్యమియు హస్తయుఁ జి
త్రాలలితోత్తర ఋక్షల
శీలత సీమంతవిధి విశేషముదలఁపన్

కం. ధనధాన్య సమృద్ధిన్ ద
త్తనయుఁడు వర్ధిలఁగఁ జేయ దగు సీమంతం
బెనిమిదవ నెలను గొనకొని
వినువాక్షణ కర్మమగుట విష్ణుప్రీతిన్

సీ. సమమాస మాద్య పక్షమునఁ జంద్రాష్టమ
జన్మతితారాతి చర్యగాక
కేంద్రాష్ట మాధిపుల్ సాంద్ర వీక్షణముచేఁ
గనుగొన మూఢ శుక్ర గురులైన
నధిక మాసములైన నవి దోషములుగాఁగ
నెన్నంగఁ గాలములోన్నతమగు
కర్మంబుగావునఁ గావింప మేల్ షష్ఠిఁ
బౌర్ణమి నష్టమిఁ బరగు చవితి

తే.గీ. నల చతుర్దశి శుక్ర సౌమ్య ——జీవ...
వారముల సింహవృశ్చిక వర్జముగను
గడమ లగ్నంబులను నేయఁ గలుగు శుభము
పేర్మి సీమంత మధిక సత్కర్మ సరణి.

తే.గీ. శ్రవణ రోహిణి......తిష్యలను జాంద్రి
చిత్ర నశ్వినిఁ గావింపఁ జెందు మేలు
మఱియు మతములఁ గొన్నిఁట మంచితార
లనుచుఁదత్కర్మములకు బుధావళి నొడివె

వ. ఇది తృతీయంబగు సంస్కారంబు నాలవకర్మంబగు జాతకర్మక్రమంబు.

చం. మృగధరచిత్ర విష్ణులును మిత్ర సువర్ణ సువాజిసార్ప ఫలా
ఖగమును నుత్తరాత్రయము సొంపగు రోహిణి ముఖ్యతారలున్
భృగుశని సౌమ్య వాగ్గురుల పేరిటి వారములున్ శుభాస్పదం
బగు సతి సూతికాగృహమునందుఁ జొరంగ ఘటావలీయుతన్

ఆ. వె. ఱిత్త తిథులు మాని రీతిమై లగ్నబ
లంబు లరసి మంచిలగ్నమునను
సూతికాగృహంబు సొచ్చిన నీళ్లాడు
సంకటంబు లేక సతి సుఖమున

కం. భావింపఁగఁదగు సుదిక
స్రావక ముత్తమము మాఘిజము మధ్యమమా
నావల భూపతనము ల
గ్నావధికిని నధమవృత్తియగు ఫలమెఱుఁగన్

కం. ఆధానలగ్న మెఱిఁగి క
నేదియుఁ బనిలేదు తెలియ మిటులైనను ల
గ్నోదయ శుభాశుభైకో
త్పాదన ఫలదగ్రహానువర్తన మెఱుఁగన్

సీ. పుట్టిన శిశువున ప్పుడ తండ్రి కనుఁగొన
వలయుఁ బితౄణంబు తొలఁగుకొఱకు
నశ్విని దేవతలాద్యంతముల మఖా
శ్లేష లిట్లలరిన లీల మూల
వల జ్యేష్ఠ రెండేసి యాద్యంత ఘటికల
భుక్తమూలల నంగఁ బొలుచు సంజ్ఞ
నవి విషములు శాంత్యర్హములగుటను
జొఁకతోడుత దూషణాకరమ్ము

తే.గీ. అట్టి గడియలఁ బుట్టినపట్టి ముఖము
తండ్రి తొమ్మిది యేండ్లకుఁ దగదు చూడ
నితరులకు నిచ్చునది క్రియ యొసఁగునేని
శాంతి నేయించునది శాస్త్రసరణి మెఱయ.

చం. ఇనశశి భౌమ సౌమ్యగురు లెన్మిదియౌ నెల నందు నుండుచో
ననఁ జల ప్రపాతరుజలయ్యశమృత్యువుల న్నొందు శౌరియు
న్నను గరళమ్ముచేఁ బొలియు శాతుఁడై యెనవచోటనుండినన్
ఘనమగు గండముల్ శిశువుఁ గ్రమ్ము గ్రమమ్మున విత్తు [illegible]

మ. ఇనముఖ్యగ్రహషట్కముల్ వరుసఁగా నెంతేనియున్ బంచమం
బున సున్నన్ దలి తండ్రి యన్నలకుఁ బెంపున్ మాలి తన్మాతులుం
డును దన్మాత్ర తదీశు లొందుదురు పెంపున్ గండముల్ గాన న
య్యినచంద్ర గ్రహణంబులున్ బరిధియం దేనిన్ దగున్ శాంతికిన్

కం. జననపులగ్నము మొదలుగఁ
జను పండ్రెంటికిని శాస్త్రి సంజ్ఞను బేర్లె
యను వెలిఁగి శుభాశుభ ఫల
మునకున్ హేతువులు దెలియ మునుకొను బుద్ధిన్

సీ. తనుకల్య దేహమ్ములును హోర లగ్నవి
లగ్నముల్ కేంద్రముల్ లలినిజన్మ
లగ్నంబుదగు సంజ్ఞలన్ ద్వితీయద్రవి
ణములు జాతియు ననసమరు రెండ
వది విక్రమము తృతీయము సహజము హిబు
కము.....స్యకములున్ర
సాతలాఖ్యయుఁ జతుర్థాతిశయ స్థాన
మగుసుత బుద్ధి వాహన సుసంజ్ఞ

ఆ.వె. షైదవవది మంత్రియనఁగ షట్కము కళ
త్రంబనంగ సప్తమంబు నష్ట
మనిధనల్ దరిద్రమనఁ త్రికోణస్థల
ధర్మ గురునవములఁ బేర్మినిరొ

కం. వివరింపఁ గేంద్ర కర్మము
లవిరళదశమంబు లాభమగు పదునొండై
యవలన్ వ్యయమగు ద్వాదశ
మివి భావము లెఱిఁగి ఫలము లిట్లనఁగదగున్

తే. జ్యేష్ఠపదినాల్గ [జనునితోఁ] జేర్చు వరుస
తల్లి జననియుఁ దత్పతి తల్లితోడు
దల్లి శిశువును గోత్రజుల్ ద్వైధ కులము
శిశుల తోడను మామయు స్వేఁగివొందు

సీ. అశ్లేష పండ్రెంటునగు పాళ్ల నట్టులఁ
జెందుదోషము శాంతి నేయఁ దొలఁగు
వినుఁ దున్న కొరకు మునుపటి దొకరెండు
నవియు మూర్ధము నాస్యమతుల కడుపు

నను నైదువలచేత నాలుగు నన్నియు
వామకరమ్మున వానిసంఖ్య
కుడియొడమగు కాళ్ల దొడరి యిట్లెన్నుచు
భావింపరాజును బండితుండు

తే.గీ. ధనసిధనవేళ విభ్రమత్తత్త్వ సత్య
యుక్తుఁడగు జన్మఋక్షంబునుండు చోటు
లలితవారాహచక్ర ఫలంబు లిట్టు
లమరు జ్యోతిష శాస్త్రజ్ఞు లౌననంగ

తే.గీ. జన్మలగ్నాష్టమంబులఁ జంద్రుఁడున్న
యతనిఁ బట్టెడెంటు గురుఁడున్న నన్య బీజ
జాతమగు దర్శఁ బౌర్ణమి జన్మమాది
నట్టి శాబకు తండ్రికి హాని చెందు

తే.గీ. అయిదు ఘడియలనొక్క పాలగుట మూల
కటుల నాశ్లేషకును ద్వాపశాంశములకు
గండముల నొక్క విధములగాన మూల
తుదను నాశ్లేష మొదలున నొదవు శుభము

చం సమతఁ జతుర్దశింబెరసి షడ్విధ భాగము లాదిభాగమే
పమరఁగ దోషవర్జితము నైతగు తండ్రియుఁ దల్లి మామ య
ర్థము శిశువైదు భాగముల దారగ గండము లొందు శుక్లప
క్షమునను దల్లికిం బహుళజంబునఁ దండ్రికిఁ గీఁడు చూడగన్

సీ. మొనసి పూర్వాషాఢ మూఁడవ పాదంబు
చిత్ర పూర్వార్థంబు చెలఁగు పుష్య
మునను రెండవపాదమున నుత్తరాదియుఁ
బిత్రు గండములు సంశయతకుఁ దొలఁగి
యుత్తరరెణ్ణల్లు నొక నెల పుష్యమి
కెనఁగఁ బూర్వాషాఢ కెనిమిది నెల
లటు చిత్ర కార్తెల లాశ్లేషకును నవ
మాసముల్ జ్యేష్ఠకు మాసపంచ

తే.గీ. కంబుమూలకు వర్షాష్టకంబు సుతునిఁ
జూడ కుండుట మేలు నచ్చుపడనిట్టి
గండములఁ బాపు కేంద్రగురుండు పెక్కు
మత్త గజములఁ దరుము సింహంబు కరణి

కం. గురుశుక్రులైన లగ్నము
పరుడైనను గేంద్రములను బ్రబలినచో వి
స్ఫురదాయుర్వర భూషా
వరణాఢ్యుండగుచు శిశువువర్ధిలు నెలమిన్

తే.గీ. జననలగ్నంబు నాల్గు నేడును బదియును
నైన రాసులు కేంద్రంబులనఁగఁ బరగు
నశుభములు నందుఁ బాప గ్రహంబులున్న
బ్రబలు శుభములు నచట శుభ గ్రహముల

కం. ఇందుని సమస్థలంబుల
మందాంగారకులు రవియు మహిసమ బుతో
స్పందితులైయున్నను మృతిఁ
జెందున్ దచ్ఛిశువు జనని నేఁగింబోరలన్

ఆ.వె అర్క చంద్ర సౌరు లవని కుమారుండు
పంచమముననున్కి పుట్టి తల్లి
తండ్రితోడఁగూడి తగ మృత్యుదశనొందు
సందియంబులేదు శాస్త్రసరణి

కం. రవి రవి పుత్రుఁడు భూసుతుఁ
డవిరళ కేంద్రములనున్కి నమరగురుండున్
నవమముననుండిరేని శి
శువు స్వల్పాయువున నడఁగునొంపెడలి వడిన్

ఆ.వె. మూలమొదటి పాదమున మామ నశియించు
జ్యేష్ఠ మొదల బావ జీవ మొడలు
నవ్విశాఖ సర్వమంత్య పాదంబున
నత్తమఱఁదిలేని దగును వెలఁది

ఉ. మంచిదినమ్మునందున సమస్థితిఁ బుట్టిన కన్యనెంతయున్
సంచిత వేదశాస్త్రచయ సద్గుణ వత్కుల శీల రూపరే
ఖాంచిత యౌవనస్థితుడనందగు వానికినిచ్చు వాఁడు వై
రించపదంబునన్మెలఁగు బ్రీతిగ వైభవ సుప్రసన్నతన్

కం. ప్రతిపక్షనితుఁడు మూనా
ల్గతిరయమున మూఁడు నెలల నా శిశువణఁగున్
ధృతితోఁ జెప్పిన తాంబదిఁ
బ్రతివర్షములేఁబదైన బ్రతుకున్ సుఖియై

కం. గ్రహదుష్టుల మిత్రత్వము
లహిత బలాబలనిరూపణాత్యున్నతులున్
వహి క్షేత్ర నిర్ణయమ్ములు
రహిఁ దెలియుచు ఫలము తెలుఁగు ప్రౌఢిమ యలరన్

సీ. పదిటను మూఁడింటఁ బాద భాగము దృష్టి
యైదిఁట నవమ మందర్ధదృష్టి
యును నాల్గు నెన్మిదింటను త్రిపాద్దృష్టియు
సంపూర్ణమగు సమసప్తమములఁ
బాదదృష్టిని శని బలియుఁ డర్ధమ్మున
గురుఁడు త్రిపాద్దృష్టి ధరణిసుతుఁడు
సంపూర్ణ దృష్టిని సకల గ్రహమ్ములు
బలవంతులగుట నేర్పడ నెఱింగి

తే. భావములు నంశములు లగ్న బలము దెలిసి
శత్రు మిత్ర బలాబలోజ్జ్వలత తెఱిఁగి
యుచ్చనీచ సమత్వమ్ములో నర నెన్ని
ఫలము తెఱిఁగింపఁ దగు బుధ ప్రకర మెలమి

కం. ధారుణి నశ్విన్యాదిగఁ
దారా త్రితయంబు గూర్పఁ దగు ద్వాదశ పా
దారూఢిన్ మేషాదిమ
హోరాశ్యంశమ్ము తెలుఁగ నగు ఘన బుద్ధిన్

చం. ఇనశశి భౌమరాహుగురు లేవున సూర్యజ సౌమ్య కేతులన్
దనుజ గురుండు కృత్తిక మొదల్ నవ ఋక్షము లిగ్రహమ్ములే
పునదశ లొట్టియున్ వరుస బుట్టిన తారకు సంఖ్య పద్ధతిన్
దనరు గ్రహంబె శాదశ విధంబెఱుఁగందగు భక్త నాథులన్

కం. ఆఱును పదియును నేడునుఁ
నాఱును బదునెనిమిదియు పదాఱును వరుసన్
వారక పందొమ్మిది పది
యాత్మాక పేడిర్వదియును హాయన సంఖ్యల్
అరుగఁ డాదిగఁ బదినెలలైన నేఁడు
లగుదశ తెఱింగి ఫలభాగమరయవలయు
నలరు సమ మిత్ర శత్రుల వలను లగ్న
విభుల బలములు నెఱిఁగి ప్రవీణ మహిమ

కం. పాపగ్రహముల దశలవి
యాపదల శుభగ్రహంబులైనను శుభముల్
జూపట్టు నుచ్చదశలను
నేపున క్షేత్రాంశ భారహితగతులందగన్

చం. గురుబలమొప్పు బ్రాహ్మణులకున్ గుజుఁడా నృపకోటికిన్ వణి
గ్వరులకు సౌమ్యుఁ డర్కజుఁడవశ్యత శూద్రుల కబ్జమిత్రుఁడు
ర్వరఁ బశుపాలజాతికిని వారక శుక్రుఁడు స్త్రీలకెల్లఁద
స్కరులకు జారపంక్తికిని గావలె రాహుతమోబలస్థితుల్

సీ. ఒగి లగ్నములకు మూఁడొక పాలు ద్రేక్కాణ
మటుఁ బాదగతి హోరయనఁగఁదనరు
మఱి నవాంశయునేని మహిరాశి పతులక్ర
మంబున ఫలములేమరమి దగును
శిశువు పుట్టినయంతఁ జేరి కన్గొని స్నాన
మొనరించి దక్షిణలను మహీసు
రావళిఁ దృప్తులఁ గావించుటొప్పగు
నైదవనాఁటి పంచాయుధంబు

తే.గీ. మంచిలగ్నంబుననుగట్టి మంచిదగును
పదిఁటుఁ బండ్రెంటు శుచివృత్తిఁ బ్రబలి నామ
కరణమొనరింపఁ దగునట్లు గలుగదేని
నమర మూఁడవనెల నాలుగైన నెలను

ఉ. విదులనైన నీరహిని నే శుగు నిందుబలంబు ఆిక్కాలా
పోడిమి నొప్పునాఁడు దగ భూసుర భోజనముల్ ఘటింపుచున్
వేడుకసల్పఁ గావలయు విశ్రుతలీలల నామకర్మమా
యేడు న నట్టిమాసముల నిల్వాడ లించుటు యుక్తమెన్నఁగన్

కం. పొరుగింట నొక్కరాతిరిఁ
గరమొప్పఁగ నునిచి మఱలఁగా శిశువున్ భూ
సుర నిజగృహమున్ జేర్చుటఁ
నైరి దగు నిష్క్రమణ కర్మనిరతిం బొసఁగన్

గీ. చంద్రుఁడును శుక్రుఁడును మఱి కేంద్రమునను
దొడరి పాపగ్రహమ్ములతోడఁ గూడి
యా విలోకనమొసఁగి క్రూరాంశములన
నుండఁ బుట్టిన గుఱ్ఱు తల్లిగుండఱ్ఱంచు

కం. భాగేశ లగ్నవిభులును
రాగంబునషట్చతుర్థ రాశ్యధిపతులన్
బాగుగఁ గలసినచో జ
న్మాగత శిశువశ్య బీజమున వలయుఁ జూమీ

సీ. పదియాఱవగునాఁడు పరగ నాఱవనెల
సప్తమాష్టమమాస సరణినైన
చంద్రతారాబల సంపదలనుపుగఁ
బూర్వాహ్ణమధ్యాహ్నముల నయినను
దినఋక్షములు పూర్ణతను బొసంగిననాఁడు
కడు పర్వ రిక్తలుగాని పట్ల
చిత్రోత్తరలు హస్తసిద్ధుల నిగమోక్తిఁ
గర్ణవేధయొనర్పఁ గలుగు శుభము

తే.గీ. హరికథాశ్రవణాలబ్ధ నిరతయోగ
గరిమచే వర్ధిలఁగ జేయు కర్మమగుట
శాస్త్రవిధిఁ జేయ శుభములు సౌఖ్య మొసఁగు
నెలమి నిలువేలుపులఁ గొల్వ వలయు మిగుల

తే.గీ. ఆఱునెనిమిది పండ్రెండునైన నెలల
వృద్ధి దినమున సితపక్ష విశదగతిని
శుభముహూర్తమునందు శిశువుల కరయ
నన్నమిడు టొప్పు నిష్ట సమాగమమున

తే.గీ. భవ్యశాస్త్రార్థ సరణిఁ ద్రిపంచ వర్ష
ములను శుభవేళఁ జౌలంబు సలుపవలయు
మఱియుఁ బంచాబ్ద పంచమ మాస పంచ
మదినమున విద్యనేర్ప సమ్మదము లాదవు

కం. గర్భాష్టకమునైనను
నిర్భర జన్మాష్టకమున నెరినుపనీతం
బర్భకునకు నమిత శుభా
విర్భూతిం జేయవలయు విధ్యుక్తముగన్

కం. గురుబలము గలుగునెడలం
గురుశుక్రులు మూఁడు దెసలఁ గుందనియెడలన్
స్థిర లగ్నములన్ శీతల
కరతారా బలము లమరఁగా నడుగమరున్

సీ. పాడ్యమి మొదలుగాఁ బంచమి దశమియుఁ
పౌర్ణమియును శుక్లపక్షమునను
మహి శుక్లపక్ష మమావాస్య గూడఁగ
నైదైదు దినములు నమర నంద
భద్రయు జయ రిక్త పరగు పూర్ణిమ యనఁ
దగు రిక్తతిథు లెట్టి వగకుఁగాదు
వలనగునే వేధ వైవాహికోపన
యన దేవతాదర్శ నాదులకును

తే.గీ. నెందుఁదుది పక్షమున నైల నెసఁగఁ ద్రిదిన
ములును గ్రహణాంత సప్తాహములను జేయఁ
దగదు శుభ కర్మములు నేయఁదనరనేని
గడుసనర్థమ్ము నశుభమ్ముగలుగు కతన.

కం. వైవాహిక కర్మమునకు
గావలె దశ విధములగుచుఁ గలయా పొంతుల్
శ్రీవెలయును సంతాన శు
భావహమగుఁ బదియు లెస్సనైయున్న కొండల్

కం. దినగణ మాహేంద్రమ్ములు
ననువుగ స్త్రీ దీర్ఘయోనులటు రాశియు నా
య్యన రాశ్యధీశ సంజ్ఞల
వినువేధయు నాడిపదియు వెస నెలుఁగఁదగున్

ఆ.వె. సకల పొంతనలును సతి తార మొదలుగ
పురుష చిక్కుదనుక పొసఁగు నెన్న
వినుము పురుష ఋక్షమును నెంచవలె నంచు
సకల శాస్త్రవిదులు చదివి రెందు

తే.గీ. ఆది మధ్యాంతనవక తారాళి చేసి
యధమమును మధ్యమము మేలు ననఁగ వరుని
తార మొదలుగ సతిచుక్క దనుక నెన్న
నదియె దినమను పొంతువ విదితమయ్యె

సీ. అశ్వినిమృగశిర హస్తలు స్వాతి పు
ష్యపునర్వసూత్తరముల్ శ్రవణరేవ
తులు ననూరాధయు నిలసురగణములు
పూర్వోత్తరాత్రయంబులును మఱియు

భరణి ధనిష్ఠయుఁ బెరయ రోహిణియును
పుష్య గణంబులు మఖ విశాఖ కృత్తి
కార్ద్రశతభిషము లాశ్లేష జ్యేష్ఠ మూ
లలు చిత్ర రాక్షసములు నటంద్రు

ఆ.వె. స్వగణమైనఁ దుల్యముగు దేవమానవ
మధమ మమరదైత్యమైన మనుజ
రాక్షసములు గావు రహి వివాహములకు
గణమునాఁగఁబొంతు గణన మిట్లు.

ఉ. కన్నియ చుక్కనుండి యొడికంబుగఁ జూడఁగ భర్తతార నా
ల్గెన్నిక నేడునంబదియు నిట్లు త్రయోదశ షోడశాంశము
య్యున్ననునై [దు] మూఁటను సమున్నతి నిర్వది రెండు నిర్వదే
నున్న శుభంబటంచును బుధోత్తము లెన్న మహేంద్రమైతగున్.

కం. కన్నియతార మొదలొక్కని
కెన్నఁగ నవక్షత్రయమున హితవరు నక్ష
త్రోన్నతి నడుమను మొదలను
బన్నగఁ గొఱగాదు తుదను బరగ శుభమగున్

వ. ఇది స్త్రీదీర్ఘంబింక యోని పొంతు విధంబు.

సీ. అశ్వినిశతభిషలశ్వముల్ భరణిరే
వతియుగజమ్ములు వరుసఁ గృత్తి
కయుఁ బుష్యతార మేకలు మృగశిర రోహి
ణులు పాములార్ద్ర మూలలు శునులగు
నలరు పునర్వసువాశ్లేష పిల్లులు
మఖపుబ్బ మూషికల్ మహిషములును
స్వాతియు హస్త, విశాఖ చిత్తయుఁ బులుల్
జ్యేష్ఠానురాధలు వెలఁగు లేళ్లు

తే.గీ. శ్రవణమును జలబుక్ష మంచంగఁ గపులు
తగధనిష్ఠ యజైక పాత్తార హరులు
నుత్తరయు నుత్తరాభాద్ర యొప్ప వృషము
లెసఁగు నభిజిత్తు ద్విపదముంగిసలు దలఁప.

కం. మొదలిటి బుత్తము పోతగుఁ
పదపడి రెండవది పెంటి పరగు సమమునన్
బొదలన్ గలహంబు బటులటు
లాదవిన సామాన్యమగు గుణోచిత వృత్తిన్

చం. పులియును ధేనువేన్గు హరిపొల్పగు నశ్వము నైన్ము లేడు లే
ర్కల శుని ముంగి పాము ప్లవంగంబును మేషము పిల్లియెల్కయున్
జలమున నొక్కొకొక్కటికి శాత్రవ వృత్తి మెలంగు గావునన్
లలనకు భర్తకున్ బగ జనన్ దగఁగూర్పఁగ యోని పొంతగున్

సీ. ఇంతికిఁ బతికిని నేకరాశి శుభంబు
నేకతార సుఖంబు జోకనొదవు
పడఁతి రాశికి రెంటఁ బత్రెంటఁ గొఱకాదు
పత్రెంటు రెంటు శుభంబు మూఁటఁ
బదునొంటు దుఃఖంబు పదునొంటు మూఁటు సు
ఖంబు నాల్గిఁటఁ బదిగాదు పదియు
నాల్గింటఁ బ్రియమైదు నవకమై యోగ్యంబు
తొమ్మిదెదిటు మేలు దొడరు నాఱు

ఆ.వె. నెనిమిదింటఁగాదు నెన్మిది నాఱింటు
వంశవృద్ధి సమత వైభవమగు
రాశిపొంతు విదియ రాశ్యధీశుల మైత్రిఁ
గనుట రాశ్యధీనమనఁగఁ బరగు

వ. తరణ్యాది గ్రహ శత్రు మిత్ర సమత్వంబులు మున్నెఱింగించితి మఱియును.

సీ. హరి వృశ్చికములు వశ్యములు మేషమునకుఁ
గర్కటు ధటులు నుత్తమునకు మిథు
నమున కంగన కర్కటమునకళి శరాస
నమ్ములు పంచాననమునకుఁ దుల
మిథునంబు కన్యకు మీనంబు తౌళికి
మకర కన్యకలు వృశ్చికమునకుఁ గు
ళీరంబు మీనంబు దార చాపమునకు
మత్స్య కుంభంబులు మకరమునకు

తే.గీ. ఘటమున కజము మేష మృగములు మీన
మునకు వశ్యంబు లివ్విధంబున నెలంత
రాశి మొదలుగ గణుతింప రహిఁ బొసంగు
శీఘ్రఁ గోవిదవినుతి వధూవరులకు.

శా. లింగాకారము మూఁడు రేఖలుగ హాళిన్ గీతలడ్డంబు నా
ల్గింగా వ్రాసిన మూఁడు తొమ్మిదులు పొల్చున్ బుద్ధిమల్ మూర్ధక
ర్ణాంగోర్వంఘ్రుల నైన రజ్జువుల నైక్యంబైనచోఁ గాదు నెం
చంగా నెక్కుడి రజ్జువుల్ విషమ మిచ్ఛల్ మేలు రజ్జుస్థితిన్.

సీ. అల చతుష్పాద తారల కెల్ల నశ్విని
త్రిపదల కెల్లఁ గృత్తికయు ద్విపద
ముల కెల్ల మృగమస్త మున్నుగాఁ గ్రమమున
మూఁడు నాలుగు నైదు మొనయ నెన్న
టదిదేశ విషయమా నన్ని దేశంబుల
నశ్విని మొదలు మూఁడమర నెన్నఁ
బార్శ్వక నాడైనఁ బడఁతికి మేల్గాదు
మధ్యనాడిని నిల్వ మగనికౌర

తే.గీ. యిద్దఱికి మధ్య నాడైన నెనయు నిదియు
నాడి పొంతువు మిక్కిలి నాణ్యమైన
బుద్ధి నిటువంటి పొంతుల పోలుపు దెలిసి
పెండ్లిఁ జేసిన మిథునంబు పెర్మిఁదనరు.

ఆ.వె. అశ్విని మఖ మూల లాది క్రమంబున
నాలు గేసి భములఁ నోలి వేధ
పర్వ రాజహంస విభావసుసంజ్ఞల
సోమచిత్రవసులు సూటిగావు

వ. వెండియుం గ్రంథాంతరంబున—

ఆ.వె. ఇదియ వేధయనఁగ నెసఁగిన పొంతువు
నిట్టి పది తెలంగు లెఱిఁగి పొసఁగఁ
బెండ్లి నేయుటొప్పు పేర్మి లగ్నబలంబు
లరసి గ్రహబలంబు నమరునపుడు.

కం. మృగధరచిత్రల ధనిష్ఠయుఁ
దగ రోహిణి యొకటి కొకటి తాఁకును వేధల్
మిగులఁ గొఱగాదు దీనం
దగులమి దంపతులకున్ ముదంబులు పొసఁగున్.

ఆ.వె. ఇదియ వేధయనఁగ నెసఁగిన పొంతువు
నిట్టి పదితెఱంగు లెఱిఁగి పొసఁగఁ
బెండ్లి నేయుటొప్పు పేర్మి లగ్న బలంబు
లరసి గ్రహబలంబు నమరు నపుడు

కం. స్త్రీలకుఁ బ్రథమ రజస్థిర
కాలము దెలియంగ మేలుగానఁగవచ్చున్
మేలిమి శశి బుధ సురగురు
లీలాహములైనఁ దగు లలిన్ శుభదములై

సీ. ఉత్తరాయణమున నురు సంపదలు దక్షి
ణాయనంబున లేమియగు వసంత
ఋతువున సుఖి గ్రీష్మఋతువున భోగియౌ
వర్షఋతువున నాడువారిఁ గనుట
హిమవేళ వ్యభిచార మిల శరదృతువునఁ
బగలకు సౌఖ్యంబు పరగు శిశిర
ఋతువునఁ బెక్కండ్రు సుతులు గల్గుట ఫల
మగు శుక్లపక్షమం దమరు సుఖము

ఆ.వె. కృష్ణపక్షమైనఁ గెరలి దుశ్చరితయౌ
రిక్త తిథుల నట్టి రీతి మెలఁగు
ఘనత నచరలగ్నమున శుభగ్రహ వీక్ష
ణములు గల్గ నార్తవము శుభంబు

తే.గీ. తదియఁ బంచమియందు సప్తమిని దశమిఁ
దనరు నేకాదశిన్ త్రయోదశినిఁ బ్రథమ
ఋతువు సుఖదము శ్రీయుక్తి నెలమి నొగ
శుచుల సుఖముల వర్ధిల్లు సుదతి వరుస.

కం. హస్తాది పంచకమునఁ బ్ర
శస్తత విష్ణుత్రయంబు శశిరోహిణి మూ
ల స్తుతపుష్యములన్ సతి
నిస్తుల ధనధాన్యపుత్రనిరతిన్ వెలయున్.

తే.గీ. మిథునకన్యాధనుస్సింహమీనకుంభ
తులలఁ గర్కాటకంబునఁ దెలుప ప్రథమ
పుష్పవతియైన సౌభాగ్య భోగశీల
కలన వర్ధిల్లు శుభలగ్నగణన దగుట.

కం. గురు బుధ శుక్రులు లగ్న
స్థిరులగునెడ మేలుగలుగు ధృతి నితరగ్రహ
స్థిరత నశుభములు నెందును
దరుణికిఁ బ్రథమార్తవమునఁ దతదురితగతిన్

ఆ.వె. లగ్న సప్తమమున రవి బుధ గురు శుక్రు
లున్న నటుల శుభము లౌదవు, గృత్తి
కార్ద్రముఖుల మఱియు సర్కార్క్షమున నాది
పాదములను మేలు ప్రబలు సలికి.

సీ. వేకువ రేపటివేళ మధ్యాహ్నంబు
నందైన భోగనుతాప్తిఁ దనరు
నపరాహ్ణమున జారయగును సాయంకాల
మున భోగి సంధ్యరాత్రిని తదుపరి
కొఱగాదు సగమురాతిరియైన గర్భిణి
యొకటి రెండగు బిందులౌదవు శుభము
మూఁడు నాలుగు పెక్కు పోడిమి మలినంబు
రక్తవర్ణము దరిద్రత వహించుఁ

తే.గీ. జాలవెలుపైన శుభమగు శక్రవహ్ని
నిఋతిదిశలైన వెల్పును నీలి కోక
యముని దెస కడమట మలినమును ధనద
వాయు భర్గాశలను రక్త వస్త్రియగును.

ఆ.వె. వీడ్య మొసఁగి చాల వినయంబుతో నైదు
వలు బుధోత్తములును దెలుప నిలిచి
నట్టి దిక్కు తిరిగి యిట్టి కోకలుగట్టి
యునికి దెలియవలయు నుచితమతిని.

తే.గీ. సంహితల రీతు లెఱింగింతు సరవిఁ గొన్ని
చంద్ర తారాబలస్థితిఁ జంద్రుఁ డష్ట
మమున సామాన్య మాఱింటు మఱియు రెంటు
మూఁటు నేడిఁటు శుభము లిమ్మగుఁ బొసంగు.

సీ. జన్మర్క్ష మాదిగా నెంచంగఁ దొమ్మిదిని గా
 భాగింపనిత్యర్క్ష పరిమితముగ
నైన వెన్నిక క్రమంబమరంగ జన్మర్క్ష
 మినుసిదియది శుభ మీక తక్కు
సంపత్తు గురునాట సంపదలొసఁగూర్చు
 దముఁడు విపత్తు బాధల నొనర్చు
క్షేమంబు బుధుఁడంత క్షేమంబుగావించు
 ప్రత్యక్కు కేతువు మృత్యువొసఁగు

తే.గీ. సాధనము చంద్రుఁడగు కీర్తి చాలనిచ్చు
నైధనం బర్కసుతుఁడు ప్రాణములఁ బాపు
మిత్రమసురగురుండు సన్మైత్రిఁ జేయుఁ
బరమ మిత్రుండు కుజుఁడు శోభనములొసఁగు.

ఆ.వె. నిత్యతారదనుక నైరి జన్మభము నుంచి
యెన్నినాలుగింట నెంచి కూర్చి
తిథుల వారములను ధృతిఁ గూర్చి నవభాగ
హారణమున దినగ్రహంబు తెలియు.

కం. దశ లేండ్లయందు సగమగు
విశదపు గడియలుగఁ బంచివేస దశ్ఫలముల్
దశ లట్లు షష్టిఘటికా
భృశతగ దివసముల ఫలము పేర్కొం దెలియగ

కం. రవి బుధ శుక్రులు నెల నెల
నవనిసుతుండొక్క నెలయు నర యబ్దంబా
దివిజగురుఁడట్టి యర్థం
బవు వత్సర ముక్కరాశి యందుండు తగన్.

కం. నడుతురు పదునెనిమిది నెల
లడరంగ మీనాది మేషమంతము గాఁగన్
దొడరుచు రాహువు కేతువు
నుడుగక గ్రహచర్య లిట్టు లొనరున్ నియతిన్

వ. రవి చంద్రులు ఋజుగతులు నితర గ్రహంబులు శీఘ్రాతిశీఘ్ర వక్రానువక్రమంద వికల గతుల మెలఁగుదురు రాహుకేతువులు సదావక్రగతులు మఱియును—

సీ. శని రాహు కేతువులును ధరాతనయుండు
మూఁడింట నాల్గింటఁ బోఁడిమమరు
ననుఁ-రార్యుఁ డేడిఁట నాఱింటఁ బదిఁటను
గురుఁడు ద్వినిధి శాణకరనిరతిని
భానుఁడాఱిఁట మూఁటఁ బదిఁట బుధుండు ద్వి
షష్ఠాష్టమ దశమ స్థానమునను
శుభదులు భారుణిసుతుఁ డేడిఁటను రాహు
వమరఁ దొమ్మిదిఁటను జన్మమున గురుఁడు

తే.గీ. మూఁట రవి పంచమ స్థానమునను భృగుఁడు
నాఱిఁట బుధుండు రెంట నొప్పారి కేతు
వాది-రాశిని మేలుగాదంద్రుఁడు జాత
కమున గోచార శుద్ధితె నమర నెపుడు.

తే.గీ. ద్వాదశాష్టమ జన్మ నివాసులగుచు
శని మహీసుత జీవ భాస్కరు లొకర్రుడు
నిలువ ధనహాని ప్రాణహానియును స్థాన
హానియును గల్గునంద్రుఁడు నిదానమతులు

వ. మఱియు దశలకుఁ గాలచక్రాది బహువిధంబుల ఫలాఫలంబులు గల వింక యాత్రార్హ దినవారనక్షత్రంబు లెఱిఁగించెద——

ఆ.వె. అనుని తారనుంచి జననర్క్షము మొంచి యే
డింటఁ జాలుకొనఁగ నెలమి నొకటి
నాలుగైదు మిగుల మేలు ద్విస షడ్ద్వి
షట్క మడర భ్రమణవర్జ్యలగును

కం. చరలగ్నమునఁ బ్రయాణము
స్థిరలగ్నమునన్ బ్రవేశ చిరకార్యారం
భరుచిర సత్క్రియలకుఁ దగఁ
గోరకొన నగు శాస్త్రవిచయవిదులు మేలనఁగన్.

కం. రవి మొదలు నేఁడు గ్రహముల
నవిరళతం దారవిభుకు నారొనిమిదిఁటన్
భువి రెండున్నర ఘడియలుఁ
దవులున్ హోరయను సంజ్ఞఁ దక్షుల మిన్నన్.

కం. శని సూర్య భూజవిహారలు
వనులకు గొఱగావు నితరపటువిహారలు మేల్
వినుఁడెల్ల కార్యములకుఁ
జనుయాత్రకు గురునివిహార చారఫలముగుఁ.

ఆ.వె. రాజగాంచుటకును రవివిహార యుద్ధక
ర్మములు భౌసివిహార రహి నిలుకడ
కర్మములకొ సౌరి ఘనవిహార విద్యకు
గురునివిహార శుభము గూర్చునెపుడు.

సీ. ధర శుద్ధపాడ్యమి తదియ పంచమి సప్త
మియు దశ మేకాదశియుఁ ద్రయోద
శియు శుభఫలదముల్ శితకర బుధ గురు
భృగువారములు మంచివగుచు నమరు
నశ్విని మృగధర హస్త పుష్య పునర్వ
సులు ననూరాధమూలలు శ్రవణము
రేవతియు ధనిష్ఠ శ్రీ విభవ ప్రదల్
కన్యవృశ్చికము మకరను మేష

తే.గీ. లగ్నమును దక్క తక్కిన లగ్నములను
వ్యత్రప చినార్గములు చౌతి యల నవమియు
నాచతుర్దశి గానిచో నగును శుభము
గమనమున కెన్న శాస్త్రసంఘటన మిట్లు

ఆ.వె. ఏకగుణము తిథిని రెంనిమిదచ్చగు వార
మలర నూఱు గుణములగును తార
లగ్నమెంచ వాటి లక్ష గుణాధిక్య
ఫలము గాన లగ్నబలము వలయు.

సీ. శని సోమవారంబులును గురువారంబు
భృగు భానువారముల్ జగతిపుత్ర
బుధవారములను దూర్పు మొదలు వారశూ
లలు దద్దిశాయాత్రలలవుగాదు
అంగారకునివార మర్కెందువారముల్
గురు బుధవారముల్ తరణి శుక్ర
వారముల్ ప్రాగాది వరుస యాత్రకు మేలు
మృత్యు యోగములు నామ్యయివి బుధ

తే.గీ. శూలలును రావుచలనంబు కాలలగ్న
దోషములులేని యెడ శుభస్తోమ విభవ
గతులు గలుగును యాత్రలు గలిగెనేని
బుద్ధి మంతులు శోభనంబొసఁగవలయు

కం. వార తిథి లగ్న దోషము
లారయ గోధూళి లగ్నమైనను బని లే
దూరకె యాత్రకు వెడలిన
సారసుఖమ్ములును సిరులు చాలఁగ గలుగున్

తే.గీ. కేంద్ర గురు శుక్రులును షష్ఠ గృహముల కడ
పాపులును నుండు నెడ మేలు పయనములకు
పదిఁట నాల్గింటఁ జంద్రుఁ డేర్పడఁగ రోహి
ణీనియుక్తతనుండుచో నెరయు శుభము

కం. ఉదయమున నుత్తరముమాఁ
పొదవ గ దక్షిణము పవల నొగిఁ దూర్పునరే
యదనఁ బడమటికిఁ బోవఁగఁ
నొదుగగు సంపదలు వజ్రయోగంబగుచున్

కం. రేపటి వేళల శకునము
చూపట్టిన యెడల మదిని సొంపు మరినచో
నేపట్ల దినము వెదుకక
వే పయనము నడుప మేలు విజయంబొదవున్

ఉ. ఆవులు గన్యలున్ దధిఫలావళి వాద్యనుమాశ్వయానముల్
పావక దీప్తి దంతివృషభద్వయ భాసుర పూర్ణకుంభము
ద్యావహాభాండ వేశ్యలు శుభాన్విత వాక్యములు మీన గానసం
భావనమన్నమున్ శవము పాలును గంగను గన్న మేల గున్

సీ. కేంద్ర త్రికోణాళి నింద్ర గురుండున్న
నలవాయసము వలపలికి నరుగ
నబ్జారియున్న బ్రాహ్మణయుగం బెదురుగ
నసుర గురుండున్న నప్పుడేటి
కింత వామాశకుఁ బొంతనే చను బుధుం
డున్నచో నారపక్షాదవు కుడికి
ధరణిజుండున్నఁ గేంద్ర త్రి కోణంబుల
నలధూమములు దోఁచు నర్కి యున్న

ఆ.వె. తైలఘటము జూడఁ దనరు రాహుస్థితి
సర్పభయము త్రిదశసప్తమములఁ
ఇంద్రుఁడున్న వాఁడు పరతార్క్ష్య గోళుఁడా
నిట్టి శకున హేతువెఱుఁగ వలయు

కం. ఆపోక్ష్లిబంబున శశి
యాపూర్ణత నుక్కుజల ఘటావళు లెదురై
చూపట్టి మంచి శకునము
లాపుణ్యగ్రహ నిరీక్ష నగు లగ్నమునన్

శా. తైలాంగుండును ముక్తకేశుఁడును ఆర్తా భాండముల్ పాము కుం
దేలున్ ముక్కిడి తక్రమున్ బోగయు నెంతే నగ్నుఁడున్ రక్తమా
లాలూనాంగ వివాదకార్ద్ర పటు జాలస్ఫీత చర్మాంకులున్
జాలం గట్టెల మోపులన్ జటిలుఁ గాంచన్ గాదు యాత్రాస్థితిన్

ఆ.వె. అమృతసిద్ధి సిద్ధమగు యోగముల వజ్ర
యోగచంద్ర గర్భ యోగములను
గురుశుభదములగును గోధూళి లగ్నంబు
నందునట్లు లగ్న మరయ వలదు

చ. ఘటికలు నాల్గుపాతికయుఁ గాదగు మేషము మీనమున్ వృషం
బటుఘటమాన పాదమగు నైదు గడెల్ తులకన్య లైదు క
ర్కాటకముచాప లై దొనరఁ గల్గఁగ వృశ్చికయుగ్మ సింహవా
ర్యటనము లైదు పాతికయు నట్టులగున్ దినషష్టి నాడులన్

సీ. పదునాల్గు మృగపూర్వపవనేంద్రులకుఁ దిష్య
ఫల్గునీత్వాష్ట్ర విశ్వాల కిరువది
వింశతి భప్పన్న పిశితాశనునకు ద్వా
త్రింశ మమరఁగ విధికి నలుబది
యేకవింశతి సవితృ శివుల కదితి కే
పతికృత్తికల్ పితృతతికిఁ ద్రిదిశ
మాహ్యోత్తరా భాద్రయములకుఁ ద్ర్యష్టమ
ష్టాదశముత్తరాజలధులకుఁబ

తే.గీ. దాశుభద్రమునకు బన్న మశ్వికి హరి
తాళవసువులకుఁ బదింటఁ ద్వ్యాజ్యమంటు
శశి ప్రవేశింప నక్షత్రసతి ఋతువగు
నటులగుటు బిందువులు నాల్గు ఘటికలయ్యె.

చం. శనిరవి భౌమవారములు సంధ్యలు పర్వములట్లు పాతలున్
బనువడి షష్టియున్నిశలు పాడ్యమి యుత్తర కృత్తికాముఖల్
గొనకొని బ్రాహ్మ్యమైత్రములు కూర్చు ప్రవాహములున్ గుళీరముల్
ధనువలకన్య కుంభ ముదితంబుగ క్షౌరవిధాన బాహ్యముల్

ఆ.వె. ఉచ్చమైన తారనుండెంచ నెనిమిదై
దుదయ బుధు మదియ మొదలుగాఁగ
నినుఁడు మెలఁగు తార నెంచి తద్ద్వి గుణిత
ఘటిక లవియె యుదయ కాలమునకు

సీ. ఎన్నఁ బాదచ్ఛాయ లెన్నైన నందులో
నేఁడు పాదచ్ఛాయ లెంచియుంచి
మేషాదిగాఁగఁ గన్యాషట్కమున కెల్ల
నొక్కటొక్కటిఁ బుచ్చి మక్కువలర
సరవితో మిగిలిన సంక్రాంతులాఱింటి
కిని మూఁడు నాలుగు నొనర నైదు
మఱియు నైదును మూఁడు మఱియొక మూఁడును
దివియుచు నానాఁటి దినదళంబు
లేడిఁటను బెంచి యాలెక్క నెలమితోడఁ
బదము నెడలను లెక్కచేఁ బాలుగొన్న
వచ్చు లబ్ధమ్ము ఘటికలై యచ్చముగను
ధరణి నిర్విధ మొందునఁ దప్పదరయ

మ. దినవారాదుల లగ్నమున్ గలయ నర్థిన్ గూడి లోకేశ సం
ఖ్యను భాగింపఁగ నొండు రెండు నట నాల్గైదెన్మిదియున్ననై
ధనవైశ్వానర రాజచోర రుజలేతత్పంచకాఖ్యానమై
తనరున్ దత్క్రమవృత్తి దక్కునది తద్రాహిత్యముల్ చూడఁగన్

ఆ.వె. వాస్తవులకు వహ్ని వసుధేశు గన రాజ
పంచకలబు వడుగు పరిణయమునఁ
గదియ యాత్ర చోరగతియు నెందును మృత్యు
పంచకమ్ము కీఁడు లెంచిచూడ

సీ. అశ్విని దస్రాహ్వయాశ్వాఖ్యలనుదగు
భరణి ధర్మునిపేరఁ బరిఢవిల్లు
నగ్న్యాఖ్య కృత్తికకగు రోహిణికి బ్రహ్మ
మఱి ప్రజాపతి మృగధరకు విధుఁడు

శర్వాఁడార్ద్రకును బునర్వసునకదితి
వేసఁ బుష్యమి బృహస్పతిసమనామ
మాశ్లేష ఫణి శర్మమగు మఖ పితృనామ
మును పుబ్బ పూర్వఫల్గుని భగాఖ్య

తే.గీ. దేవతాకాభిధానంబు ధృతిఁ దలిర్చు
ధరణి ఫల్గునియనఁగ నుత్తర పొసంగు
హస్త యర్కాఖ్య చిత్రత్వష్ట్రాఖ్య నమరు
స్వాతి వాయువు పేరిట రీతి నమరు

తే.గీ. తలఁపఁగ విశాఖ శూర్పద్విదైవ నామ
మగు ననూరాధ మిత్రమైత్రాఖ్యలఁ దగు
జ్యేష్ఠ కింద్రాఖ్య మూలకుఁ జెలఁగు నిఋతి
నామములు చెల్లు నవ్వలి నాల్గు వరుస

కం. జీవస మాఖ్యయు విశ్వే
దేవాఖ్యయు బుద్ధి విష్ణు ద్విపాహ్వయముల్
రీతి వసు నామకంబుల
చే విలసితమగుచు నుండు సిద్ధాంతోక్తిన్

కం. శతభిష పూర్వాభాద్రలు
మతి వరుణాజైకపాద్వి మహితాఖ్యలగున్
ధృతిద్విపదయుత్తరాభా
ద్రతగున్ దుది పూష పోష రత్యాఖ్యలచేన్

వ. ఇట్లు బహుభేదంబుల ననేక మునిరచిత మతాంతరంబుల నమరు జ్యోతిషశాస్త్రం బేత దనుగుణంబకానమరు స్వరక్రమంబు వివరించెద—బ్రహ్మ విష్ణు రుద్రాది మస్కంద కూర్మ దివ్యామలసప్తసంఖ్యయు, యుద్ధ జయార్ణవ సిద్ధాంత పట్ట ధూళగామడ స్వర భైరవ, చయపద్ధతి, స్వర సింహ బడబానల స్వారార్ణవ కూటయుద్ధ తంత్ర గ్రహణ హృత్త్రిముండికా జ్యోతిష మస్తకేంద్ర మంత్ర గ్రంథ యంత్రశాస్త్ర శ్రీదర్శనవతీ త్రిముండి యోగి నీలాజ శంబర కుమారి కాశళాది శాస్త్రసారంబును నాత్మజ్ఞానాధారంబును నాయుష్ప్రదంబును శ్రేయస్కరంబునునగు స్వరశాస్త్రంబు కృతాది చతుర్యుగంబుల జయార్ణవ బ్రహ్మయామళ విజయార్ణవ స్వరోదయాఖ్యలం గ్రమంబునఁ దనరునట్టి స్వరశాస్త్రం బెఱుంగ నేరికి నలవిగాదైన నెంతయుంత యెఱింగిన ననంతఫలప్రదంబగు గావునఁ దద్విధంబు వినుండు.

సీ. చతురంగ బలయుత జనపతి హీనస్వ
రోదయుం డగు నేని వోలి నల్ప
బలయుతుచే ధిక్కృతుఁడు గాంచు స్వాశాస్త్ర
మెఱుఁగక నని సేయు ధరణిపు జయ
మరయ ఘుణాతుర న్యాయమా స్వరచక్ర
గౌర్వాగ్నిఁ బడక రణాబ్ధి నీఁదు
సత్యశౌచ వివేక చతురత నధి నేర్చు
నతఁడు జయంబ వశ్యముగఁ జెందు

తే.గీ. స్వరము దయమైన నతిబల సహితు గెలుచు
నది పొసంగమిఁ బుర్వులనైన వేఁటు
లాడఁ దగదు నృపాలున కటులగుటను
దైవమును మోచు శమనమంత్ర స్వరముల
నెఱుఁగు మేధురు దైవము లిలఁ దలంప

ఆ.వె. హీర పద్మరాగ గారుత్మతేంద్ర నీ
లములు మౌక్తికంబు నమరఁ బంచ
రత్నములు శుభంబు రహినిచ్చుగతి పతి
కిత్తు రేర్పరు శుభ మెప్పు డరయ

వ. వర్ణ మాత్రక్ష తేంద్ర జీవ గ్రహ రాశి యోగస్వరంబులును నాడీ ఘుస్ర పక్షమాస ఋత్వయన వత్సర ద్వాదశాబ్దాధ్వరంబులునుంగూడ స్వరచక్ర భూబలాంగబల జ్యోతిష శకున బల ప్రకరణంబుల నప్పదియాఱు స్వరంబుల ఫలాఫల నిరూపణ కారణము లగు, నందు వర్ణంబు లకారాదులను ఋతుస్వర మశ్విన్యాదులను బిండస్వర మార్పు లను జీవస్వరంబు తత్కాలిక ప్రచారమునను గ్రహ రాశి యోగనాడీ దినపక్ష మాసస్వ రాదులు తదాత్వప్రచారంబులవలనను శుభాశుభంబు తెలుఁగందగి యమరు నందుపిండ స్వరంబు.

కం. ఇడ యెడమ ముక్కు పింగళ
కుడి దెసను సుషుమ్న రెంటి గూడుతుగ నెపుడున్
నడుచు దశ ప్రాణాత్మక
మెడపక ప్రాణుండ పానుఁ డీమార్గమునన్

కం. ఆదిచంద్ర సూర్య సంక్రమ
పద సంజ్ఞలనైను గడెలు పరిమితముగ భూ
మ్యుదకాగ్ని పవనగగనా
స్పదములు గా వరుస నడుచు జననాసికలన్

సీ. రవి భౌమగురుశని దివసాదులర్కస్వ
రంబును దక్కు వారముల మొదల
నిందుస్వరంబును నేనగు గడియల
నల సుషుమ్నయుఁ బృథివ్యాదిపంచ
భూతముల్ నడుమన పొసఁగఁ గ్రింద (టి?) జైని
నడ్డంబుగా రెంటి నడరు వరుస
నాద్యంత పక్షములబ్జార్కులనఁ దగు
వహిఁ బక్ష మాసర్తు వత్సరాయ
నాదులదిన త్రయంబు నయ్యె స్వరమ్ము
నడుమఁ దత్పక్ష మాసాయనర్తు వత్స
రములనెల్లను శుభమగు క్రమము నెరయ

... ... ...

ఆ.వె. ఇందుఁ డడరు వేళ నినుస్వరంబైనను
నినుఁడు నడచు నెడల నిందుఁడైన
నట్టి పక్షమాస హాయన దినములఁ
గీడు లొదవు జనుల కేడనైన

కం. పవలింటినాడిని నిశి నిం
దువిభుని నాడి దినమందుఁ దొడరఁగ మనునా
సువివేకియె యోగీశ్వరుఁ
డవనిఁ సందియము వలవదాక్రియఁ దగినన్

వ. గమనంబులకు వామ స్వరంబులును ప్రవేశంబులకు దక్షిణస్వరంబులు సుఖప్రదంబగు మఱియు నిందుచారంబున విషహరంబును రవిచారంబున నంగనాజనవశీకరణంబును సుషుమ్నను మోక్షంబును నగుచు నేకంబయ్యును త్రివిధంబగు వామస్వరంబు ఖగరూపంబగు నాత్మమెలంగు చంద్రనాడిని జ్వరమూర్ఛితుల కడిగెడు ప్రశ్న సుఖకరంబగు శాంతిశోక విషార్తజనులకు నృపతోషణ భూషణాలంకార దూరయాత్రాదానసంగ్రహ శాంతి పౌష్టిక దీక్షా సంధికార్య వివాహ బీజావాపన వ్రతౌషధ కర్మ నృపదర్శన స్వజన సమాగమ యోగవిద్యాభ్యాస తటాకాంబు కుల్యాసిద్ధక్రియలును సస్య దేవతాప్రతిష్ఠాది కర్మంబు లుత్తమఫలదములగు. విద్యారంభ వాణిజ్య, దీక్షా, సేవా, శాస్త్రాభ్యాస, ద్యూత వివాద, ఖేటక, చౌర్యక్రియా, గజాశ్వాదివాహనారోహణ యజ్ఞ శిల్పకర్మ, లిపిలేఖన గీత, మంత్రయంత్ర యుద్ధ, భేషజ, శస్త్ర, విషభూతనిగ్రహ, వ్యవహార భయకర్మాభ్యంగ పణ్యకర్మ స్నానభోజన మైథున మోహన, స్తంభన, విద్వేషణ, ప్రహర్షణాకర్షణ క్షోభణ శయనాది కృత్యంబులు సూర్య స్వరంబులం జేయుటలధిక ఫలదంబులగు వెండియు—

సీ. ఉభయనాడులయందు నొక్కొక్క నిమిషంబు
నడుచు నయ్యెడఁ బ్రశ్నలడుగుటయును
కార్యంబులును ఫలగతులానగూడవు
మిశ్రాఖ్య గలయది మేలుగాఁగ
నిరుపదేనింటైన నిరవుగ జీవనా
డినిఁ బ్రశ్న వేఁడిన ఘనశుభదము
చంద్రునాడిని జేసి సవితృ నాడిని సమా
ధిరములుగా శూన్యగతిని నిల్పి
ఆ.వె. యడుగు ప్రశ్నములకు నగువిపరీతంబు
శ్వాస మొదవుఁ బార్శ్వ సంగతముగ
మాతలడుగు ప్రశ్న దొడరును శుభములై
సిద్ధ ఫలదముల్ ప్రసిద్ధమగుచు

తే. గర్భిణికి వేఁడు ప్రశ్న యర్కస్వరమున
సుతుఁడు, చంద్ర స్వరంబైన సుతయు శూన్య
మునను విపరీతమును గల్గు విషువులందు
నైనఁ బతన నపుంసక భావమగును

వ. శూన్యమున నిల్చి పూర్ణనడిగిన మృతుండును జీవితుండగు ప్రశ్నలు సుఖకరంబగు తద్విపర్యయంబైన స్వస్థుండును మృతుండగు నిరుదెస స్వరంబునడుచునప్పుడైన రోగి దార్ఢ్యుండగు నితర కాలంబులనైన విఫలమగు వామనాడిఁ బూర్వోత్తర దిశలకు దక్షిణనాడి యామ్య పశ్చిమ దిశలకు యాత్రలు దగు విషువున యాత్రయనందగదు నితరగతుల యాత్రలు శుభదమగు స్వరభాగంబు జీవంబు. ఇతర భాగంబు శూన్యంబనందగు సప్తశలాకా ప్రకరణంబున భూబలం బెఱింగి అఇఉ ఎఓ అను స్వరముల ప్రశ్నలకు ఫలాఫలం బతీత క్రమంబున కెఱుంగందగు నిట్లు శిక్షా వ్యాకరణ ఛందో నిరుక్త జ్యోతిష శేఖరంబగు కల్ప క్రమంబు—

కం. కల్పము శ్రౌతము ప్రేల్మిక
నల్పమహత్త్వమున సత్క్రియాధారతఁద
త్కల్ప ప్రకారయాగము
లల్పేతర సుకృత వితతులలవడఁగఁ దగున్

సీ. ఏకరాత్రము మొదలెన్నఁగ దశరాత్ర
సంఖ్యఁ జేయఁగఁ దగు సవనవితతి
యందు నేకాదశంబది పౌండరీకంబు
ద్వాదశాహస్సుఁ దగును ద్విశత

నైన సత్త్రేష్టు లసుబది యదియున
గ్నిష్టోమమత్యగ్నిష్కృతము. శుద్ధి
జ్యోతిరప్తోర్యామ షోడశ మతిరాత్ర
సర్వతో ముఖములు సర్వకృష్ణ

ఆ.వె. సవన వాజపేయ సౌత్రామణులు మహా
వ్రతబృహస్పతులు సవనములశ్వ
మేధ విశ్వజితుల మేయ చయనములు
రాజసూయ యజ్ఞరాజి మఱియు

కం. గోమేధ కాదియజ్ఞము
హోమహితక్రమము తత్తదర్హ విధంబుల్
ధీమాననీయ కర్మము
లామిః నెఱిఁగింతు శ్రౌత మాద్యంతమ్మున్

వ. స్వర్గకాములగ్నిష్టోమంబులాచరింపవలయు ననెడి శ్రుతివాక్యంబును సవనసహస్రనియమంబులును దత్తదుచితవారంబులు దదుపపాత్రోపకరణ ద్రవ్యమంత్ర తంత్ర శాలానిర్ణయ వేదీవిశేషంబులు దెల్పఁ గల్పనామంబయ్యె నట్టి క్రతు ప్రకరణంబులయందు.

సీ. బ్రహ్మయధ్వర్యుండు ప్రస్తోత హోత సు
బ్రహ్మణ్య నేష్టృ మైత్రావరుణులు
నుద్గాత యగ్నీధ్రుఁడున్నేత హోత య
చ్ఛావాక బ్రాహ్మణాచ్ఛంసులు ప్రతి
హర్త గ్రావస్తోతయవ ప్రతిప్రస్తాత
తగ నుపద్రష్ట్రి సదస్యులనఁగ
నను మఱియుఁగఁ దెల్ప నందియ నొనఁగూర్ప
వేల్పుగములఁ బిల్చువీతిహోత్రుఁ

ఆ.వె. ప్రబలఁ జేయు వస్తుపంక్తి పాత్రల నిల్పి
ననువదింపఁ జూడ నమరియుంద్రు
పేర్మితో ద్విషట్క ఋత్విక్కులఖిల యా
గములయందుఁ గల్పగతిఁ బొసంగి

వ. మఱియు దర్వీ ప్రమాణ మథ్యాజ్య హోమద్రవ్య భేదంబు లెఱింగించు కల్పంబని వేదాంగంబు లెఱింగించిన సూత్రం గనుంగొని యజుర్వేదశాస్త్రంబు లెఱింగింపఁదగిన జ్ఞానకాండులడిగిరన్నిఁ—

శా. శృంగారాకర వత్స భాగవిలసచ్ఛ్రీవత్స ! వత్సార్భకో
త్తుంగైకాకృతి నందితామిత లసద్గోపాంగనోన్మీలనా
భంగస్వాంతన వాబ్జ ! యబ్జరవి భాస్వన్నేత్ర! నేత్రస్ఫుర
ద్గాంగేయాలయ ! పాదపుష్కర ! కరాగ్రస్థారి శంఖోజ్జ్వలా !

కం. అరిదరకర ! సురగణారా
డరిదర ! కరిభక్తయుత మహర్షి నికరము
త్యరి వికసన కరుణాశ్రీ
కర ! కలకంఠనుత ! శుభముఖ స్థిరసుకరా !

తరలము॥ కలశ సంభవ సత్తపోఫల కారణార్తినివారణా
విలసితానన పద్మ ! పద్మనివేశినీప్సిత పూరణా !
బలరిపుస్తుత నిత్యసేవిత పన్నగామర చారణా !
జలజలోచన ! వేంకటాచలసద్మ సంస్థిర భారణా !

గద్య. ఇది శ్రీమదలమేల్మంగా వేంకటేశ్వర వరప్రసాదాశుకవితావిచిత్ర మహంకాళి అప్పకొండార్యపుత్ర సకలసుకవిస్తోత్రపాత్ర వినయగుణాదృతి వేంకటపతి సహాయ తేకుమళ్లాన్వయ పాథోనిధి పూర్ణసుధాకర తిమ్మ మాంబాక్రపయామాత్యకుమార సకల విద్వజ్జనాధార శ్రీవత్స గోత్ర ఆపస్తంబసూత్ర సత్కవిప్రమోదసంధాయి రంగశాయి రచితంబైన వాణీ విలాస వనమాలికయను ప్రబంధంబునందు సాలగ్రామ లక్షణ ప్రభావ గ్రాహ్యా గ్రాహ్య క్షేత్రమూర్తి నిర్ణయ పరమేధ మత్స్య కేశవశివనాభాదిభవు భేదరూప ప్రమాణనిర్ణయంబులును దద్దానపూజాఫలనిరూపణంబులును తులసీ మహిమయు బృందావన నిరూపణంబును జలంధరోపాఖ్యానంబును దన్మహిమకుగా మృగయు చరిత్రంబును విష్ణుయమభట సంవాదంబును తులసీప్రతిష్ఠార్చనాఫలంబులును దీపదాన మహిమకుఁగా లలితా మాంధాతృపూర్వ జన్మ వృత్తాంతంబులును దేవబ్రాహ్మణ ప్రతిష్ఠా ఫల నిరూపణంబులును బ్రహ్మప్రశంసయు దానఫలంబులును మాసదాన నిర్ణయంబులును చతుర్వర్గధర్మవిశేషంబులును దానపాత్ర నిరూపణంబులును నానావిధ దేవతా ప్రీతికర దానభేదంబులును భూదాన మాహాత్మ్యేతిహాసంబులును చిత్రదానఫల నిరూపణంబులును అపాత్ర నిర్ణయంబులును అన్నదాన ప్రభావంబు నోషధివ్రీహి భేదంబులును తద్దీయ ప్రభావేతిహాసంబులును యమధర్మరాజకిరాత సంవాదచరిత్రములును దురన్నదోషనిరూపణంబును వివాహాష్టవిధ వర్ణార్హ జాతి ధర్మ ప్రమాణంబులును కన్యాదాన ఫలప్రశంసయు పితౄణమోక్ష కారణ కౌండిన్యోపాఖ్యానంబును నుదకదానమహిమకుంగా సుశీలచరిత్రయు ఋణానుభవ నిమిత్తక భద్రక కౌశిక సత్యశీలుర వృత్తాంతంబులును శిక్షావ్యాకరణ ప్రశంసయు ఛందో లక్షణంబును నిరుక్త విధానంబును జ్యోతిష నిర్ణయంబును కల్పవివరణంబును నను కథలంగల తృతీయాశ్వాసము సంపూర్ణము.

# చతుర్థాశ్వాసము

శ్రీవనితేశా ! భూసౌ
ఖ్యావేశన ! నీలనీరదాంచద్దేహా !
సేవిత పుష్కరజ ! శ్రే
యావహకల్యాణ వేంకటాచలనాథా !

వ. దేవా! అవధరింపు మక్కథికుం డాయుర్వేద గాంధర్వవేద ధనుర్వేదంబులను
నుపవేదంబు లిట్లని వివరింపందొడంగె.

సీ. నలువ మానస మిథునద్వైధ సృష్టిచే
జగమెల్ల జన పూర్ణమగుచు నెరయ
భారమోర్వక భూమి పద్మజుఁ బ్రార్థింప
సరసిజాసనుఁడొక తరుణిఁ బొడమ
నొనరింపుచును మృత్యువను పేరువెట్టి లో
కులఁ జంపుమనుడు నప్పలుకు చెవుల
కలుగురై కన్నీరు డొలఁక నేడ్చుచు నిట్టి
క్రూరకర్మమున కేఁ జేరననిన

తే. నేత్రవారి బిందునివహంబులున్నూఁటు
యరువదియు మహారుగాకృతులను
జనులఁ దునుము నీకు సడిలేదు పొమ్మని
జలజభవుఁడు రోగములకు ననియె.

ఉ. మీరలు లోక [ధ ?] ర్మముల మేరలకుం దెగినట్టి [కష్ట] దు
ర్వ్యారుల ఘాత సేయుచు నవశ్యము నాయువు దీఱఁ దున్ముఁడా
చార విహార శౌకృత విశారద కేశవభక్త వర్జనన్
ఘోరతరాఘదౌష్ట్య ఘన కుత్సితమానవకోటిఁ జెందుచున్

వ. దురితయుతుల డాంబికుల నసత్యవాదుల సజ్జనద్వేషుల హరిహరదూషకుల బాధిం
చుచు ధరణిఁ దిరుగుఁడు——

కం. అని నియమించిననవి య
ట్లనదుష్టాచారజనములన్ బాపుల నెం
దునఁ జొచ్చినఁ బోనీయక
ఘనపీడలొనర్చి దేహగతు లెడ సేయున్

సీ. ఒగి వాయువులు నెన్బదొకటి త్రయోదశ
సన్నిపాతమ్ములు సరవి నిరువ
దొకటి మేహంబులు నాల్గు కుటిలాజీర్ణంబు
లెనిమిది గుల్మంబు లిరువదైన
మూత్రరోగమ్ము లిమ్ముగ నరువదినాల్గు
జ్వరములు శ్వాసపంచకము శ్లేష్మ
మన్నిరం పదునొకండగు క్షయంబులు నాల్గు
రక్తపైత్యముల స్వరసదనములును

తే.గీ. శ్వాస లరుచులు ఛర్దులెంచంగనైదు
నైదు హృద్రోగములు నటు లాఱు తృష్ణ
లర్శలాఱును సన్న్యాస మనెడి దొకటి
మదము లేడును మూర్ఛలిమ్మహిని నాల్గు

సీ. అతిసార షట్కంబు నావర్తమొకటి శో
థుబు తొమ్మిదియు గ్రహణులవి నాల్గు
నొకటి హలీమకు మొనరం గుష్ఠువులు ప
ద్దెనిమిది పాండువు లెన్ననటులం
బేర్మి షద్దెనిమిది పీనస లరువది
[ యామక వ్రణ ? ] ములు నమర సన్ని
పరగ నిర్వదినాల్గు పైత్య రోగమ్ములు
శ్లేష్మమ్ము లిరువది వెనకు నేత్ర

తే.గీ. రోగములు షణ్ణవతి కర్ణ రోగవితతి
పంచవింశతి ముఖరోగ పంక్తులటుల
శిరమునం బదితొమ్మిది యమరలోక
విహృతులైనట్టి యాయాయి విధములిట్లు

కం. నొచ్చుచుం బిల్చుచుం గాంకల
హెచ్చుచు జఠరానలమ్ము నెడఛుంచుచు శో
ర్విచ్చంగ నేమ్చుచు బహు రో
గోచ్ఛయ ముదుబాధ స్లల్పు నొకినరు లారలక్

వ. అంతట

మ. సురలున్ మౌనులు విష్ణు విశ్వవిభునిన్ స్తోత్రంబు గావింప శ్రీ
హరి తద్భావమెఱింగి మీకు దృఢమయ్యం జేయుదున్ రోగహా
ర్యరుచి ప్రక్రియ నంచు దానమృత హస్తాబ్జుండు ధన్వంతరి
స్థిర నామంబున క్షీరవార్ధిం బొడమెన్ జీవాతన ప్రక్రియన్.

ఆ.వె. పొడమి రోగనాశమును శుభకరము నా
యుశ్శ్రీప్రదమ్ము వేద మొనరం జేసి
జనులకుక్షయంబు శాంతిం బొందించె మా
నీంద్రు లమరవరులు నెల్ల పొగడ.

కం. సత్యముగ చక్యముఖగుణ
కృత్యత కఫవాత పైత్యకృతముల చేనా
ద్ధత్యము నాడీత్రయమున
నిత్యము దేహ ప్రచార నియతులం దెల్పెన్

ఆ.వె. శ్లేష్మనాడి తలంప శివుండు పైత్యము బ్రహ్మ
వాతనాడి విష్ణుం డాతతముగ
సంఖ్య దశలశ్లేష్మ మధికమా లయ కార
ణుండు పార్వతీధవుండు గాన.

కం. హృదయమునం బ్రాణవాయువు
హృదయేంద్రియ చిత్తముల భరింపుచు నిశ్వా
సజకృతగు నోగిం దెంపులు
నొదవింపుచు భోగ్యవస్తువులురువుగం జొన్పన్

తే.గీ. వస్తి మేఢ్రోరు గోచరివసతి గుదము
నందపానుండు పానందు డగుచు గర్భ
మాత్ర శుక్లార్తవములనిమ్ముగ వెలార్చుం
బరగ నుచ్ఛ్వాసకారణస్థిరతం దనరి

తే.గీ. వ్యానుండు హృదిస్థుండయ్యు సర్వతనుయాక్తి
ప్రజలు నాక్షేపణోత్క్షేపకుటిమ్ము, స్వా:ని:
మేషణోన్మేషణక్రియా మేళనమున
నన్ని పనులకున్ దానయి యతిజవమున.

చం. గుదమున నయ్యపానుఁడును కుంతితుండై వసియింపఁ బ్రమన్ వళో
ప్రదుఁడును నాభికంఠబిలవర్తియు ప్రాణపవయుండనున్ బలా
స్పదుఁడునునై మెలంగు నవశంబులుకోష్ఠగతిన్ సమానుఁ డో
ప్పదగఁ జతుర్థశాగ్నులను పేర్మి మెలంగుచుఁ దేహమున్ బ్రగన్.

చం. కటి హృదయాస్థి నేత్రములఁ గర్ణములన్ స్పరిశన్ మెలంగుచున్
నటనత భుక్త పాన వచనక్రియఁ జెందుచు వాయువుల్ తమం
తటఁ దను జేర రక్త ముదితంబుగ నూర్ధ్వ గతంబుగా రస
స్ఫుట మొదవింప శ్లేష్మగతి పొల్పుగఁ జైత్యము పెంపఁ దానయై.

తే.గీ. స్పర్శ దృఙ్నాభులన్ బైత్య చర్య నించు
ఘ్రాణ మేచ నుస్నులన్ జిహ్వ శ్లేష్మ జేర్చు
నాసమానుండు నట్ల ప్రాణానిలములు
నైదగు ధనంజయాదులు నైదుగలవు.

కం. అవి యుపప్రాణమ్ములు
నవిరళముగఁ బ్రాణదశకమగునవి యవియున్.
వివిధములగు నాడులుతముఁ
గవియును ద్విగుణమ్ములు బుకఁగాఁజే యుఁదగన్

సీ. వారుణి పూషగాంధార పయస్విని
శంఖిగాహంస సరస్వతియు సరణి
ఇడహస్త జిహ్వ యశస్విని విశ్వోద
రియు నలంబుస పద్మినియును నిడయుఁ
బింగళయు సుషుమ్న పెనచుక పదియాఱు
దలఁచఁ బ్రధాన నాములుగఁ దనరు
రావాకు నడియైన భావమ్ము కుండలి
పాన్నవ్రపుట్టనైల పగిది నత్తి?

ఆ.వె. నమరఁ బీఁచుచంద మగుచు డెబ్బది రెండు
వేలనరములంటి వెలయుదాన
నందు రక్త మాంస మా నాడులను గూడ
ఘాతువనఁగ రుజ్ని వాసమయ్యె.

కం. వాతము వక్రము పైత్యం
బాతత చాపలము శ్లేష్మమరయంగ స్థిరం
బీతెఱఁగులు గలసినయది
ధాతుగ ద్వంద్వమ్ములగుటఁ జను దెలియంగన్.

ఆ.వె. జలగ పాముఁ బోలి మెలఁగు వాతము తొండ
కప్పభంగి మెలఁగఁగలదు పైత్య
మమరఁ గ్రోతి గమనమైన శ్లేష్మపునాడి
జతలు సర్ప శీఘ్రగతులు దెలియ.

తే.గీ. పరగుచుఁ జిల్కఁగతి సన్నిపాతనాడి
మాంద్యచాపల్య కుటిల సమ్మర్ద మగుచు
మెఱసి శీతోష్ణ సంగతి నైరయునాడి
సాధ్యముఖగానియెడల నసాధ్యమగును.

కం. చేతిబొటనవ్రేలి క్రిందట
వాతం బావెనక పిత్త మర్సను శ్లేష్మం
బాతరువాతఁ సమగతు
లీతెఱఁగున కుబుక రోగ మెచ్చుటు లరయన్.

కం. పురుషులకున్ కుడిభాగము
తరుణులకున్ వామ హస్తదండము నాడీ
స్థితతోల్బణములు దెలియఁగ
బరికింపవలయు శాస్త్రపారీణులకున్.

తే.గీ. పాదకర మూలధాతువుల్ పలుకు నేత్ర
మూత్రమలములఁ బలు రోగముల నిదాన
మెఱిఁగి దూడంగఁ దగు నొచ్చు లెల్లవాత
మదరి మండుట తీఁట పైత్యంబు కఫము.

కం. వాతమ్ము లేని శూలయు
భాతిగఁ బిత్తమ్ము లేని భ్రమయున్ శ్లేష్మో
ద్భూతంబుగాని తీఁట ప్ర
జాతతికి నజీర్తి లేని జ్వరమును గలదే!

తే.గీ. నలి నపస్మార మృత భాషణములు చిత్త
విభ్రమం బూర్ధ్వ నిశ్వాస వీక్షణములు
జ్వర విదాహక వదన సంస్పర్శ యార్తి
తనుత మృతి చిహ్నలగు నవస్థాదశకము.

సీ. అట్టి యవస్థల నలయించు రోగముల్
పాపకర్ములను దత్త్వాప్తి కొలఁది
గోఘ్నుల వాతంబు కోరి ప్రజాపీడ
నాసక్తజనుల జ్వరావళియును
హింసాపర ద్రోహుల నధిక వ్రణమ్ములు
బ్రహ్మఘ్నులకు గుష్ఠపంక్తి స్త్రీప్రవ
ణాన్వితులకు రాజయక్ష్మలు గురుతల్ప
గుల మక్షిరోగముల్ బాధించు స్వర్ణ

తే.గీ. హరణులకు బైత్యముల్ పితృ హంతలైన
వారి శ్లేష్మామయము పితృవ్యనిహననుల
గుల్మములు మాతృహంతలఁ గుక్షిరుజలు
యతినిహంతలఁ గాశరోగాళి చెందు.

తే.గీ. భ్రాతృ వధకులఁ గాశముల్ బాధపఱుచు
తల్లి సవతులఁ గవయ వంధ్యత్వ మొదవు
తత్సుతులఁ జంపఁ బాండువుల్ దవులు మామ
దునుము వారల శోఫలు దొడరి నొంచు.

కం. మూలమగు సోదరీ వధ
నాలస్యతఁ బుత్రిఁ గవయ నక్షిపటలము
ద్వేలమగు ఖండుఁడగుఁగడు
బోలఁగ నిజజనని తోడఁ బుట్టులఁ గవయన్.

ఆ.వె. కన్నపుత్రిఁ దునుమ గజ చర్మ రోగియౌ
భూపపుత్రిఁ గవయ మూత్రరోగి
వెలయు శిశువుఁ జంప విషచర్మరోగియౌ
ప్రియసుగంధహారి పీనసియగు

కం. గురుతల్పగు మూత్రామయ
మరయంగాఁ గనకహరణు నటు శోఫయు భూ
సుర ధనహారిని లేమియు
గురుశాఖల గోని రుంధకునిఁ బీడింపన్.

కం. దుహితృ వధాన్వితు మూర్ఛయు
మహి మాతుల వధవహిన్న మాతులపత్నీ
నిహను దపోహను మాతృస
మహనున్ ఓట్లహయా ? జెందు మద మెడయంగన్.

ఆ.వె. శిల్పిహత్యవలనఁ జిత్రరోగము చెందు
నశ్వహత్యవలన నడరు దులుము
మిత్రఘాతు నొందు మేని స్థూలత్వంబు
దాసిఁ జంపనొదవు ధర్మరంబు

సీ. వేశ్యను దునుమఁ బ్రవేశించుఁ గ్రమరుజ
వదనరోగ మబద్ధవాది నొందుఁ
జెరువులు పాడార్పఁ జెందును గ్రహణి య
శ్వత్థఘాతికి రోఁత వగ గదిరయున

క్షితి బావి చెఱచిన నతిసార మొనఁగూడుఁ
గూటసాక్షికి నోటి కొదవలొదవు
సరవి భ్రూణహుల విషమ రోగములు చెందుఁ
బటుమూర్తిహంతి స్వప్నపాత మొదవు

తే.గీ. సుమవన తటాక దేవాలయముల నదుల
రతియు నుచ్ఛిష్ట మలమూత్ర గతులఁ దవుల
యతి సతి వ్రతి నిందలు మతినొనర్ప
విషరసజ్ఞ రుజల్ చెందు విశ్రుతముగ.

౬౦. పాపములు నిరయకూప
వ్యాపారత ననుభవించి యనుమతి మనుజుం
డై పుట్టి నప్పుడిట్టి మ
హాపాతక రోగతతుల నలమకు పొందున్

ఉ. అందులకున్ బ్రతిక్రియ మహామహులౌ దా తొలివెజ్జుసత్కృతుల్
మందులనేక మూలికలు నవ్యమతిన్ గలిగింప మానిరా
డ్బృందము హోమదాన జపవిష్ణు శివార్చనలు న్విధించె నా
చందము సేయువారి కనిశంబును రోగము లొందవెయ్యెడన్

సీ. అభ్యంగమున్ నస్య మంజనమ్మును వస్తి
రహి ధూమకర్ణపూరణము లేప
నము తైలతనుమర్దనమ్ము గండూషంబు
నౌషధమును డీక లగ్నితప్త
లంఘనతప్త తైలకషాయ కల్కచూ
ర్ణవిరేచవమనముల్ రక్తమోక్ష
రక్షావిధుల్ లేహ్య రసరసాయనములు
దండన పాన ఘృత ప్రతతియుఁ

తే.గీ. గల్పసేవ శిరోవేష్టకము మితాశ
నము హుతాశన హోమ దాన జప దేవ
తార్చనావని సురభోజనాభిమతులు
శాంతి కారణము లివి సత్సౌఖ్య మొసఁగు.

తరలము. తొలుతఁ జేసిన పాపపుంజముతోన నారక బాధలున్
బెలుచఁ దీఱఁగ శేష మియ్యెలఁ బీడలౌ తుద కాయమిన్
దొలఁగు నౌషధ దానమంత్ర విధుల్ సదా ద్విజ దేవపూ
జలు నొనర్పఁగ సజ్జనాళికి శాస్త్రి వైఖరి మీఱఁగన్.

ఆ.వె. ఔషధములలోన నగు రసౌషధములు
మేటియగుట వాటి మిశ్రగతుల
గంధకము రసంబు కలిత పాషాణముల్
శుద్ధులయినఁగవలెఁ బ్రసిద్ధిగాఁగ.

ఆ.వె. పిల్లికోడియైనఁ బెట్ట పావురమైనఁ
దినఁగఁ జేసి వెడలఁ దీసినట్టి
రసము శుద్ధియగుచుఁ బొసఁగు నౌషధములఁ
గలసి యౌషధముల మెలపు మీఱు

కం. పాలపయిఁ బిట్టుఁ బెట్టిన
పోలిక పాలిడిన శుద్ధి పొడమి గుణమగున్
మేలిమి గంధక మౌషధ
జాలమ్ముల గలుపు నపుడు చర్చింపంగన్

ఆ.వె. కాకరాకు వేఱు కాయ తీఁగల పస
రుల విశుద్ధియగుచుఁ దలఁప నౌష
ధములఁ గలసి గుణము సమకొను పాషాణ
వర్గమదియు సకల వైద్య మతము.

ఆ.వె. నిమ్మపంటి పులుసు నెరపెండ కరుతైన
నొక్కదినము నాన నుండ నీయ
నిర్మలమగు శుద్ధి నేపాళమునకగు
నౌషధములఁ గలుప నర్హమగుచు

సీ. అభ్రమాక్షిక విమలాత్రిజ వైక్రాంత
సస్యక చపల రసోచ్చయములు
గంధోష్మ కాసీస గైరిక శ్రీతాళ
కంకోష్ఠ మణిశిలా ఘనశిలాంజ
నములు సాదక జారి నవసారక కపర్ది
గౌరిపాషాణ గోదార శృంగి
కంపిల్ల చపలముల్ కరిరాద్రి సింధూర
హింగుళంబులు క్రమంబెసఁగఁ జిలుక

ఆ.వె. సముల సరసములును సాధారణ రసమ్ము
లివియిరువదినాల్గు నెలమిఁ బొదలి
రుజల నడఁగఁ జేసి ప్రజలకు నెల్లను
నెమ్మియొసఁగు శాస్త్రసమ్మతముగ

వ. ఇట్టి క్రియావిశేషము లెఱిఁగి దేశకాల గుణస్వప్న దూత లక్షణముల వలన సాధ్యాసాధ్య నిశ్చయం బొనర్పందగునందు.

చం. వెరపును దైన్యపాటు తలవీడుట మేనువడంకుటల్ భ్రమన్
బోరయుట చేత దండమటఁ బూనుట చేతులు గట్టి కొంటయున్
బరువిడి వైద్యుఁజేరి యశుభ ప్రకటోక్తులు పల్కి సంధ్యలన్
దిరముగ నగ్నినైరుతి విదిక్కుల నిల్చిన మూత కీఁడగున్

వ. స్వప్నఫలాఫలమ్ములు వినుండు

సీ. పంచీకృతంబైన పాంచభౌతిక మగు
స్థూలగాత్రంబున లీల సాత్త్వి
కంబు జాగ్రదవస్థఁ గలుగు షోడశవికా
రముల లింగశరీర మమర రాజ
సాకృతిమై స్వప్న మగు కారణాఖ్యను
దమముచే స్వాపమౌ క్రమముతోడ
విశ్వతైజసులన వెలయుఁ బ్రాజ్ఞుండన
నాత్మయొప్పగునిట్టి దగునవస్థ

తే.గీ. లును బ్రమాణంబులును సూక్ష్మ తనువు బాయ
జనఘ! పరమాత్మనెడఁ జెందునంతదనుక
కారణ శరీర మెడయదు కలయఁ బోలయుఁ
గానఁ జిత్సుఖ మాస్వాదగతిఁ బొసంగు

తే.గీ. స్వప్నమింద్రియదశ సుహృత్సంయుతంబు
ప్రాణ పంచక చర్య ప్రపంచక మగు
కంఠ హృన్నాభి గుదములఁ గదల వయ్యు
దానముఖ్య చతుష్కమౌ ప్రాణ గతులు

కం. వ్యానుఁడు సర్వశరీర
స్థాన వ్యాపకుడు గాన సకలేంద్రియముల్
వాని వెనుదవులు నెందున్
గానఁ దలంచినవి విన్న కన్న వి యొల్లన్

చం. కనఁ బడినట్లు సూక్ష్మతను కారణమై పొడకట్టి నట్టివిన్
వినుఁడవి రాజస ప్రకృతి వింతగు శైత్యగుణోల్బణంబునన్
గనునది పుష్యమాసమునఁ గల్గు ననేక విధంబులై తగున్
దినుసులుగాఁ గలవ్ జనులు దీన నెఱుంగవలెన్ ఫలస్థితుల్

ఆ.వె. బొంకు పల్కువతఁడు పొసఁగఁ గన్గొనుకల
రోగజన్య మదియు రూఢికెక్కు
దందు పరుస నాలుగగు జాల నేఁడష్ట
......మాస......చర్య నమరు

కం. పశుల విడుచునెడఁ గనుకల
పొసఁగున్ న్నాల్గైదు నాళ్లఁ బూనిక ఫలద
వ్యసనత సర్పము కుడిభుజ
మెసఁగ గఱవఁ గనిన శుభము లెంతయుఁ గల్గున్

సీ. హస్త్యశ్వడోలిక లాందోలికలు వెన్క
నడవఁగఁ బ్రభువులు నడచు తేరు
రక్తధారలమేయఁ గత్నముల్ పశుగణ
బ్రాహ్మణులన్ గన్నఁ బరగు శుభము
జెలగ పాముసు దేలుచేరియుంటఁగఁ గన్న
[భార్య కప్రియమగు ?] బావివడగఁ
గన్నెలఁ జూడఁగ ఘనసౌధగిరులపై
జనులతో నుండంగ జలధి దరిని

తే.గీ. నుండఁగాఁ గలఁ గన్న వేటొకరి దాస్య
మమరు నట్లుగ వ్రణగాత్రు నధిక హర్మ్య
ధనకనకపుష్పవనములు గనుట లెస్స
శయ్య నుండఁగఁ గలఁగన్న సౌఖ్యమొదవు

చం. లకుముకి కోడి క్రౌంచ మొకలావుకఁ గన్గొన నగ్ని నిల్వఁగాఁ
బ్రకటిత వాహనస్థితులఁ బాడుగృహమ్ములలో సుఖాసన
ప్రకరములన్ వసింప స్ఫుటపంకజ పాండురవస్తువుల్ గనన్
సుకరవి భూతి యున్ శుభము శోభనమున్ గలుగున్ గ్రమంబునన్

కం. నీలాంబరసుమ భూషణ
జాలాన్విత పతులఁ గనిన సరవి ధరింపన్
లీలన్ సూర్యునిఁ జందురుఁ
బోలఁగఁ గలఁగనిన రోగపుంజము లొదవున్

ఆ.వె. కొమ్ములున్న బలు మెకమ్ములఁ బలుకోతి
నట సివంగి నెగయునట్టి పక్షి
నంత్యదుష్ట జనుల నంబు వర్షము జల
మింకఁ గనెడు కలల నెసఁగుఁ గీడు

ఆ.వె. నలుగుబెట్టఁ గసిన నలుపుతై తెల్లని
వస్తుచయము లుండు వడుపుగనిన
రక్తపుష్ప గంధరాజిఁ గన్గొనఁ గీఁడు
కనని వినని కాంతఁ గవయు గ్రహము

సీ. మొండి ముక్కిడులను దండహస్తులఁ బాశ
ఖడ్గ సంభృతుల వికారతనులఁ
బెట్టుకొట్టఁగ నుండ? వెన్నయు నేయియుఁ
బెరుగు తైలాంగుల ఖరము మేక
కాక గృధ్రంబులఁ గాష్ఠము సంకంబు
దుర్లక్షణమ్ములతోన పొలఁగఁ
దానంబు సేయంగఁ దై లాంగుఁడగుటయు
హోమకుండము తేరు భూమి మిత్తు

తే.గీ. పుట్టి సౌధంబు నొకటిరై పాసఁగ నెక్క
క్రొత్త కోకధరింపఁగఁ గోరియొకరు
పల్లకినుబిల్వఁ దానద్వఁ గలఁ గనిన
శోకభయపీడ చింత నాసీక మొదవు

కం. పచ్చని కోకలు సొమ్ములు
నచ్చఁగఁ గల చెలులఁ గనినను సంపద తా
నెచ్చగమ్మృతిగనఁ గుణకము
నెచ్చఁగఁ గన్గొనుటఁ గల్గు నెంతయు వేడ్కల్.

తే.గీ. అన్నముల్ భక్ష్యముల్ తినినట్టు వారలు
తిననఁ గనినట్లు వైరికోత్రస్తనవ గార్ద
భయాతురత మొక్కనట్లుగాఁ బాత్ర నీళ్ల
ముంపఁ జేరంగఁ గలగన్న మొనయుఁ గీడు

కం. వననిధి పొంగుచునింకఁగ
గనుకల యాప్తజన బంధుగణ నాశమగున్
ఘననృత్త గీతవాద్యము
విన నూతన బాంధవజన వీక్షణ మొదవున్

తే.గీ. తొండలన్ గూరమల్లను బండుటాకు
పాలపక్షియుఁ గాకి కన్పట్టు చెట్టు
ఘృతము పరమాన్న భోజనోద్వృత్తి పొగయు
వీడుకోలను గలంగనఁ గీఁడు లేదవు

సీ. సంకెళ్ళ బంధంబు సంతాన మొనగూర్చు
బెడఁగు ముత్తెముగన్నఁ గొడుకు గలుగు
మశక మక్షికముల మచ్చెల హంసముల్
గలఁ గన్న సంపదల్ గలిగి వెలయు
మంచివారలఁ జూడ మంచివి చేకూఱు
మంటఁ గన్గొన శుభ మహిమ దనరు
నమిత పాదముఖావయవ దేవతలఁ గన్న
దేవతార్చనలు తత్సేవఁ గనుట

తే.గీ. చాలసుఖములు నారోగ్య ఖేలలొదవు
నిట్టి స్వప్న ఫలమ్ముల నింగితమతి
వైద్య జనులు శుభాశుభాపాద్య గతులు
దెలిసి సేయఁ బ్రతిక్రియ ఫలము లొసఁగు

వ. దేశకాల ప్రకృతి విశేషమ్ము లెఱింగి సాధ్యాసాధ్యనిర్ణయస్థితిం బ్రతిక్రియ సేయందగు నింక గాంధర్వవేదక్రమంబు వివరించెద—

సీ. మానితంబగుచు బ్రహ్మ గ్రంథి వాయువు
దనరినమందర స్థానకమున
నేమింప ఛందోవతీముఖ్య శ్రుతులకు
నలువైన హృదయోర్ధ్వ నాడులయెడ
నెనసి తిర్యఙ్నాడులను బుట్టి సొబగొందు
శ్వసనంబు శ్రుతులకు స్థానమగుచు
రమణీయమగు దత్స్వరము వినువారల
చెవులకుఁ బండువు చేసి చెలఁగు

తే.గీ. వెండి బ్రహ్మహ్వాయ గ్రంథి నుండి యూర్ధ్వ
గతిని నడచుచుఁ గ్రమముగ వితత నాభి
హృదయ కంఠ శిరో వక్త్ర వృత్తితాన
కముల ధ్వని గూడినది నాదమనర నందు

కం. పరగు నకారము ప్రాణం
బరయఁ దకారంబు లోహితాన్యుండగుచున్
దిరముగఁ బ్రాణాగ్నులలో
నిరవొందఁగ నాదనామ మెలమి వహించెన్

తే.గీ. సురుచిరమ్ముగ నతిసూక్ష్మ సూక్ష్మ పుష్ట
గురుతరాపుష్ట కృత్రిమ స్ఫురణ నామ
ముల క్రమంబగు తానకంబులఁ జెలంగి
నాదగతి యొప్పు సంగీత వేదు లెఱుఁగ

చం. హృదయ గళోత్తమాంగకము లెన్నఁగ మంద్రముఖత్రయస్వరా
స్పదముల కొక్కటొక్కటిః చక్ద్విగుణమ్ములుగాఁ బొసంగు ద
త్పదముల నాద సంభవలసత్త్వవిభేదములేవు మీఱుని
ర్వ్యదియును రెండునాడులఁ దిరమ్ముగఁ బుట్టెశ్రుతుల్ మరుద్గతిన్

సీ. మొదలిఁటి శ్రుతికి హెచ్చొదవు రెండవ శ్రుతి
తన్మధ్యమమున నాదంబు పొడమి
క్రమ్మక యవిరళగతి నొప్పు శ్రుతి మట్టు
దగఁ బుట్టె దాన సప్త స్వరములు
నాఱింటు షడ్జ మెన్నంగ నేడిఁటు బుష
భంబు గాంధారంబు బరగు తొమ్మి
దిఁటఁ బదుమూఁటు విస్ఫుటు మధ్యమము పది
యేనింటఁ బంచమ మెలమి నిర్వ

తే.గీ. దింట దైవత మిర్వది రెంటఁ దగ ని
షాద ముద్భవ మయ్యె వినోదలీలఁ
వాలు విఱిగినఁ బెరుగగు పగిది శ్రుతుల
కలయికల చేత స్వరములు వెలసె నిటుల

కం. గీత ప్రబంధముల నీ
రీతిన్ బేర్లిడఁగ గమి సరిగమపదనిస
ఖ్యాతిన్ సంజ్ఞలఁ దాల్చి
శ్రోతవ్యంబగుటు స్వరసుశోభనత దగున్

సీ. ఆయార కరణ మధ్యావ్వృతు లిప్తము
లనఁగ నైదగు ధాతు లా శ్రుతులను
గలవవి స్వరములఁ గలసి నాలుగు మూఁడు
రెండు నాలుగు నాల్గు రెండు నొకటి
రెండు షడ్జాదుల నుండు నలంకార
ములు నాఁగ స్వరములు వెలయు నాల్గు
స్వరములు గూడిన సరవిఖండములు మూఁ
డిరవైన కళయన మెరవడినగు

ఆ.వె. సప్తశుద్ధ జాతి సంగతిఁ దగు నలం
కారములకుఁ బేళ్ళు గాఁ దదీయ
మగుచు షడ్జముఖ్యమై యిట్టు లొప్పగుఁ
గంబళాశ్వతరనిగదిత మగుచు

కం. స్వరభాగలు ఋషభస్వర
విరహితమై కైశికీయ విఖ్యాతిఁ దగున్
దర గాంధార నిషాదో
త్తరణములగు జాతులచటఁ దగు స్వరయుక్తిన్

సీ. గ్రహ మంశమనఁగ రాగములకు మొదలగు
వహి నవి తారవ్యవస్థ మంద్ర
మట్టిద న్యాస విన్యాస లుపన్యాస
సన్న్యాసలు బహుత్వ సరణి నల్ప
మంతర మార్గంబు నట షాడ వౌడవ
సంగీత వస్తు ప్రసంగతిఁ బడు
మూఁడోపు సంపూర్ణమునకు నంగమ్ములై
స్వతముల గల జాతిసంక్రమణము

తే.గీ. తారకంబగు లక్షణోత్తరిణఁ గామ
చారియనఁ బొల్చు గీతమ్ము చాలు తరిటి?
న్యాస మంతరగోపనమగు స్వరప్ర
చార మాంతర మార్గిక సంజ్ఞ నమరు

తే.గీ. షడ్జ మధ్యమ ఋషభ పంచమములెన్న
దైవతంబు నిషాద గాంధారములును
దైవ్యపైత్రక మౌని నిత్యమ్ములందు
బ్రాహ్మ్యమగు షడ్జమధ్యమ పంచమములు

కం. దైవత ఋషభములవనిప
పావనకులములు నిషాదపటుగాంధార
శ్రీ విట్కుల భవమన్యము
లీ వసుమతి శూద్రజాతి యెన్నఁగ వరుసన్

సీ. తమ్మి కెంజాయయు నెమ్మి కంఠము బలె
వర్ణంబు బంగరు వడువు, మొల్ల
పూరుచి పచ్చని పోలుపు పసపు మిన్న
ధూసరచ్ఛవి క్రమధూర్వహమున

షడ్జాదులగుస్వరచ్ఛాయలు జంప్యంత
రీహాదులు ధ్రువరీతి కటుల
రసములద్భుత వీరరౌద్రముల్ ఋషభ ష
డ్జముల కెన్నఁగ దైవతమున కుభయ

తే.గీ. వికృతములు కరుణారిసవృత్తిఁ దగు ని
షాదగాంధారములకు హాస్యరుచి రసము
లలరు పంచమ మధ్యమంబులకు జన్యలు
గూడ గ్రామముగతి స్వరకూటమయ్యె

మ. శ్రుతిజాతి క్రమసంగతిన్ స్వరములచ్చో నిల్చుటన్ మూర్ఛనా
స్థితినొప్పున్ ప్రథమంబు షడ్జ మటు నర్థిన్ మధ్యమంబా ద్వితీ
యత, శుద్ధంబగు పంచమంబులఁ దృతీయంబయ్యె స్వరౌఘని యో
గ్యతనుండున్ భువి నల్ప శాఢ్యల తదీయచ్ఛాయలం జేయఁగన్

వ. షడ్జ మధ్యమ గ్రామంబులకు లక్షణంబు ఛాయాకల్పనార్థంబుగా నొడివెదనని
వెండియు——

తే.గీ. షడ్జ మధ్యమ గాంధార సంజ్ఞ గ్రామ
ములకు నధిపులు విధిహరీశులును దేవ
తలు తదీయంబులగు రాగములకుఁ బలఁప
సరవి సీమంతఘర్మ వర్షర్తు లునికి

సీ. పూర్వాహ్ణ గేయార్హములగు షడ్జగ్రామ
రాగముల్ మధ్యాహ్న రాగములగు
మధ్యమగ్రామ సంభవములు సంధ్యల
గాంధార జన్యరాగమ్ములమరు
షడ్జ మూర్ఛ నలునెంచఁగ మంద్ర రజనులు
పరిశుద్ధ షడ్జమత్సరులు మఱియు
నమరు నశ్వక్రాంత మరయ నిట్లన తక్క
గ్రామమూర్ఛనలిటుగాకనైన

తే.గీ. విరువదియు రెండుమూర్ఛన లిందువలన
నైదు వేలును నన్నూరులైన తాన
ములకుఁ బత్తాంతరమ్మునఁ గలుగు నేఁబ
దాఱు మూర్ఛనలందుల సారగతిని

వ. రెండులక్షలున్నెనుబది రెండు వేలు నిన్నూఁటునలుబది పూర్ణతానంబులయ్యెనీ
కసంపూర్ణతాన క్రమం బెఱింగించెద.——

తే. గీ. అమరుషాడవ మౌడవ మార్చికమును
గాథికము సామికము సనఁ గలుగు షడ్వి
ధములు విరహిత స్వరము లాఅమరు షాడ
వంబు స్వరములు నైదౌడవంబు దెలియ

సీ. అవనిధ్రువైన స్వరాంతరంబనఁదగు
సనరిగలు సమీక సంజ్ఞనొప్పు
సరి గాథికంబగు షడ్జ మార్చికమగు
లాలిత ప్రస్తార మూలమిదియె
స్థిత షాడవౌడ వార్చిక గాథికములు సా
మికము స్వరాంతర మిశ్రితంబు
నిల నేఁడు నూఱులు నిరువది నూఁటిరు
వది యిరువది నాల్గు వరుసనాఱు

ఆ. వె. రెంటు నొకటి తానరీతులు జనియించు
కైశికంబనంగఁ గలదు జాతి
స్వరములొక్క కొన్ని జనక సాధారణం
బుదితమగును దాని తుది స్వరమ్ము

తే. గీ. అమరు స్వరములు నూలాదులనఁగఁ దాళ
యుక్తి నొకకళ చిత్రమార్గోక్తి మాగ
ధియు ననేడిగీతి వార్తికద్వికళ సంభ
వీత మనఁగ గీతి యొప్పగు చతురలీల

వ. మఱియుఁ జతుష్కళ లైన దక్షిణ మార్గంబునఁ బృథుల యనుగీతియు నిట్టి
విధగీతులకు నుత్పత్తా వృత్తకమనేడి తాళంబెసంగు నట్టితాళంబునకు వినియోగం బెట్టిదనిన

తే. గీ. తనరు నాక్షిప్తికి ప్రసాదకులు నంత
రైయు నైష్క్రామికియు నాల్గు రహిని నాట్య
గతినిఁ బ్రథమాంకమునఁ దుదఁ గలది తెల్పఁ
దగియె నాక్షిప్తికలు షాడ్జతక్ భాసంగి

సీ. అదియు ద్వాదశకళ యాకళ లఘుస్పష్ట
కంబు ద్విత్రి స్వరగతి లఘువగు
నాదిమధ్యాంతంబులవి మంద్ర మధ్యమ
తారక సంజ్ఞలఁ దనరియుండుఁ

తెలియ స్వస్తికము వృత్తిద్వయంబనఁగ నం
ద్యావర్త మబ్జపత్రంబు భ్రమర
మబ్జగర్భభ్రమేడి తాఖ్యలరాగ
కదంబముల్ గలవు భేదంబులమర

తే.గీ. రంజన యొనర్చు కతమున రాగమయ్యె
నింకఁ దల్లక్షణ క్రియలెల్లఁ దెలియ
వినఁగను మాళవ షడ్జ సంజనిత మగుచు
షాడవ ప్రాప్తి శ్రీ రాగ సంగతితగు.

సీ. రమణీయ గౌళ మేకము మాళవము తాళ
మమరు మాట్టెను పూర్ణమగుచు నొప్పు
లలితరుఝమ్మట్టె తాళము షాడవము పూర్వ
యామమ్మునకు నది యర్హమగును
నలువైన సారంగ నాటతాళము డెంకి
పూర్ణమ్మునై యొప్పఁ బొల్పుమీఱి
వరుస గుజ్జరి షాడవమటు తాళంబు కాం
భోజి పూర్ణంబట్టి పొల్పు దక్క—

తే.గీ. లలితహిందోళ ధన్యాస్యులమరు గుజ్జ
రియును దేశాక్షి గుండ క్రియయు వసంత
మలహరులు దేవగాంధారి వెలయ [రేష]
[క డవా] ల కర్షంబు భూపాల కలిత మగుచు

తే.గీ. కనడ బంగాళ కేదారగౌళ శంక
రాభరణ నాదనామ క్రియలు మనోజ్ఞ
రచిత ఘంటారవమ్ము సారంగనాటు
లిర్వదియు రెండు పగఁటు రేయింటఁ దగును

వ. ఇట్టి ద్వాత్రింశ ద్రాగంబులయందు భూపాలాదిపురుషరాగాష్టకంబునకుఁ బత్నులగు చతుర్వింశతి శ్రీరాగంబుల నరువదినాల్గు మిశ్రంబులు జనించె నందు పాళి, సారంగ, హంవీర, రేవగుప్తి, మేఘరంజి, కురంజి, పదపంజర, పూరి, సావేరి, హసావేరి, మంగళ కౌశిక, నారాయణ గౌళ, పంతుగౌళ, కన్నడగౌళ, మాళవ గౌళ. శుకవరాళి పున్నాగవరాళి, పంతువరాళి, తొండవరాళి, హెజజ, ఖాధి, యెరుకల కాంభోది, యెసకల కాంభోది, నీలాంబరి, బిలాహరి, మధ్యమావతి, ఉశాని, ఛాయాగౌళ, రవిగౌళ, పూర్వగౌళ, కుంతలవరాళి, ముఖ్య రాగంబుల ప్రస్తార క్రమంబుల ననంతరాగంబులయ్యె నిట్టిరాగ మార్గ స్వరబద్ధంబులగు గీత ప్రబంధంబుల భేదంబు లెఱుంగవలయు మఱియు వీణావిధంబు.

సీ. ఆరోహణావరోహణములు స్థాయి సం
చారచతుర్విధ చారములును
మేలాపకోద్గ్రాహ లాలితాభోగధ్రు
వములంగములు గీతసమితి కెల్ల
స్వరపాఠ వచనముల్ బిరుదు గద్దెములు ప్ర
బంధషడంగముల్ పరగనవియు
చౌషష్టి భేదముల్ సరవి శ్రీవర్ధక
కలహంస శ్రీరంగకైవశాదు

ఆ.వె. లిట్టిగీతవేద మొంమి నాదబ్రహ్మ
మరయ మేటి యోగ గరిమ లెన్న
పరమశబ్ద పరవిభాగ తత్వ బ్రహ్మ
విదుల నడిగి తెలియ విధము మేలు

కం. వేదోక్తమంబు క్షత్రియ
వేదితముగ సాధుజన వివేక విహిత మ
ర్యాదాస్పదమైన ధను
ర్వేదము వివరింతుఁ దెలియ వినుఁడని యందున్

కం. దక్షతఁ బదియును రెండగు
లక్షణములు త్రివిధమైన లక్ష్యంబులు శాం
తిక్షమ యుక్తిని విల్కాఁ
డక్షయమతి నెఱుఁగ వలయు నభ్యాసమునన్

సీ. వేళ లెఱుంగుచు విలుఁ బూనుటయు దృఢ
ముష్టి మట్టుగఁ బట్టు మురువు పెద్ద
వ్రేల నుంగర మిడు విధము నాసిక నేయ
నేర్పు నిశ్చలదృష్టి నిల్పు దెఱఁగు
నిలుచు పాదన్యాసముల విభేదమ్ములు
నాకర్ణముగ గుణమటు దివియుట
ఘాతవాత ఘాతాదుల కెడయుట
యేయునప్పుడు నిల్పు నైపుణములును

తే.గీ. సమతనరి వేయునెడ తనువిముడు కొనుట
శరము విసురుక చసనీక చాయనేయు
టుంగరము నారి సమత పొసంగఁ జూచు
టిట్టి పదిరెండు విధముల నెట్టుకొనిన
లక్షణమ్ములు వేర్వేఱ లలితమగును

కం. చల్లని వేళలఁ జేతన్
విల్లుధరించుటలు లెస్స విసరెడు గాలిన్
బెల్లగు నెండన్ వ్రేళ్లలు ?
నల్లన నల్లనగుగాన నభ్యాసదశన్

కం. తలము ధనువంటు నీ కం
గుళముల నణఁకువగ మధ్యమాంగుళి వెనుకన్
దళముగఁ దర్జనియుండఁగ
బలుముష్టిన్ విల్లు బిగ్గఁ బట్టఁగ వలయున్

తే.గీ. నారిఁ దివియుచు భుజమునఁ జేర నీక
నుంగరము వామదిశయందు నుండఁ దర్జ
ని నఖమటుఁ గప్పుకొని వ్రేలు దనర వాటి
సంధి శర ముప్పఁ దివియుట శాస్త్ర సరణి

సీ. వామాంఘ్రి భుజములు వలనొప్ప సగముగ
నమరించి యాకాలి కడ్డమగుచు
నుండఁ గుక్షిపదము నొదవించి యారెండు
మడిమల నడుమొక యడుగిడుండు
నటుల నిల్చుటలు ప్రత్యాలీఢ మది విప
ర్యయమైన నాలీఢమనఁగఁ దనరు
వడిలక్ష్య మేయుచు వామాంగుళము నేల
బలుపుగ నూనియాపట్ల మడిమె

తే.గీ. నొత్తుటలు లెస్స గురియేయు నెడల శరము
కరముచాయఁగ నిరుచెయ్యి సరిగనుటలు
పూర్వ పాదాంగుళము చాయ బూను టొకటి
యంబుతుదఁ జూడ్కి గురి గనుటదియు నొకటి

తే.గీ. సప్త షట్పంచశత చతుశ్శత శతత్ర
యాంఘ్రుల కొలంది మఱియేయునపుడు వరుస
నయ్యనామిక మొదలుగ నైదు వ్రేళ్ల
తుదలకైయంప మొనసరి తొడరఁ గనుట

కం. పిక్కలెడ నేసి దేహము
చక్కఁగ నిడివింటి వంపుచాటున నిడి యే
చక్కటి కదలక బెబ్బులి
యిక్కవఁ బొంచుటలు లెస్స యొంతయుఁ గడకన్

తే.గీ. గుహ వెడలివచ్చి దిశలుగన్గొనుచు వాల
మవనిఁ దాటించి గమికించునట్టి పెద్ద
పులి విధంబున నేయుచోఁబోసఁగవలయు
పింజ పింజంబు నేయుట పేర్మిఁ దగును

కం. పారవోయిన పేఁ జెత్తిన
నెరవిఁకిన విల్లుచూసి విడివి దృఢంబున్
గురిచక్కని దగువింటన్
దురుసగు తానకములమరఁ దొడరుట లొప్పున్

వ. ఆలీఢ ప్రత్యాలీఢ సమవిషమ చిత్ర ప్రచారాది స్థానక కుశల బుద్ధుల నమర, దృఢముష్టి దూరాపాత లాఘవ చిత్రగతుల నతుల చాతుర్యత సకలాయుధ శ్రేష్ఠంబగు ధను ప్రసంగ ప్రవీణుండైన ఘనుఁడిహపరసుఖంబులం బొదలునని సూతుండు షట్శాస్త్రము లెఱింగించెద వినుండని మునుల కిట్లనియె.

తే.గీ. తర్కములు రెండు నొక్కటి దండనీతి
సాంఖ్య శాస్త్రంబు మఱియును సారలీల
పూర్వ మీమాంసముత్తర పూర్వమైన
యట్టి మీమాంస శాస్త్రంబు లాఱునయ్యె

సీ. తర్కద్వయమునందుఁ దనరు గౌతమకణా
దములు షోడశ పదార్థముల గౌత
మము, కణాదము పదార్థములాఱిటందగు
నల ప్రమాణ ప్రమేయము సంశ
యము ప్రయోజనము దృష్టాంత సిద్ధాంతావ
యవతర్కములు నిర్ణయమును వాద
జల్ప వితండముల్ సరవి హేత్వాభాస
ఛల జాతి నిగ్రహ స్థానములన

ఆ.వె. గౌతమంబు ద్రవ్య ఘన గుణకర్మ సా
మాన్యగురు విశేష మహిమల సమ
వాయమనఁ గణాద వరతర్క షట్కమ
దార్థతత్త్వ సంవిదతుల ముక్తి

సీ. జ్ఞాన నిరతులకు సమకూరు నెప్పుడు
నా మోక్షసంసిద్ధియనఁగ వేడ్క
వినుఁడు తన్నాద్యేకవింశతి దుఃఖాంత
మర్థ స్వరూప సమ్మతము దలఁచ

పరుస శబ్ద స్పర్శ వర రూప రస గంధ
హృదయముల్ షడ్బుద్ధు లింద్రియములు
నాఱు సౌఖ్యము దుఃఖ మది యిర్వదియు నొక్క
పై యొప్పు విజ్ఞానులైన జనులు
దలతురిద్విధములు తొలుమతంబునఁ బల్క
నమరు షోడశపదార్థముల యందు

తే.గీ. నవనిఁ గన్గొను టెల్లఁ బ్రత్యక్ష మయ్యె
మహిఁ బొగ వహ్ని కలిమనుమానమయ్యె
దానివంటిదె యన నుపమానమయ్యె
మఱియు విను టెల్ల శబ్ద ప్రమాణమయ్యె

వ. ఇవి ప్రమాణ చతుష్కంబగు. ద్రవ్యగుణ కర్మ సామాన్య విశేష సమవాయములను షట్పదార్థములయందు

కం. ఈ విధిఁ బెక్కులయిన నం
దావలనన్ మొదలిదైన యాత్మ ద్వివిధమా
జీవాత్మయుఁ బరమాత్మయు
నా వేత్రై యొక్కటగుచు నానాతనులన్

తే.గీ. తనువు లెన్నఁగ భోగసాధనము లింద్రి
యములనఁగ జ్ఞానపంచక మటుల మఱియు
ద్రవ్యగుణకర్మ సామాన్య తద్విశేష
మనఁగ సమవాయ మీయాఱు నర్థమయ్యె

సీ. తొలి ద్రవ్య భేదముల్ తొమ్మిది పంచభూ
తములు కాలదిగాత్మలు మనసు నన
గుణ మిరువది నాల్గు గుణితులఁ దగు రూప
రసగంధములను స్పర్శమున సంఖ్య
పరిమాణతను బృథక్త్వతను సంయోగ వి
భాగ పరత్వ తాపరత గురుత
ద్రవత స్నేహతను శబ్దమున బుద్ధిని సుఖ
తను దుఃఖమున స్పృహతన్ ప్రయత్న

తే. గీ. ధర్మ విద్వేష సంస్కారతతి నధర్మ
తను వితర్కింపఁ గల్గు భేదములఁ దనరి
కర్మము మనశ్చలన మెన్నఁ బేర్మి జాతి
యగుట మాత్రమె సామాన్యమనఁ దలిర్చు

ఆ.వె. ధర విశేషమనఁగఁ బరగు నిత్యద్రవ్య
వృత్తి యది విశేష విధ పదార్థ
మాయతగతిని సమవాయ మన్న దియొ సం
బంధమనెడిదిదియొ భావమరయ

కం. ఇదియర్థ భేదగతి న
య్యదనన్ బుద్ధియన జ్ఞాన మన నది రెండౌ
నది యను భవమున్ స్మరణము
విదితంబింద్రియము లణఁచు విధమున నరయన్

తే.గీ. యత్నము ప్రవృత్తియనఁదగు నదియొ పుణ్య
పాపకలితంబు మోహ రోషములు రాగ
మెసఁగుటయొ దోషమనఁదగు వసుధ మఱలఁ
బుట్టుటయొ ప్రేత్య భావమ్ము నెట్టు కొనగ

కం. ఫలమనఁగన్ సుఖదుఃఖం
బుల యనుభవమగుట పీడబొందుట దుఃఖం
బుల మోక్షం బపవర్గం
బలరఁ బ్రమేయంబు తెఱగు లగు నిది యెల్లన్

సీ. ఒక్కటిఁ గాంచి వేఱొకటిగా నెంచుట
సంశయంబనఁ దగు జనుఁ డొనర్చు
యత్నమ్ము సఫలమౌటది ప్రయోజన మెన్న
వాదియుఁ బ్రతివాది వాదసరణి
కనుగుణంబగు నిదర్శనము చెప్పుటలు దృ
ష్టాంతమౌ శంక లేదరయ దీని
కనుట సిద్ధాంతమౌ ననుమానవాక్యాంశ
మవయవంబగు నప్రియ ప్రసంగ

తే.గీ. మదియ తర్కంబు నిర్ణయంబగుట తిరము
నేయుటయొ జ్ఞానమగు తత్త్వ చింత దొలఁగి
పలుకునది వాదమగు, జయ ప్రార్థి వాడుపు
కతలు జల్పంబు తర్కోక్తి గణుతి నిల్లు

తే.గీ. ఆత్మ పక్షము స్థాపించు నలవు లేక
పరమతము దూషణము చాలు పట్టునది వి
తండ, మనుమాన దూషణతం దలిర్చు
వాదమన్న హేత్వాభాసనాఁ దనర్చు.

సీ. రహి నభిప్రాయాంతరముతోఁ బ్రయోగించు
శబ్దార్థముస దూష్యసరణి నాడు
నది ఛల మనఁదగు నమర నుత్తర మీమి
జాతియౌ నటఁ బరాజయము దోఁచు
నెరిమీఱ నాడుటఁ నిగ్రహ స్థానమౌ
నొగి షోడశ పదార్థయుక్తి లిట్లు
దెలిసి మోక్షార్థము దీనంద నేరక
వాది భంజన ధరావర్య రంజ

తే. నముల కుపయోగము గ్సంధతమసమౌచు
సమగ్రహస్థితి బుద్ధి జాడ్యమున జనులు
కొందఱిందంను సుఖములు జెందరందు
హగిపరాయణులధిక సౌఖ్యాఢ్యులరయ

మ. ఇది తర్కస్థితి దండనీతి యనఁగా నింపారు నెందర్థశా
స్త్రిదశ ఖ్యాతిశ్రుతిస్మృతి ప్రకర సిద్ధంబై ధరాధీశపు
ణ్యదమై పాతక దండ నార్హమును సత్య స్థైర్య వర్ణాశ్రమా
స్పద ధర్మ శ్రుతి పాద్యమై వినుఁడు తచ్ఛాస్త్రంబు మోదంబునన్

కం. దురితాత్ముల దండింపుచు
వర సజ్జనతతులఁ గరుణవర్ధిల్లఁగ భూ
వరుఁడరసి మనుపవలయున్
దలచగు వ్యవహార దశలఁదజ్ఞులు పొగడన్

వ. ధర్మాధర్మము తెలింగి దండింపఁ దగుటఁజేసి తన్నిర్ణయ పురులవలన నృపతి తెలుఁగవలయుంగావున.

సీ. పటుమత్సర క్రోధపక్షపాతాధర్మ
దుశ్శీల నిరతులఁ దొడరనీక
శాస్త్రధర్మ వివేక సత్యదమశమ సం
యుతుల విప్రుల సభాన్వితులఁ జేయ
దగు, వారు లేనిచో సుగుణులెవ్వరో వారి
శూద్రుఁ దక్కఁగ సభఁ జొనుపవలయు
నేగుర ముఖ్వర నేడ్వురగా ద్విజ
వర్యుల సభ నున్పవలయు నీతి

తే.గీ. పౌరిదిఁ బిలువక సభకు వచ్చునతఁడు బ్ర
యత్నమునఁ జేరనీక ధర్మార్థవేదు
లైన వారలచే వాదు లణఁప మేలు
శిష్ట పాలనులగు నృప శేఖరులకు

కం. కులశీల వయోరూపము
లలవడు ధర్మజ్ఞులైన యనఘాత్ములవై
శ్యులసభఁ గూర్పఁగ దగుని
శ్చలమధ్యస్థ ప్రచార సత్యులయినచోన్

తే.గీ. బ్రాహ్మణులు సర్వదేవతా ప్రతిములగుట
నధ్యయన శీలములు గల్గునట్టి వారు
లున్నసభ దేవసాన్నిధ్య మొనరు కతనఁ
బలుకుబడి వల్ల ధర్మము బల్కులు వడును

కం. కనిచెప్పమి కనకనె చె
ప్పినదోషము లొందుగానఁ బెద్దలు సభలన్
విను వినుకుల కనుగల్గిన
ఘనుల సముల సభలఁ గూర్పఁ గాఁదగు పతికిన్

చం. తగుజనులెల్లఁ గూడి యిది ధర్మమటంచు విధింప నట్లు నా
జగతివిభుండు తత్ప్రజలఁ జాతురితో నియమింపఁ బుణ్యమా
నగడున నేయకున్న సచివాప్తపురోహితులెల్ల భూవిభున్
మిగులఁగ నీకధర్మగతి మేకొనఁ జేయుట యొప్పు నెంతయున్

ఉ. వారని కోర్కి నయ్యుభయవాదుల ప్రార్థన సేయ ధర్మవి
స్తారకుఁడాలకించి పెరసభ్యులు మెచ్చఁగ ధర్మయుక్తిమై
గూరిమిఁ దెల్ప నెన్న వినఁగూడమి భూవిభుఁ జెందుఁ బాపముల్
ధారుణి సభ్యులతుణ బుధప్రకరంబటు లేక యుండినన్

ఆ.వె. ఎవ్వఁడేని సభ్యహితలక్షణుఁడు వానిఁ
బ్రాడ్వివాకుఁ జేయఁ బతికిధర్మ
మతఁడు ముందువెన్కనగు ధర్మములు పట్టి
యరసి నిర్ణయింప నర్హుఁడగుట

కం. మోహభయలోభమత్సర
సాహసములఁ దప్పి బలుకశాస్త్రోక్తముగా
నూహించి వారిదండన
నోహటిల నొనర్పవలయు నుర్విపుఁడలరన్

కం. అమరఁగ స్మృత్యాచారము
సమయాచారంబు నిఖిల శాస్త్రార్థ లస
త్క్రమ మెఱుఁగు ననపరాధుం
డమలుఁ డవధ్యుం డబాధ్యుఁ డాతం డెచటన్.

సీ. క్రమత నల్బుధియు నెనిమిది సంస్కారముల్
కలిగి కర్మత్రయ కలితుఁ డగుచు
వసుధఁ బ్రసిద్ధుఁ డౌ వాఁడు మోసము వల్క
దండింపఁగారాద ధరణి పతికి
సమయ శాస్త్రాచారవిముఖుల గతులిత
రులు వల్క విని యది గలుగఁ దెలియు
టే వ్యవహార మానెసఁగు నాతనికి శం
కాభియోగమ్ము తత్త్వాభియోగ

తే.గీ. మనఁగ వస్తు దర్శనాదులు ప్రత్యక్ష
దర్శనంబు నగుచుఁ దనరఁ గనుట
కెఱుఁగ ననుట యిదియో యిదిగాదనుట రెండు
గలిగి మత్త వృత్తిఁ గడగి యొకఁడు

కం. పాప మెఱుంగమి నన్యా
యాపరతన్ బైఁడి భూమి హరియించున్ ద
ద్వ్యాపారమష్టవిధములఁ
జూపట్టున్ నిజము బొంకు చొప్పొనరంగన్

ఉ. అప్పదిగాదు కూలిడిలివంచును చాననునేసి తంచు నీ
వప్పుడు నించుమించుగఁ గ్రయంబొనరించితి వంచెఱింగియున్
జొప్పకయింతయున్ గనని సూటిగ వాటికిఁ గూడియిచ్చి తం
చెప్పుడు నుద్ధరించుమని కిచ్చితి నౌనని లేదు నాఁడనన్

తే.గీ. స్వామి పేరను టాఘాత్యసరణి, బెదరు
నేయుటయు బ్రుచ్చిలించుట స్త్రీ ధనంబ
నుటయు జూదంబునం బిలుచుటయు వాదు
లివి యసాధ్యగతుల నూఁటరొనిమిదయ్యె

వ. మఱియుఁ బెక్కుదెఱంగులగు వ్యవహారంబులై ధరంబరగె బలవంతులొనర్చనవి యను దేశంబేకంబుగాఁ బూనినవియు రాజావలంబంబున నైనయవి వ్యవహారంబులుగావు మత్త మద్యపాయి నీచ స్త్రీ జలవల్లోభుల వ్యవహారంబునకుగా నొక్కరుండు వచ్చి చెప్పిన

వారలఁ బిలువంబంపక తత్కార్యంబు లరసి దండించునది. బాలవృద్ధ గర్భిణీ శిశుజనానాథులకేదియొ క్రమ పరామర్శం దెలిసి ధర్మంబునిలుపునది. సమర్థుంబైన వారలితరులచేఁ బలిమొఱుంగునట్లొనరించి తదాహూయమానులై వ్యవహారంబులు దీర్చకోవలయు నిర్లెతింగిధర్మంబు దప్పనియతండు ధర్మాసనస్థితుండనఁ బరగు వెండియు.—

సీ. దాయాద్యమన ద్వేషత నబద్ధతం దెల్పు
టది వేగమున నరయంగ వలయు
సభ నొక్కగతినుండుచుండ మంతకుమున్న
చెప్పు నాతండ యసిద్ధుఁడండ్రు
కాలకర్మస్థానక ప్రవాసా సిద్ధు
లన నాల్గు దెఱఁగు లౌనట్టివారి
దండించుచుఁ యథార్థము దెల్పు మనఁదగు
ననుపుగ నిజమాడు నర్థి బొంకు

తే.గీ. వాఁడు ప్రత్యర్థియున్ బూర్వవాదియర్ధ్యు
ప్రాయఁగాఁదగు :గాఁడును వాక్యసరణి
నొరసి పల్కునడిగి తదుక్తు లెఱిఁగి
పురుష భేదము సభ్యు లేర్పఱుపవలయు

ఆ.వె. స్థానతత్వ వస్తు సంఖ్యలవియు లత్త్య
మావిధంబు లరసి భావమరసి
యది పరిగ్రహక్రయములకు బలవత్త
రంబు పూర్వ విరచితంబునగుచు

తే.గీ. అన్యవాది క్రియాద్వేషి యస్థిరుండు
యట నిరుత్తరుఁడును నిల్వ నంపరాని ?
వాఁడు నేగురు హీనపు వాదులరయ
నందుల సమర్థ నసమర్థ నరయఁ దగును

సీ. ఖ్యాతిఁ గర్మస్థాన జాతి సంజ్ఞాధివా
సములు దేశము నొక్క సమముగాఁగ
నుభయవాదులు దెల్ప నొగిఁ బ్రమాణమె కాఁగఁ
దెలిసి పత్కోడలు శోధింపవలయు
పైతృ పైతామహ ప్రభురాజకీయమ్ము
లగు నెడఁ దన్నాల మరయవలయు
నప్రసిద్ధ ప్రద్యతా విధేయ విహీన
ములు నసాధకములు దెలియవలయు

తే.గీ. నిష్ప్రయత నిష్ప్రయోజనాన్వితము లెఱిఁగి
బహుతరోక్తి యసంగతభాషణములు
పరగు ద్రవ్యనిరాకరణ భావయుక్తి
క్రమ విశోధనచే నెఱుఁగంగవలయు

ఉ. సాక్షియు భుక్తియుఁ లిఖితసంజ్ఞ యనేక వివాదముల్ సభా
ధ్యక్షులు పెక్కుచందముల ధర్మఁపు ద్రోవ విమర్శచేసి శాం
తిక్షమ నొప్పు నుత్తరము దెల్పక మున్నె యొకింతగాఁ దగన్
గక్షులుగాక యుత్తరముగైకొన నిర్ణయయుక్తి దక్కఁగన్

సీ. విధిపూర్వ పక్షశోధనముచే సంగత
మవలంబనము చేసి యట నసంగ
తుని దండ్యుఁ గావించి మును లిఖియింపుచోఁ
బలుకులు బెళుకులు దెలియవలయు
నిజమరి యర్థియు నెమ్మి నుత్తరవాది
యనఁదగు ప్రత్యర్థియనఁగఁ బూర్వ
వాదినా, బొంకరి వర్తిల్లఁ బరపక్ష
ఖండన నిల్కడ గరిమ సార

తే.గీ. మరయ సందేహరహితమా నర్థి పలుకు
లిందులకు నన్యమై విరోధిమై పొడమఁ
గలఁక నొందుచుఁ బ్రత్యర్థి పలుకులడరుఁ
దెలియఁదగు కల్లనిజములు పలుకుబడిన

శా. అంగీకారము పట్టుపీడమియు సత్యంబైనచో వానికా
సాంగత్యం బెడలంగఁ బల్కుటయునున్ సభ్యాలిగర్హ్యుండు నా
నంగా సత్యము నాల్గురీతుల నసత్యం బట్లయా లేదెటుం
గం గూడుండుటు లేదు పుట్టెననుట ల్గా నాల్గుచందములన్

కం. ఉత్తర వచనమురీతిన్
హత్తియుఁ బెరన్యాయ భేదమగుచు విరోధం
బెత్తినది పూర్వపక్షం
బత్తఱి నది దెలిసిపలుకనగు ధర్మోక్తిన్

తే.గీ. హీనములు నూరొసంగితి నేనటన్న
నది పదార్థిసచో యాకలనుట పూర్వ
సభ్య రప్పింపవలయు వాగ్జాలి పొసఁగఁ
బలికెనేనియు బొంకుగాఁ దెలియవలయు

కం. వ్యవహారమ్ములు చెప్పుట
యవి వ్రాయుట యర్థి సత్యమాడుట వ్రాతల్
భువి సాధ్య కార్యసిద్ధిన్
వ్యవహారము నాల్గుగతుల వర్తించుఁదగన్

తే.గీ. తగమిఁ బ్రత్యర్థితోడ విరోధంబు గనియు
ఖండితము సేయకనె యర్థిఁ గాదనుచుట
వారి మనసులుగనుగనుగొనవలయు నన్య
వాది పద సంగ్రహుండనఁ బాటువడును

కం. కడు వాక్ఛలనమ్మునఁ
జెడు వ్యవహారమ్ము భూమి స్త్రీ ఋణముల యం
దడరు ప్రమాదంబనియున్
వడి నెఱుఁగునటన్న సత్యవాది జయించున్

వ. ఎల్ల యర్థ వాదంబులకు నిదియ ప్రమాణంబు వాదకాలంబున దివ్యప్రమాణరీతిగాబల్కినతండు దండ్యుఁడు సాక్ష్యాదులచే నిరూపితధనంబర్థి కిప్పించి రాజానకట్లు నయ్యాయఋణంబుల యందిట్లు నిర్ణయింపవలయు వెండియు.

సీ. సాహసంబున విషశస్త్రాస్త్రములఁ బ్రాణి
హింసలు సేసిన నెసఁగ ద్రోంగి
లించినఁ దిట్టిన నొంచిన సంచిత
ప్రాకారా పరాధులఁ గులతరుణుల
దాసీ జనంబుల తగవులు దీర్చుచో
నిల దుష్ట గుణములు దెలియ డెగ్గు
లాడిన నోడమి యానన స్వేదంబు
గద్గదికయు........ తొట్రు

తే. పాటు నాల్కకుఁ దడిలేమి పరుల పలుకు
నమ్మి మెచ్చుట ముఖ వివర్ణమ్ము దైన్య
మాత్మ వికృతియు గుఱుతుగా నరసియపుడె
దండనము సేయ ధర్మమ్ము ధరణిపతికి

కం. మఱియుం జెన్నెలదుష్టుల
తెఱఁగెఱుఁగుచు నేర్పుమెఱయ దీరాఘులనే
ర్పఱపుచు దండింపనియా
ధరణిపతికిఁ బాపమెసఁగు ధర్మము పోలియున్

సీ. కనుగొన్న యాతఁడు విని వాఁడటు సాక్షి
యందుఁ గృతాఖ్యుండు నకృతుఁడనఁగ
ద్వివిధుల లిఖితుండు తెలియఁ బత్రపుసాక్షి
యాదృచ్ఛి కాగతుండరయ గూఢుఁ

ముత్తరసాక్షి నా నొదవు నేవురు కృతుల్
ప్రాడ్వివాకుఁడు పెక్కు మనులవాఁడు
నర్థి పక్షుఁడు గ్రామ్యుఁ డాలేఖకుఁడు సభ్యుఁ
డార్గురు నకృతు లిట్లైన సాక్షి

తే.గీ. మహితకులశీల సత్య ధర్మములు తపము
దానమును బుత్రధన శాస్త్ర తత్త్వదమము
లమరు సద్గుణవంతుఁ డౌనతఁడు వలయు
స్త్రీ వివాదమ్ములకు సాక్షి స్త్రీలు వలయు

కం. వ్రతులున్ వృద్ధులుచోర
ప్రతతియు సాహసుఁడు నంబి బాల కితవదు
ర్మతులున్ వికలేంద్రియులున్
బతితులు కోపనులు సాక్షిభావ విరహితుల్

తే.గీ. అర్థ సంబంధి పాషండు నతివ ధూర్తు
నట్టువునిఁ గూటసాక్షి నెక్పట్టు నడుగ
రనఘుఁ డగుసాక్షి ప్రాఙ్ముఖుండధికశుచియు
నగుచు ద్విజదేవసన్నిధి నాడవలయు

కం. కులధర్మముపై నొట్టిడి
పలుకులఁ దప్పైన నాల్క పడునని యడుగన్
వలయున్ బొంకినచో ఘన
కలుషగతులఁ జెందు సాక్షి ఘనపాతకియై

సీ. బందుకట్టున వచ్చి పల్కువాఁడగు కూట
సాక్షి వాఁడనుచితసరణి నఘము
లనెసంగి పల్కు సాక్షిని జాతి కొలఁదుల
దండించివారిచే ధనము గొనుట
పతికి నీతియు శుభాస్పదమతి ధర్మంబు
కూట సాక్షులనాల్క కోయవలయు
జానపదంబన శాసనంబన నిరు
దెఱఁగుల లిఖితంబులరయ స్వకృత

ఆ.వె. మైన సాక్షి వలవ దన్యకృతంబైన
సాక్షి వలయు దేశచర్య నుభయ
సమ్మతంబు సాక్షి సకలంబు లిఖిత ప్ర
మాణమగుచు సంజ్ఞ లాఁ దనరు

మ. ప్రతులైనన్ లిఖితమ్ములన్నయెడల న్వారింపఁగా నొప్పగున్
ధృతిఁ దత్పుత్రులు పౌత్రులున్న ఋణముల్ దీర్పందగున్ వేఁగఁ ద
ద్గతిఁ దీర్పంబని లేదు బల్మినగు లేఖ్యంబత్య సిద్ధంబగున్
చ్యుతమైనన్ మఱలంగ వ్రాయఁదగు నచ్చో బొంక దండ్యుండగున్

కం. చను జయ పత్రిక లిట్లన
యనువొందక రాజకీయమట సందేహం
బొనరిన నిర్ణయ విధములు
దనరు లిఖితములను నెల్లఁ దగు దద్విధముల్

వ. యుక్తి ప్రాప్తి క్రియా చిహ్న సంబంధాగమ హేతుశుద్ధాశుద్ధిస్వహస్త పరహస్తాది క్రియల వలన లిఖితంబును ధర్మవచనానురూపక్షి సభ్యులు నిర్ణయింపవలయు లిఖితభుక్తి సాక్షి వ్యతిరేకంబైన దివ్య ప్రమాణం బావశ్యకంబగు నదియు, జలాగ్ని భుజగ విషకోశ ప్రమాణంబులను నైదు తెఱంగులం బరగెనవి యధిక వ్యవహారంబులకుఁ దగి శారీరదండ న్యాయ్యంబులగు మఱియు విప్ర శిరస్స్పర్శన పథాది ప్రమాణంబులనేకంబులు గలవిట్టివి సభానాయకానుమతి భానువాసరాది పుణ్యదినంబులం దొలునాఁడుపవసించి యార్ద్ర వస్త్ర ధరులు ప్రాఙ్ముఖులగుచు నొనరింపవలయు.

సీ. అగ్ని దివ్యంబు పూర్వాహ్ణ కాలంబున
నంబువులందు మధ్యాహ్నమునను
కోశదివ్యము మాపు కోరి వేకువ విష
మహివహ్ని తప్త మాషాది విధులు
పూర్వాహ్ణమునఁ జేయఁ బూనుట తగు దులా
దివ్యంబు నేయ నత్తెఱఁగు వినుఁడు
యజ్ఞార్థ తరువుల నటు హేమకృత్యంబు
లమరంగ వటము క్రిందైనచోట

తే.గీ. వెలయఁ గల్పోక్త పూజ గావించి ప్రార్థ
నంబొనర్పుచునెక్కిన నరుని ధరణి
ద్రోయకుండిన శుద్ధుడౌ త్రోసెనేనిఁ
గపటిగా నెంచి దండింపఁగాఁ బోసంగు

కం. అది వృద్ధ స్త్రీ బాలుర
కదనన్ రోగులకు ద్విజులకలవడదు ద్విజా
స్పదము జలదివ్యమగ్నియు
నదియున్ శూద్రులకు దివ్యమగు నర్హంబుల్

తే.గీ. తప్తమాషములమరు దృతకులభవుల,
కంబుదివ్యంబు విషము వైశ్యాన్వయులకు
యోగ్యమన్నియ శూద్రున కుచితమనిరి
పూని స్మృతివిదులైన విబుధచయములు

కం. కొంచెపుఁ బనులకుఁ దనువుల
కెంచ విరోధమగు నెడల నిట్టివి తగదం
దంచిత విషదివ్యము వి
ప్రాంచజ్జాతికి ననర్హ మనిరి మునీంద్రుల్

సీ. ఈ ప్రమాణముల యందెల్ల దిక్పాలుర
గణదేవతా పూజ ప్రణుతి వలయుఁ
దలను బత్రిక పూన్పఁదగు ప్రార్థ నాయుక్తి
యిట్లు ధర్మా ధర్మ మెఱిఁగి నృపతి
శాసించి పుణ్యంబు భాసుర కీర్తియుఁ
గల్గి సౌఖ్యమ్ములు గాంచు నెచట
తుల ధటానామమా నిలధకారము ధర్మ
మా టకార మధర్మమగుటవీఁటి

తే.గీ. రెంటి వివరింప నేర్చిన రీతిదగుట
బాపలకు నెల్ల నటశిరః పత్రికదగు
కుంచ ఘూతాది దేవతా ప్రార్థనోక్తి
మంత్ర మొక్కటి దగునది మఱవఁ దగదు

శ్లో. ఆదిత్య చంద్రావనలౌ నిలశ్చ
ద్యౌర్భూమి రాపో హృదయంయమశ్చ
అహశ్చరాత్రిశ్చ ఉభేచసంధ్యే
ధర్మశ్చ జానాతి నరస్య వృత్తం

వ. ఇది వ్రాసిన పత్రిక శిరంబున నిడి ధట నెక్కి యొండుండిరైన దారు వికలంబున నైనఁ బడిన నశుద్ధుండు పడమి శుద్ధుండు, ననల ప్రమాణంబునకు నట్లన గావించి.

కం. రావాకుపైన నర్కుడ
శ్రావలి నాల్గొకటి చేతికట్టంబిడుచో
నావహ్నిన్ ప్రార్థింపుచుఁ
బావకనిభమైన మడ్డు పట్టింపఁదగున్

ఆ. వె. నీళ్లనద్ది త్రాఁచి నెఱినేతు జేసల
పొడవు మద్దు నెత్తి నడచి యంతఁ
జేతవద్దు నలుపఁ జెయ్యి కందిన నోట,
మొదవు కందుకున్న యదన జయము

చం. జలములు నాభిదాఁకఁ గలుషం బొనరింపుచు నందులోపలన్
నిలిచి తదీయ పూజనము నెమ్మి నొనర్చుచు యజ్ఞవృత్తిపున్
బలువగు మొద్దు బట్టుకొని పజ్జ శరాసనమూని మూన్ని బెటి క
మ్ములు పడి మూఁటి నేయ నటమున్న వసించినవాఁడు వేగితన్

ఆ.వె. వెనుక నేయనమ్ము గొనివచ్చు నంతలోఁ
గలఁక దేఱి వాఁడు గానబడిన
శుద్ధుఁడగును జూడఁ జొప్పడకున్న న
శుద్ధుఁడగును ధర్మ శోధనమున

కం. హిమవజ్జాతము శృంగజ
మమరఁగ నభిమంత్రపూర్వకార్చితవిషమున్
క్రమమున జీర్ణించిన చో
నఘులుండని తెలియఁదగు సభాధిపుఁ డతనిన్

తే.గీ. కాలకూటకులంబది కాదుగాని
కడమ విషముల శోధింప నిడఁగ నర్హ
మటుల చాసలు నేసిన యనఘు నరసి
ప్రీతితోఁ బ్రోవ నృపతికి నీతి సుమ్ము

వ. విషమిచ్చునతఁడుదఙ్ముఖుండును గొనునతండు దక్షిణముఖుండుగా నుండ వలయునింకఁ గోశప్రమాణం బెఱింగించెద——

సీ. పశుభృత్యగణన మొప్పఁగఁ జేసి కడువడి
నియమస్థుఁ గావించి నిత్యవిధిగ
నార్ద్ర వస్త్రములు దివ్యాభిముఖస్థున
నిల్పి దోయిఁటనుంచి నీళ్ల ద్రావ
ముమ్మాఱు గావించి యిమ్మాడ్కిఁ గడవఁగఁ
దనకు సుఖంబుంటఁ దగ విశుద్ధుఁ
గానెఱుంగుడు కీఁడు గల్గ నశుద్ధుఁగాఁ
దెలిసి దండింపఁ గావలయుఁ క్షితికి

తే.గీ. బియ్యమొక క్రొత్త ఘటములోఁ బేర్మినునిచి
సూర్య సన్నిధి నిడి తినఁ జొనుపవలయు
పగుల దవడలు రక్తము ప్రబల నతనిఁ
గపటవర్తను గానెఱుంగ నగవలయును.

వ. పతితమద్య పానులక నాచారులకుఁ బ్రమాణంబులు పనిలేదు వారలు దండనార్హులు మఱియుఁ దప్త మాషాజ్య దైవంబులనునవి తామ్రమృణ్మయాది పాత్రంబుల నిరువది పలంబుల తైలంబులు గాఁచి యందు మాషంబులు మాడ్చియవి యొక్కటొక్కటిగా నెత్తించుటయును, ఆజ్యంబు గాఁచి యందు జెయ్యిడు మనుటయు నాగ్నేయంబనఁ దగుదైవంబువెండియు.—

కం. ధర్మంబు వెండివంటిద
ధర్మము సీసంబు రీతిఁదగు భూర్జమునన్
బేర్మి లిఖియించి పూజకు
నర్మిలి తద్వర్ణగంధ మక్షతలు దగన్

కం. ధీయుక్తి గోమయంబు మృ
దాయత పిండంబు ప్రార్థనావృతి బాలుం
డాయొడ నదియెత్తియ్యఁగ
నేయది యెటువచ్చు దాన నెఱుఁగఁగవలయున్

వ. ధర్మపత్రిక వచ్చినన శుభంతునుంగానెఱుంగందగు నింక దాయాద్యంబెఱింగించెద.—

సీ. పైతృకంబగు ధనప్రతిబంధకము గాయ
మచ్చటఁ గల్గుదాయాద్య మరయ
ద్రవ్య భేదంబుల ధనికనేరంబుల
స్వత్తు విభాగ ప్రశస్త మగును
స్వామి రిక్థక్రియ సంచి నాగ పరిగ్ర
హాదికముల్ స్వత్తులవనిసురుల
కలభూపులకును జాయానులబ్ధంబులు
వైశ్య శూద్రులకు నుర్వర శరీర

తే.గీ. కృతములంగల్గు నరి స్వత్తు కీర్తితముగఁ
బూని కనినది యెత్తినవాని సొమ్ము
శాస్త్రసిద్ధమె నిజసత్తు సరవిలౌకి
కంబగు ధనంబు పనిగొనఁ గాదు సొమ్ము

వ. వైశ్యునకుఁ గృషియు శూద్రునకు శుశ్రూషయు రిక్థాదులు స్వస్థంబులై వర్ధిల్లు గావున.

సీ. అప్రతిబంధి దాయాద్యంబు రిక్థంబు
క్రయమది ప్రతిబంధకమగు దాయ
మిలఁ బ్రతిగ్రహము మున్నలుగ నొక్కఁడు దీసి
కొనిన నిక్షేపంబు గొనుటలధిక
మంబు ప్రతిగ్రహమింబగు ద్విజుల క
ర్థము వాటికంటె భాగానుగతికి
నదియుఁ బైతామహమై పితాపుత్ర సా
ధారణమయ్యె నా తండ్రిదగును

తే.గీ. స్వామినాశ విభాగాను చర్యలయెడ
సుతుల సొమ్మగు జనకు నార్జితము నవి క్ర
మంబునైన ధనంబును మఱలు సుతుల
యనుమతిఁ దానమును విక్రయంబు నీతి॥

కం. ఆపదలకు శ్రాద్ధక్రియ
నోపికఁ దద్ధనమునమ్మ యోగ్యుఁ డొకండే
యాపట్ల సుతుల యనుమతి
చూపట్టఁగ వలయున నెడి చొప్పొప్పదిలన్॥

తే.గీ. గ్రామ సామంత దాయాదిగణము జ్ఞాతు
లెఱుఁగ భూవిక్రయం బర్హమిరవుగాఁగ
భాగ మగ్రజుకిరు పాలు పరగ మధ్య
మునకు నొకపాలు హెచ్చియ జనకు తగవు॥

వ. నిజార్జితంబైన నగ్రసుతునకు విభాగంబునందొక యంశం బీవలయు భార్యలకుసమాంశంబేకాని యధికాంశం బిచ్చుట యనర్హంబగు జనకుండు న్యూనాతిరిక్తంబుగా విభాగించిన నశాస్త్రీయంబగు నేని పునర్విభాగంబు కర్తవ్యంబు.——

కం. జననీ జనకుల యంశం
జనుపొందఁగ జ్యేష్ఠునిం దదంతమ్మునఁ జెం
దును సంతతిలేనిచో దా
యను జెందుఁ దద్ధనంబులవి శాస్త్రగతిన్॥

ఆ.వె. సుతుఁడు లేమి పుత్రి కలివయు లేమి దా
యాదితతికిఁ బ్రాప్త మౌధనమ్ము
జ్ఞాతులకు విభాగకర్త్రార్హమగు పైత్ర
కార్జితము స్వతంత్రమైన ధనము॥

కం. పిత్రార్జితా విరోధత
మిత్రుల వలనన్ స్వవిద్య శౌర్యముల ధన
క్షేత్రములు సోదరులకును
ధాత్రిన్ దాయాదిపాళ్లు తగదీయంగన్.

వ. పిత్రార్జిత జీర్ణ క్షేత్రంబు ఉద్ధరించె నేనియుఁ దదంశంబును స్వాంశంబును దాన కైకొని సోదరులకు యథాంశంబులీయందగుగాని స్వార్జిత విభాగంబశాస్త్రీయంబు పైతృకంబగు కృష్యాదు లుద్ధరించె నేని సమాంశ విభాగంబర్హంబు తటాకారామాది సుకృతంబులు పంచుట నిషిద్ధంబు వస్త్రశయ్యాలంకారాదులు శ్రాద్ధకాల వినియోగార్హంబులు దాస దాసీజనంబుల యథాంశ క్రమంబుల పనులు సేయించి కొనునది. ఇది పితృధన విభాగ పద్ధతి, పైతామహ్యంబునకు విశేంబుగలదు వి నుండు,—

సీ. తండ్రిగడించిన ధనము లాతని కెన్న
రెండుపాళ్లిచ్చుట రీతి తాత
యార్థంబు వచ్చుచోటది గూర్చుటతనికె
తాత గణించిన ద్రవ్యమున్నఁ
బౌత్రుల పాళ్ల వెంబడిఁ బంచుకోదగు
వేస విభాగంబైన వెన్కఁ బుట్టు
నతనికిఁ బాలు లేదా తల్లి దండ్రుల
యదియు తదంత మందతనిఁ జెందు

ఆ.వె. జనకుఁడీల్గు వెన్క జనియించిన తదంశ
ధనము లేమి భ్రాతృ జనులు భాగ
గతుల ధనము గూర్చి యతనికిఁ బాలిచ్చు
టర్హమగుటఁ బుత్రి కదియు తగవు॥

చం. జనకుఁడు లేమి భాగములు సల్పఁగఁ దల్లికి భాగమీఁ దగున్
దనరఁగ స్త్రీ ధనంబుగల తల్లికి నంశము సాము యోగ్య మా
జనని చనంగఁ బుత్రికల చాల్పటఁ జెందల విత్త మెల్ల ని
ట్లనువుగఁ దల్లి దండ్రు లెడయైన విభాగమునందు పొందుగన్॥

కం. కడగొట్టుమూఁ తురైనన్
గొడుకైనన్ఁ బెండ్లి లేమిఁ గూడు ధనము నం
దెడ కల్గఁ దద్వ్యయంబున
కిడి మిగిలిన ధనము పాళ్లకిరవగు జగతిన్॥

మ. భగినీ భాగములీయఁ గావలయు నే పట్టందుఁ బిత్రర్థ మె
ట్లగు నింతేనియుఁ గల్గఁ గొంచెమగుచోఁ బూన్కిన్ బ్రశస్తంబుగాఁ
దగవా విప్రుఁడు క్షత్రియాముఖజ సంతానంబు లెందంగఁ బా
దగు భాగంబుల పాలు తక్కువగు శాస్త్రామ్నాయాది జాత్యానతన్ ॥

వ. క్షత్రియా వైశ్యా శూద్రా స్త్రీ భవులకుఁ ద్రిపాదార్ధపాదభాగంబులిచ్చుటి హితంబు దానప్రతిబంధక క్షేత్రంబులు దక్కఁ దక్కిన ధనంబులీవిభాగంబునకనర్హంబులు—

తే. గీ. పాళ్లు పంచుచు నెవ్వఁడే భ్రాతృ జనుల
వంచనము సేయు వాని భూవల్లభుండు
పాలి కేడఁ బాపి దండింపఁ బాడి వాని
పాలు తత్సోదరుల కిడ మేలిసీతి ॥

చం. తనయులులేనిచో గురుబుధ ద్విజముఖ్యులవల్లఁ బుట్టఁజే
సిన తనయుండు క్షేత్రక విశేష పితృద్వ్యయి కెన్న శ్రాద్ధముల్
ధన ఋణముల్ ఘటింప విదితంబుగఁ బూనఁగఁ గర్త వానికిన్
దనయులు గల్గిరేని విను తద్విధి కించుక తక్కువాతగన్ ॥

కం. కులనాశన మగుచోఁ ద
త్కులమున్ నిలుపుటకు నొక్క కొడుకు విధవకున్
గలిగించవచ్చు బ్రాహ్మణ
కులమునకుం దక్క నితరకులములకెల్లన్

ఉ. వేనుని భూమి సంకరము విస్తరమైన యెడన్ ఋషీశ్వరుల్
పూనిక విప్రజాతికిది పోలదటంచు విధించిరట్టి లీ
లైన ధవుండు లేమి నియమాన్వితయై చరియించు కాంత స్వ
ర్గాను గతిన్ దలంగుఁ బ్రథమాశ్రమ వైఖరి భద్ర వృత్తులన్ ॥

ఆ. వె. పుత్రవాంఛనట్లుపోయి మూర్ఖరఁ గన్న
విధవ నిరయగతుల విడువకుండు
గాని బ్రహ్మచర్యగతి నుండు కామిని
పగిది స్వర్గ సుఖము బడయ లేదు ॥

సీ. స్త్రీ ధనమ్ములు పుత్రిఁ జేరు పుత్రికలేమి
పుత్రజదుహితృజల్ పాత్రలరయ
వారులేకున్న సవతి కూఁతులకుఁ దగ
సుతులకిఁ బాడి తత్సుతులు లేమి

క్షేత్రవివాదంబు చేకూఱఁ దన్నాల్గియ
మరయంగఁ దగు సాక్షి నడిగి మఱియు
స్వామి విక్రయ ఋణ చర్య లన్యాయంబు
నపలాప మాక్రమ్య మాదినర్యో

తే.గీ. పదియు నెనిమిది తెఱఁగులఁ బరగు వీని
గతు లెఱుంగుచు వ్యవహార కర్మ విధుల
వలనఁ దెలియుచు భూపతి ములుచలైన
వారి దండించుటలు ధర్మవర్తనంబు ॥

కం. కాలువలకుఁ బొలిమేఱకు
మేలిమి వనములకు గొడవ మేకొన్నరొండన్
వాలాయము దమ పొరుగుల
గ్రాలు వయోవృద్ధ వాక్యగతిఁ దెలియఁదగున్

సీ. స్వామి హీన క్రయాస్పదభూమి స్వామిదే
యితరుల భూమి గ్రహించు వాఁడు
దండనార్హుఁడు చేని దండ చే నుండఁగ
జరపినవాఁడట్టి చర్యకుఁదగు
చేనునఁగల పూరిచెట్టులఁ దద్భర్త
నడుగక పట్టినయట్టివాని
కరము ఖండించుట ధరణి పతికి నీతి
క్రయము నష్టమ్ము నొక్కరుఁడు మ్రుచ్చి

తే.గీ. లించినది రాజుతోఁ జెప్ప నెంచి యతఁడు
క్రయము మూల్యంబు నిప్పింపఁ గార్య మితర
జనుల శాస్త్రోక్తదండన సల్పి స్వామి
కనుభవార్హమ్ము గా క్షేత్ర మరయ వలయు ॥

కం. ధరణిపతికిట్టి చందము
లెఱిఁగింపక తమకుఁ దామయిచ్చఁగ మెలఁగన్
నరవరుఁడు దండనంబిడి
గుఱిగా నపరాధధనము గొనుటర్హమగున్ ॥

చం. క్రయధన మీయఁ గావలయుఁ గ్రక్కున నాఁటనె యేసులోనుగా
నయగతిఁ గాలదేశముల నాటికి నేఁటికి మించెనేనియున్
రయమున భూమిపాలునకు ద్రవ్య మొసంగుట. నీతి యిట్టి వృ
త్తిని మదిదాఁటు దండ్యుఁడు మతిందల పోయఁగలాఁడు రాజుచేన్ ॥

సీ. వల్లగానట్టి యావస్తువు లప్పుడ
తిరుగ వేయుటనీతి మఱుచనాఁడు
క్రయమొనర్చినవాఁడు గావలెనన్నచోఁ
బూనిపాతిక పాలు మానుటొప్పు
పచ్చి వస్తువులైనఁ బదిఁటి కొక్కటి గా [ర్చి?]
యిచ్చి తిరుగవేయు టింగితమ్ము
రత్నాంబరాదిస్ఫురద్ద్రవ్య వితతికిఁ
బదినాళ్ల మేర యేర్పాటు శాస్త్ర
తే.గీ. మంత కెక్కుడు దివసమ్ములయ్యెనేని
సమ్మతమొకాని శాస్త్రమ్ముసరవి గాదు
నార్ద్ర వస్తువులకు నెల్ల నపుడు నాఁడు-
నీరసములకు గణియింప మేరయిట్లు ॥

సీ. పనిపాటు లొనరించు జనులు శిష్యులు దాసు,
లాపనులగు శుభ మశుభములన
కాళ్లు గ్రుద్దుట మొదల్గా నశుభంబులు
నల్పపుఁ బనులు పాకాది విధులు
శుభములు కూలి దీసుక వేదములు చెప్ప
నెన్నఁగ భృతకుడో, నెంగిలెత్తి
కనుపూఁచ్చువాఁడవస్కరుఁడందు నుత్తముఁ
డరయంగ భృతకుఁడు హలికుఁ డధముఁ
ఆ.వె. డగును బల్మినైన యట్టిబంటు నదత్తు
చోరునమ్ము వానిధారుణీశుఁ
డరసి విడఁగఁ జేయ టర్హ మానకుండఁ
బ్రోచు బంటు పుత్రు పోల్కిఁ దన్ను ॥

కం. ఎక్కువ జాతులవారికిఁ
దక్కువ జాతులగు జనులు దాసులగుటయే
యెక్కువ జాతుల జనములు
తక్కువ జాతులకుఁగాదు దాస్యము సేయన్ ॥

కం. గురునొద్ద విద్య నేర్చుక
తరమిడి మును నొడువు గురువు దప్పినవాఁడా
వఱకిడిన బత్తెమునుగా
నిరవుగ గురునకు నొసంగు టింగిత మందున్ ॥

కం. అరయిక యీశగతగవులు
ధరణిసురులు శాస్త్రసరణి దప్పఁగఁ దెలుకన్
నరవరుఁడు వారిఁ దనదగు
ధరణి న్వసియింప నీక తఱుమఁ గవలయున్

కం. గ్రామగణద్రవ్యమ్ముల
నేమానవుఁడపహరించు నేనియతని సొ
మ్మామనుజ విభుఁడు గొని తన
సీమ వెడల నడచుటరయ సిద్ధం బెందున్ ॥

ఆ.వె. జనుల సమ్మతమునఁ గొనిరాజు శాఁకేటి
వారికీక బలిమివలనఁ దెచ్చి
యిచ్చునేని వానికిచ్చుఁగఁ బదిపాళ్ళ
ధనముగొనఁగ వలయు మనుజవిభుఁడు

సీ. పని నేయుటకుఁ గూలిగొని నేయకనె పోవు
నతఁడిమ్మడిగ స్వామి కరవవలయు,
వచ్చెదనని కూలి పుచ్చుక గమన వి
ఘ్నము నేయ నిమ్మడిగైకొనఁదగు
నడిత్రోవ లోపలవిడిచి వచ్చిన మిఱి
పాతికపాలియఁ బాడియగును
మఱియును జనుల నేమరక సాక్షులె సభ్యు
లధికార శాస్త్రజ్ఞులగుట నుచిత

ఆ.వె. గతులఁ జనులకొలఁది భృతు లియ్యనగు రాజు
నది మొఱింగి నీతి నరయవలయు
నయముతోడ శ్రేణినైగమపాషండ
భేదములను గలసి బెరయనీక

కం. కపటమున గెల్చు జూదరి
చపలునిఁ గుక్కలచ్చు లిడుచు సడలింపఁ దగున్
నిపుణత నైన బ్రాహ్మణవే
షపు శూద్రుని నట్లనేయ శాస్త్రము పలికెన్

సీ. అతిపాపి నిందలకాస్పదమగువాని
నాచార రహితు నన్యాయనిరతు
నపరాధయుతుఁ బతి యరసి తచ్ఛేదమున్
జాత్యంతరమ్ముల సరణి కలిమి

తరమున శారీర ధనదండనమ్ములఁ
గావింపుటుచితమ్ము గడగి విప్రుఁ
డత్యపరాధయుచాతాతుఁడగు నేని
శత నిష్కముల కెచ్చు జనదు గొనఁగ

తే.గీ. క్షత్రియాది త్రివర్ణుల జాతివరుస
నాల్గు పాళ్లెచ్చు ధనము గొనంగవలయు
నధికవర్ణాపరాధి విద్యా నిరూఢు
జైనకి దుర్జను మిక్కిలి గొనఁగవలయు

వ. ఫలమూలోపకరణక్షేత్రోదకాదులకు భంగంబు విఘ్నంబు నాపాదించునతండును విషశస్త్రనిపాతపరదార విమర్శనులు ప్రథమసాహసులు పశుగృహోపకరణాన్నపాన భంగ సాహసులు మధ్యములు. నితరసాహస దుష్టాచారులధములగుట మర్యాదాతిక్రమణుల సద్యోఘాతదండనములు సేయందగు పితృమాతృగురుజనాత్మభార్యలయందు దోషంబులేమిఁ ద్యజించునతనిఁ, జౌర్య క్రియలవలన వెడలనడిపించుకొనియును బోకయున్న వానిని విప్రునంటుకొనిన చండాలాదులను శూద్రసమాగమజటాధరులకు భోజనంబిడు నతనిని దాసీ గర్భపాతునిఁ ఒది నూడలపరాధంబు గొనుట్వర్థంబు.

కం. జనకుఁడు పుత్రుఁడు వాదం
బొనరింపఁగ [జూచి] తీర్పకుండు నతఁడు వో
డిన షండెమునకుఁ బూటు
య్యును వాదము బెట్టునతఁడు నురుదండార్హుల్ ॥

సీ. తోరణ దండాదులూడిపో మొత్తు
పాతకు, ధనము మార్పులచు నతని
శాస్త్రహీనత చికిత్సల వివాదముల ప్రా
యశ్చిత్త యఘునిరతునిఁ
జోరుఁడో తెలిఁగియు గారవించిన వాని
స్ఫటిక పయో వ్యాఘ్ర చర్మ సురభి
గంధద్రవ్యముల్ గడఁగి దొంగిలువానిఁ
దను ధనదండనం బొనరు నీతి:

ఆ.వె. గదిసి పొడిచి రాత్రికన్న పెట్టినవానిఁ
బురుషసతులఁ జంపు పుణ్యరహితు
ముల్లె విడఁచువాని మునుకొని శాస్త్రోక్తి
చిత్రవిధముగాఁగ సేయటొప్పు ॥

కం. ధనమిడి దేశాంతరగతి
జనఁగ దశాబ్దముల స్వామి జనులడిగిన నీ
యనివాని పిదప ధర్మం
బున కొసఁగనివాని దండముల్ సేయఁదగున్

చం. అవిహిత దుష్టచర్యయగు నంగన గర్భనిపాత కామినిం
బ్రవిమల శాస్త్రమార్గ పరిభావ విచారిణి బావిఁ ద్రోయఁగా
నవు నిటువంటి పాపఁపు లతాంగులరీతి నెఱింగి ధారుణీ
ధవుఁడిటున్యాయముల్ దెలుప ధర్మము నిర్మల కీర్తి చేకురున్

వ. గురు పుత్రఘాతకునిఁ గోడెలఁ గట్టిన బండినిడి తఱిమి చంపఁదగు రాజపత్ని గమన గృహదాహక గరదారామ చ్ఛేదనులఁ గటాహాగ్నితుషాదుల భస్మంబు సేయందగును.

సీ. పరిహాసకముల సాదర దృష్టులను నంతు
టులు సరసాలాపములను గొంటి
[యునికి?] యు గ్రామోపరిని వసించుటఁ జూపు
లాసక్తి నవ్వుల యందములును
గలుగుట పరసతీకాముకుగాఁ దెల్సి
శతనిష్కములు దీయఁజను విభునకు
జాతుల కొలము లెంచక పొంద నెక్కువ
తక్కువలన్ దగు దండనములు

తే.గీ. సంకరులు వేశ్యఁ బొందిన సరవి దండ
నార్హులగుదురు సద్గుణులందు కేని
ధవుని దేవునిగాఁ జూడఁ దగవు బ్రాహ్మ
ణాది వర్ణాంగనల కన్య నంటఁ జనదు

కం. పశు వేశ్యాసంయోగుల
కశనం బరువది దినమ్ములరికట్టఁ దగున్
వశపోనిదానిఁ గవసిన
యశుచిన్ గొనవలయు నృపతి యటు దశపణముల్

సీ. సతి యల పతియు నాచారమ్ము మానుట
కాఘుకును దండ్రియు నడిచి పడుట
యొరుల దూషించుటయును గులధర్మముల్
విడుచుట సంకీర్ణ వృత్తిగాన

భూవిభుఁడారసి పాసఁగఁ జేయుట నీతి
తగినట్టి దండనోద్ధతు లొనర్చి
యగసాలి కపటాత్ముఁడై సర్వ కంటకుఁ
డగునేనిఁ గండలు నొగులఁ జించు

తే.గీ. టర్థ మరయంగ సిద్ధాయ మపహరించు
వారి ద్రవ్యంబు కొలఁది నద్ధారుణీ శుఁ
డరసి దండింపఁ దగు తోవ నపటి కొదవు
వస్తు వెత్తిన శిక్షింపవలదు సుమ్ము

కం. కర్తకు సాక్షికి ధరణీ
భర్తకు సభ్యునకు సమము పాతకచయముల్
కర్తవ్య మెఱిగి ధర్మపు
వర్తనదండింపకున్కి వడిఁ బాతకులన్

మ. ప్రతిపాదింపఁగ నైజ మాట సుజనుల్ భాషాక్రియా వృత్తులన్
జతురస్థైర్యత సాధు వాక్యముల నిచ్చున్ బూర్వ తద్గ్రాహి స
మ్మతితోఁ దద్ధన మిచ్చి చేకొనఁగ నందర్థమ్మునం జేయ లే
గలియా ధర్మమె విక్రయంబునకు జోకన్ హెచ్చు లెందేనియున్

సీ. ఉన్నదియున్నట్లు నురుశోధనస్థితి
సభ్యులు పలుక దోషంబులేదు
పలుదెఱంగులఁ బల్కు ప్రత్యర్థి నొడువుల
యందొక్కటియె పట్టి యరయవలయు
ప్రతి లిఖితముసాక్షి పరగుచో మును లిఖి
తంబునకును సిద్ధి దనరియుండు
క్రియల మధ్యస్థ నిర్ణయపరుఁడగువాఁడు
ప్రాతి భావ్యుండట్టి పగిది త్రివిధ

తే.గీ. మరయ దర్శన విధి ప్రత్యయంబు నిత్తు
ననుటలిట్లగుపూట కాపగ్గమైన
ధన మొసంగిన యతని కాతనికె కాని
ఋణికి బనిలేదుబంధక క్రియఁ దగులుట

ఆ.వె. ప్రాతి భావ్యునికి సబంధక భోగ్యముల్
లిఖిత భుక్తి సాక్షి సుభిత యపుర
యప్పుదీసినట్టి యతని సుతుల్ ప్రాత్రు
లాఋణమ్ము దీర్పనమరు శుభము

కం. దేశాంతరపూటలక్రియ
నెంతయు నష్టంబు వరుస నీయఁగఁ దగ దే
శాంతరమైన న్మొదలిఁటి
చెంతన్వసియింప రెట్టిచే నొసఁగఁ దగున్

ఉ. అప్పుడు వాఁడు పూటఁ బడినాతనిఁ జేరి ఋణస్థుఁ జూపుమం
చొప్పఁగ వేడఁ జూపఁదగు నూఱటగా మితి యేర్పఱించి యా
చొప్పునఁ జూపకుండు నెడ సొమ్మొసఁగందగు నప్పు దెచ్చినన్
దప్పు వ్రతస్థుఁడౌ ఋణిని దండ్యునిఁ జేయుట నీతి భర్తకున్

సీ. ఇచ్చిన సొమ్మున కిచ్చుట లది యాది
గడువులేనిదియును గడువుగలద
గోప్య మగోప్యమ్ము గొనకొన నాలుగు
విధములై ధారుణి విస్తరిల్లు
జంగమ స్థావర సంజ్ఞయేడాదికి
నిసుమడికిన్ వడ్డి హెచ్చనేని
మేలి వస్తువుల దక్కోలగు భోగ్యమా
నేని మూలధనంబె యిచ్చుటర్హ

తే.గీ. మిలమహారాజికము దక్కఁ గలుగు నయ్యు
పద్రవంబులు స్వామియే పరిహరింప
వలయు నిర్ణయమెల్లనా వైపు లెక్కఁగ
ధర్మ పద్ధతి నడిపింపఁ దగవు పతికి

వ. తామ్రకటాహాదులగు గోప్య స్థావర వస్తువులును అశ్వాశ్వాదిగోప్య జంగమంబులును నష్టంబైన యెడ నట్టివి సంపాదించి యుత్తమర్ణున కీదగు. కాదేని యధమర్ణుండొడ్డిన క్రయంబైన నీయందగు. పూర్వాధి బలవంతమగు నుత్తరాధులధమంబులగు. గంగాస్నాన ముఖ్య సుకృతాధులైన ద్విగుణ ధనంబిచ్చుట విహితంబు.

సీ. నెరి దాచనిడుటది నిక్షేపమా నాణె
మది వృద్ధి విక్రయాఖ్యానుసరణి
మార్పఱచిన లాభమహిత ధనంబెల్లఁ
బంచీయఁదగు ముద్రపడి కటాహ
ముఖవస్తువులు నష్టమును నొందెనని పల్కు
వరుసలఁ గ్రయ మీయవలయు మోస
మునఁ బోయినఁ బ్రతిభాగము నొసంగుటయు నీతి
రాజిక దైవిక మోజ నిజము

ఆ.వె. లైన ధనికిఁ గలుగదా ధనం బెంతయుఁ
గపటమైనయదియుఁ గలదటన్న
నఖిల ధనము సంగ నగు రాజకీయాప
హృతము మరలనిచ్చుటింగితంబు

కం. అడిగినపుడీయకుండినఁ
గుడిచిన మతికొంత ధనముఁగూడీయఁ దగున్
బుడమిపతి యపుడు దండన
మిడఁదగుఁ గ్రయవృద్ధిశేష మీయఁగ దగుటన్

కం. స్మృతుల నన్యోన్య విరోధ
స్థితిఁ దోఁచిన న్యాయశాస్త్రసిద్ధక్రియలన్
ధృతి ధర్మనిర్ణయముదగుఁ
స్మృతులు సమంబైనయటులఁ జేయఁగ వలయున్

కం. గురుబాలవృద్ధులైనన్
బరికింప బహుశ్రుతైక బాడబులైనన్
ధర నాతతాయులగుచో
సరవిం జంపుమని యర్థశాస్త్రము దెల్పున్

తే.గీ. ధర్మగతి "బ్రాహ్మణోనహంతవ్య" యనెడి
వాక్యమమరుట హితసంగ్రహ వర్తనముల
నదియ బలవంతమగుట నట్లగు నొనర్ప
క్రతు సతీ దేవతాత్మ రక్షలను దక్క

వ. వితతకర్మ విఘాతముల పట్ల వధ యుచితమగు గోబ్రాహ్మణ బాలవృద్ధోన్మత్త స్త్రీ గురుజను లాతతాయులైనను సహింపరాదు. అని మను వచనంబు ప్రతిష్ఠితంబు.

ఆ.వె. కొండెగాఁడు నగ్నిదుండును గరదుండు
శస్త్రపాణి యన్యసతి వధించు
నతఁడు క్షేత్రధనము లపహరించినవాఁడు
నతివ విడుచువాఁడు నాతతాయి

కం. ద్విజుఁడిట్టిఁడైన భూప
వ్రజదండము లేమివలయుఁ బ్రాయశ్చిత్తం
బు జగతిపతియిది దెలియుచు
బ్రజ మతిఁ బాలింప ధర్మపద్ధతి వెలయున్

తే.గీ. ఇల లిఖిత భుక్తి సాక్షులవెల్లవలయు
నడకలకుఁ జీరకము శాసనమ్మునాఁగ
నిరు దెఱంగుల లిఖితముల్ పరగు వరుసఁ
గడఁగి చెప్పుటయును యథాక్రమమునగుచు

సీ. అదియు సాక్ష్య స్పదమైయుండు ద్వారమా
ర్గ క్రియావహము భోగ్యక్రమంబు
లనుభవ సిద్ధంబులమ్ముట లెంచుట
లరయఁ దానిక యెన్నికైన పాటు
పాటుచో లిఖితంబు బలవంతమై యుండు
నిచ్చినందుకు జూడ మేమి యనికి
నైనఁ గూడుండుట కలిసాధనము సాక్షి
పూర్వంబునకు బాధ వారయు నేని

తే.గీ. యుత్తరంబు ఫలంబగు నుర్విభుక్తి
కిర్వదేండ్లు మితంబగు నెల్లద్రివ్య
తతికిఁ బదియేండ్లు వాహసంతతికి నట్లు
వైశ్య శూద్రులు నొనరింప వర్ష మితము

కం. స్త్రీధన పశువాదములన్
బాధకమగు నమితభుక్తి పరగ భుజింపన్
సాధకుఁ డొదవిన నీయమి
బాధకు నర్హుండు చోరుభంగి నతఁడిలన్

కం. అడుగకయుండిన ఫలముల
నిడుమనగా దగదు సొమ్ములిప్పింపఁ దగున్
జడబాల కర్మరుల కొం
డె డకేగినవారికైన నిలవిభుఁడెలమిన్

వ. బంధనంబునకు నిటుల ధర్మ ప్రకారం బెఱింగింపవలయును. ననధికారానుభవం బొనర్చినయతండు దండనంబునంబడి రాజునకపరాధంబిడందగు దరిద్రుఁడైన ధిక్కార దండనంబుల కర్హుండు.

ఆ. వె. కర్ణపాదనేత్ర కరనాసికోపస్థ
ముదర గాత్రజిహ్వలొదవు ధనము
గొనుట దండనములు దనరారు బదియును
దుడుకు సేయ నంగములుడుపవలయు

కం. చెఱఁబెట్టుట పురివెడలం
దఱుముట ధనమెల్లఁ గొనుట తలగొఱుగుటయున్
ధరణీసురులకు దండను
గురుతల్పగు తనువు దునియ గోయుట లొప్పున్

కం. పరికింపఁగ బ్రహ్మఘ్నుని
శిరమున్ ఖండింపవలయు స్తేయుని పదముల్
నఱుకదగు మద్యపాయిన్
గరములు గోయంగవలయుఁ గడు ఘోరముగన్

సీ. పనిలేనిపనికినై యనుభవించినయది
శతవర్షములకైన స్వామిసొమ్ము
దానముల్ త్రివిధముల్ మానసవాచిక
లిఖితములనుభవలీల బలము
నిది బలాబలచింత లెఱిఁగి చెప్పుటలెస్స
యుత్తరసభ మెచ్చ నుచితలీల
జాతివివాద మాజాతివారలఁ గూర్చి
తీర్చుట మేలగు దెలియదేని

తే.గీ. స్త్రీవివాదమునకు రహస్సీమ లెస్స
గురుని శిష్యుఁడు పతిసతి దొరను బంటు
జనకు సుతుఁడు వివాదంబు సల్పెనేని
యణఁచి తెలియంగఁ బల్కుట లర్హ మెచట

కం. వారల కర్తల వలనన్
వారి వివాదముల దీర్పవలయున్ బలికిన్
మీఱి గణ ద్రవ్యముదిను
క్రూరుని ధనమంత రాజు గొనుటర్హముగన్

ఉ. చోరులుగొన్న నోలియిడుచో నెడ పడ్డ ధనంబు స్వామికిన్
భూరమణీశుఁ డట్లు బడి పొల్పుగనిచ్చుచు పాటు నొద్దిగా
వారక తాను పుచ్చుకొని వారికిఁ దక్కిన వీయఁగాఁ దగున్
ధీరత స్వామి లేమియు దదీయకులోద్భవుఁ జెప్ప టొప్పగున్

ఆ.వె. నెమ్మి నవధినైన నిక్షేపమునునైన
ద్విజుడుగన్న పాలు దీయఁదగదు
ధనము కొలఁది పాళ్ల ధరణిపుఁ డీదగు
దనకుఁ దెల్పి నితర జనములకును

కం. ధన నిక్షేపము గొనపతి
వినవొడువక యున్నవాని వెసదండ్యునిఁగా
నొనరించి యాతఁడెత్తిన
ధనమెల్లన్ గొనుట నీతి ధర్మము దలఁపన్

కం. పదపడి వ్యవహారంబులు
పదునైనిమిది యింటి ఋణముఖఁగికి ధర్మం
బదనఁ బదింటికిఁ బరకరు
విదితంబుగ వృద్ధి ధర్మ విధమూహింపన్

ఆ.వె. ఏడులెన్నియైన నిలవృద్ధి తఱచైన
ధనము లినుమడిగను గొనుట నీతి
కుదువ వలయు నమ్మికొదవని యెడల ప
త్రాదులైన వృద్ధి యధికముగను

తే.గీ. మొనయు నారణ్యకులకు సాముద్రికులకు
నొనరఁబడియింటు నైదింటు నొక్కపాలు
గొనుట ధర్మంబు వృద్ధి హెచ్చిన సమయము
నైదుపది పాళ్లు హెచ్చు గొంటదియె నీతి

సీ. ధనము లినుమడియును ధాన్యంబు ముమ్మడి
మఱి వస్త్రములు నాల్గు మణులు నుపల
ఘృతతైల తూలముల్ గీర్తింప నైదుపా
ళ్లెక్కువ గొనఁదగు నేకదేశ
విషయంబునన్ గాలవిస్తృతియైనచో
దూరదేశములైనఁ దొడరు మిగుల
నెనిమిదంతల కంటె హెచ్చైనఁ గొలగాదు
సామజాశ్వములను జామరముల

తే.గీ గములు నట్లె కాని కలుగ దంతకు హెచ్చు
ఋణి దరిద్రుఁడైన వృత్తి కొలఁది
శక్తియరసి ఋణము సరిదీర్చుకోఁదగు
భోగ్య బంధ కాంత పురుష లెందు

వ. దేశకాలనిర్ణయ శక్తాశక్త పరివర్తనములరసి ఋణ పరిచ్ఛేదంబు సేయించుట ధరణిపతికి ధర్మంబు తీర్చువలయుంజెల్లిన వృద్ధి యీగుణాధిక్యముల కొలఁది గూర్చుట యుక్తంబగు నిట్టితెఱంగుల నధిపతియు శమదమ భాగమున కర్హుండు—

ఉ. అప్పులు దీసికొన్న జనులాదట జీవన హాని నందుచో
నప్పులొసంగినట్టి జనులారసి జీవనముల్ ఘటించి యే
చొప్పుననేనియున్ ఋణ విశుద్ధుల జేయుట లెస్స విప్రుఁడీ
యొప్పమి దాన మీవలయు నూర్జిత ధర్మ విచక్షణ క్రియన్

కం. ధనమిడిన వాని నొడివిన
దినుసునఁ జరియింపవలయుఁ దీసికొనిన వాఁ
డొనరఁ గలయపుడు ఋణి ధని
కుని గానమి యడర నిల్వఁగొను వడ్డిదలన్

వ. ఎడగరి గట్టిన దారభ్యము వడ్డి పనిలేదు. అవిభక్తులగు సహోదరులు ఋణంబు కుటుంబరక్షణార్థంబునకైనచో నందఱు గూడ దిద్దవలయు పితాపుత్రులకును పతిసుతుల యవి సతికిని స్త్రీఋణంబు భర్తకునునట్లు విహితంబగు నీయర్థంబులకై యెవ్వరికింబనిలేదు. ఇతర ప్రయయంబనునది ధూర్తవంది కుత్సిత మత్త వైద్య కితవచాటు జారచోరుల కిచ్చుటనిష్ఫలంబులుగావుననిట్టి ప్రియంబులు చేసినయతనికే కాని తదీయులకుఁ దీర్పఁగర్తవ్యంబులేదు.

తే.గీ. దండశుల్కావశేషముల్ దానియటుల
శిష్టశాయమ్ము గక్షణ స్థితులకైన
నప్పుదిద్దఁగ వారల కర్హమరయ
క్షుద్రజాతుల గృహకర్త సుదతిగాన

కం. తదధీనుఁడగుచుఁ బురుషుం
డదనన్ దదృణంబు దీర్ప నర్హుడు సుతుఁడున్
సుదతులు దాసులు ధనఋణ
సదనాఖ్యులు సకల శాస్త్ర సమ్మత వృత్తిన్

చం. సతిపతులొండరుల్ దెలియ సల్పినయప్పులు దీయవారి స
మ్మతముగ దిద్దఁగా వలయు మానిని భర్తృ ఋణంబు దీర్పనో
నతఁడతిదూరగామి మృతుఁడాత్మజ హీనుఁడునైన సాక్షియ
క్తత దగునప్పు దానెఱుఁగఁగా నదియైనను శాస్త్ర సమ్మతిన్

కం. జనకుఁడు నన్నయుఁ జేసిన
ఘన ఋణము సమద్వాదశక కాలం బెల్లన్
జనిన ధనికిఁ బనిలేదను
మనువచనం బట్టిదగుట మహనీయగతిన్

కం. తనయుఁడు పదియాఱేడులు
దనుకా జనకుని ఋణంబు దాలిమి దీర్పన్
బనిలేదుగాన నెఱిగన
వెనుకన్ దదృణమ్ము దీర్ప విహితం బెందున్

వ. బాలుండైనను శ్రాద్ధ కర్తయగుగాని ఋణకర్తగానేరఁడు విభక్తులైన సోదరులు యథాంశంబుల జనకుని ఋణవిముక్తుం జేయాదగు నవిభక్తులైన జ్యేష్ఠునికిఁ గర్తవ్యంబు మృతుల ఋణంబు దీర్చునెడ వృద్ధికినిమిత్తంబులేదు. మూలధనంబు దీర్పవలయు నపుత్రకుండైనఁ దద్ధనంబెవ్వరిపాలౌ దిద్దవలయు పుత్రులులేనియెడ దాయాదులు కర్తలు తదభావంబగునెడ భార్య. అదియును లేనిచోఁ దదీయుండగు దత్త పుత్రుండు కర్తయగు.

కం. పృథివిఁ గుమారులు గలిగియుఁ
బధిరాంధ క్లీబులైన బట్లన్ దాయల్
కథితముగఁ గర్తలగుదురు
బుధవర హృత్తోషణాను పూర్వక వృత్తిన్

సీ. ఇలఁ బునర్భూస్వైరిణులు మూఁడు నాలుగు
తెఱఁగులు వరుసగాఁ దెలియవలయు
క్షత యోనియుఁ గన్యకయు నన్యు గూడిన
యది యాత్మ పతిగల్గ నన్యపురుషుఁ
గలయు నింతియును దాయల నాశ్రయించిన
యదియుఁ బునర్భువు, లాశభర్తఁ
గాదని యొరుఁ బొందు గాంత యౌవనమునఁ
బెఱభూమిఁ దిరిగి క్రమ్మఱఁగ ధవునిఁ

తే.గీ. జేరినది భర్త మృతుఁడైన మీఁది మఱఁదిఁ
బొందునది దూరమునఁ గ్రయంబునకుఁ దెచ్చి
కలయ నిల్లాలివలె నుండుగలికి స్వైరి
ణులు చతుర్విధ లీగతిఁ జెలువలందు

వ. పునర్భూప్రథమయును స్వైరిణులును దీసిన యట్టియప్పులు తదీయ భర్త తీర్చుట తగవగు పరవిధానలైన పెఱయేవురి ఋణమ్ము లామగువలు దత్పరిగ్రహజనులు దిద్దుట లర్థంబులు ఇట్టి ధర్మాధర్మ నిర్ణయంబులు పెద్దలవలనఁ దెలిసి దండనీతి దప్పక న్యాయ శాస్త్రక్రమంబునకుం బరిపాలనంబు సేయ నృపతి యిహపరసుఖంబులు గనునని మునుల కాకథికుండు సాంఖ్య శాస్త్రంబు వినుండని యిట్లనియె.

సీ. ప్రకృతిచేఁ బుట్టిన రాజస సాత్త్విక
తామస గుణములు ధర జనులకు
నొగిఁ బైత్యవాయు కఫోజ్జ్వల లీలలఁ
జెంది సంతతము నింపొందు నుదయ
మారభ్యమవి వరుసనై ప్రబలుచునుండు
రాజస ముద్యోగరాజి సాత్త్వి
కమునందు గృహకృత్యగతులఁ దత్కార్య స
మాచరణము తామసాను వృత్తి

తే.గీ. జాడ్యము సుషుప్తినొనఁగూర్చు సరవి తోడ
నిట్టివై సంతతంబును నెసఁగి యుండుఁ
బ్రాణి కోటుల తనువులఁ బ్రబలి మిగులఁ
బోషణంబును లయమును బూని చేయు

కం. అమరులు సాత్త్విక సాత్త్వికు
లమరఁగ రాజసముగూడ నవనీసురులన్
గ్రమమునఁ దామసయుతస
త్త్వములితరజనంబు గుణవిధంబులఁ దెలియన్

కం. వెలయు రజస్సత్త్వము య
క్షులు రాజసరాజసమ్ము చూడఁగ రక్షః
స్సులు రాజసతమము పిశా
చుల తద్గుణ గౌరవాతిసూచితచర్యన్

కం. తామస సత్త్వము పశువులు
తామస రాజసము వృక్షతతి ధరనెన్నన్
దామసతామస మద్రులు
తామరసప్రభవు సృష్టి తతనిపుణతలన్

ఆ.వె. ఘనతస్థూల సూక్ష్మకారణాఖ్యలఁ బాంచ
భౌతికము మనస్సు పదియు నింద్రి
యములు ప్రాణులైదునట పరమాత్మైక్య
గతుల మూఁడు తనువు లతిశయిల్లు

తే.గీ. ఇవి యవస్థాత్రితయముల కెందునేని
నాస్పదంబుగ వరుసతో నాత్మయైన
విశ్వతైజస ప్రాజ్ఞులన్ విశ్రుతముగ
మెలఁగు పురుషునివలన నుజ్జ్వలత దనరి

తే.గీ. జ్ఞాన కర్మేంద్రియములు పాసంగు పదియు
నందులకు మేటి మది నాలుగై తనర్చు
మనసు బుద్ధియహంకార మొనరఁ జిత్త
మనఁగ ధర్మ ప్రసక్తి నియామకముగను

సీ. అస్థిమాంసత్వక్కు లటునాడులును రోమ
ములు పృథ్వి భాగములలవడంగ
శుక్ల మేదోమూత్ర శోణిత లాలలు
నుదకాంశములు గడునొప్పు మీఱ
సంగమాలస్యతృష్ణాక్షుత్తులును నిద్ర
యగ్నిదేవుని పాళ్లనమరు నెలమిఁ
జలన ధావనకంపములును గుంచాకుంచ
నములు వాయ్వంశము లతిశయముగ

తే.గీ. భయము క్రోధంబు కామ లోభములు మోహ
మంబరాంశము లిర్వదియైదు గూడ
స్థూలదేహంబు తన్మాత్ర లీలలైదు
నైదునగు నింద్రియమ్ముల కాకరముగ

సీ. ఎంతకాలము ముక్తికేగకయుండిన
జనన మరణముల ననుభవించు
నాముక్తికిని దపోధ్యయన సత్యాచార
శమదమధ్యానాదుల మరియుండ
ద్వంద్వంబులను స్థిరత్వము శరీరంబున
యశుచి సమస్త పదార్థములును
నశ్వరంబగును పుణ్యమును బాపంబును
కర్మద్వయము జాడ్య గరిమ యనుచు

తే.గీ. యోగివర్యుండు దలపోయు నల్పమునను
గాన నమ్ముక్తికిని సాధకంబులయిన
గుణములను మెలఁగవలయు దుర్గుణము లేక
మహిని మీఱ నజస్రంబు మానవుండు

కం. ప్రాణాపాన సమాన
వ్యానోదానులు ధనంజయము కృకరము వి
ట్లూనాగదేవదత్తము
లానికఁ గూర్మంబు పదియుఁ బ్రాణానిలముల్

వ. ఇట్టి ప్రాణాది పంచకోశమయదేహస్థులగు నింద్రియధాతు వర్ణరూప దేవగణంబులు.

సీ. పరగ సితాసిత పాటీరవసు హాట
కశ్యామ ధూమ్రాభకలిత రక్త
రుచులష్టది క్పతుల్ యాధి ధర్మధువ
సోమపరానిలుల్ సోరిది ననలు
లరయఁ బ్రత్యూషభాసురు లష్టవసువులు
నంశుపర్జన్య మిత్రార్య మేంద్ర
వరుణ ధాతలు భగవత్త్వష్ట్ర మరుద్విష్ణు
పూషులాదిత్యులు బుద్ధినెంచ

తే.గీ. స్థాణు భువనాధిప కపాలిశంభులును గి
రిశభవ పినాక్యహిర్బుధ్న్య పశుపతులును
బ్రౌఢతా ౽జైకపాద్వీరభద్ర ముఖ్యు
లరయఁగా రుద్రు లేకాదశాహ్వయులును

కం. అనిలస్పర్శన వాయువు
లనువుగ మారుతము శ్వాసనాఖ్య ప్రాణం
బును ప్రాణేశుఁడు-ననఁగాఁ
దనరెడి ధాతుమయ మారుతములున్ మఱియున్

తే.గీ. గరుడ గంధర్వ కిన్నరాప్సరస లమర
సాధ్యచారణ యక్ష రాక్షసులు కింపు
రుషులు విద్యాధరుల్ సిద్ధ ఋషిగణంబు
లుందు రెప్పుడు పిండాండయుక్తి రూఢి

వ. ఇట్టి దేవమయంబైన చతుర్వింశతి తత్త్వంబులకు నవ్వల మెలంగు పరమేశ్వరాంశ భూతుండైన శివునికి సాక్షియుంబరుండును షడ్వింశుఁ డనందగు భగవంతు ననంతు నంతర్ముఖంబున ధారణావశంబునఁ గనుంగొన వలయునని ఋషభకపిల సిద్ధమత సిద్ధంబగు నిట్టి సాంఖ్యంబున నైన యోగంబున నైన నాత్మ దర్శనంబు మోక్షంబగు నట్టి యోగంబు కాలంబెఱింగి సాధింపఁదగు.

కం. దినమొకటెంతయుఁ బింగళ
ననువుగఁ బవనంబునణఁచి యర్కుని నాడిన్
బోనియమి మూఁడేడుల న
య్యినసుతుఁ గనుగొనునటంచు నెఱుఁగఁగవలయున్

కం. ఇనునాడి సూర్పురెన్నా
ళ్లనువైనఁ ద్రివర్షమాయువది మూఁడును నా
ల్గును దినములైన నేడా
ఱని యమునింగాంచునతఁడు దెలియఁగ నెందున్

కం. వనజ హితాహిత నాడుల
నెనయుచు సమువృత్తి వాయు చేక దినము చ
య్యనడిచిన నార్నెల్లకు
జను నాతఁడు రవితనూజు సదనమ్మునకున్

కం. ప్రాణాపాన మరుత్తులు
ఘ్రాణన్ బరిపాటి వెడలి గొనకొని తగన
క్షీణగతి నడచునాతని
ప్రాణము త్రిదినములఁ దనువు బాయున్ బెలుచన్

సీ. కదిసిన యాపోషకాల ఘుస్రంబున
నదరిపాటున నెవ్వఁడభ్రవీథి
ఘనకృష్ణ పింగళాకారు గన్గొనిన రెం
డేండ్లకుఁ గడతేఱు నినునిఁ జంద్రు
మున్నుగఁ జూచి తానున్న నీడను వెన్కఁ
గనుగొని మఱియు నాకాశ పదము
చెలియఁజూచిన చాయ తెలుపైన దీర్ఘాయు
వగు నలుపైన శీఘ్రగతిఁ బొలియు

తే.గీ. మిగులరక్తమైన మెల్పుగఁ బొగవన్నె
యైన దుఃఖ మొదవు హస్తచరణ
హీనమైన నొక్క యేడాయువగు దల
తొలఁగఁ గనిన నాఱు నెలలఁ దెగును

తే.గీ. జఘన హీనమైన సకియల నెడఁ బాయు
నైల్యవారణముల నభమునందుఁ
గనిన మింటి కుమియఁగాఁ బుక్కిటుదకంబు
చాల వన్నెలైన సమయు వేగ

ఉ. కానఁడరుంధతిన్ ధ్రువునిఁ గానఁడు మూఁడు తెఱంగులన్ దివిన్
గానఁడు మాతృకావసతిఁ గానఁడు వాఁడొకయేట సోలుటో
మానక జిహ్వాముక్కు బొమ మధ్యము కన్నులివెల్లనున్ గ్రమం
బానఁ గడంగ శుష్కముల నంతకుఁ జేరును నాఱు నెల్లలో

సీ. కర వక్త్ర తాల్వోష్ఠకంఠదంతమ్ములు
నెండెనేనియు నల్పు నెఱుపు మొదలు
వర్ణమ్ములామ్లాది వర్జితరసములు
నొగి నన్య భావంబులొందవే నేని
పవలు నక్షత్రముల్ పను పట్టెనేనిఁ జేఁ
కటి నింద్రచాపంబు గాంచెనేని
చాపంబు శితకరచయము నీక్షింప నూ
సరవెల్లి యొడవెల్ల సరవిఁ బ్రాక

ఆ.వె. నాఱునెలలకు నంతకునూరు జేరు
దర్పణంబుల వీక్షింపఁ దల గనమిని
నొక్క నెలలోన నీల్గుట నిక్కమరయ.
... ... ... ...

కం. ఆ నీడయొ నలి పైనన్
మానక మూణ్ణెల్ల కెంపు మాడ్కి నొదవినన్
బూనిక నాల్నెల్లను రవి
సూనుని పురి గృహచయంబు చూచుం బెలుచన్.

కం. పున్నమయందు నహూవా
స్యన్నలిన... . నేకచక్షువునఁ గనన్.
గ్రన్ననఁ బెను వ్రేలికి మిగి
లున్నన్ షణ్మాసములకు నూర్ధ్వగతుఁడగున్.

కం. ఘృతమున జలమున నీడలు
ధృతిఁ బూర్ణత మాని మొరప లేటఁబడినచో
నతఁడాఱు నెలలఁబోలియున్
క్షితి వక్త్రచ్ఛిద్ర మొదవఁ జేకుఱు నటులన్.

సీ. ఒకనిమిత్తములేక యొడలుఱిమిన గఁడు
వలమైన బడుగైన వాడెనేని
నాదటు సురతాంతమపుడు ఘంటానాద
మాలకించినయట్టులైన నడును
నందురజంబున నడుగిడు నెడ తెగి
కనుపింపఁ జందురుగతి నినుండు
దోఁచిన గుండె తెంతో పగిలినయట్టు
లైన గ్రా............ యదిరిపడినఁ

తే.గీ. దృష్టినొందియు నాఁకలిదీఱకున్న
శ్రుతిపుటంబుల నంగుళుల్ జొనుప నబ్ధి
ఘ్రోఁతగతి లేమిఁ గ్రుంకిడఁ జేత నంఘ్రిఁ
దొడల రొమ్మున జలమింక నుడుగువేగ.

తే.గీ. కనఁగ, సంకర్షణజ్యోతి కనకరుచిని,
గానరాకున్న వలపటికంటి నీరు
నెపుడు గారిన మోమున నెఱుపుగదుర
యొరులకన్పాపఁ బ్రతి గానకున్నఁబోలియు.

చం. శిరమొగిజాఱ బొడ్డుబుకఁ జెన్ను లరన్ జలమజ్జనంబుచో
సరసిజపత్రవృత్తికణసంతతి యంటుకయున్న దంతపం
క్తి రుచి దొఱంగి కందొరయ తేకువ లేకెదలో శ్రమంబు వేఁ
బొరసిన, మేనిపై తెలివి పోయినవారికిఁ గీఁడుశీఘ్రతన్.

కం. మానసము నెగులుపుట్టిన
వీనుల నేశబ్దములును వినరామిన్ జా
పానక వికృతంబైనన్
బూనిక మైనీడ కదలఁ బొలియున్వేగన్.

కం. నెరయ భ్రమన్ గంధర్వన
గరము గనినఁగల నులూకక్షరసూకరకా
సరకృద్ధోష్ట్రిసృగాలక
హరిదర్శనమైనఁబొలియు నాతఁడు వేగన్.

తే.గీ. నుదుటఁజెయిచేర్చి కరదండమదనఁ జూడ
సన్నమైనను వర్ధిష్ణు చాల స్థూల
మగుచుఁ గనుపింపఁ దలలేమొడగుచు నీడ
కానమైనను మూణ్ణెల్లఁగాలుజేరు.

తే.గీ. దండపాణులఁగలఁగన్నఁదైలపిహిత
గాత్రులనుజూడఁ దానట్లు కా వసింప
తేరుపై కొండలను మేడ [తెగువ?] పొడవు
చోట నుండంగఁ గలగనఁ జేటులాదవు.

కం. మఱియును బెక్కునిమిత్తము
లరయఁగఁగీఁడులకు గల్గు నదికలఁగనినన్
గరమిట్టివిలక్షణముల
గుఱుతెఱుఁగుచు మేనిమమత గూడకబుద్ధిన్.

కం. ధీకలితవృత్తిఁగర్మవి
పాకంబొనరించికొనుచుఁ బ్రాకటతత్త్వ
శ్రీకల్మి నాత్మయోగవి
భాకమనీయత మెలంగఁదా ముక్తుఁడగున్.

ఆ.వె. పుణ్యతీర్థసేవ పుణ్యపురావాస
మైన యోగరీతినైన సుకృతి,
మహితపదవికిన్ గ్రమక్రమంబునఁ జేరఁ
దలఁచు వలయు దనువు గలఘలమున.

కం. ఆత్మజ్ఞానము లేక
ధ్యాత్మల సద్బ్రహ్మపదము నంద ననిత్యా
త్మాత్మీయత మెఱఁగు నస
త్యాతులకున్ వశమె ఘననియమికిన్ దక్కన్.

వ. కావున సాంఖ్య లిలాపింగళా హఠాది రాజయోగాత్మకంబగు రాజయోగంబు నం దవులపలయుఁ దత్క్రమం బెఱిఁగించెద.

సీ. యమనియమాసనక్రమము ప్రాణాయామ
మెలమిఁ బ్రత్యాహారకలన, ధ్యాన
ధారణలు సమాధి వారక యష్టాంగ
యోగమౌ యమనియమోపరహిత
మైన షడంగమౌ నట్టి యోగస్థితి
యొప్పగు నష్టాంగయుక్తిఁ దనరు
యమ మది నైజ కర్మాచార నిరతియౌ
నియమంబు సద్వ్రతనిష్ఠ నెలయు

తే.గీ. నాసనంబుల భేదంబు లలరు పెక్కు
పద్మకుక్కుట మాయూరి భద్రకూర్మ
మత్స్య ముఖవీరసిద్ధ విమల నిరోధ
చాపగోముఖరౌద్రోగ్రసంజ్ఞ లమర.

కం. దిట్టగ సిద్ధాసనమున
గట్టిగ గుహ్యమునఁగాల్గ గదియించి కడు
న్నెట్టుగ భ్రూమధ్యస్థితిఁ
బట్టుగ చూపమరు సిద్ధపటిమ దనర్చన్.

తే.గీ. అట్టి సిద్ధాసనమ్మున నైన మఱియుఁ
దనకొనరిన యాసనస్థత దృఢముగ
నిలిచి హృదయంబు మిగుల నిశ్చలముగాఁగ
నిరత మంతర్ముఖత్వంబు నెరయు వరుస.

ఉ. దంతము లొక్కటొక్కటిని దాఁకఁగనీయక మౌనవృత్తితో
సంతసమొందు వేళ జనసంఘము చేరనిచోట నొంటిగా
నెంతయు దేవతాగృహ వనేషితరమ్యతలంబులన్ మదిన్
జింతదొలంగఁగాఁ బ్రణవసేవకుఁ జొచ్చుట యుక్తమెన్నఁగన్.

ఆ. వె. అదియు మూఁడు తెఱఁగులగు ప్రాకృతంబు వై
కృతమునాఁగ మఱియుఁ గేవలాఖ్య
కంబు ననఁగ లోనఁగల్గు ప్రాణాపాన
ములను నాత్మదిరుగు వెలికి లోన.

ఆ. వె. ప్రాణుఁడయ్యపానుఁడవన నధోర్ధ్వగ
క్రమ హకారమున సకారమునను
దివియ జీవుఁడడరు పవనచాలనదీప
భాతి స్థిరత మాను రీతి నచట

సీ. తనకు నయ్యక్షరద్వయిసందు బిందువు
జనియించు వలన హంసయన శబ్ద
గతి దివారాత్రులొక్కటి నిలుకడలేక
వేగ నిర్వదియొక్క వేయు నాఱు
నూఱుమాఱుల దొక్క వారంబుగా నిట్టు
లైన ప్రాణాయామ మాని స్థిరత
గావింపఁగా స్వప్రకాశుఁ డౌనటులొన
రించుటచేఁగాదె ఋషులు సురలు

తే.గీ. ప్రబలి చిరకాల జీవులై పాతకములు
బాసి కర్మంబు లెడలైన భవ్యపదవు
లను మెలంగుదు రంతకంటెను దపంబు
గలదె! పరికింప మూఁడులోకములయందు.

కం. అజపాగతి పంచాశ
ద్వ్యజనాక్షరయుక్తి నొడువఁ బ్రాకృతమయ్యెన్
వృజినాపహమగు ప్రాకృతు
ల జపింపన్ వైకృతంబు లలితంబయ్యెన్.

కం. పూరకసంఖ్యకు నినుమడి
నారూఢిని గుంభకంబునందును సగముం
గా, రేచక మొనరింపఁగ
సారత వైకృతమనాఁగఁ జను బ్రణవ మిలన్.

కం. ఇడ చంద్రనాడి దాన
న్వాడిఁబూరింపుచును భానువరనాడి తగ
న్విడుచుచు సుషుమ్నలోపల
నిడినందగు పవనసిద్ధి యింతయును వినన్.

మ. ఇవి రెండుఁ విడనాడి యేకగతిగా నివ్వాయుయుగ్మంబు చే
ర్చి వెసంగా మణిపూరకంబుదిగువన్ జెల్వొందు వైశ్వానరున్
రవణన్ బ్రజ్వలితంబు జేసి యట చేర్పన్ గుండలిన్ లేపి యం
దవలంబించి త్రికూటమౌ హృదయసీమారూఢి నింపొందుచున్.

క. లీవిగ నత్తటి పశ్చిమ
మౌ వరనాడీపథమున నభ్రముఁ జేర్పన్
గేవల కుంభకమగు నది
పావనతన్ రాజయోగ పటిమ దనర్చున్.

కం. ఇది ప్రాణాయామము వెలిఁ
బొదలెడి యంగములు కూర్మమందనలోనే
యొదుగుగతి నింద్రియములన్
బదనగు నెడఁ గుదురుచేయఁ బ్రత్యాహరమౌ.

ఉ. పూని యుపాసనాఫలవిభుండగు నప్పరమాత్మ నెప్పుడున్
మానససీమఁ జేర్చి యసమానమతిన్ దదధీనమౌటఁ యే
ధ్యానము తద్విభాద్యుఁ బ్రథితంబుగ నిట్టులు జేరనీక డెం
దానఁ గుదుర్కొనంజలుప ధారణ నానుతికెక్కు నెక్కువన్.

తే.గీ. జ్ఞానమయుండును వైరాగ్యమానఘనియు
నిష్ప్రపంచకుఁ డాద్యుండు నిర్మలుండు
నైనఁ దద్దర్శనమున నప్రాకృతమతి
వెలయు నదియొసమాధి నా వినుతికెక్కు.

ఉ. ఇట్టి మహానుహత్త్వమున కెల్లను మూలము వాయుధార్య మ
ప్పట్టున వేగురించి తడఁబాటున రోమములన్ వెలార్చినన్
నెట్టగు కుష్ఠముఖ్య జననిందితరోగము లట్లుగావునన్
గట్టిగఁ బ్రొత్తయెన్నువలెగా నలవాటొనరింప మేలగున్.

క. ఆవరణము నిర్మలకును
భావన మేకాంతవృత్తి పవనరహితమున్
గా వెలయుచోటుదగు యో
గా వహచిత్తులకు నెపుడు నభ్యాస దశన్.

సీ. ఆత్మ జీవాత్మస్థుఁడగు నాత్మనీక్షింప
నాతఁడె తలఁచుఁగ నాత్మవిదుఁడు
మది నంతరాత్మసమ్మతిఁ గూర్చువలనఁ బ్రా
ణాపానములను దఘాత్మ గూర్చు

వలన నింద్రియముల నలరఁ గూర్చుటవల్ల
మది నాత్మనొనఁగూర్చు మహిమవలన
యోగాఖ్య విలసిల్లె నొదవు బాహ్యేంద్రియ
మంతర్ముఖము జేసి యదియె మనసు

తే.గీ. దవుల నొనరించి దాన క్షేత్రజ్ఞునెఱిఁగి
యతనివలనను నంతస్థమైన యాత్మ
దర్శనము ఘన మన్య శాస్త్రములు గ్రంథ
విస్తరంబులు గడు నప్రశస్తములును
గురుని దయ ముక్తిదంబది కరము వేడ్క.

కం. గాలికి జలములు కదలిన
పోలికఁ బ్రాణానిలములఁ బోరి జీవుండున్
జాలనుఁడగు దత్పరతకు
గాలి పవనమును నిలుపఁగా దగు ఘనతన్.

సీ. అంఘ్రి లకారయుక్త్యనిలు నిల్పుట నజు
సరవిఁగాంచిన భూమిజయము గల్గు
శ్వాసనుఁ బకారోక్తి జానువులను నిల్పి
శార్ఙ్గిఁ గన్గొన వారిజయము గల్గు
రేఫతో నాభి నర్తిలి గాలి నిల్పి యం
దళవుఁజూడ లభించునగ్నిజయము
కన్బొమ మొదల యకారోక్తి మాహేశు
నటుఁ గన వాయుజయంబు గల్గు

తే.గీ. నవల భ్రూమధ్య నిటలంబునందుఁ బవన
జితి హకారంబుచే సదాశివ నిరీక్షఁ
జైన సుజ్ఞానముక్తుఁడౌ నతనికరుణ
గణనఁజెల్వగు పంచధారణలు నిట్లు.

ఆ.వె. పదవు నైష్ఠికమున యోగమ్ము సిద్ధించు
తన్నుదానె తెలియు దానఁజేసి
భ్రమరకీటసరణి భావనచే బ్రహ్మ
మహితచిత్తశుద్ధి మహిమఁబొసఁగు.

సీ. తనరెడుయోగరంధ్రమున హృత్పూత్రమ్ము
గీల్కొల్పు టరిది తత్కృతము వలనc
గనc గుమారస్త్రీసుఖంబులకై వడి
జ్యోతిర్మయస్థానశుద్ధిః బొసcగి
యస్ఖలితంబగునానందమునcగూడి
చిత్తదర్పణమున శివుc బరేశు,
సూత్మ్మc గాంచుటలొప్పు చూపట్టుcడితర క
ర్మముల యోగవిహీనుcడమలు నభవుc
తే.గీ. గానలేcడంధుcడల శశికాంతిc దెలియ
లేనికై వడి, దారువుల్ పూని త్రచ్చి
యగ్నిcగనురీతి మదినీవు నరయవలయు
లలితమతులైన సుజ్ఞానులకుcదలంప.

సీ. అందులకాధారమునcగ స్వాధిష్ఠాన
కంబును మణిపూరకము ననాహ
తము నాజ్ఞయును విశుద్ధము రతిమేరుశి
ఖరమును బ్రహ్మచక్రము శిఖాఖ్య
మీ తొమ్మిదింటిలో నీశ్వరావాసంబు
తన్మాత్రలకు నెల్లcదావలంబు
బహురంధ్రమును శశిభానువహ్నియుతంబు
సగుణనిర్గుణము హంసమున కిరవు
తే.గీ. ఘనత గనత్రయాధారకమును నాద
బిందుకళలకు నునికియుcబేర్మి నిర్మ
లమును క్షేత్రంబు ననcదగు దమని దామ
ని శమని స్తంభనియుc బావనియు ననంగ.

కం. విదగుపేరులcబ్రాణము
లైమరcబొరియుంచు దేహమంతయుc దామై
యాదియు గాసిద్ధుల కవి
యాదట జ్ఞానమయుమైన యాత్మకునెలవై
ఆ.వె. జలమునుప్పుగలసి సోమరసంబన
నమరురీతి మనసు నాత్మగూడు
టది సమాధి యైక్యతానందసంపత్తి
కదియె తుద మహాత్ములరయ నెడల

ఆ.వె. యమము తెల్పెడగు నియమము చిత్తమునిల్పు
నాసనములు బలడ మఘహరణము
ప్రణవవృత్తి శుద్ధి ప్రత్యాహరము ధ్యాన
మాత్మజయము ధారణాత్మఁజూపు.

కం. వినుఁడు సమాధియె మోక్షం
బనఘుంబు తురీయ మదియుహఠరాజములన్
ఘనసంజ్ఞ కదియె యర్థము
జను నున్మనియనఁగ నదియె సత్యంబగుచున్.

ఆ.వె. అది మనోలయంబు నజ్ఞానరహితము
ధారణమగు వాయుధారణంబె
మూఁడుబంధనములు ముద్రలు మూఁడునై
కలవు సాధనప్రకాశమగుచు.

కం. ఆసన భేదమ్ములచే
భాసితమగు పవను నెచట పరగ నిలుపుటల్
వాసిగ ధారణయనఁదగు
నా సంజ్ఞలుగలవు పెక్కు లవయవములలోఁ.

సీ. సరవి మూలోడ్యాణజాలంధరములను
బంధత్రయంబందుఁబవను నూర్ధ్వ
గతిని నాకుంచన క్రమమునఁ దివియంగ
మడమచే యోనిసమస్థలమున
నానుట మూలబంధాఖ్యమౌ నాభికి
నెగువను దిగువ నిల్పఁగల వాయు
వదియె యోడ్యాణ మయ్యనిలుని హృదయ చు
బుకములు బంధించి పాసఁగ జిహ్వ

తే.గీ. పైకెని గిడించి యట సుధాపాన మొదవ
బంధురస్థితిఁజేయ జాలంధరమగు
ననిమిషత్వమ్ము లోన లక్ష్యమ్ము బహిని
దృష్టియుంచుట ముద్రగాఁ దెలియ వలయు.

చం॥ అది యట నూర్ధ్వదృష్టియగు నప్పుడు నంబరముద్రనాఁగ నా
ష్ఠిదమగు ఖేచరీ యనఁగ నట్టిద యల్లన నల్లనేత్ర మ
గ్రదశను దృష్టి నిల్పుట కరంబగు ముద్ర పొసంగు దృష్టిసం
పద సమమైనచో నమరు పావనమైన మహాఖ్యముద్రమై

సీ॥ పవను నపానైకపథమున నరికట్టి
మూలబంధము తగులీల నాత్మ
నల మహాఖగము నొయ్యన నిల్పుటకునునో
డ్యాణ బంధమ్ము చయ్యనఁ బొసంగు
జాలధారణకుఁ గా జాలంధరంబొప్పు
పరమాత్మఁ గనుటకుఁ బరమ ముద్ర
యాత్మశోభనకు సూర్యాంబునాడులఁ గార్ప
రస మిపుర మహాఖ్య పొసఁగు జిహ్వ

తే.గీ. పైకి నిగిడించి యంచిత బ్రహ్మరంధ్ర
మాని యచటి సుధాంశు నందమృత మాను
టకు మహాబల ముద్రయే ప్రకట మగును
బంధములు ముద్రలిట్లగు పవను నిలుప॥

తే.గీ. వ్యాహృతుల మున్నుగాఁ బ్రణవములు దనర
నమరు గాయత్రి శిరసులో నందుఁ గూర్చి
మూఁడు మాఱులు జపియింపఁ బోడిమలర
నదియుఁ బ్రాణానిలాయామ మనఁగ మెఱయు॥

క. ఇడ పదియాఱిఁట పూరక
మడరఁగ నరువదియు నాల్గు నట కుంభకముల్
వడి ద్వాత్రింశ ద్రేచక
మిడపని ప్రణవములఁ జేయుటిది యటులయ్యెన్॥

మ. తను ప్రాణానిలరావముల్ దలఁప నాదంబయ్యె హృచ్చిత్త బు
ద్ధ్యను సంయోగము బిందునామమగు క్షేత్రజ్ఞైకచైతన్య జీ
వనిరూఢాఖ్య కళాభిధానమగు తేపల్ మీఱ నిమ్మాడ్కి గూ
డినచో నున్నని రాజయోగమగు ప్రౌఢిన్ సత్యమాధ్యాకృతిన్।

క. పరమాత్మకు నెలవగునది
పరికింపఁగ నిట్టి యోగపటిమ దనర్పన్
జిరకాల జీవియును జ
న్నిరతానందుండు నగుచు నెగడు నరుఁడిలన్॥

క. ఇడిపింగళలు సుషుమ్నయు
నడిఁగూడుటవలన భానువహ్నీంద్రులటన్
బొడరువలన నుభయపవను
లడరి ఖగాత్మతఁ ద్రిమూటమనఁగా జెల్లున్ "

తే.గీ. అది చతుష్పథకంబు శృంగాటకంబు
ననఁగఁ దగు కర్ణ నాసికా జనిత రంధ్ర
ములును నాలుగు కలియుట వలనఁజేసి
యది త్రివేణియుతంబన నతిశయిల్లు

క. ఇడ పింగళలును గుండలి
వడి గంగాయమునలనఁగ వాణియు ననఁగా
నడరియవి కలయు వలనది
జడరహితత నా త్రివేణి సంజ్ఞంజెల్లున్॥

సీ. రహి సమాధికిఁ బేళ్లు రాజయోగంబు ను
న్మని యమరోగంబు తనరు తత్త్వ
మును మనోన్మని లయంబును బరంపద మమ
నస్కము ద్వైతశూన్యమును శూన్య
మును నిరాలంబనమును నిరంజనమును
సహజ జీవన్ముక్తి సంజ్ఞ లమరి
తుర్యంబునన్ జెల్లు ధ్రువ బుద్ధి నస్తి భా
తి ప్రియ రూపకముల్ దెలియ నామ

తే.గీ. కలన బ్రహ్మాంశములు నైదు గలవు గాన
నాద్య శబ్దత్రయంబు బ్రహ్మమగు తుదివి
రెండును జగంబులగు నిట్టి రీతు లెఱిఁగి
యాత్మచింతన సేయ సౌఖ్యంబుగల్గు॥

క. విడుచుట కొన్నియు సేయఁగ
నడరుట లోకకొన్ని గ్రాహ్యమని కొన్నియు నాఁ
బడమింగలదే బ్రహ్మం
బెడయకనన్నియును నగుచు నెయ్యెడ నమరున్॥

క. యోగరతుఁడు బహుచర్యల
రాగియుఁ గృద్ధుండునున్ విరాగిజడుఁడు నా
భాగుఁగ కర్మవశంబుల
చేఁ గడఁగుట దోషమెద్ది చింతింపంగన్॥

సీ. వినుఁ డసంప్రజ్ఞాత మనఁగ సంప్రజ్ఞాత
మును సవికల్పంబు దనరు నిర్వి
కల్పంబనఁగ నందుఁగడగి మనోవృత్తు
లనయంబు లోపల నాఁచి యాత్మ

యందు లీనంబైన యది యసంప్రజ్ఞాత
మగు నేను బ్రహ్మంబు ననెడి మనసు
పరగ సంప్రజ్ఞాతపటిమ నొప్పగు మనో
గత కామములకు నిల్కడగు చేత

తే.గీ. నంబె సాక్షిత్వ మాత్రంబె నాఁదగు నవి
కల్పగతి స్వానుభూతి నెక్కడివి గనక
ఘనతఁదద్వి్సకలితమై యొనర నిలుపఁ
గల్పమనెడి సమాధి నా గణనవనరు॥

వ. సూర్యభేదనోజ్జాయి సీత్కార శీతల భస్త్రికా భ్రమరీ మూర్ఛా కేవలాఖ్యలఁ గుంభకము లెనిమిదియు, మహాముద్ర మహాబంధ ఖేచర, ఓడ్యాణ, మూలబంధ, జాలంధర కరణ, విపరీత, వజ్రోళి శక్తిచాలనములను ముద్రలు పదియును, ధౌతి వస్తి, పరేక, త్రాటన కాళిక, కపాల, భాతులనెడి కరణషట్కంబును నేతత్సాధకంబులు గావున-

మత్తకోకిల. ఏ విధంబుననైన యోగి రహిఁ భవంబులు గాపఁబోఁ
బోవ నిశ్చల సాంఖ్యమొందుట భూరి వైభవహేతువౌ
పావనంబగు దేహమెత్తిన భాగ్య మూరక రోగ సం
భావితస్థితి బోవవీడకపట్టు గట్టుగటొప్పగుఁ

సీ. మేథతోముక్తికి సాధనంబగు మేను
దేశకాలగుణానుధృతు లెఱింగి
యోగి యాత్మజ్ఞాన మొదవ మెలంగక
మదవృత్తి ననియమాస్పదత కొలఁది
కి మిగుల నన్నపానములు గొన్నను వాత
పైత్యముల్ శ్లేష్మంబు ప్రబలమగును
వాతమెచ్చిన మేని వడిఁ గుదియఁగఁ జేయు
పైత్యంబు కృశమును భ్రమ యొనర్చు

ఆ.వె. శ్లేష్మమే [మేచ?] ముక్కుశౌవు లడ్డగించు ని
ట్లైన నుల్బణములు ప్రాణవాయు
పంచకముల నెలవు బాపి [జీవుని?] మెయి
నుండ నీక లివిచి యుదర దర్ధము

క. కర్మేంద్రియములు దమతమ
ధర్మమును వహించుఁగాని తడవఁగఁగలదే
యగ్మలి జేతోగతులవి
మర్మిత నింద్రియముల కడమఱఁగి మెలంగుక్

వ. అట్టి యింద్రియంబుల మనస్సున, మదిని బుద్ధియగు నటులది యహంకారంబు గా నదియు జ్ఞానంబుగా నొకటించుకొనిన యాపోజ్యోతివిధంబున బహిరబహిఃప్రకాశంబై సకలమయమగు బ్రహ్మస్వరూపంబెఱుంగగాను నందునం గలయూనది సమాధి. యిట్టి యోగంబునకు ననేక మార్గంబులు గల వందొకఁటినైనఁ గ్రమక్రమ ప్రాప్యంబగు, నింక మీమాంసాద్వయంబు వివరింతునని సూతుండిట్లనియె—

సీ. పూర్వమీమాంస యొప్పు ద్వివిధము యి దాన
వఱలు సేశ్వర నిరీశ్వరములనఁగ
వ్యాసజైమిని మునుల్ చేసిన సూత్రాను
సంగతి ధర్మవిస్తార ఫణితి
వ్యాస సూత్రముల బ్రహ్మ ప్రతిపాద్యమై
యుత్తరమీమాంస యొప్పునందు
భేద మభేదంబు పేర్మి భేదాభేద
మగు నర్థమట్టి శాబ్దాళి నమరు

తే.గీ. పూర్వపక్షంబు సిద్ధాంతమును బొసంగ,
నట్టి రాద్ధాంత మర్మంబు లరయ బ్రహ్మ
మొక్కటియ పెక్కు రూపము లమరఁదనరు
నమిత శబ్దమయంబఖిలాత్మ యగుట ॥

వ. కావున బ్రహ్మ ప్రతిపాద్యంబగు నుత్తర మీమాంసార్థంబునకుఁ గా వసిష్ఠ శ్రీరామ సంవాదంబు గలదు తద్విధం బెఱింగించెద, రామభద్రుం డడుగ వసిష్ఠముని యవస్థాత్రయక్రమంబనం దెలియ నిట్లనియె—

సీ. రహి స్థూలసూక్ష్మ కారణ దేహముల యంద
హంకారములు మాని యత్రుపంబు
స్థూలంబు దుఃఖంబు సూక్ష్మంబు జడము కా
రణమనిన . . . వారలకు దృశ్య
మగు ప్రపంచ మభావమగు నంత సత్తు చి
దానందములు నిత్య మగుట దృఢము
గాఁ, గలమతియె జాగ్రదవస్థలో నిజా
గ్రంబని యంత్రము సుజ్ఞాన లిదియె

ఆ.వె. తత్పదార్థదర్శితము సచ్చిదానంద
మునసై పుట్టి పెరిగి పొలియు సకల
మదియె నిత్య మనుట లగును జాగ్రత్స్వప్న
మదియు సత్పదార్థ మగుచు మెరయ॥

తే.గీ. అంబు పరిపూర్ణరీతి చిదభ్రమగుచు
నుండటయె కాని వేఱె యొండొదవదనెడి
యెఱుక గల్గియు విషయములింద్రియములు
నిద్రఁజెందుట జాగ్రపు నిద్రయండ్రు ॥

వ. ఇది యసిపదార్థదర్శనబీ త్రివిధంబు తత్త్వంబు మఱియు—

ఉ. జీవుఁడ నౌనొ కానొ! యనుచింత దొలంగి యెఱుంగలేని యా
భావముచే ననేకముగఁ బాటిలు జన్మము లొంది యిప్పుడా
దేవు ననుగ్రహంబున మదిం దిరమయ్యె గురూపదిష్టమం
చీవిభవంబు మోక్షమును నెన్నమి స్వప్నములోని జాగ్రతల్ ॥

వ. ఇది కారణోపాధి దొలంగ నిష్ఠయౌనందగు—

సీ. జీవాత్మ హేతుసుస్థితిని మూలాధార
మటు గురుకృపవల్ల నడఁగు పిదప
గనునది యతనికిఁ గనుపించునది త్రిపు
టాదిగా నొక్కటియైన లేద
టంచు నెఱుంగుట లది నిశ్చయ జ్ఞాన
మది స్వప్నమున స్వప్న మనిరి బుధులు
ధృతిఁ గారణోపాధి త్రిపుటి, దీఱని నిష్ఠ
యిది నిశ్చలపుబుద్ధి నెసఁగమోక్ష

తే.గీ. శోభ గురుబోధనంబుల చొప్పుదెలియ
వచ్చుటయె తత్పదార్థమున్ వరదృఢమది
స్వప్నమంనను సుషుప్తినా జరగు నిదియె
సతి గద రమేశదర్శనానుభవనిష్ఠ ॥

క. అంతః కరణ చతుష్టయ
మంతయు నటులుండ నింద్రియాధిక్య ప్ర
శాంతచిదానందిదె
యింతయు సుప్తిదగు జాగ్రదితహితయుక్తిన్

క. పొందుగ సత్యజ్ఞానా
నందాకృతి యనుభవంబు నాఁదగు నిది యా
చందము వలనం గాంచుచు
నందవు సంతసముదొఱక దళుకొని ? మఱియున్

ఆ.వె. గాలిలేనిచోటఁగదలని దీపంబు
పగిదిఁ జిత్స్వభానుభవము లయము
పొందు సమయ మంద మొంద సుప్తి స్వప్న
మదియె ముక్త్స్వరూపకానుభవము

ఉ. పూనికతోడ నిట్టులగు బుద్ధి విమర్శన భావనాగతిన్
మానక వృద్ధిఁజెందు మతి మాటికి నన్య మెఱుంగఁబోక బ్ర
హ్మానుభవంబు పూర్ణగతి నైనది సుప్తిని సుప్తియయ్యె యి
ట్లా నగ నిర్వికల్పపు సమాధి యగున్ బరమంబు గావునన్

తే.గీ. శ్రవణ మనన నిదిధ్యాస చర్యలఁదగు
నిట్టి తొమ్మిది విధముల నెన్న వరుస
మూఁడు గుణముల తెఱఁగు రామునకు నావ
సిష్ఠమౌనీంద్రుఁ డెఱిఁగించె నిష్ఠవెలయ ॥

వ. ఇట్టి బ్రహ్మస్వరూపంబునకుఁగా వరుణ భృగుసంవాదా దీతి హాసంబులు మున్న యెఱింగించితి నట్టి యానందమయంబును నఖండంబును నఖిలపూర్ణంబును నగుటం జేసి ఘటాకాశ మఠాకాశ చిదాకాశముల వలన పరమవ్యోమ ఖ్యాతంబగుటం దెలియందగు దేహంబులు గుహయనందగు నందు నిహితంబగుట ఘటమఠాకాశక్రమంబునఁ దత్తద్భిన్నములగు నెడనెప్పటి యట్ల నఖండగతిన్ బూర్ణత్వంబునం దగు హృదయ కమల మధ్యంబున దీపక్రమంబున వేదాంతసారంబగు నయ్యానందరూపంబు వర్తించుచు వెలువలనంతయుఁ దానెయగు నాహోజ్యోతి చందంబున వెలుపలనుండియు నీవారశూకవత్తన్వ్యణు రూపంబునఁ దద్దీపశిఖయందుఁ దేజరిల్లు నద్దివ్యతేజంబును బహింగల మహావ్యోమవత్ప్రకాశమును నేకీభావం బొనర్చిన యోగి సమాధి నిష్ఠుండొంటి నివృత్తి మార్గంబునఁ జన సులభదర్శనంబైన యట్టి బ్రహ్మంబె తానగు మఱియును—

తే.గీ. నిర్మమత్వంబు నిస్సంగనిరతి నాత్మ
దృష్టిఁగన్గొనఁ జేయఁగఁ దేజరిల్లు
నప్రయోజన కార్యము లభిలషించి
కష్టపడు దుర్మతులకు సౌఖ్యంబు గలదె.

తే.గీ. వ్యావహారికు జాగ్రదవస్థ ప్రాతి
భాసకుని స్వప్నమును నిద్ర పారమార్థి
కుని నిరూపించు మాయకు నొనరు నావ
రణము విక్షేప శక్తియు గణన రెండు

క. మెలఁకువ నప్పరమాత్ముని
నలవడఁ గప్పుకొనియుండు టావరణమగున్
జెలఁగు చరాచర సంతతి
వెలయం గనుపించుటదియ విక్షేప మగున్ ॥

సీ. పరగ రజ్జువున సర్ప భ్రాంతి శుక్తిని
రజతంబు తోఁచువిభ్రాంతి రీతి
బ్రహ్మంబునందు నేర్పడ జగంబులు గను
పింప సన్మతి వివేకింప బ్రహ్మ
మమరు సత్యాత్మకమగుచు నాత్మధ్యాన
నిష్ఠులు దక్క వర్ణింపఁ గర్మ
పరులు గానరు వెలుపలఁ గాలమయుఁడు లో
పల నణువైయుండు లలిత యోగ

ఆ.వె. యుక్తి నిర్వికారు నురుతేజు గనఁదగు
ప్రకృతి నెడసి శుద్ధ భావులగుచు
నామరూపములకు నాశనమగుట న
వ్యక్తు సత్యుఁ గనుటలది శుభంబు ॥

కం. ఉత్తమము తత్త్వ చింతన
మత్తుక జపచింత మధ్యమాకృతి యధమం
బెత్తఱిని శాస్త్రచింత మ
హాత్తర నింద్యమ్ము లౌక్యమగు చింత తగన్ ॥

కం. ధరణీసురులకు నగ్ని ని
విరయోగులకెల్ల నాత్మవహ్ని ప్రతిమ ల
స్థిరతాల్పబుద్ధులకు నే
ర్పరులగు సమదర్శనులకుఁ బరుఁ డెందమగున్

ఆ.వె. దేహబుద్ధిఁ జూడ దేవుని దాసుండు
జీవబుద్ధినట్టి దిశ్యసంశ
మాత్మబుద్ధిఁ జూడ నాదేవుఁ డేతాను
మతుల కొలఁది నిట్టిధృతి పొసంగు

వ. జాగ్రత్స్వప్న సుషుప్తుల విశ్వతైజస ప్రాజ్ఞ సంజ్ఞల నేత్ర భ్రూమధ్య బ్రహ్మ స్థానంబుల నుండియు వ్యాపకశక్తి నంతటం దానయైన యప్పరమాత్మ విచారింపలేని మూఢులు మూర్ఖభావముల కరిగి సేయందగు ప్రయోజనంబు లెవ్వియేనియుంగలవె! కావున హస్తగత మాణిక్యమ్ము గైకొన నేరక గనులు శోధించు జడభావునింబలె నగునెన్ని యత్నంబులనైన బ్రహ్మ విచారంబు సేయవలయు "నాత్మజ్ఞానీ సంసారంతరితి" యను శ్రుతి ప్రమాణ బనియును వాచామగోచరంబగు బ్రహ్మంబిట్టిది యని వేదాంతంబులు నేర్పరింపనిచో నెవ్వరు తెలియం జాలికెదరనియును, అయినను గొండగు బిళియిడిన కరణి భావనచే నఖిలమయుం గననగునని యు దెల్పి మునులకు సూతుండు వెండియు నవ శాస్త్రంబులగు భరతకళాలంకార శిల్పగజాశ్వ పశురత్న సాముద్రిక గణిత శాస్త్రంబులు వినుండని యిట్లనియె.

కం. ఆది సదాశివరచిత
ప్రాదుర్భవమగుచు నందివటు వాజ్ఞిపుణ
శ్రీదనరి భృంగిముఖ్యవి
నోదంబై ఋషి చయప్రణుతగతి వెలయుఁన్

వ. రత్నాకర చూడామణి తాళకళా విలాస సంగీత మణిదర్పణ చతుర సభావిలాస కాత్యాయన జైమినిమత మారుతీయాది నామంబులఁ జాతుర్లభ గ్రంథ విశ్రుతంబై.

ఆ.వె. భరతశాస్త్రమనఁగ సురముఖ్య సభల యం
దప్పరోమనోజ్ఞమగుచు ధరణి
నర్జునాది కల్పనా రూఢిఁ జెలువొందె
నాట్య లక్షణముల నవ్యమగుచు ॥

తే.గీ. తాళమార్గ క్రియాంగాది లీలఁ దనరి
లయ యనఁగ నాట్య జీవ విలాసమయ్యె
నట్టి లయకనుకూలమై యమరు తాళ
సప్త సూళాదులి రవగు జగతియందు

కం. శివశక్త్యాత్మక మగుచున్
బ్రవణగళ ప్రాణకమును భాసుర మగు తా
ళవిధంబెటిఁగిన పండితుఁ
డవనిం దత్త్వజ్ఞుఁ డగుచు నతి శుభమొందున్ ॥

కాలమార్గ క్రియాంగముల్ గ్రహము జాతి
కళయు లయయును బ్రస్తారకమును బదియుఁ
దాళమునకును బ్రాణముల్ దనర వాటి
కాదియగు కాలనిర్ణయమది వినుండు

సీ. సరసిజచ్ఛదముల శతమొక్కటిగఁ జేర్చి
యొకపరి సూదిచే నొనరఁ బొడువఁ
దెగునది క్షణమనఁ దగు నవి యెనిమిది
లవ లవ లన్ని కాష్ఠవిధిఁ దనరు
కాష్ఠ లెనిమిదియైన గణుతింప నిమిషమ్ము
నిమిషమ్ము లన్నియే నెఱిఁ గళయగు
తోడిఁ గళల్ రెండు చతుర్భాగ మనఁదగు
నదియె యనుద్రుతాఖ్య మది రెండు

ఆ.వె. ద్రుతము తద్ద్వయమ్ము గలియున్న లఘువగు
గురువనాఁగఁ దల్ల ఘుద్వయమ్ము
ప్లుతమమూఁడు గురువు లతి వేడ్క లఘుచతు
ష్కంబు శబ్దరహిత కాకుపదము

కం. ఇది కాలము మార్గంబును
నదియన్ మాత్రా ప్రధానమైదు లఘువు లిం
పొదవఁగఁ బలుకుట మాత్రా
స్పదమగు తన్మాత్రరీతి పాటింపఁ దగున్

సీ. దక్షిణ మార్గంబు తగ నష్టమాత్రలు
వామ మార్గము నాల్గు వరుస చిత్ర
మార్గమ్మునకు రెండు మాత్రలు నొకకళ
యొదవు చిత్రతరంబు నొక్కమాత్ర
దనరిన కళచిత్రతర మార్గమునకు న
య్యేకకళ కళయన నొనర నర్ధ
మాత్రమానను ద్రుత మర్యాదయట్టిద
యతి చిత్రితాఖ్యమ్ము నర్ధమాత్ర

తే.గీ. కచటతపయను నంతను గడగుమాత్ర
యదియ లఘు సంజ్ఞ వర్తిల్లు విదిత మగుచు
నిట్టి మార్గంబు క్రియలచే నెసఁగ వలయు
ద్వివిధ మరయంగ మార్గమ్ము దేశియనఁగ

తే.గీ. మార్గమనియెడునది శుద్ధ మార్గ మచట
నమరు నిశ్శబ్దము సశబ్దమగుచునాల్గు
దెఱఁగులా వాప నిష్క్రామ సరస విక్షి
ప్త ప్రదేశంబులకును శబ్దంబులేదు

కం. ధ్రువమును శమ్యము తాళము
నవిరళమగు సన్నిపాత మనియెడునాల్గున్
ప్రవణ సశబ్దము లీయ
ష్ట విధంబులు శుద్ధ మార్గ సంజ్ఞలు దలఁపన్

సీ. అరచేయి మీఁదుగ నట బొటమన సాచి
వరుస వ్రేళ్లు ముడుచ నావాప మగును
నరచేయి క్రిందుగ నన్ని వ్రేల్ సాచిన
నిష్క్రామ మగునది నెమ్మి దక్షి
ణమునకుఁ జిమ్ముట యమరు విక్షేపమై
యరచెయ్యి మీఁదుగ నన్ని వ్రేళ్లు
మణఁచి రొమ్మునకునై మలుపఁ బ్రవేశంబు
చిటిక వ్రేయుట నంత శిఖరిహస్త

తే.గీ. మెలమి దిగవిడ ధ్రువమగు నలరు దక్షి
ణతలమెడమతలమ్మున హతి యొనర్చు
టదియె శమ్యము నెడమ చెయ్యట్లె సేయఁ
దాళమగునది సన్నిహతంబు దెలియ

తే. దేశిక్రియలు ధ్రువము చేసినఁ గుడిచేయి
రొడమ కడకుఁ గ్రిందఁ దోడరఁ దీయ
సర్పిణియగు నదియె సవ్యంబునకుఁ దీయఁ
గృష్యమగును దేశి క్రియఁ దనర్చి

కం. అరయఁగ నిట్లగు హస్తమె
యరచే క్రిందుగను డివియె నది పద్మమగున్
సరవి నది వామకరమున్
సరి మున్నిడి నట్టిచో విసర్జన మెన్నన్

తే. అతుల మున్నిడి సాచిన హస్తమునను
దర్జనియుఁగూడ నాల్గువేల్ దనరవంచి
వెనుకకై తీయ విక్షిప్త విధ మదియగు
తలము పార్శ్వోర్ధ్వమైనఁ బతాకయగును

కం. అట్టిపతాకయె క్రిందికి
నెట్టుచుఁ దివియంగఁ బలితనిర్ణయ మరయన్
బట్టుగ నివి క్రియలనఁ దగు
గట్టిగనిఁక సంగవిధము గణుతింతుఁ దగన్

సీ. జాతులైతగు చతురశ్రత్ర్యశ్రమిశ్రమ్ము
లాలి ఖండమ్మను మేలిమైన
సంకీర్ణ మొగిసిట్టి సంజ్ఞకు నాల్గేసి
లఘుగురుద్రుతములు లలిఁ దలిర్ప
చతురశ్రమును మూఁడు సరవినిట్టివి కూడఁ
ద్ర్యశ్రమమిట్టి చందములఁ దక్క
తాళమ్ము తెలుఁగుఁడు తత్త్వజ్ఞు లీయైది
టందుఁ జతురశ్రమత్ర్యశ్రమములు

తే.గీ. రుద్రకళలను జనియించి రూఢిఁ దనరె
నభవు నాలుగుకళలై నయాచతుర
మమున నగమును మిశ్రమునమరఁ గూడి
యైదు గురువులఖండమై యతిశయిల్లె

కం. అలచతురశ్రమసమమున
నెలమిమె ఋన్ ఖండయుక్తి నేడు గురువులై
యలవడియొ మిశ్రమంబ
ట్లలరఁగఁ జతురశ్రమమ్ము నందలి సగమున్

తే.గీ. మిశ్రయుక్తమ్ముగాఁగఁ దొమ్మిది గురువులు
నమర సంకీర్ణమయ్యె శాస్త్రాంతరముల
సరణులెన్నైననగు నైన శార్ఙ్గదేవు
మతము లివి జాతిభేద సమ్మతముదలఁచ

కం. ఇవి ప్రస్తారించినచో
నవిరళ శతకోటి సంఖ్యలగు తాళములన్
భువిఁ బ్రఖ్యాతిగ వాడుక
కవి యేరుడ నొదవనట్టివగు పరికింపన్

కం. చచ్చత్పుట చాచపుటముల
నచ్చుగ లఘు గురువిభేదమై యొప్పగు న
త్యచ్చయత యథాతథరభా
స్వచ్ఛరత నేకకళ నిసంజ్ఞతఁ దనరున్

అమరు చచ్చపుటంబున నవుడు రెండు
గురువు లొక లఘువటఁ బ్లుతంబొరసెఁ గాన
నది యథాక్షర తాళమై విదితమయ్యె
చాచపుటా షట్పి గురులఘు సంజ్ఞ గనుఁడు

కం. కళ యనియెడి దెఱిఁగించెదఁ
బలు సంఖ్యావాచకములపై కళ యనినన్
వెలయు గురువితరములఁచోఁ
గళయన లఘు వమరు శాస్త్ర గణనము వెలయున్

తే. ద్వికళయుఁ జతుష్కళయునది ప్రకటితమగు
ద్వికళ చచ్చపుటంబది ద్విగుణమైనఁ
దగఁ జతుష్కళయన నివ్విధమున చాచ
పుటము గురుసంఖ్య సంజ్ఞల పొలుపు లిటుల

తే.గీ. షట్పితాపుత్రకమ్మును సరవిఁ దాళ
మదియు ద్వాదశకళయగు నట్టిచో య
థాక్షరము ద్వికళ చతుష్కళాఖ్యలైన
దడయుఁ ద్రివిధంబులగు వెండి నందువలన

తే.గీ. పొలుచు నొకకళ షట్పితాపుత్రక మది
యుత్తమము పంచపాణి నా నొప్పు మిగుల
మఱియుఁ బ్రస్తారమునఁ గల్గు మహితతాళ
గతుల కీరితి భేదముల్ గలవు మిగుల

కం. సంకీర్ణత నైఁదేడున్
బొంకమ్ముగఁ దొమ్మిదియును బొసఁగఁ బదియు నొం
డుంకువగఁ బదియు గురువులు
నంకురితములయ్యెఁ దగ మతాంతర ఫణితిన్

సీ. సరవి నిశ్శబ్ద సశబ్ద క్రియానంత
రమున విశ్రాంతి విరతిలయయును
నన లయయగు నది యమరుఁ ద్రివిధముల
ద్రుతమధ్యమ విలంబగతు లనంగ
నందు శీఘ్రము ద్రుత మల్లన నడచుట
లగు విలంబము రెంటియందుఁ దవుల
కెడసిన మధ్యమం బీగతులగు నెడ
గురువులను నవిరళ నొకిది లఘువు

తే.గీ. తాళమున కవయవములై తనరు లఘు గు
రువుల నంటిన మధ్యమ మవిరళముగ
రెంటి నంటమి లయ లేమినంటి యొకటి
గదిసియుండినను లయమై విదితముగను

కం. స్వరబద్ధమగుచుఁ దాళ
స్ఫురణన్ గురులఘువు లొకట సొంపుగ నడవన్
దొరకొనుట మధ్యమంబీ
తెఱఁగున లయలయ్యె మూఁడు తెఱఁగుల దెలియన్

కం. ద్రుతమధ్య విలంబములొక
గతిఁ ద్రోవన్ మునుగు రుచనుచుఁ గడువడి నొకరుం
డతని వెనుకొకఁడు వానికి
నతిమందత వెనుక నొకఁడు నరుగువిధమగున్

తే.గీ. పదము దప్పక మూఁడు నేర్పడక క్రియలు
చరణ విన్యాస విశ్రాంతి సంయుతములు
భేదములునయ్యెఁ దప్పనిపేర్మి నడచు
నవి లయాఖ్యలఁ దగు ప్రాణమగుచు మఱియు

ఆ.వె. చిత్రమార్గ వృత్తి క్షిప్రభావము ద్రుత
మమరు వార్తికాధ్వమైన మధ్య
భావనిరతి మధ్య పటిమ దక్షిణ మార్గ
చిరత నవ్విలంబశీల మమరు

కం. పదియిరువది త్రింశతిగా
మొదవినయా లఘువులరసి యొక్కొకపరిగాఁ
బదపడి నొడివెడు కతమున
విదితములగు త్రివిధలయలు విన వాటి మొదన్

కం. ఒక్కొకలయలో మూఁడున్
మక్కువఁ ద్రిగుణీకరణము మహిమం దగుసొం
పెక్కు లయజ్ఞులు నీగతి
నిక్కంబు తెఱంగవలయు నిర్మలబుద్ధిన్

ఆ.వె. అట్టిలయను గీతమడరి పొందదు గానఁ
బొందవలసి యతి యనందనర్చు
సొరిదిఁ ద్రివిధమగుచు స్రోతోవహంబు గో
పుచ్ఛసమములనఁగఁ బొల్చుయతులు

కం. వేడుకమూఁడు తెఱంగుల
నాడిక లయ యయ్యె మార్గమది నిల్కడచే
కూడినవియతులు నొకటొక
టోడక త్రివిధముల మార్గయుక్తిం దనరున్

తే.గీ. మహివిలంబ మధ్యమములఁ ద్రుతంబునఁ
దవిలియతులు నడచుఁ దాళగతుల
నొక్క టొకటి మూఁట నొనరు నీత్రి విధంబు
లైనయతులు మఱియు యతులు గలవు

వ. గ్రహక్రమం బెఱింగించెద—

సీ. సమము నతీత మెంచఁగ ననాగతమన
గ్రహములు మూఁడొప్పఁ గలుగు నందు
గీతవాద్యంబులు నాతతనృత్యంబు
సరియైన గ్రహసమస్ఫురణ నొనరు
మొదట తాళము వెన్క మొనయు నృత్యము గీత
మైన యతీతగ్రహాఖ్య నమరు
గీతము ముందరగా తాళ నాట్యంబు
లడర ననాగతమనఁగ జరగు

తే.గీ. నివియు నన్వర్థనామత నెసఁగుకతన
మది వివేకింపఁ దగు విషమగ్రహమని
కొందఱను కొంద్రుగాన మక్కువను నాట్య
శాస్త్రతత్త్వజ్ఞులౌనఁ జతుర ఫణితి

వ. ఇంక జాతుల తెఱంగెఱింగించెద—

కం. చచ్చత్పుట చాచపుటములు
తచ్చనగా నట్టి షట్పితాపుత్రకముల్
హెచ్చఁగ సంపద్వేష్టయు
నచ్చుగఁ బంచముఖ సంజ్ఞ నమరిన జాతుల్

కం. ప్రస్తార గతుల నిల్చిన
విస్తులగురులగు సమంబు నెరి నంగము నాఁ
బ్రస్తుత భరతాగమధీ
విస్తారకులంద్రు నాట్యవిదులౌనఁగన్

కం. నష్ట ప్రస్తారము ను
ద్దిష్ట ప్రస్తారమనఁగ ధృతిఁ బాదైక
స్పష్ట ప్రస్తారములు ద్రి
విష్టపమత మగుచు మూఁడు విధములఁ జెల్లున్

వ. ఇవి తాళదశ ప్రాణంబులింక నాట్యక్రమంబు వినుండు—

కం. శిరమున్ గన్నులు పదములు
కరములు నభినయతతులకుఁ గలికాలమున్
గలనాట్యకళా విదులగు
చెలులకు భావాభినయము చిన్నెలుదలఁచున్

సీ. అంచితంబును సాచి కుంచి సమంబులు
సంచరోగ్రములు పార్శ్వమును బ్లుతియు
నుద్బద్ధ మమితము నాగి తాడితోత్సేద
నములు పార్ష్ణియనన నమరు పాద
తలగతులివి త్రయోదశ స్థానకము లొప్పు
వైశాఖ సమపాద వైష్ణవములు
మండలాలీఢముల్ మఱియుఁ బ్రత్యాలీఢ
గతులుగఁ బంస్థానకంబు లాఱు

తే.గీ. ఘనత నవహిత్థ మాక్రాంతగతము లాగ
తము విరత మంబువినివర్తనమును మేలి
తమును స్త్రీ స్థానకము లైదు దనరు పాద
జంఘ లూరులు కటియొక్క సమముగాఁగ

కం. కలచేష్ట చాలయనఁదగు
నలవడ నాకాశచారు లటు భూచారుల్
గలయవి పదేసి చారులు
చలనము స్థానకము నిల్చు చందంబరయన్

కం. తలమెడ కరములు పాదం
బులు తనువు షడంగ నటనముల ఘనకీర్తిన్
మెలఁకువల నలరవలయున్
దలఁపుగ భరతాగమార్థ తత్త్వజ్ఞులకున్

సీ. ఆకంపితము ద్రుత మావిధూతంబును
వ్యాహితాధోముఖుల్ వరుసతోఁ బ
రావృత్తలోలిత భావవాంఛికములు
పరివాహితము ననుభవము నెరయ
దేవతానృత్తముల్ దివిని దొమ్మిదియును
మస్తకగతులంద్రు మఱియు నైదు
శార్ఙ్గదేవుఁడు చెప్పె సమము నాలోళిత
కము తిరశ్చీన ప్రకంపితములు

తే.గీ. నమరు సౌందర్యము ననాఁగ నమగు వాటి
యందు సమ మనునదియాఁ బుష్పాంజలులకుఁ
నిశ్చలతఁ బూనమిని యోగనిరతి కెసఁగు
సభల నాలోకితము గూడి శాస్త్ర సరణి

కం. వహి లజ్జాగోపణమగు
రహినిం బనులరయుడఁదిరశ్చీనంబి
మ్మహి పానపూర్ణ విస్మయ
సహజములఁ బ్రకంపితంబు సమ్మత మొందన్

తే.గీ. పాడవునను గ్రింద విన్యాసమునను బార్శ్వ
చలనము నొనర్ప సౌందర్యకలన నమరు
సేయుమనుటకు సంజ్ఞగాఁ జెలఁగు యోగ
యుక్తి వెండియు నిది చెల్లు నుచితగతులు

కం. వినియోగములకు నొప్పఁగఁ
గననగునివి పంచమస్తక విలక్షణముల్
ఘననాట్యశాస్త్రకోవిద
వినుతియు సమ్మతము నగుచు వెలయఁగ నెందున్

తే.గీ. సరవి నాలోకితంబును సమము సాచి
తము ప్రలోకిత ముల్లోకితము విలోకి
తంబు ననువృత్తమన నష్టధా వహిఁదగు
చూపులని పల్కి రాదిమ సూరివరులు

సీ. వెస రెండు రెప్పలు విప్పి చూచుటయె యా
లోకనమదియు భావాకరంబు
రెప్పపాటొదవనిరీతి సమంబగు
సాచి నాఁ గడకంట సాఁగుచూపు

జోకఁ బార్శ్వములఁ బ్రలోకితమగు
పృష్ఠగతిఁ జూచుటది విలోకిత మనఁదగు
నుల్లోకితంబగు నూర్ధ్వ భాగము జూడ
ననువృత్తమగు సారెఁ గనుగొనుటలు

ఆ.వె. నడరఁ గ్రిందు చూచుటవలోకనంబగు
నింక శార్ఙ్గదేవుఁ డెన్న సప్త
విధములందుఁ గరుణ వెలయు మీలిత మింగి
తము ద్రుతోగ్ర సూచనములు మఱియు

కం. దూరాలోకనమనఁదగు
కారుణ్యము విరహిజైన క్రమమున నటనో
దారతకు నుచిత వాక్యవి
హారతమం జెల్లుఁ బూర్ణమగు చూపగుటన్

కం. అరచూపు మీలితంబగు
వరముని జన నాట్య భావభర సురతాంత
స్ఫురణముల భావముల నని
భర సూచన సేయు భావతత్త్వజ్ఞులకున్

కం. కడకంటి చూపులింగిత
మడరన్ శబ్దార్థయుక్తికట వారసతుల్
దొడరెడు నాట్యంబులకున్
గడు వేడ్కన్ భావమగుచు గరిమన్ జెల్లున్

కం. కన్నుగ్రుడ్లు రెండు గదలిం
చిన ద్రుతమది గీత కార్యచిర శబ్దములన్
ఘన వీరరసమునన్ వ
శ్యవిహాణి వారాంగహార సంజ్ఞలఁ జెల్లున్

కం. చెలువగు గన్నుల రక్తిమ
గలుగుట యుగ్రమది మత్తగతులన్ గోపం
బుల భయరసమున జెల్లున్
సొలపునఁ జేదోయి గూర్పు చోలలి నెలమిన్

తే॥ కదలు చరమోడ్పుగల చూపు గడగు సూచ
నాఖ్య నది దేశవిధముల నడరు గుఱుతి
భావమున బాణసంస్థాన పటిమ నటన
మెఱయు శృంగార రసమునఁ జరగు దెలియ

తే.గీ. కించిదూర్ధ్వ వికాసత నెంచ దూర
దృష్టియగు నాది యలరుచోఁ దెలియఁ బ్రేర
ణమున మధుపాన నర్తక నటనలకును
భావ్యమగు నింక హస్తసంభవము వినుఁడు

సీ. ప్రాణ హస్తంబులు పద్రెండు సంయుత
ములగు ప్రసారణ ముఖ్యము లవి
ఇరువదియైదు రెండెసఁగు పతాకాదు
లౌగిఁ బదియాఱు సంయుతముల నటఁ
గౌశలాభినయ ప్రకాశత నంగుళు
లన్ని సాపఁ బ్రసారణాఖ్యఁ దనరు
నంగుళి కుంచిత మది కుంచితంబగు
ధృతివేళ్ల గదల రేచిత మభిముఖ

తే॥ రేచితంబైన గుంచిత రీతినైన
నెరపుట ప్రసారిత పతాకనిరతి పుంఖి
కంబధోముఖ ముపనేష్టకము ప్రసారి
తాంచితంబది రేచిత కుంచితముల

ఆ.వె. ఊహరచనకేక నొదవుస్థూలమున సం
కేతమగును మున్న రీతి కరము
గుఱిగఁ జూపఁ జిహ్వ నరి పరార్థారోప
ణంబు లేక నగుక్రమంబు తోడ

వ. మఱియుఁ బతాక త్రిపతాక యర్ధపతాక కర్తరీముఖ మయూర అర్ధచంద్ర అరాళ శుకతుండ ముష్టిశిఖర కపిత్థ కటకాముఖ సూచి పద్మకోశ బాణ సర్పశిర సింహముఖ లాంగూల అలపల్లవ చతుర భ్రమర।హంసాస్య హంసపక్షక సందంశ ముకుర తామ్రచూడంబులను నసంయుతహస్తంబు లిరువదాఱు. అందుఁ జేదోయి యొడ్డిపుష్పాంజలి సేయుట స్వస్తికంబయ్యె కర్తరి స్వస్తిక దోలాది వైష్ణవ హస్తంబులివి పదియాఱును నుద్వృత్త తలాముఖ విప్రకీర్ణ గజదంతాది ముద్రా హస్తంబు లిరువదిరెండును గలవిమ్ముద్రాహస్తమ్ములకు దక్క తక్కినవాటికిఁ దత్తదుచిత వినియోగంబులు గలవు.—

మ. ఇనువారమ్మున బుష్య ఋక్షమున బుట్టింపారఁగాఁ జెల్వు న
ట్లను వావ్రస్తము గొప్ప కన్నగవ శృంగారాంకమున్ ధాత వే
ఋను శాండిల్యుఁడు మౌని ఫ్లక్షము గృహంబుంగా ననుష్టుప్పహా
ర నిదానంబు ధ్రువంబగున్ లఘువు జేరన్ గౌరవం బొప్పఁగన్..

చం. ఎఱుపగునట్టి శోక తగ నిందునివారము హస్తభుక్తి మే
ర్పఱుపఁగఁ బుట్టి సొమ్ములటఁ బాములు మేలి విరాట్టు చందమున్
బెరిమగు మేను కౌశికుఁడు ప్రీతి మునీంద్రుఁడు వేల్ప గౌరియున్
గుఱినిఁ గుశాంతరీపము లఘుద్వయ వక్రగమైదు పెంపగున్

మ. గురువారంబునఁ బుబ్బనుం బొడమి తళ్కున్ జిత్రవర్ణంబు న
వ్వరుసన్ వస్త్రము సొమ్ములుం గలిగి వేవన్ గ్రౌంచపున్ రావు నే
ర్పఱుపంగా జమదగ్ని హాని యట ఝంపాతాళ మింపొందు ని
ద్ధర విశ్రామము మీఁద ద్విద్రుతము లంతన్ బైలఘుప్రాప్తిగన్

మ. కుజవారమ్మున నిందుభుక్తమున నిగ్గుం బగరుం జాయ న
క్కృజమై పుట్టి సువర్ణచేలమును నాగస్ఫూర్తి భూషన్ శుభ
వ్రజభాగ్గౌరి యై వేల్పుగా నలరి విశ్వామిత్రసన్మౌనియున్
నిజమై రూపకమొప్ప రెండులఘువుల్ నెమ్మిన్ గ్రమంబై తగన్ ॥

తే.గీ. రుద్రసౌమ్య వారయూఢమై చిత్రవ
ర్ణమును బట్టు చీరయమరఁ ద్రిపుట
రహిని శాల్మలిన్ భరద్వాజముని విరా
మాంతమునఁ ద్రిద్రుతములమర గౌరి॥

మ. రవివారమ్మునఁ జిత్రనుం బొడమి స్వర్ణచ్ఛాయయౌ నంబరం
బు వహిన్ ముత్తెపు సొమ్ములన్ మిగులనొప్పన్ గశ్యపాఖ్యానహా
ని వెసన్ హాస్యరసంబునున్ వికృతి వర్ణింపంగఁ జందం బటం
చవనిన్ మధ్యద్రుతద్వయంబు లఘువాద్యంతంబునన్ బొల్పుగన్ ॥

మ. శనివారమ్మున స్వాతి భుక్తమున నిచ్చన్ బుట్టి నైల్యమ్ము నె
ఱ్ఱనికన్నుం గవ పీతవస్త్రమును సర్వంబొందు శాకాంతరీ
వనివాసంబు త్రిమూర్తి తత్త్వమయరూపంబై మృదంగాత్మకం
బును మోదావహ సర్వదైవతమునై పొల్పొందు నేకాఖ్యగన్ ॥

క. నృత్తము తాళాత్మకమగు
హత్తుకనాదాత్మకంబె యగు తాళంబున్
దత్తన్నాదాత్మకశివుఁ
జిత్తమ్మున నిల్పి కొల్తు నేమములొదవున్.

చ. సరసిజసూతి తాళధరి సారసనాభుఁడు హారజాంకుఁడున్
గరిమను వాణి గాయని వికర్తనచంద్రులు రాశికుల్ వృషే
శ్వర శరజుల్ మృదంగికులు సారవిధానుఁడు తుంబురుండునై
సురగణముల్ సహాయులుగ శోభననర్తకుఁడీశుఁడొప్పుగన్.

ఆ.వె. అట్టి శివునివలన నభినిర్మితంబైన
పాట విస్తరించె భరతమౌని
దాన భారతీయమై నుతికెక్కె నీ
భరతశాస్త్రమెన్న ధరణి యందు॥

క. భరగభ కారము భావం
బరయన్ రేఫయది రాగ మమరు తకారం
బిరవొందుఁదాళ సంజ్ఞన్
బరువడి నివిమూఁడు గూడి భరతంబయ్యెన్॥

సీ. తగఁ బ్రేక్షకున కెదురుగనిల్చు పాత్రకుఁ
గుడిచక్కి మార్దంగికుండు రుచిర
వామభాగంబున వాంశిక శాంఖికుల్
బిఱుఁదఁ బాఠకుఁడున్కి బెరయ వాని
వెనుకగా హాళ కాంస్య జనము లన్నిఁటఁ బరా
మరిక సేయుచుఁ దాళధరియు మెఱసి
సరివెన్కనుండర గరిమ నొప్పగ దగ
మురజంబు వామత మెఱసెనేనిఁ

తే.గీ. గుడిని వాంశిక కాంస్యముల్ నడపవలయు
నందుఁ దాళజ్ఞుఁడెనిమిదిరైన లక్ష
ణములఁ బదిలక్షణముల సొంపమరవలయు
భరతశాస్త్రోక్తనర్తన ప్రౌఢులకును!

క. మతియున్ మాధుర్యలఘు
స్థితివాగ్వ్యక్తములు హస్తశేముషి దృఢసం
గతియున్ వ్యాప్తియు వృత్తో
న్నతిగల్గిన వాద్యవేది నాఁ దగు సభలన్॥

తే.గీ. స్థిరతరేఖయు భ్రమరియు దృష్టిజీవ
మశ్రమంబును మతియు మేధాతిశయము
గీత పుష్టియు శుభవచోరీతి పాత్ర
కును పది ప్రాణములు నాఁగఁ దనరు నెలమి

తే.గీ. శిరముగరములు వక్షంబు పరగు పార్శ్వ
కటిపదములు లంగములు బొమల్ కన్నుదోయి
చెక్కులధరంబు చిబుకనాసికము లాఱు
దనరఁగ నుపాంగములు భరత క్రమమున.

క. గ్రీవోదర ముఖ చరమము
లావల జంఘోరు వితతులగు ప్రత్యంగం
బీవఁగఁదగు స్వర్గంబున
దేవాంగనలభినయించు తెఱఁగులు దెలియన్.

తే.గీ. అంగభావాభినయచారు లలగు ప్రాణ
దశకమును గల్గుపాత్రవృత్తంబు సలుప
గీతవాద్యవిలక్షణ రీతు లమరు
నటనఁ గనుగొన్న శుభము లెన్నంగఁగల్గు.

వ. ఏతల్లక్షణవ్యతిరిక్తనాట్యంబులు గనుగొన దురితంబులగు నింక నలంకారాది శాస్త్రశేఖరంబగు కళాశాస్త్రంబు వివరించెద

ఉ. జాతులు సత్త్వముల్ రతులచందము చూపుల లక్షణంబు భా
వాతిగుణేంగితమ్ములు రసాకర వేశజధర్మముల్ క్రియా
రీతులు ద్రావకస్థితులు ప్రేమకు గుర్తులు బంధభేదముల్
నాతుల చర్యలుం దెలుపు నాణెముగా రతిశాస్త్ర మిమ్మహిన్

మ. స్మరవాత్స్యాయనకూచిమారమతముల్ కష్టమ్ములౌగాన నా
స్మరశాస్త్రంబది జాతిధర్మము కళాస్థానంబులుం దెల్పు న
ర్వర వాత్స్యాయనుఁడెంచు సత్త్వములు తేవన్ గూచిమారుండు బా
హ్యరతి ప్రక్రియ లెంచు వశ్యముగ సంయమ్యానుకూలస్థితిన్.

క. ఘోణీపుత్రుఁడు మందుల
రాణల్ వచియించు సమసురతలాలనచే
నాణెములను బాంచాలుఁడు
త్రాణముగా నెంచనైదు ప్రకరణములగున్.

క. చయ్యన స్వకీయయున్ బర
కీయయు సామాన్యయ నెడి కిసలయచరణల్
నెయ్యము పుట్టించుట చే
నెయ్యుడఁ బ్రియ మొదవఁగా వహింతురు చెలిమిన్.

క. విశదసరసాను కూలత
శశిముఖి కెడు ప్రొక్కి వలపు సమకూరఁగా
వశయైనఁ గలయు టొప్పున్
బహుసురతంబైన సుఖ మభావము గాదే.

చ. సమరతి నొందుచోమృదులశయ్యయుఁ బుంస్త్రీయ మేలిమైన య
శ్వము వఱునెక్కి రాతుగతి జాణ సబంధ విశేషసంగతిన్
గ్రమమునఁబూవుదీవె యనఁగాఁ దగుమానిని పొందు మోహవి
భ్రమకరమట్టి కాంత నరపాలసమర్చిత ధారుణీస్థలిన్.

క. క్రమమున ముగ్ధామధ్యము
లమరెడి ప్రాగల్భ్యతివిధలగు నాయిక లా
సమరతి బహురతి బంధ
క్రమరతి వశ్యంబులిట్టి కాంతలకెందున్.

తే॥ బాల యౌవనప్రౌఢయు లోల యండ్రు
బాల లాలన యౌవనబహుళరతుల
ప్రౌఢధనమిచ్చుచో లోల ప్రాపువలన
వశ్యమైయుండు రెంతయు వాంఛగల్గి.

సీ. ఇరువదెఱంగులరతుల్ పరగు బాహ్యాభ్యంత
రాఖ్యల బాహ్యంబు లవియు రెండు
దర్శనస్పర్శ విమర్శము లభ్యంత
రములు తొంబదియాఱు రతుల బంధ
గతు లెన్నఁబదునాల్గు ధృతిఁ దంత్రరతులైదు
నైజి సమనీచాతినీచపరమ
నీచలు నుచ్చయు నెమ్మి నత్యుచ్చయుఁ
బరమోచ్చ యనెడి సప్త విధములను

ఆ॥వె॥ బెరసి భద్ర ముఖ్య పురుష పద్మిన్యాది
జాతిభేదములను సమము నుచ్చ
నీచరతులు గుహ్యనిర్ణయ వివర ప్ర
మాణములఁ బొసంగు మహితవృత్తి.

సీ. అంగుళి నాభిమధ్యమునఁ జాలన మొన
రింపఁ బేటితతంత్ర మింపు మీఱు
మధ్యమాంగుళిచేత మన్మథ గృహశోధ
నము కుట్టితంబను నామ మయ్యె
నలరు వేడుకఁ జికురాకర్షణము నామి
తంబనునట్టి తంత్రముగ మెఱయుఁ
బదముఖంబుల నింతి పాదమూలంబాను
టది క్లిత్త మను తంత్రమగునుఁ జిబుక

తే॥ పీఠ్యమది ఘట్టితంబనఁ బేర్మిఁ దనరు
బేటితము ఘట్టితము సామితాటనంబు
క్లిత్త ఘటితనులివి యైదు కీర్తనీయ
తంత్రతరతులయ్యె బాహ్యవిధములఁ గలియు.

ఆ. వె. కూర్మి భద్రదత్తకూచిమారులకుఁ బాం
చాలునకును ద్వాదశ దశములు నె
నిమిది యాఱు నంగుళములు లింగప్రమా
ణములు మదనశాస్త్రి సుమహితముగ.

క. మతి శంఖినిచిత్రినులకుఁ
గిరికింపఁగ హస్తినికినిఁ బద్మినికిన్ లో
తిరవుగ మరుగృహ మిట్లగు
ఎరుసన్ భద్రాది పురుషవర్గ్యుల కరణిన్.

క ధర దేశమతాంతరముల
పురుషుల శశ వృషభ తురగ భూరిఖ్యాతిన్
దరుణులు శశి వృషభయు మతి
తురగియు ననఁ ద్రివిధజాతి ధూర్వహలీలన్

తే.గీ. అందుఁబద్మిని పాంచాలు లరయ లేమి
నుచ్ఛ్వసమనీచరతులు నొఱపొప్పు భద్ర
హస్తినీముఖ్యమైన జాత్యానుదూఢి
నమరి గుహ్యాంగుళ ప్రమాణములు నట్లు.

వ. జాతులతెఱంగెఱింగించెద—

సీ. మొగము తేఁటయు నైల్యమగు కతుముల్ దీర్ఘ
ఘ్రాణమ్ము గడుగొప్పకుచయుగమ్ము
రక్తాంగకము తీవ్రరతి జలగుహ్యమ్ము
ఖరజన ప్రీతి తుంభత్కృథయును
కటుతిక్తముల మీఁదఁ బటుతర ప్రేమయు
రక్తభూషాది వస్త్రములు దాల్చు
టురుఱు లోలత్వమ్ము నంగుళ ద్వాదశ
గుహ్యంబు భద్రమునైఁగూర్మి ప్రథమ

యామరతినింపు హరిణ గత్యాను రూఢి
కరిమదము కంపు నులివెచ్చగల ద్రవంబు
గలిగినది హస్తినీజాతి కాంతయగుచుఁ.

— — —

సీ. కొద్దిరోమ లోతు నెక్కొనునట్టి కనుదోయి
చపలచిత్తము కేశసంహననము
నతిదీర్ఘమును జిత్రితాంబర ప్రీతియు
గురుకుచమ్ములు నల్పగోష్ఠి చిత్ర
రతి గొప్పపెదవి స్మరగృహ కక్షా ప్రరో
మములు దుర్గంధమ్ము నమరునదియు
మరుగృహస్థలి తొడల్ విరివియు సత్యంబు
తెలుపు నుష్ణపు మరుజలము కోడి
ఆ. వె. నడయు దత్తు కూర్మి యొడపని రతి పది
యంగుళముల గుహ్య మటు ద్వితీయ
యామసురితవాంఛ ప్రేమ మిక్కిలిఁ గల్గు
చిత్తినీలతాంగి చిరసుఖతను ॥
సీ. కఠిన పయోధర ఘనతర దుర్గంధ
కచయుగ్మయు దీర్ఘకంఠి రక్త
హస్త సుమధ్య కృశాంగి పంకజనేత్ర
విస్తారగుహ్యోరు విపులజఘన
జిగి పలువరుసయుఁ దగుచూటు నేర్పును
నీలభూషణ వస్త్రజాల నిరతి
స్వల్పనిద్రయల్పభోజన శుభయుక్త దు
ష్టమదన గేహ తత్పార్థ నహీన
తే. రోమ, యష్టాంగుళిక గుహ్య ప్రేమగలది
యధికదుర్గంధజల మయూరాభిగమన
కూర్మియూఁడవ జామునఁ గూచిమారు
సమరతియుఁ గల్గు శంఖినీ సారసాక్షి ॥
సీ. పద్మగంధమ్మును బద్మాసనమ్మును
జిలునవ్వు నిద్దంపు జెక్కుదోయి
హార శుభ్రాంబరచారు భూషణ గంధ
సుమలోల రాయంచ సొబగునడపు

సమ సుందరాంగియు సవినయ భూషణ
సౌశీల్య సత్యవిశారదయును
బాంధవాలసమరతి భవ్యవిద్యాయుత
నాలవజామునఁ గేళి వెలయు

తే. గీ. సత్యవాద పతివ్రతా చారనిరత
యరయఁగ నపూర్వ యాటు వెల్లచటి లోతు
శీతల సుగంధ మన్మథ సీమసలిల
పద్మినీ కామినీ మణి భవ్యసరణి.

క. అమరిక నయ్యా జాతుల
సమరతి యగు నెచ్చుతుచ్చ సరణి దిగుడుచోఁ
గ్రమమున నీచలగుఁ బ్రా
వము లట్లన యగుచునుండు వనితల కెందున్॥

ఉ. జాతులచే నెఱుంగమిని సత్వలచేత నెఱుంగఁగాఁదగున్
నాతుల చిత్తవృత్తులు ఘనంబగు వాంఛలు మర్మకర్మముల్
ప్రీతి నెఱింగెనేని సుఖవృత్తికిఁ బట్టగు నాయకుండు న
త్యాతత చేష్టలన్ సతి గుణానుగతిన్ మదికింపునింపుచున్॥

క. తీఖికిఁ దగు సంభోగ
ప్రావీణ్యము మంచిరూపు పలుకుల నేర్పున్
శ్రీ వెలయు నకుటిలస్థితి
పావనయగు దేవసత్వ పరికింపగన్.

శా. అత్యాచారము యోగ్యవస్తురుచిరాహారమ్ము సాధ్వీవ్రత
ప్రత్యాసన్నత సత్యభాషణ రతి ప్రాగల్భ్య హీనక్రియా
చిత్యాంచన్నిశి సంగమంబు శుచియున్ శీలమ్మునుం గల్గు నా
న్నత్యన్ సంయమిసత్వగాఁ దలఁతు రెన్నన్ మారశాస్త్రి స్థితిన్

తే. గీ. ఇట్టిగుణముల నియమవ్రతేచ్ఛయగుచు
సంతతింజాలగాంచి యాచారగరిమ
నమరు నట్టిలతాంగియౌ యమరు పైత్య
సత్వయైతగు శుభసదాచారకలన॥

క. తేఁటమొగ మెఱుపు మేనన్
నీటగు నొయ్యార మధిక నిర్మలచర్యల్
పాటలు నాటలు గల్గిన
బోటియౌ గాంధర్వసత్వ భూనుతలీలన్.

క. ఘనుల యెడ నేర్పు నణఁకువ
వినయము సంగీత విద్య విభవము మైనం
పును ముక్కు నిడివి గలయది
యనుపమగతి యక్షసత్వ యనఁగాఁ దనరున్.

క. పాడవున్ వీణారవమున్
గడు మీఱెడు పలుకు సౌఖ్యగతిరతి కేళిన్
గడిదేఱి మెలఁగు విధముల
వడిఁ గిన్నరసత్త్వమైన వామాక్షియగున్॥

క. వారని నిష్ఠయు సమరతి
చారువినయవర్తనమ్ము సద్వ్రతసత్యో
దార విహారము లలవడు
వారిజముఖి సిద్ధసత్త్వ వర్ణింపఁదగన్.

క. ఏ యెడ నింద్రింపుచు మృదు
వైయుండెడి మేను భూషణాసక్తియు నే
ర్పైయొదవు పనులు గల్గిన
యాయింతియె నాగసత్త్వ యతి కోపియగున్.

క. ధనధాన్య పుత్ర వాంఛయు
ఘనలోభంబజ్ఞతయును గడు దామసమా
పనులున్ గఠినోక్తులు గల
వనిత మనుజసత్త్వయనఁగ వసుమతిఁ బరగున్॥

క. క్రూరా హారం బశుచియు
సారెకు గలహంబు కఠిన సాహసభాషల్
సారా చార ద్వేషము
దారుణరతి దైత్యసత్త్వ తరుణి దలంపన్॥

క. ఘోరాకారము దుష్టా
చార మశుచి చిత్రకేశ జాలము క్రోధం
బేరిం గలహించుచుఁ దగు
నాగరియె పైశాచసత్త్వనా ధర నమరున్ ॥

క. ఏ తద్గుణములు గల్గిన
నాతిన్ ధరమిశ్ర సత్త్వ నాఁ దెలిసి తదీ
యాతత సంతోష క్రియ
లాతరి నొనరింప సౌఖ్యమమరున్ రతులన్॥

కం. ధర్మార్థ కామమోక్షము
లర్మిలిఁ బురుషార్థ రీతులగుగానఁ గడున్
గూర్మిని గామార్థంబుల
పేర్మిన్ స్త్రీగుణము లెఱిఁగి ప్రియమొందఁ దగున్

వ. ఇంక బాహ్యరత్యంగములగు దశసంస్కారము లెఱిఁగించెద,—

తే.గీ. తాడన నఖక్షతములు దంతక్షతంబు
చుంబనంబులు పేటన చూషణములు
వితతత పంచాంగుళిక వషట్కృతులు పీడ
చాలనంబును బదియు సంస్కారవిధులు

సీ. చరచుట తాడన మరయ మీఁటుట పేట
నము నఖదంతముల్ నాటు క్షతము
చుంబనమగు ముద్దు చూషణచాలన
ములు పీల్పు టలకపాణుల చరితము
తగ వషట్కృతి కూజితంబు పంచాంగుళి
హస్తకృత్యంబు పంచాంగుళమగు
నాలింగనాదులు లీలఁ బీడన మిట్టి
దమరఁగఁ బదిచుంబనముల నెలవు

తే.గీ. లన్నితాడల నఖక్షత మమరు చోటు
లూరులు నితంబపృష్ఠవక్షోరుహకర
కక్షకర మూల గుహ్యముల్ కటియుఁ జెక్కు

— — — —

వ. ఇట్టిస్థలంబులఁగల నఖక్షతంబులకుం గ్రమంబున నామంబులు :—

కం. ఛురితము మండలముఁ బ్లుత
మిరవొందఁగ నర్ధచంద్ర మిషుశిఖ పదమం
జరి కుముద పత్ర శశకము
లరయన్ మణిమాల యన నఖావళి నెలవుల్

కం. ఫాలము నధరము నూరుక
పోలాక్షిస్తనయుగమ్ము బోరి మరునిల్లున్
మూలిమెడ నాభి నాసిక
వాళ్ళిం బది చుంబనములకగు నెలవులాగిన్

ఉ. తాడన పేటనాదుల ముదంబొనఁ గూడఁగఁ దత్తదర్థ సం
క్రీడల నంగభోగములఁ గృత్యమెఱుంగఁ బోసంగ జేసినన్
వేడుకపుట్టు వశ్యమగు వే లలనామణియున్ దదీయ మా
జాడ కళాస్థలమ్ము లనిశమ్ము నెఱుంగ శుభమ్ము చేకుఱున్

సీ. అంగుష్ఠ పదగుల్ఫసంగతి జాను జఘన
నాభి వక్షోజ ఘనకుచాగ్ర
కక్ష కంఠకపోల క్రమోష్ఠ నేత్రాళి
కముల మూర్ధమున శుక్లగతి నెక్కు
కళ దిగు కృష్ణ పక్షమున మతాంతర
ములఁ జాంద్రమానర్తువుల ముహూర్త
గతుల మెలంగ రక్త (స్రవత్తి) దినముల్
తల నుండు గళలిలఁ జెలుల కెల్ల

తే. హస్తినికి శుక్లగతి దక్షిణాశ నెక్కు
నెడమదెస చిత్తినికిఁ గళ లెక్కు నిశల
శంఖినికి శుక్లగతి వామసరణి నెక్కుఁ
బద్మినికిఁ గృష్ణగతి వామభాగ మెక్కు

కం. ఎల్లతెఱంగుల జాతుల
పల్లవపాణులకు నెక్కు భాగేతర మం
దల్లన దిగు కళ లంటినఁ
బల్లవితంబగుచు సుదతి పరగున్ వశతన్

ఆ.వె. స్తంభ విధము ప్రళయ సరణి రోమాంచంబు
స్వేదమున్ వివర్ణ వేపథులును
అశ్రు విస్వరమ్ములష్టవిధంబుల
సాత్త్వికోదయములు సకియలకును

కం. ద్రవబాహుళ్యమతి ప్రియ
మవిరళముగ గొంచెమైన నల్ప ప్రియమా
ద్రవమేమి లేమి యొల్లమి
యవనిన్ నాయకుఁడు దెలియనగు జెలుల యెడన్

చం. ప్రియమగుచోట శుభ్రమును బెద్దయు నప్రియ మించుకైనచో
నెయిదిన చిత్రవర్ణమగు నేమియు లేమిఁ జెమర్పదందు న
ట్లయినఁ గదుష్ణ శీతలము లత్యధి కోష్ణము లొక్రమంబునన్
నయవిదుఁడై యెఱుంగఁ దగు నాయకుఁడింతుల కా ద్రవంబులన్

సీ. చెప్పపాటని మేషదృష్టి విమర్శింప
    సంతోషభావ విస్పష్ట మదియె
కుటిల చూపులు దగు కుంచిత నామమై
    దృతకోప భావంబు దెల్పునదియె
ఆకాశవీక్ష యూర్ధ్వ లోకనంబగు
    పరికింపఁగ విచార భావమదియె
యరమోడ్పుగను చూడ్కులర్ధ వీక్షణ నామ
    మగుజుగుప్సా భావమరయ నదియె

తే. చిదుపచూపులు ఖండదృష్టి విషమదియు
    నటఁ గటాక్షావలోకన మదియ ప్రేమ
    నీచదృష్టియె దుఃఖమ్ము నెలఁత సహ్య
    దృష్టి భావమ్ము లీగతి దెలియవలయు

చం. చులుకనఁ జూచుఁ గేళికిని జూన్పదు వీడఁగనాడు నొండొరుల్
    దలఁచుఁ బ్రియంబు సల్పదు వృథావచనమ్ములఁ బ్రొద్దు పుచ్చుచున్
    గలహము నేయు వేనలుకఁ గైకొను చూచినయంత విన్నఁనా
    వలవని కాంత నిందలిడు వైఖరిఁ బూను నిరంతరంబిలన్॥

కం. కలకలనవ్వు కన్గొనఁగ గౌతుక మొందుచు గారవించు ని
    చ్చలు గొనియాడు నంటు నెడ సాత్త్విక ముప్పతిలంగఁ గేళి, మై
    యలయిక కోర్చు దైన్యవచనానుగతిన్ బలిమాలు జోడుగా
    గలజలముబ్బ ప్రేమదగు కామిని నాథుని సేవసేయుచున్॥

కం పరకీయయు సాధారణ
    యరయఁగ బాహ్యాంతర క్రియార్థాలు దలఁపన్
    బురుషరతియును తత్ద్వయ
    సరణి స్వకీయలకు మాన్పఁ జనుఁ బతి కెందున్॥

చం. కనుఁగొనినంతఁ గన్గవని కాసము నెమ్మది గూర్చుటల్ దినం
    బును గడు గోర్కులున్ వగపు పొల్పగు పల్కులు జాగరమ్ముగా
    ర్శ్య నిరభిలాష లోదన విసర్జన సంజ్వర హృచ్ఛలమ్ములున్
    ఘనతర మూర్ఛనైధనము గల్గునవస్థలు మోహజన్యముల్॥

కం. సమజాతియు సమరతియును
    సమశుక్ల స్రవము మోహసంజనితమ్ముల్
    సమరహితమైన మందుల
    గమకము నేర్పులును స్థిరము గాపరయంగన్

సీ. పాడ్యమి మొదలుగఁ బౌర్ణమి యొక పక్ష
మార్తవం బాదిగ నన్నినాళ్లు
పగఁటి ముహూర్తముల్ పదియేను నివి శుక్ల
పక్ష మన్యము కృష్ణపక్షములగు
రహి నిందులన్ బాహ్యరతి సల్పవరుసలు
తాడనపేటన పీడనములు
చుంబన చాలన చూషణ పంచాంగు
ళనఖదంతక్షత లలిత మణిత

తే. క్లిత్తములు తంత్రసంస్కారకృత్య పంచ
దశకమొక్కక్కటాదిగ దగు క్రమమున
నన్నియు నొనర్చి రతిసేయనతివవలచు
... ... ... ... ... ...

వ. మఱియు మోహనస్తంభన ద్రావణాకర్షణ క్రియలు మణిమంత్రౌషధయంత్ర తంత్రంబులు గలవవిదేశకాలజాతి భేద ఫలితములగు నాభ్యంతరంబులయం దెనుబది నాల్గు దెఱంగులఁ బద్మనాగర నాగకూర్మవృషకుక్కుట మాయూరాది బంధమ్ములు గలవ వియు నెఱుంగందగు నిట్టి కళాశాస్త్రాంగమ్ములును నాయికా నాయక గుణసూచకమున గు నలంకారశాస్త్రమ్ము వినుండని సూతుండిట్లనియె॥

సీ. రసయుక్తి నింపుగా రచియింప రౌచికుఁ
డగు వాచకుండు శబ్దాతిడంబి
యర్థగాంభీర్యోక్తి నార్థికుఁ డగు నర్థ
భాసుర శబ్దకల్పకుఁడు శిల్పి
మధురమార్దవయుక్తి మార్దవానుగుఁడగు
శాస్త్ర వాక్యజ్ఞుఁడెంచఁగ వివేకి
ఘనతరా లంకారగతి భూషణార్థియా
నమరు నన్నిఁటను మహాకవియన

తే. గీ. సకల సద్గుణియును సదాచారి విద్య
లెఱుఁగు జపశీలకవిగోష్ఠి నెసఁగు ఘనుఁడు
సరవిఁ గృతినాయకుల్ ధీరశబ్దపూర్వ
లిల నుదాత్తోద్ధతులు శాంత లలితులనఁగ॥

మ. అలకావ్యమ్ము ద్విభేదమై వెలయు బ్రేక్ష్యశ్రావ్యములై, రూపా
ఖ్యల నాద్యంబు దశప్రకారములఁ జోద్యంబైతగెన్ నాటకో
జ్జ్వల దీహామృగ భాణ సప్రకరణ వ్యాయోగ వీథ్యంక ని
ర్మల హాస్యోడ్డిమ భాస్వరత్సమవకారస్ఫారనామమ్ములన్ ॥

తే. గీ. భావశబ్దార్థరస పరిపాకశయ్య
లయ్యలంకార రీతులు వ్యంగ్యభేద
గతులు మది ప్రాణము లివెల్లఁ గావ్యములను
గాన నిర్దోషకావ్యమ్ము గను శుభమ్ము

కం. ఈ ధారలు గల కవివరు
లా ధీరోదాత్తముఖ్యులగు పతులకు స
న్మేధ నొసంగిన కృతులవి
సాధుస్తుతి నుభయ లోకసౌఖ్యము లొసఁగున్

చం. ఉదధి పురర్తు శైలతనయోదయ సంగరరంగ నాయకా
భ్యుదయ వివాహ దౌత్యమృగయోత్సవ పాన సరోవిహార స
మ్మదతరుణీరతీ విరహ మాన దురోదర దండయాత్ర లిం
పొదవఁగఁ జంద్ర సూర్యగతు లొప్పఁ గృతి క్రియ వర్ణ నాంశముల్ ॥

వ. అందష్ట నాయికా విధమ్ములు.—

సీ. పడకిల్లు వైపుగాఁ జాటించి పతి విముగ్ధ
న నేయు నావాససజ్జిక దయ
ధవుని చిన్నెలు మదిఁ దలఁచి చింతిలు
విరహోత్కంఠితా నాయికోత్పలాక్షి
విభుఁడు దానాడివిన విధమున మెలఁగఁగ
జతురయా స్వాధీనపతిక యెప్పుడు
వా డాడికాని క్రేవన్ జతి జేరని
రీతిని గలహాంతరిత నెలంత

తే. గీ. పతిని దండించు ఖండితా భామ ధవుని
బలిమె మదిఁ గోరు ప్రోషితభర్తృక పతి
దను మొఱఁగఁ గుంది విప్రలబ్ధావధూటి
హత్తుసంకేత మభిసారికోత్తమాంగి ॥

ఉ. ఒక్క సఖీలలామ నెనరొందినవాఁ డనుకూలనాయకుం
డెక్కువ పెక్కుకాంతల రతిన్ సమవైఖరిఁ గూడఁ దక్షుఁడౌ
నిక్కువ గుర్తులుండి చెలినెంచక డగ్గఱు వాఁడు ధృష్టుఁడౌ
కక్కస మాత్రకామినికిఁ గాక మఱెందును లేశమందిలన్

కం. ఒనరఁగఁ గావ్య శరీరం
బున బద్ధావయవములకు భూష లనుప్రా
స నిబంధవృత్తులాదులు
గనుక నలంకారమని పొగడఁగావలసెన్.

కం. చెంది గుణాలంకారము
లందుప వేశమ్ము క్రియయు నాశ్రయరీతుల్
పొందుగ సంఘము కావ్యము
నందున్వివరింప గుణము లనిపించుకొనున్

వ. శబ్దార్థోభయగతమ్ముగఁ జిత్రములు త్రివిధమ్ములైయమరు నర్థాలంకారమ్ములు చతుర్విధంబందుఁ గొన్ని ప్రతీయమానవస్తువులు కొన్ని ప్రతీయమానరస భావములు కొన్నియస్ఫుటప్రతీయమానములు సమాసోక్తి పర్యాయోక్త్యాక్షేప వ్యాజస్తుత్యుపమేయోపమానానన్వయాతిశయోక్తి పరికరా ప్రస్తుత ప్రశంసానుక్తనిమిత్త విశేషోక్తులుంగాక మఱియును.—

సీ. ప్రతిమాన వస్తురూపక పరిణామసం
దేహ స్మరణ తుల్య దీపకములు
నుల్లేఖ భ్రాంతి మదుత్ప్రేక్ష లుపమాన
పెూక్తిదృష్టాంతముల్ యోగితమును
వ్యతిరేకమును ప్రతివస్తు సందర్శన
శ్లేష లూర్జస్వి విశేష భావ
ములయందు రసభావములు జెందు నుపమాన
భానురార్థాంతర న్యాసములు వి

తే. రోధభావ నిమిత్తైక రూఢలలిత
విలసిత విశేష సంయుక్త లెలమి విషమ
కలిత చిత్రాధి కాన్యోన్య కారణములు
లికావళీ వ్యాఘాత మాలికలును.

వ. మఱియుఁ గావ్యలింగానుమాన సార యథాసంఖ్యార్థాపత్తి పరిసంఖ్యా దికకలాపములయందు సముచ్చయ సమాధి ప్రత్యనీక ప్రతీప విశేష మీలన తద్గుణవ్యాజోక్తి భావోక్తి భావి కోదాత్తములయందు సహృదయ హృదయాహ్లాది ప్రస్ఫుట ప్రతీయమానములు లేవు. వీఁటియందు ద్వివిధంబున నలంకార కక్షలు వివరించెద.

తే. గీ. తనరు సాధర్మ్యములు త్రివిధమ్ము లగుచు
భేదము నభేదభేదా విభేదముఖ్య
ము లయి యుపమానము పమేయ మొనరు నిట్టు
లవియె భేదమ్ము లగు నవాస్తవములగుట.

వ. ఇందురూపక పరిణామ సందేహ భ్రాంతిమదుల్లేఖాపహ్నవాదులు అభేద ప్రాధాన్య సాధర్మ్య నిబంధనమ్ములు దీపకతుల్య యోగితా దర్శనదృష్టాంత ప్రతివస్తూపమా సహోక్తి ప్రతీప వ్యతిరేకాదులు భేద ప్రాధాన్య సాధర్మ్య నిబంధనమ్ములు ఉపమానద్వయోపమేయోపమా స్మరణాదులు భేదాభేద సాధర్మ్య మూలములు, ఉత్ప్రేక్షాతిశయోక్త్యధ్యవసాయ మూలములయందు విభావనావిశేషోక్తి తద్గుణాన్యోన్యవ్యాఘాత భావిక విశేషణాదులు విరోధ మూలములు యథాసంఖ్య పరిసంఖ్యార్థాపత్తి వికల్ప సముచ్చయమ్ములు వాక్యన్యాయమూలమ్ములు ప్రత్యనీక సమాధి స్వభావోక్త్యుదాత్తములు వ్యవహారమూలమ్ములు కావ్యలింగానుమానార్థాంతర న్యాసతర్కములు న్యాయమూలమ్ములుఁ గారణమాలైకావళీ మాలాదీపక శృంఖలాదులు వైచిత్ర్య మూలమ్ములు వ్యాజోక్తి వక్రోక్తి మీలనాపహ్నవములు సమాసోక్తి పరికరములయందు వైచిత్ర్య మూలములగు నిట్టి యర్థాలంకారములకు మున్నుగ శబ్దాలంకారమ్ముల నెఱింగించెద.

సీ. ప్రాసమౌ ఛేకానుప్రాసమ్ము ధీరాధార
ధారాధరోదారసారుఁ డనిన
నిదియె యనుప్రాస మిల వృత్త్యనుప్రాస
మీ వారి మీవారి కిమ్మటన్న
కమలా కరంబిది కమలాకరంబన్న
యమకమౌ గిరిదరి హరికిరి యన
నొకయర్థమునను వేఱొక ధ్వనిదోఁప
శబ్దాలంకరణమగు హరిపరాక్ర

తే॥ మప్రభా విభవోన్నత మహిముఁడనఁగ
చక్రభుజగాది బంధముల్ చాల చిత్ర
కవితలఁ గూడి యొనరఁగ వివిధగతుల
నొప్పు సందష్టదళ పద్య మొప్పునిట్లు

శ్లో. యాతాయస్యా సమగ్రాసతి మహ కనకస్థాన సత్కాసనాయా
యానాసత్తాస నస్థామఖయతు కమలాఖ్యాస నుజ్ఞాను మాయా
యామానుజ్ఞాను సఖ్యా క్షితిపతి తిలకం జ్ఞాతిరక్తా సగేయా
యాగేసక్తారతిజ్ఞా సుకృతిషు పలితగ్రామ సస్యాయతాయా.

వ॥ ఇట్టివి చిత్రబంధవిధంబులు—

తే. అంబునిధివంటి గాంభీర్య మమరశిఖరి
వంటి యౌన్నత్య గరిమ ది గ్వారణముల
వలె ధరణిఁ బూన్చె రఘుకులవర్యుఁడనఁగ
నర్థయుక్తి నలంకారమై తనర్చు

ఉ. రాతిరి యాననప్రభల రాములు హారతు లిత్తురా మురా
రాతికి నన్న శ్లేషయగు రామకరాస్యహి దైత్య రాజబిం
బాతతసంగ్రహోద్యమము నయ్యెడ రూపకమౌ సురాచలం
బాతడ నాఁ బ్రతీపకసమాఖ్య నలంకరణమ్ము చెల్వగున్.

సీ. ధర్మార్థకామ సంతతి యొక్కచో నిల
శబ్దమ్ముచేఁ దోఁచ సరవి నొదవు
మితి యుప మానోపమేయమై తామ్మిదో
దిక్పతియో విష్ణుదేవుఁ డొకో
యను నెడ సందేహమను నలంకారమ్ము
హరికీర్తి చంద్రిక నా చకోర
కములు సంతస మందెఁ గడు నన్న భ్రాంతి
మత్తగు వేంకటాచలం బఖిలజనులు

తే. మోతురమ కున్క యని దైత్యముఖ్యులమిత
శౌర్యమున కెల్లయనియు నిశ్చలులు జ్ఞాన
మయమనియు నెంచు సాధర్మ్య మహిత మయ్యు
లీలఁగను పట్టు టదియౌ యుల్లేఖ మగును.

ఆ. వె. సైన్యరజము గాదు జయమహాధూమ మం
చనుట పహ్నవాఖ్య నమరు పూర్ణ
లుప్తయనఁగ నుపమలు ద్వివిధములు త
చ్ఛబ్దభాసురార్థ చర్యనమరు.

క. ఆఱు దెఱంగులఁ బూర్ణలు
మీఱున్ బందొమ్మిదైన మితి లుప్తలగున్
ధారుణి యయాతి రాజుల
తీఱున ధర్మజుఁడు పూనె ధృతి నపుడనినన్.

సీ. ఉదయాద్రి నినుఁడుండి యదన సారసముల
నలరించు రీతి సింహాసనమున
జననేత్రముల వికసనమునర్చె రమేశుఁ
డనశ్రోత్రియన్ బూర్ణమయ్యె మఱియుఁ

దద్ధిత యర్ధియోఁ దగవాక్యగయు సమ
    రసయు వానొప్పు పూర్ణ మ్ములాఱు
వనజాప్తునెడఁ జక్ర వాకముల్ చంద్రుని
    యందుఁ జకోరము లలరుల యెడ

తే. నళిచయం బెట్టు లట్టుల నంజనాద్రి
విభుని సేవలఁ బ్రజలు నావిధము లు త్త
లివియె పూర్ణుల పేరుల నెసఁగు మఱియు
గలవు పదమూఁడు భేదముల్ దెలియ వరుస.

క. వెన్నెలలై యమృతంబై
యన్నీరజ నేత్రు కీర్తి యమరె నటన్నన్
ఎన్నఁగ ననుక్తధర్మి ప్ర
సన్నత లుప్తయగు నుపమచందము దెలియన్.

క. హరిభుజ దండము దానవ
వరులకు యమ దండమగుచు వర్తిలు ననుటల్
ధర నుక్తేతరధర్మ
స్థిర నామాలంకరణము చెలువగు మిగులన్.

సీ. గురుని శిష్యులరీతి సురలెల్లఁ గొల్తురీ
    హరిననినఁ బ్రతీప మనఁగ నొప్పు
నినకులంబెల్ల రాముని చేఁ బరిష్కృతం
    బైనట్లు యదువంశ మమరెఁ గృష్ణు
చేతనా నర్థప్రతీతి యౌపమ్యంబుతోఁ
    గలజలదంబన్న నైలమి సీత
తోనున్న రాముఁడు దోఁచుఁ బింబప్రతి
    బింబ భావమనంగఁ బేర్మి నమరు

తే. ద్రవిడస్వర్గంబు వేంకటధర సురపురి
యచటి జనములు దేవత లబ్జనాభుఁ
డింద్రుఁబోలెడి విభవాతి సాంద్రమహిమ
ననుటు యుపమాఖ్యఁదగు బుధజనఘనోక్తి.

క. శారద శరదురు నీరద
నారదశర పుండరీక నందిత మిహికా
పారదరుచి మీఱున్ హరి
గౌరవ యశమనిన మాలికారూపమగున్.

ఉ. రాముఁడు రాములీల జనరంజకుఁ డన్న ననన్వయంబగున్
రాముని యందుధర్మము తిరంబగు నర్థము రీతి నర్థమ
ప్పెల్మి మఱిఁ గాముమా ద్వివిధ మౌనఁ బ్రత్యవమర్శనామమా
నోమిక నొందుఁజూచి మఱి యొండెఱుఁగన్ స్మరణాఖ్య మొప్పగున్.

తే. వేంకటాద్రీశుఁ డాశ్రిత వితతి కాత్మ
సేవ దయసేయుచో భోగసీమ వెలయు
నట్టి పరవాసుదేవు నైయ్యమునఁ దలఁపఁ
గా నొనర్చుట లారోప గర్భమయ్యె.

సీ. వహి సావయవ నిరవయవ విభాష్టక
రూపకాలంకార రూఢులందు
హరి జయ యాత్రాంబుదావళి ఘోరని
స్వాన నిర్ఘోషణ శత్రుశైల
ములు పగుల్చుచు వారి లలనల కన్నీటి
జడి యశోంకుర సముచ్చయ మొనర్చె
ప్రౌఢి నావస్తు రూపక మగు హరి కల్ప
వృక్షాకృతిన్ గుణవితతి ధూప

తే. వాసనలు నించె జగములు వాసి గనన
బరగు నటనేకవర్తి రూపక మనంగ
కరమథనశైలమున శత్రు కంధిఁ ద్రచ్చి
రహి యశస్సుధ లోకామరత్వముగను.

వ. గాంచెననుట సావయవరూపకంబగు, నందకరాహువు దైత్య రాజమండలమ్ము గ్రసిం
చెననుట, పరంపరరూపకాలంకారమ్మగు మఱియును.

క. దానవ భంజన కరుణాం
భోనిధి సత్పూర్ణి పంక్తి పొరి దిక్తతులం
దానె ననుట శ్లేషోక్తియ
గానఁ బరంపరితరూప కంబై వెలయున్.

సీ. జయ యాత్రదలఁచు శేషనగాధి పాజ్ఞామ
య స్రక్చయం బఖిలామరగణ
మట సన్మ్రమకుటుంబు నట్లలంకారా
భిలాష భజించు విలాస గతుల

ననెడి యర్థము సహానాధి కరణైక
పరిణామమను నలంకరణమయ్యె
హరి కటాక్షములు ప్రబర్హ్మదులు కల్ప
దామములో ! చింతామణి మహిత రుచులో !

తే. రహిఁ బయో నిధులో! సిద్ధరస తరంగ
సంఘమో!యని యెంచి నిశ్చయము సేయు
నైన నిశ్చయ పర్యవసానసంశ
యాఖ్యమైన యలంకారమగుచు వెలయు.

క. హరి దరహాసము దిక్కులఁ
దరలఁ జకోరములు షట్పదములుఁ జ్యోత్స్న
వరమని సుఖించె నన ను
ద్వర భ్రాంతిమదభిధ మగుచువర్తిలు నెలమిన్,

చ. అసురకులాంతకోద్భట భటార్భటికాదు చతుస్సముద్ర వా
ర్యసమ మహారవంబగు మురాంతకు ఢక్కరవమ్ముగాదు సై
న్యసహిత భేరి గాద నెడి యర్థ మపహ్నవనామమై తగున్
వెస నది సవ్యమై యన్యతవృత్తిన నా ద్వివిధంబులై తగున్

తే. తొంబదియు నాఱు నుత్ప్రేక్షలింబుగాఁగ
నవి యుతర ధర్మ మొకటి యందమరఁదలఁచు
రాము పట్టాభిషేకాంబురచిత పంకి
లాంకురములనఁ బుప్పొడు లమరె ననుటు.

వ. మఱియునను పాత్తనిమిత్త జాత్యభావస్వరూప హేతు ఫలగమ్య త్ప్రేక్షాదులకుఁదత
న్నామ నిర్దేశంబుల నర్థానుగతి నుత్ప్రేక్ష తెలుంగఁదగు మఱియును—

సీ. రామ దోర్దండ ధారణమును చే ధారుణి
మృదుశయ్యనున్నట్లు మెలఁగె భూమి
ధర నివాసము మదిఁ దలఁచు కవ్వడ టన్న
జాతి హేతూత్ప్రేక్ష చంద మమరు
ధరఁ గల్పకమ్ముగాఁగ ధాత రాముసృజించె
నన జాతి హేత్వాపహ్నయముఁ దనరు
నతని భేరీధ్వని యరులున్న గుహఁ గల
యఁగఁ జూచ్చెననఁగఁ గ్రియాఖ్య నమరు

ఆ.వె. సుదతిఁ గల్పవృక్ష మొనరఁ బుట్టిన యట్లు
రామచంద్రుఁ డొడమె రహి ధర నన
నతిశయోక్తి యయ్యె నవి నాల్గు దెఱఁగు లౌ
పేర్మితో నభేద భేదగతుల.

ఉ. నారదుఁడబ్ధిజేరె నది నాథము రారి వసించు నెయ్యెడన్
గారణ మేమినాఁ దపము గైకొన వేఁడిన నిచ్చె నిట్టు నా
క్షీర సముద్రుఁ బోలి తన చెల్వుగ, నాతి శయోక్తియౌ తగున్
మీఱి యసంగతాఖ్యమగు మేరుగభీరవరానుకారితన్.

క. మురరిపు ఖడ్గము దానవ
వర కంఠము నందుఁ గల్పవాసన కుసుమో
త్కర మనిల యుక్తిఁ బడునను
టరయంగ సహోక్తియనఁగ నతిశయ మందున్.

తే.గీ. దినదినము సూర్యుతోఁ గూడి వనజ నేత్రు
శౌర్యరమ పూర్వగిరిని నిశ్చలతఁ బొదవె
ననను రూపాసహోక్తి నానతి శయిల్లు
మరికథలులేని కృతిరమ్య మగునె యనుట,

వ॥ రమ్యతాధిక్యోక్త్యలంకారంబగు. రామచంద్రుండు పూర్ణుండును నిష్కళంకుండు నగుచునుండు, చంద్రుండు కళంకయుక్తుండిట్లు పూర్ణుండగునను టయు రమ్యతావినోక్తి యగు మఱియు.

సీ. ఘనతవిశేషణంబునకుఁ దుల్యంబగు
ప్రస్తుత వస్తు ప్రశస్తి వినుతి
నన్యవస్తువు దోఁచు టది సమాసోక్తి యు
దానలక్ష్మి భాస మానవృత్తి
సప్తాంగ మహిమ నెంచంగ భద్రాత్మత
సార్వభౌమఖ్యాతిఁ బర్వె రాముఁ
డని దిగ్గజారోపణార్థమౌటది సమా
రోపణా లంకార రూఢి నమరు

తే. సుకవి రతిను బల్కు వేఱొకటి దోఁచు
టది యీ వక్రోక్తి ఋజువు గా నాడు మాట
అదియె వాక్యార్థ హ్వయంబున నతిశ యిల్లు
గజము మదమాత చలన రాఘవుఁడు నలరె

॥.వ అనుట స్వభావోక్తి యగుమఱియును.

క. వేంకట విభు దర్శనరో
మాంకురములు వొడమఁ బ్రముదితాంబులు దొట్టన్
గొంకక తత్కింకరులకు
నంకహో యని యిప్పు డనుట వ్యాజోక్తి యగున్

తే. గీ దైత్యకాంతలు తమ తమధవులఁ గలయ
నపుడు రోమోద్గమంబొట లక్ష్మ శౌరి
వలనిభయ మంచు విశ్వాసకలన మాన్చి
రనుట మీలన సంజ్ఞచేఁ దనరు నెలమి

క. ఝల జాత్ము కీర్తి లోకం
ఖిల విశదంబైన శంభుభువనాధిప శ
క్తులు నిజ వాహన రూపము
లలవడ నెఱుఁగరనఁ దద్గుణాఖ్యంబయ్యెన్.

సీ. ధర విరోధా కృతుల్ దశవిధమ్ములు వేంక
టాద్రి నాయకుఁడు పద్మాకరుండు
నైజలాశయుఁడు గాఁడన శుభతర వారి
ధారుఁడయ్యును దైత్య తాపకరణుఁ
డగు నను నివి విరోధాభాస భేదముల్
మునుపటి రాజుల ఘనయశమ్ము
రాముఁడా ధేయమ్ము గామేల్మిఁ దగునన
రహి విశేషా లంకరణ మనఁదగు

తే.గీ. నిదియుఁద్రది విధమ్ములగు నెన్ననిట్లు పెక్కు
విధముల విరొల్ల నెఱిఁగి కవిత్వ గతులఁ
గృతులుగావించు సుజనుఁడు కీర్తిఁగాంచు
వెలయుఁగల్యాణ వేంకట విభుని కృపను.

క. యత్నముల జనులలో స్త్రీ
రత్నమ్మును మఱియుఁబురుష రత్నమ్మును స
ద్రత్నమ్ము శిలల గజహయ
రత్నమ్ములు పశువుల రొంకరాజిత లీలన్.

క. స్త్రీ పుంస లక్షణమ్ములు
చూపట్టఁ గనెఱుఁగవలయు శోధితతత్త
ద్వ్యాపార శుభా శుభ ఫల
దీపితమది యగుటు శాస్త్ర ధీరతి విబుధుల్.

తే. గీ. అందు స్త్రీలక్షణము వినుఁ డంఘ్రియుగము
కుదురు మృదువునఁ దాఁబేటి పదువు లెస్స
గుల్ఫము లరోమశంబులు కుదురు బటువు
మేలు దొడలట్లు కరభమ్ము పోల వలయు.

క. నునుపు జిగి యవయవంబులు
దనరినఁగడు శుభము పిఱుఁదు దళమగు టయ్యునన్
వినుఁడు పురోభాగము మృదు
వనువుగ సమమైన వైభ వాధిక్య యగున్

చ. ఉదరము పై వళుల్ తెలివినొంది తగన్ ద్రివిధమ్ము లై ముదం
బొదవుచు నుండఁగావలయు నున్నతి నాఱు కటారి లీఱునన్
బొదలుచు గబ్బిచన్నవకుఁ బొందుగ మధ్యమసీమఁ జేరి సొం
పు దనరఁ జీమచాలనఁగఁ బొల్చిన కామిని యొప్పు నన్నిఁటన్.

తే. గీ. పొంగలగు వ్రేళ్లు చుక్కల సొబగు నఖము
లమరఁ బాటలరుచి పాణులమగు నున్న
కాంత యొంత యుఁ బ్రభుపరిగ్రహముగల్గి
సంతతియు వైభవస్థితి చాలఁ గాంచు.

తే. గీ. చన్నులకుఁ గ్రింద నాభితో నెన్నఁగూడి
గన్నెయున్నట్టి చెలువున వన్నెమీఱి
కడుపు గడునొప్పె నేనియుఁ బడతి పుత్ర
వతియు సౌభాగ్య వతియు నై యతిశయిల్లు.

క. కనుబొమల వంపు పలువరు
స నెడంబమరమియుఁ గచనిచయమున సన్నం
బు నిడివియు నలుపు గలిగిన
వనితామణి యైదువైథృవంబుగ వెలయున్.

క. కరములఁ బదములఁ జెక్కులఁ
గర మరుదగు కోమలంబు కలువల చెలిమో
మురు కాంతి కక్షములు గల
తరుణీమణి భోగ భాగ్యతన్ వర్ధిల్లున్.

సీ. అళికపు సుడి మోము పులిపిరి గలసఖి
దారిద్ర్య పీడలఁ దవిలి నదియు
గుంట కన్నులు నైఱి కుఱుచ చింపిరి వెండ్రు
కల చెలి రోగియై యలమటఁ బడు

వెం(డుకలరుణముల్ విషమాక్షీ విషముపాద
పుటింతి యాపద లెపుడు వొందు
గట్టి తనువు రోమకలిత చుబుకయైన
వనిత యెన్నఁగఁ గడు వంధ్యయగును

తే. పురుషువలె కంఠ నాదమ్ము కలుకు మొగము
గల్గురో మమ్ములరయ నాకుఁడు గలయది?
విధవయగు గొగ్గి పండుల వెలఁది జారి
ణియగు విషమేక్షణియు నట్లు నయగు పరుస.

వ. ఇంక పురుషలక్షణం బెఱింగించెద—

ఉ. సారస మందముల్ మృదువు చందము సంఘ్రుల నున్న మేలునా
యారుల రోమముల్ దళము సుత్కటినస్థితిఁ బర్వ నొప్పగుల్
జారుకరాబ్జముల్ బొమలు సాఁగి ప్రలంబములైనఁ జెల్వగుల్
వారక కేశ జానువులు వక్షము గుక్షియు నున్నతిం దగుల్.

సీ॥ పాదరేఖలు కేశ పాశమ్ము లింగమ్ము
స్నిగ్ధమ్ములైయున్న నెరయ మేలు
నఖపాణి చరణోరు నయనాంతములనెఱ్ఱ
దనమైన నైశ్వర్య ఘనత నమరు
స్వరనాభి సత్వమ్ములరయ గంభీరమ్ము
లైన భూపాలకుఁడగుచు మెఱయు
గండోదర లలాట కామ్య్రతివళులచే
నతిభోగ భాగ్యాయురాప్తిఁ దవరు

తే.గీ జంఘకంధర కృష్ణ హ్రస్వతయు లెస్స
చరణ రేఖలు చామరస్తనములఁదగు
చక్రములుగల్ల వైభవాస్పదుఁడునగును
విరివి పాదోదరమ్ములు వెలయటొప్పు.

తే. రోమ కూపాళి విస్తార రుచిరమమరు
నందు నొక్కొక్కటున్న రాజ్యానుభవము
రెండు రెండున్న మధ్యమరీతి మొలఁగు
మూఁడునాల్గైన దారిద్ర్యమునఁగ్రుంచు

కం. చెక్కుల భుజముల వీపున
ముక్కులఁ గర్ణముల రోమములు దట్టమైనన్
చిక్కున్ దారిద్ర్యంబున
ప్రొక్కులు గనుబాపలు వక్షముల నవిగలుగన్.

కం. తలవర్తుల త్రయంబున
నిలయేలున్ వ్రేళ్ల కనుపు లిరవగు రేఖల్
వలనన్ నాలుగు రెండున్
గలిగిన దీర్ఘాయురాప్తిఁ గడు దళుకొత్తున్.

ఆ. వె. నుదుటఁ గరయుగమునఁ బదముల నాల్గేని
రేఖలున్న భాగ్యవృత్తి నలరు
నంకుశాబ్జ వజ్రముల లసద్ధ్వజరేఖ
లడుగులన్ బొసంగ నధిపుఁడగును.

కం. కరతలమున మత్స్యాకృతిఁ
గరమొప్పగు పద్మరేఖ గల్గిన ధనద
స్ఫురణఁదగు ననామిక కణు
పరయఁ గనిష్ఠికఁ గ్రమించ నాయువు పొసఁగున్.

కం. చిటికెన వ్రేలికి పై దటున్
బటుగతిఁ బెను రేఖ ఛిద్రభావరహితమై
యటుఁ దర్జని మొదలంటిన
బటువుగ నూరేఁడ్లు బ్రదుకు ప్రస్ఫుటలీలన్.

సీ. అంగుష్ఠము నడుమయవరేఖ గల్గినఁ
బాడి పంటలు గల్గి పరిఢవిల్లు
చిటికెన వ్రేలి క్రిందటి పెద్ద రేఖకు
నెగువ రేఖలు గల్గ మగువ లనియు
మణిబంధ తన్మధ్య మహితాల్ప రేఖలు
పుత్రులు సుతనుతై పొసఁగఁ బుత్రి
కలు నటించు నెఱుంగఁగాఁ దగు నంగుష్ఠ
మూల రేఖలున్నట్టి లీలఁదనరు

తే. వ్రేళ్ల నడుములు వేర్వేఱ వెలయఁ గొల్చి
నట్టి సూత్రమ్ము మూరెడంతైనయున్న
నవతి వర్షంబులాయు వెన్నంగ నెంత
తక్కువైనను దక్కతి తగు నెఱుంగ.

తే. బాహుజానూరు యుగ్మమేర్పడఁగ పొల
యుగము సమముల విభుతచే జగతి వెలయు
జాను పర్యంత బాహువుల్ సరవిఁ గలుగ
నతఁడు మూర్ధాభిషిక్తుఁడౌ నధిక లీల.

కం. మడమలు మెడ భుజములు లా
వెడలక కుఱుచలగుచున్న నిలకుం బతియౌ
కడునరచేతులు కఠినం
బడరినఁ బదమ్మృదుత నాతఁడవనివిభుఁడగున్.

తే. గీ. నిడుఁద శేఫమ్ముచే లేమి నెరయనొందు
హ్రస్వ శేఫమ్మువలన ధరాధిపుఁడగు
మధ్యమంబైన నాతండు మధ్యముండు
నిరువలన గొని జాలు నెన్నిక వహించు.

కం. అరచేత ముసలమున్నన్
వరవిద్యాశాలి యగుచు వసుధనసుత భా
సుర రక్తిన్ బహుళ స్త్రీ
పరితోషణ నిరతుఁడగుచు భాగ్యయుతుఁడగున్.

కం. కనుబొమ నాసాపుటములు
కనుగవ శ్రుతులోష్ఠ చూచుకములున్ జానుల్
ఘనకూర్పర మణిబంధము
లానరున్ గటికర వృషాండ మొగి సమమైనన్.

కం. చెక్కులు పెదవులు భుజములు
మక్కువ దంతములు జత్రుమధ్యము హెచ్చున్
దక్కువలుగాక సమమై
చక్కఁగఁ గను పట్టు రాజ సన్మాన్యుఁడగున్.

ఆ. వె. ఏకవృషణుఁడైన నిలబలియగు లంబ
వృషణుఁడైన మధ్యవిధిఁ దనర్చు
విషమ కోశుఁడైన వెస రోగ దారిద్ర్య
బాధలొంది పీడబడుచునుండు.

తే. గీ. సింహశార్దూల గజవృషస్థిర గమనత
నాయురారోగ్య భాగ్యభోగాన్వితుఁడగు
నోష్ఠ హనునాసికల నెఱుపొదవెనేని
భాగ్యవంతుండు వాఁడె శోభనము లలరు.

కం. ద్వాత్రింశద్రదనములే
కత్రింశత్త్రింశదుచితగణనకలిగినన్
ధాత్రీశుఁడగున్ దత్సం
ఖ్యాత్రితయన్యూనతన్ మహాకృపణుఁడగున్.

తే. గీ. తనదు జోటు వ్రేల దేహమంతయును నూఁట
తొనిమిదైనను భూచక్రమేలఁగలఁడు
షణ్ణవతి సంఖ్య మధ్యమసరణిఁదనరు
నంతకుందక్కువైన వాఁడధముఁడగును.

సీ. పార్ష్ణ్యంగుళీగుల్ఫపదజానుజంఘలు
కటితటస్తన నేత్రకర్ణయుగము
భుజహస్తనాశికంబులు నండకములు
సముద్వంద్వంబులునుగాళ్లు తలముగోళ్లు
కన్నులు పెదవులు గడునిగుళ్లన్ జిహ్వ
రాజిత శుభవిభారక్తకములు
వక్షశ్శిరః ఫాలకుక్షి పదములు కం
ఠశ్రోత్రనాభి పృష్ఠములు విరివి

తే.గీ. వక్త్రకరగుల్ఫ జిహ్వలు వర్తులములు
కచచుబుక తారకా భ్రూయుగమ్మునలువు
దంతములు నేత్రములు చాలధవళరుచులు
గలుగు వారలు శుభసౌఖ్యకలనులిలను.

కం. పిక్కలు కచదంతమ్ములు
త్వక్కున్ వ్రేల్ సూక్ష్మమైన వాఁడధిపుఁడగున్
మక్కువఁ గక్షభుజమ్ములు
నిక్కిన యాతండు ధారుణిన్ బూజ్యుఁడగున్.

కం. కనుబొమ తుదలఁ బ్రదక్షిణ
మునఁదగు సుడిగలిగెనేని మూర్ధన్యుఁడగున్
ఘనరేఖాస్పదత మృదు
త్వనిరూఢిన్ మాంసయుక్తిఁ దగు చరణమ్ముల్.

తే. గీ. అమరు మధుమత్స్య మాంసగంధముల శుక్ల
మొనరెనేనియు సంతతిఁ దనరఁగాంచు
ఛత్రచామరపద్మకచ్ఛపధనుశ్శ
కటమకరమీనరేఖాంఘ్రికములు శస్త.

కం. మణిబంధరేఖ సడిగ్రేవేల్
గణుతింపఁగ నంటియున్న ఘనసిరులాందున్
బ్రణుతగభీరోక్తులచే
రణితాలంకార ధృతివిరాజిత నొప్పున్.

కం. తుమ్మికడు చప్పుడైనన్
సమ్మతి నధికాయురాప్తి సమ్మతిఁ గాంచున్
ఇమ్మహిఁ బూరుష లక్షణ
మిమ్ముగ నీరీతి వెలయు నింతయు నొప్పున్.

వ. ఇంక సకలైశ్వర్యమ్ములకు నాధారభూతంబగు గజలక్షణం బెఱింగించెద.

మ. గజజాతుల్ [గుణ] ముల్ మదస్థితులు లోకన్ హేతుభూతాదిరు
గ్వ్రజనైదాన చికిత్సలున్ దెలియ దేవన్ మీఱఁ గాప్యాయనుం
డు జగన్మాన్య విశంపనందనుఁడు శిష్యుల్ మెచ్చఁ గావించి రీ
గజశాస్త్రింబు తదీయ గర్భ జననాథప్రాప్తముల్ లీలలన్.

కం. పూనిక లోహక వీతా
శ్యానకలామశ గవాక్ష సైంధవ వనముల్
వ్యానర నిరసీకములున్
స్థానంబులు ద్విరదకోటి జన్మంబులకున్.

సీ. ఈయష్టవనములు నెన్నసీ దేశముల్
గిరులును గలవొటఁ గరులు దత్త
దర్థాఖ్యలం బొల్చు నందభద్రలు మంద
మృగములు సంకీర్ణములగను జాతు
లగు నాదిచర్యయు నంతచర్యయునాగ
మలములు దిగుటు మొదలఁ దుదలను
గల లక్షణములాదిగ మదించి నిల్చుట
యావలింపుట నీల్గుటడవి కొమ్ము

తే.గీ. గ్రుద్దుటది పైసరంబట్టి గుఱుతు నడత
కీలుమేలును గత్తెరకాలు నులిమి
చూపు సంతతధారయు నేవుమీఱు
టంత చర్యయు నాఁగ గజాళికమరు

శా. షండత్వంబును గట్టికొమ్ము గవ విస్తారాతి నేత్రాంతముల్
దండిన్ లావగు కంఠభాగము మృదుత్వక్కర్ణముల్ గోళ్లు ను
ద్దండ ప్రాభవ సాహసమ్ము విపరీతంబైన చర్యల్ మహా
శుండం బేటును మండలమ్ము మద మెచ్చున్ జాతి భద్రాఖ్యమై.

కం. నిబ్బపు మొగముల్ గమకము
సుబ్బగు వెన్నముక కుదురు నొరపుల్ సమమై
యుబ్బరమగు కుంభము లా
గుబ్బగు చూపులును భద్ర కొమ్ము సయిక మై.

మ. పొగరున్ గంఠము త్రొక్కునన్ శిరము నొప్పన్ బృష్ఠభాగానతం
బొగి జాతింబగలేమి యన్యకరిపై నుత్సాహితం బోవుటల్
తగు సత్త్వమ్ము జనమ్ము చల్లనగు వాతంబానుటల్ గల్గి సొం
పగు నా నల్ల మదంబు మందకుల ముద్యద్రాజసన్మాన్యమై.

సీ. కాలికంబమ్ము నైకము రోమములు చాల
గలచెవి గూబలు గండయుగము
తోక విస్తారమ్ము తోరంపు గొమ్ములు
ప్రక్కలం గోశంబుపట్లు నుత్త
మారదృష్టియు స్వకీయారోహకానుకూ
ల్యము వామ దక్షిణలలితపార్శ్వ
వర్తులావర్తముల్ వైపరీత్యము లొంట
మద గుప్తమును సౌమ్యమహిత గణన

తే.గీ. మున్నతియు నొప్పు మృగజాతి కురువివేక
మమర గజములకెల్ల నిట్లనుపు మీఱు
దక్షిణోత్తరములకుఁ బ్రదక్షిణా ప్ర
దక్షిణమ్ముల మృగజాతిదక్కు నెలమి.

ఉ. వెనుకటికాళ్ల సెకి కును వెన్ను ననున్నతి దీర్ఘహస్తమున్
ఘనతర కార్శ్య దుర్గుణ వికాసము చక్కఁగ బండు కొంటయున్
మును వెనుకల్ మదంబు క్రమమున్ దగ నబ్బు నబ్బమూలకుం
తెనయఁ బ్రకీర్ణ జాతిగల యేనుఁగు మానుగఁ బ్రోది మేదినిన్.

కం. ధరఁ ద్రింశత్సంవత్సర
పరిమితమున్ దంతవృద్ధి పాటిలు ధైర్య
స్ఫురణంబాయుర్దాయము
పెరుగున్ గజములకునెల్లఁ జేర్మిదలిర్పన్.

చం. పటువన సీమఁ జెల్వొఁ దగు భద్రసజాతిగజంబుఁ జూచి వి
స్ఫుటమగు మంతు జంతు పతిపాల్కుఁడచే మృగదంతిరొప్పు ని
న్నిఁటుఁ దెలివొందు మిశ్రకరి నిర్మల సంగర సాహస క్రియా
నటనకు దిద్ద విక్రమ గుణంబు భరించు పురీణమెంతయున్.

కం. కండలు నైత్తురు లుఱలిన
గండడగదు భద్రదంతి గంభీర విదో
ద్దండాఖ్య నొప్పునది వే
దండకులోత్తమము నాల్గు దంతముల దగున్.

వ. కలివేళ భద్రమంద లపూర్వంబులైనను సంకీర్ణంబును దద్గుణ రూప చిహ్నములు మిశ్రంబైయుండువలనంగదా సంకీర్ణజాతినా దత్కాలంబున బహుళంబయ్యె మఱియును—

కం. కలుముల కెల్ల న్నెలిమి
దళశృంగారమ్ము రణవిధాన జయార్థం
బలఘు శ్రేయస్కరమగు
నిల గజలక్ష్మి గల విభుని కెదురే! యెవరున్.

కం. శిరమును బూర్వోత్తరములఁ
జరణద్వయ మును కపోల చక్షువులున్ ను
స్థిరకర్ణ మూల మేఢ్రము
లరయం జెవిక్రింది దిస్నె లష్ట మదమ్ముల్.

కం. శీకర సాగరనిక్త్రక
ప్రాకట లవ మేఘ మధు విభాకుండల గం
ధాక్రమాఖ్యల మదములు
శ్రీకరకర్యంగములఁ బ్రసిద్ధివహించున్.

సీ. శిరమెత్తరము మోము సిబ్బెంబు బిగువును
గాలి కంబంబుల మేలికుదురు
కొమ్ముతోరంబును గొమ్ము— పదిలంబు
వెన్ను విస్తారంబు కన్ను దెలివి
విడుఁదతుండమ్మును వెడఁద వాలమ్మును
వలఁ గొనుసుళ్లచే వలకలి దెస
యప్రదక్షిణపు సుళ్లనువగువామభా
గంబును గలినదంతంబులు వగ

తే.గీ. సమరునది రాజరాజార్హమైనగజము
భద్రమాతంగ మదిరా శోభన కరంబు
చతురకరి గల్గుకంటె నైశ్వర్యమెద్ది
మేలిమిగలట్టి ధారుణీ పాలురకును.

వ. శాలిహోత్రగర్గ్య శ్రీశ్రుత నైషధ, గణ, మానప్రియ, అతికాంత రాజకాఖ్య లంగల శాస్త్రంబులెనిమిదియును గజరోగనిదాన హేతుభావ చికిత్సలు వక్కాణించు నందు జ్వరంబులు గజజాతికిఁ బాకలంబులును దురంగమ్ములకు వేధలుననఁదగు నట్టి పాకల దశకంబును ద్వాత్రింశత్పాదరోగంబులును గూలకుక్కుటాది సత్త్వవాహనంబులును ద్వాదశ శోభలు, శాల్మలీకదళీ తండులంబులను జతుర్వింశతి నేత్రరోగంబులునుంగలవు గుణచర్య దృష్టకర్షంబుల వలన నే తద్విపరోగంబు నెఱింగి తదుచిత చికిత్స లొనర్ప వలయుఁ బాకలంబుల యందసాధ్య బాహుళ్యంబగు నిది గజ లక్షణం బింక నుష్ట్రజాతి భేదంబు తెఱింగించెద—

ఆ. వె. ద్విఖురి చక్రవాళి ధృతినొప్పునందున
త్యధికధార సతతమమరు ముదము
తలచు కేశపంక్తి కుఱుచయౌ మెడ మేటి
బరువు మోచు ద్విఖురి తెలుఁగు నెరయ

కం. బటువగు గౌరిశల పాదముల్
పటుమదము వసంత వేళఁ బ్రబలఁగ నాల్గై
ల్లటఁ దనరు నల్పధారలఁ
జటులగతిన్ జక్రవాళి సరణిఁ దలంచన్.

చం. పశువులకైన రోగముల భంగిరా
యుష్ట్రికులామయమ్ము త
ద్దశలరు కింతు క్రపసవదండము
నెల్గుల రక్తముల్ గలిన్
లశునము రాతియుప్పును బలం
బొనఁగూర్చుఁ జికిత్స నేయుచో
విశద వివేకరుక్ప్రథిత
విశ్రుత బుద్ధుల సిద్ధ చర్యలన్.

వ. ఇంక నశ్వలక్షణం బెఱింగించెద—

కం. ఆవర్త...వర్ణా
భావ చ్ఛాయాగతి ప్రభావనుగుణ శో
భావహలక్షణ రుగ్గో
షావళిఁ దెలియంగవలయు నశ్వములరొండన్ !

ఉ. కందము మందముఁ గుదురు గల్గినయంఘ్రులు సూక్ష్మకర్ణముల్
కందువలందు మేల్ సుడులు కాయపు నిద్దము ముద్దుమోము నీ
టందపు వాలమున్నత మహాజవముఁ శిరసెత్తడంబు సొం
పొందు గుణమ్ములుం గలుగు నుజ్జ్వలవాజియె లక్ష్మియన్నఁగన్ !

మ. అనిలోఁ గాయముదాఁకి ప్రేవుగమి జీరాడన్ వడిన్ శౌతవనిం
టనిరుఁ నైజబలంబుడంబమర వాటంబొప్పఁ దచ్ఛిహ్నముల్
గన నెచ్చన్ బయనమ్మునం జడియ కేకక్రుక్రియంబొల్చు నెం
దనుమానించదు నత్తమాశ్వ గుణమీయందమ్ము లింపొందఁగన్ !

కం. అనికిన్ వేఁటకు వేడుక
కను వాహన మిద్దియని గుఱ్ఱము బోల్పన్
జను నే! బహు గజములు గల
మనుజేశుండశ్వవిభుని మాడ్కింజను నే !

కం. కలన నైడి జలధిలోపల
నలవగు సైంధవము మందరాద్రిగ నరులన్
గలఁచిమథింపక యాలక
కలుగునె! జయలక్ష్మిశౌర్య కలితుల కెందున్ !

సీ. విదితమ్ముగా నూట పదిసుళ్లు గలవు
తురంగమంబులకుఁ దత్క్రమము తెల్పి
దగు విధంబుల నుండు నావర్తమని యెడి
సుడిగలి ముకుళమ్ము సొంబగుమల్లె
మొగ్గ చందము జెట్టి మురువున శతపాది
పాదుకార్ధము ఖండభాగరీతి
చిప్పమాడ్కిని శుక్తి యొప్పగు పదభాగ
కొమ్ము రూపమున మరాకుడు విధమున

తే.గీ. తగు సమూహాయవ విధము దూడనాకుడు
కరణి నిట్టి గుఱుతు గల్గు సుళ్లు
దనరు నిట్లు సుడుల స్థానఫలమ్ములు
దోషములు నెఱుంగఁ దొడరు శుభము !

ఆ.వె. మూఁడు పదుల మీఁద మొనయఁగ బుషిసంఖ్య
సుళ్లు శుద్ధములు విశుద్ధలీల
నబ్బుకేఁడు సుళ్లు డబ్బదియాఱని
నాఁటి కాలములు నికి పదుపు వినుడు !

కం. శతపాది శుక్తి పాదిక
మితముల రెండంగుళముల మితిఁ ద్ర్యంగుళ సం
గతి యవవిధి పాదాంగుళ
మితి ముకుళము పూహ యాఱెనిమిది యంగుళముల్ !

కల. ఆవర్తపాదుకార్ధము
లావాజుల తనువుకొలఁది కనువై యుండున్
రావులు కొలఁదులుదప్పిన
చో విదిత ఫలమ్ములొసఁగ జూడవునుమ్మీ !

డం. శిరమున నుదుటం బ్రక్కల
నురమున రంధ్రమునఁ దగుతదుపరిస్థాన
స్థిరత దశధ్రువముల నా
నురుచిరముగఁ గల్గు వాజి శుభములొసంగున్ !

కం. నరనారాయణ గుహయ
తురాతుసమరుత్తులు రవిశశిదస్రులునున్
మరుఁడునధిదైవతములు
ర్వారఁ దేజికిఁగలదశధ్రువములకుఁ దొరుసున్ !

మ. సరిమస్తమ్ములు లేనివాజుల కరస్పర్శమ్మునుం జేయ రా
దరయన్ స్థానములందు లేనికొడ లాయంబెల్ల శూన్యంబుగా
నెరయన్ వర్తిలు రావులంగలుగ నెన్నేయొండ్లు వర్ధిల్లు ను
స్థిర సౌఖ్య ప్రదమౌ ధ్రువంబు లెడయన్ శ్రీ పాయు తద్భర్తకున్ !

కం. హీనాధిక్యములైనన్
స్థానమ్మున లేమి ధ్రువలు జనియింపమియున్
వానిం గనుగొనదోషం
బానికపది ధ్రువలు లేని యశ్వముకొఱయే !

సీ. నెలవులయందునఁ జికురంబు నెడ నోఁట
రెండేసి కొంప్యెడ నుండు మూఁడు
నొసల నాలుగు సాది నుతి నున్నతంబగు
భాగమ్ములను నుఱ్ఱ్ పదియు రెండు
కంఠనిగాళముల్ కరయుగమ్మున నాల్గు
కచహాను వదనసంగతుల మఱియు
నెనిమిది పూర్వోక్తమీ సంఖ్య స్వస్థాన
ముల నుఱ్ఱ సంపదల్ గలిగి వెలయుఁ

తే.గీ. నెలవు మఱిదేవమణియున్న నెరయ శుభము
పరఁగఁ గంఠాభరణము శోభనములిచ్చు
నివి గలుగు గుఱ్ఱముల నెక్క నవనియేలు
గళమునన్ శక్తి సుడియున్నఁగలుగు శుభము !

కం. సకలైశ్వర్యమ్ములు న
త్యకళంకయశమ్ము నిచ్చు నవి గళసీమన్
బ్రకటముగఁగల్గ మదిన
మ్మకు కంఠాభరణ దేవమణు లెడలైనన్ !

కం. గళమునను దేవమణి తగఁ
గల గుఱ్ఱము నెక్కి యింద్రు కరణిన్ మెఱయున్
వెలయఁగ నదిముందరిదెసఁ
గలిగిన రిపుజయముగాంచు గను సౌఖ్యంబుల్

చం. నెలవుల రెండుసుళ్లు గల సింధుజ మిష్టములిచ్చు రంధ్రసీ
మల నల మేఘరీతి సుడి మానుగ మేలిమి నాఁదనర్చు న
ట్లలవడు వాజినెక్కి మణిహేమవిభూషణముల్ ధరించు గూ
బల వృషభాఖ్య సుళ్లనికి పట్టుగఁ గుండల ధారణుండగున్ !

సీ. నాలుగు మూలల నాలుగు సుళ్లాన
నంబునఁ జతురంతికంబనఁ దగు
వక్షస్స్థలమున శ్రీవత్సకి యదిగల
సైంధవంబైశ్వర్య జయములొసఁగు
రీతి మూలల మూఁడు శ్రేతాగ్నియది ముఖ
మున సున్కి రాజ్యాది ఘనతఁబొసఁగు
నెఱి మూఁడు దొంతరనిశ్రేణి రాజ్య ప్రదమ్ము
ధామ్మునవైనఁదనరు సుఖము !

తే. యమళమన రెండు సుళ్లు జయప్రదమ్ము
భుజములనుమూడుఁ సుళ్లన్న భూషణములు
కలిగి వర్ధిల్లు లక్షణ గరిమ లెఱిఁగి
మేలివాజుల నెక్కిన మేలుగలుగు !

వ. మఱియుఁ బ్రసాద చిత్రతోరణ ధను శ్శ్రీ సరసీరుహ వేదిక స్వస్తిక శ్రేతాగ్ని యమళ నిశ్రేణిక చతురంతిక గదా చక్ర కలశ లాంగూల శక్తి ఖర్జూర ఖండేందు వజ్రాయుధ అంకుశధ్వజ రథ అశ్వత్థదళ సూర్య అష్టపద అండజ పాంచజన్య

భావంబులను భ్రువలునుంగల తురంగంబుల నేలిన నృపతికి శత్రు జయంబును దద్రాజ్య లాభంబును గలుగు నింక దోష మహాదోషములగు నావర్తంబు లెఱింగించెద—

చం. గళమున శంఖదేశమునఁ గన్నుల క్రేవల జంఘ లందుర
స్థలమునఁ గిందుసందులను జానువులన్ గకుదంబునందుఁ బ్ర
క్కలఁ గటిదంతవాలముల గల్గిన సుళ్లఁ దురంగమంబు ని
చ్చలు నొదవించు రౌతున కసంఖ్యములైన యరిష్టసంతతుల్

తే. కక్షమున వెన్ను దెస నాసికాపుటముల
నాభి భ్రూమధ్యమున వృషణముల జబ్బ
ల యెడ రెండేసి సుళ్లున్న హయముఁ జేరి
యంటి గ్రుంకిడి రవిఁ జూచు టర్హ మరయ !

కం. ఇవిదోషపు సుళ్లనఁదగు
నవిరళముగ మూఁడు నాల్గు నయ్యైయెడలన్
వివరమగు సుళ్లు గలిగిన
నవియె మహాదోషసంజ్ఞ లశ్వమ్ములకున్

వ. ఇంకను వర్ణ జాతి రోగ నిదాన చికిత్సాక్రమంబు లెఱింగించెద—

కం. నేలం గోరి నేలఁ గొట్టుచు
మేలిమి బంగారుచాయ మేనున గమనో
ల్లీల శిరశ్చలనాశ్వము
హాళిన్ ద్విజకులము గత్తెరనఁ గలిమొసఁగున్ !

కం. మొకమున బిగువు జపాకిన్
శుక దాడిమబంధుజీవ సుమరుచియు తుత
ప్రకటిత జడియమి రాట్కుల
మకుటిల మది పూజకర్హ మగు తేజి ధరన్ !

తే. శక్రకోదండ పద్మకింజల్కశుక్లవర్ణ
మది వైశ్యకులమగు వాజి దాని
నెక్కునాతఁడు సిరులెల్ల నేలు యశః
విభుఁ డగు నాధనవంతుఁడౌ విశ్రుతముగ !

కం. హరిమణికోకిల షట్పద
సురుచిర వర్ణములుఁ గలిగి శోభనవేగ
స్ఫురణన్ ధాన్యప్రదమై
కరమొప్పగు శూద్రజాతిగలయశ్వంబున్ !

ఉ. మంగళ నీలజంబుగరిమం దగు గర్తళి బోరబొల్ల సా
రంగియుఁ జారి యుత్తరజరక్తియు గండియుఁ బంచభద్రయున్
బింగళ బిబ్బ జయ్యడనఁ బేర్మి విషుం డళిజాతి నాఁగ ధా
త్రిం గల వర్ణసంజ్ఞలను దేజులకుం దగు నామధేయముల్.

తే. పంచకల్యాణియనఁదగు పాదవదన
పాండురంబును కర్ణముల్ వాలవతు
ములు నవియుఁదెల్పు నష్టమంగళి యనఁదగు
నచ్చమగు తేజి బోర నా నతిశయిల్లు.

కం. ద్విజకులము కాచారము
రాజునకున్ మహము ధేను రాజికిఁ బాలున్
వాజికి వేగము ముఖ్యం
బోజన్ వేఱు గుణమేల నూహింపంగన్.

ఆ.వె. అల్ప మూల్యలబ్ధ మాజి లబ్ధంబును
జోరలబ్ధమైనచోఁ దురగము
లక్షణమ్ము లివి నిరీక్షింపఁ బనిలేదు
సొంపు మీఱ సంగ్రహింప వలయు.

చం. శనగలు దిన్నచోఁ గయిపు సల్పినచోటు జలమ్ము నార్చుచో
ననువుగఁ గింకిణుల్ గళము నందిడుచో నుపచార వృత్తిచో
ఘనముగ నేర్పరెక్కు నెడఁ గల్గు హయాళికి సంతసంబు నె
మ్మనమున నుబ్బునుం బలిమి మానిత ధైర్య సమగ్ర వైఖరుల్.

కం. క్షతరోగ లోహబంధన
తతరణ గజభట నినాదతన్ వహ్ని జలా
ద్భుత మృతదశలను సురుధీ
రత లల యశ్వముల ధైర్య రహితం బనరున్.

తే. దురమునకు నేర్పులేమియుఁ గఱచుటయును
గందమటు నప్పళించినఁ గదలమియును
తఱటుచేఁ గొట్ట నురకమి తన్నుటయును
గలుగ దుష్టతురంగ మాఖ్యను బొసంగు.

కం. వెల్లుల్లి జయజ వాకుడు
వెల్లగు మిరియాలు శొంఠి పృథుమాగధులు
ద్యల్లీలఁ గూర్చు కవణం
బల్లన నిడ వాతరోగమది మాను తగన్.

కం. నరులకు నాడియు గజముల
కరయఁగఁ దగుగతి విశేష మశ్వమ్ములకున్
బరికింప నేత్ర వర్ణము
లిరవగు రోగములఁ దెలియ నివిలక్షణముల్.

ఉ. కన్నులు పద్మ పత్రముల కైవడినుండిన స్వస్థదేహముల్
ఎన్నఁగ నల్పు మించునెడ నెంతయు వాతము దాదియేకురీ
తిన్నెర పల్చనౌ తెలుపు దేఱిన శ్లేష్మము పైఁడి ఛాయదై
యున్నది పైత్యమైది తగ నున్నదియుం దగు మిశ్రరోగమై.

సీ. కన్నీరు బిందువుల్ గా నేత్రముల నున్న-
జ్వరము తత్తద్వర్ణ సంగతముగ
నలుపాకు పసరును [నలి?] హరిద్రాఛాయ
యగు గచ్ఛకాయ యొప్పుందముదగు
తెలుపు ఛాయయును గాజులరుచి మక్షి-
కోజ్జ్వలము శంఖౌలూక విలసనంబు
కన్నులఁ గను పట్టియున్న గుఱ్ఱంబున
కాయువు నిర్ణయ మరయ వరుస

ఆ.వె. నైనిమదియును ఒదియునేండ్లు పద్మాలుగు
పదియునేఁడు రెండుపదుల నిరు :
దియును మూఁడు నిరువదియునాఱును౦ బది
తొమ్మిదేండ్లు దెలియఁ డిమ్మగాఁగ.

సీ. గుండు గుఱ్ఱములైదు గోడిగ నొక్కటి
ప్రాఙ్ముఖంబున నిల్పి రహింనిషోడ
శోపచారమ్ముల నేపునఁ బూజించి
యుల్లియఁ బసపు నయ్యుత్తరేణు
విత్తులు వసయును వేపాకు జీరక
తండుల వ్రీహులత్తతిని మూట
గా గళమునను రక్షాబంధనము నేయు
టనుళు మహానవమిని నొనర్పఁ

తే.గీ. నారవుతు నెల్ల సౌఖ్యమ్ము ల నుభవించు
రోగముల బాసి తురగముల్ రూఢిఁదనరు
మఱియు దశవిధ ధాన్య హోమములు సూర్య
తనయు రేవంతు ప్రార్థనల్ తగవు మిగుల.

శ్లో. నమో దేవాది దేవాయ
తురంగాణాం హితాయచ
సూర్య పుత్రాయ దేవాయ
రేవంతాయ నమోనమః

సీ. రేఁపును బగఁటను మాపొద్దు శస్త్రింబు
కొమ్ము జలూకంబు కొని రుధిరము
నశ్వంబులకు రోగ మరసి తీయఁగ నర్హ
మదిరోయిండు పది ద్వాదశాంగుళముల
పాడవునఁ గలరక్త సుదరి వెల్వడుటన
శ్వాళ్ళములకుఁ గ్రశ మబ్ధిఫేన
గంధమణుల్ సింబు ఘనలికుచరసమ్ము
లవి తేనెతోఁ గుక్కుటాండ యుక్తిఁ
జెలఁగఁ బిప్పళ్లు మృదువుగా నెలమినూరి
కలిక మిడినంత నక్షిరోగములు మాను
సరవి నెత్తురు దీసి రసమ్ము నిడ్డ
గంతు లడఁగు దురంగమగణములకును.

కం. రసములకును దంగేడా
కసముఁనఁ గట్టినను మాను నడఁగమి నవిచిం
చిసరగ నుప్పదిమినచో
పొసఁగఁగల్ లఘు వగుచుఁ బాదములు చెలువలరున్.

చం. తనువునఁ గంతులున్న విదితంబుగ దోషపు వేఁకి దాఁకినన్
బెనుపగు తిప్పతీగె నరికిండియునున్ గొతిమర్లు చందుమా
లనియతి జీరతైలములు లాలితరీతి లవంగయుక్తిమై
పసుపుడఁ బాలతోఁ గలయ బాగుగ నూరి రొమ్ముసంగ మేలగున్.

తే. చల్లనగు మేనుతత్తమున్ జ్వరము నాఁడు
దంపువేళ్లను వట్టిరు గుంపువేళ్లు
పటికపాయమ్ము మూఁడవపాలుజిక్క
కాచియిడ నశ్వములకింపుఁ గదలుజ్వరము.

తే. శొంఠిపిప్పలి వసయును జూర్ణముగను
జేసి తొల్తఁ గషాయమమ్ము పోసియిడిన
సరగ విడుచును దప్తమగు జ్వరము మఱియు
నరచికిత్సలు విహితంబు తురగములకు.

కం. తనువత్యుష్ణత సంతా
పనిరోధజ్వరము గళముపట్టుఁ గురకుర
ధ్వనులకును దోసకాయయుఁ
బనుపడఁ గొతిమర్లనరఁటి పండ్లిడమానున్.

వ. ఇంక రత్నలక్షణం బెఱింగించెద——

గీ. కెంపు వజ్రంబు ముత్తెంబు గొంపు మరక
తంబు వైడూర్య పుష్యరాగంబు లింద్ర
నీల విద్రుమ గోమేధికాళి దగ న
వగ్రహాధిపరత్ననవక మొలమిని.

సీ. వెలలేని మణి కురువిందము లివి రెండు
భంగులా కురువింద పద్మరాగ
మాంస గంధియుఁ గెంపు మఱియు సౌగంధికం
బనునందు నుదయార్క పటిమ దీప్తి
పద్మరాగము పిక ప్రకటాక్ష రుచి
కురువిందంబు దాడిమ విరి పోలుఁగున
కురువింద మతిరక్తతర మాంసఖండంబు
బలె మాంసగంధియు నలుపునెఱుపు

ఆ.వె. గలుగు నిగ్గు నీలగంధి వీక్షింపఁ గ
లాఖులేఁత తోమలములుగాఁగ
గొరిది కెంపునది యశోకకింశుకలోధ్ర
సమవిభాతిఁ దనర నమరుమేలు.

తే. పేర్మి లశునత్రాస భిన్నముల్ పటలంబు
జర్ఝరంబు కర్కశమును నీల
మనఁగ దోష షట్కమగు కెంపుజాతికి
వేఱువేఱ వాటి విస్తరింతు.

కం. పాలుపయిఁ దోయఁ గనుపడు
డాలది లశునంబు సిరుల డంబడఁగించున్
లీలన్ బగిలినగతి రే
ఖాలత్యము త్రాసమగుట కలహము నేయున్.

ఆ.వె. తునిఁగి పోయినట్లు తోఁచుట భిన్నంబు
బంధువైర కార్య పరిణతిఁదగు
చిమ్రపమైన రీతిచేఁ బటలంబది
శోకకారణమ్ము ప్రాకటముగ.

కం. పొరలున్న జర్ఝరంబగు
నెరయఁగఁ గర్కశమునగును నెరి సంకటమై
నెర నైల్యము నీలమ్మగు
పరువడి వెలువకును దిగుడుపాటుగు నెందున్.

కం. సున్నయగు మీఁదబిందువు
లున్నన్ జూడంగదోష మొదవుం దానున్
వన్నెదగు పద్మరాగం
బన్నది వెలకెచ్చు సూర్యుఁ డభిమత మొసఁగున్.

సీ. హిమ మతంగమ్ముల నిలబుట్టు గృతయుగ
కాశ్మీర కోసల ఘనవిశాల
ములఁ బుట్టు త్రేతను వెలయంగఁ బాండ్యసౌ
రాష్ట్ర భూముల ద్వాపరంబునందు
హీరాగ దేశ విదూర భూములయందుఁ
గలికాలమునఁ బుట్టు నెలమివజ్ర
మణులు దాఁకటఁ బెట్టి గణన సంబెటను
వేసిన తగ్గకయు విరిసియును బోక

తే.గీ. బెడిసియంతటఁ బడునది విరుదువజ్ర
మదిపురుష రత్నజాతియై యతిశయిల్లు
శుక్రుఁ డధిదైవతముగాన శుభములొసఁగు
ననఘ మగునేని రాజ భూపార్హ మగును.

కం. మల్లె విరిచాయ ద్విజకుల
మల్లనఁ బల్లవము కాయనగు రాట్కులమున్
మొల్లపుఁ బసిమిన్ [వైశ్యము]
పొల్లన నలుపైన శూద్ర మిత్తెఱఁగమరున్.

తే. పగఁగు సుకృతమ్ము కలిమియుఁ బాపహరణ
విభవములు గల్గు పరుసతో నీటిఁజాల్చ
నా ఋనుూలలుఁ ఉదియు రెండైనధార
లమరుఁ జుల్కనగల వజ్రమదియె మేటి.

సీ. నడుమ నల్లనిరేఖలడరఁగాకపడమ్ము
దాఁచినవాఁడు నిర్ధనికుఁడగును
వింతచాయలు గల్గ విచ్ఛాయ నిజఛాయ
తెనిమిది మలినమ్ము లీనకోణ
ధారలు లేనివి తగ నుండనంబగు
జరగు దోషములు వజ్రముల నిట్లు
శుద్ధవజ్రము దాల్ప శుక్రుఁడు వరమిచ్చు
వినుము త్రైగుణులు. దశవిధములరయ

తే. జలదజమ్ములు నిర్జరసమితి దాల్చు
పాముతల యది గురుగింజ భాతి విషహా
రంబునగు కీచకజము తారకముభాతి
దాల్ప శ్రీవశ్యకము శుభదంబునగును.

ఆ.వె. గండుమీలఁ గలది వెండి మల్లియచాయ
లడరు దాల్పనగ్ని యంటుదెందు
నిలను జెఱుకువలన వెలయు ముత్తెమ్ము శ్రీ
రాజవశ్యకము ధరాతలమున.

కం. కిటిదంత సంభవంబది
పటు భూపార్థ్వమ్ము రేగుపంటి గతిఁబగున్
స్ఫుటతామ్రపర్ణి సింగళ
నటరావణ శుక్తి ముక్తి శావధు తెలమిన్.

ఆ.వె. తామ్రపర్ణిఁ దక్క దక్కన వరుదుకుం
ఖనిఁదలంప మఱియుఁ జినుకు తెంత
ముత్తెము శుక్తిఁబడిన నట్లన సంతేని
ముక్తికములు పుట్టు మహితగతిని.

కం. కెంజాయ సింగళమ్మున
రంజిలు బంగారువన్నె రావణమున ని
ల్లుంజను సురాక మాణియు
మంజుల పాణియును త్రివిధ ముక్తికజాతుల్.

తే. తనరుఁ ద్ర్యశ్రంబు పార్శ్వకుంతనము కాక
పాణిస్ఫుటకంబు శుక్తికాస్పర్శనంబు
నరయ నతిరక్త మత్స్యాక్షులనఁగ జా[గ]
రంబు ధూమాంకమనఁగ దోషంబు లమరు.

కం. గోమూత్రములోఁ బడనిడ
నామిక దేలినది తెస్సయౌట మునిఁగిన చో
నాముత్తెము కృత్రిమమగు
శ్రీమహిమం దాల్ప విధుఁడు సేమము లొసఁగున్.

సీ. పాలపక్షి గరుత్తు బాగు నెమలి పురి
యందము గాజు పెంచెంద గురుచి
యలదూర్వముల వన్నె బలు రక్కసపువిరి
మహితదీప్తియుఁ బాలు మానికొమ్మ
చిలుక టెక్కల జిగి నలశిరీషప్రస
వరుచులఁ జెలువందు మరకతములు
కెంపు లక్షణము లీ సొంపున నన్నియు
బుధుఁడిచ్చు ఫలము లెప్పుడును దాల్ప

తే.గీ. దృష్టిదోషమ్ము విషములు దీఱుదాన
వర్ణవిధములు దక్కఁగ నిర్ణయములు
తెలియఁదగు కురువింద జాతికిని బలెను
నీలలక్షణ మెఱిఁగింతు లీలవినుఁడు.

కం. నైరరంగు నింద్రనీలం
బరయఁగ ధర దొరకదెందు నమరపురిఁదగున్
నైరి ముప్పాతిక రంగునఁ
బొరి నీలము నెన్న వెదురుఁబూరుచి దనరున్.

సీ. అది మహానీలమౌ నఱరంగు నీలమ్ము
గుఱుతు విష్ణుక్రాంతకుసుమ భాతి
నిలఁదాస భిన్నపటల శిలాగర్భ మృ
ద్గర్భ శోణిత బిందుగతులు గలుగు
టలు మహాదోషముల్ మలినంబు విచ్ఛాయ
కుక్షికురంగ నైక్కొనిన వాలు
కాస్పర్శనములు నాఁగ గలుగు సామాన్య దో
షంబులు త్రాసజర్జరితమున్న

తే. రీతులా కెంపు నెఱిఁగిన ఖ్యాతి నెరయ
వలయుఁ బరిశుద్ధ నీలమ్ము నెలమిఁ దాల్ప
శని ఫలప్రదుఁడగుచు నిచ్చలును బ్రోచుఁ
గీడు దొలఁగించి కొంతయు వేడుకలర.

కం. గోమూత్ర కాంతి నమరుఁ
గోమేధిక రత్నవరయ గురువిషహరమై
భూమిదుఁడు కేతు వెప్పుడు
శ్రీమహిమం దాల్చునట్టి శిష్టుల కెల్లన్.

తే. పుష్యరాగమ్ము బంగారు పోలుపుదనరు
నదియు వైడూర్యమును దాల్ప నధికశుభము
లిచ్చు రాహువు మిక్కిలి మచ్చికలర
విద్రుమంబునఁ గుజుఁ డిచ్చు విభవ మెలమి.

కం. అది మఱ్ఱిపంటి ఛాయన్
బదపడి యలచంద్రనిప్పు బాగునఁ దనరున్
విదితము గా నవరత్నము
లదనం దెలియంగ నిట్టివగు గతులమరున్.

వ. అని సకల వ్యవహారంబులకు నాధారంబగు గణిత సూత్రంబు శౌనకాది మునుల కిట్లనియె—

కం. గణితములు పదివిధమ్ములు
ప్రణుత స్థిత్యష్టసంఖ్య పరికర్మములన్
గణుతించి వేఱువేఱుగ
ఫణితిన్ సంక్షేపరీతిఁ బలికెదఁ దెలియన్.

సీ. సంజ్ఞయుఁ బరికర్మ సరణి భిన్నాధికా
రము ప్రకీర్ణమ్ము త్రైరాశికమ్ము
సూత్రంబు క్షేత్ర మచ్చుగ ఖాత గణితంబు
కరణసం స్థితి ఛాయ గడఁగు పదియు
ప్రబలత గుణకార భాగహారమ్ములు
లల వగు వర్గ మూలములు ఘనము
ఘనమూల మమర సంకలిత ముత్కలితంబు
లను పరికర్మంబు లతిశయిల్లు

ఆ.వె. నందు మొదటిదైన యట్టి సంజ్ఞలెఱుంగ
కొలఁగఁ గూడలేమి యిరవుగాఁగ
భూమి కాల ధాన్య హేమ తులా క్రమ
మెఱుఁగఁ బల్కెదిపుడు వరుసగాఁగ.

కం. పరమాణు వాది యష్టా
ష్ట రుచిర వారాభివృద్ధిఁ జను నంగుళమై
నెరి నవి జానెడు పంద్రెం
డరయఁగఁ బదియాఱు జాన లవి దండమగున్.

తే. దండములు వేయి క్రోశమై తనరు నాల్గు
క్రోశములు యోజనము నేల కొలఁత నిడివి
వెడలుపాక కోల గుంటె డాకడఁక నిరువ
దేను గుంటెడు తూమెడు మాన మిట్లు.

కం. నిమిషమ్ములు పదునెనిమిది
యమరంగాఁ గాష్ఠ కాష్ఠలగు కళ త్రిదశ
క్రమమున నవి యాఱొకఘటి
క మెఱయు దివసాబ్దముఖ్యగతులగు దానన్.

సీ. ధర నవశతసంఖ్య ధాన్యమ్ము సోలెడు
మానెడౌనవి నాల్గుమాన్కె లన్ని
కుంచెడు నాలుగు కుంచముల్ తూమెడు
నవి యిరువది పుట్టెడనఁగఁబరగు
నాలుగు వడ్లెత్తు లీలతో నొకగుంజ
యవినాల్గు కూక యొత్తవియు నాల్గు
ధరణమ్ము రెండవి తగ గద్దె గద్దెలు
పదియాఱు గూడిన పలము పలము
తే.గీ. లిరువదొక వీసె యవి నూఱు పరగ బారు
వరయ నేకాంగుళాకృతి యంత జలము
లిల వరాయెత్తు పట్ప్రలమ్ములును బాద
భాగమొక కుంచెడిది జలభావ మరయ.

ఉ. వన్నియ యెన్నొ తద్గణన వర్ధనసేయుచుఁ గూర్చియొత్తు న
వ్వన్నెలయట్లు నింతని ధ్రువంబొనరింపుచుఁ దాన వన్నె చా
ల్గొన్నను వన్నెయా పయిఁడి కోరి పుటంబిడి నందునన్ బదా
వన్నియ కుందనం బొకటి వన్నియ వెండి విమర్శనస్థితిన్

క. కాసులు నాలుగు వీసము
మానక నవి పదియు నాఱు మహిఁజిన్నె మగున్
పూనిక నేకదశస్థా
నానీకము దశగుణోత్తరాధిక్య మగున్.

వ. ఇవి సంజ్ఞా ప్రకరణమ్ము నయవి యింక సకల పదార్థపరికరంబున యవి వినుండు—

కం. వికోత్తర వృద్ధిన్ బది
దాకాలెఖ్ఖ్యలిడి కూడఁ దగు నేఁబది యై
దీకరణి రెంటిలెక్కలఁ
గైకొని యనుమడగునట్టి క్రమ మెఱుఁగుటలన్.

ఉ. పెక్కగు లెక్కలిట్టివియొ పేర్కొఁదగన్ గుణితక్రియార్థమై
కొంక్కువ తక్కువన్ సుళువు లిట్లిడ నిట్లగునన్ విధంబులున్
దక్కక నెందు కందు వెసఁదార్కొకనఁగా సమకొల్పు రీతు ల
ట్లుక్కజమైన రెండవదియొ పరికర్మ మనేకభంగులన్.

శా. కొన్నిన్ బుద్ధిని గొన్నిఁటిన్ గుణకసంగుహ్యమ్మునన్ దంత ని
ష్పన్నార్థి గ్రహణాధి కారముల నెచ్చన్ గొన్ని మర్థ్యార్థతన్
గొన్నిన్ సంకలితోక్తి వర్గగతి గీ ల్కొన్నింటినిన్ బ్రశ్నలన్
జెన్నొందన్ వివరించి తేటఁపఱుపన్ భిన్నాధికారమ్మగున్.

కం. నిర్ణయమునకై తత్త
ద్వర్ణత నొనఁగూర్చి యొందు నైఖరి దానిం
బూర్ణము చేయుట లదియొ ప్ర
కీర్ణకమను పరికరంబు కీర్తితమయ్యెన్.

తే. రమణఁ ద్రైరాశికము పంచరాశికమ్ము
సప్తరాశిక మనఁగల సంఖ్యలకూడ
భాగముల నిర్ణయించు శోభనవిధమ్ము
దనరుఁ ద్రైరాశికమ్మునా వినుతికెక్కె.

కం. చిత్రములు భాగవిధములు
పాత్రార్థ వివేకసిద్ధి పటిమయుఁ దగఁ ద
త్సూత్రమునఁ గాక పేర్వాక
సూత్రము వివరింప కునికి సూత్రంబయ్యెన్.

కం. రీతిఁ గొలయచ్చుకట్టుల
చేతన్ గుంటలు ఘటింప క్షేత్రగణితమా
ఖాతపు మట్టున్ విరివియు
జ్ఞాతిన్వివరింప ఖాతసంజ్ఞదనర్చున్

ఉ. చుట్టును గొల్చి కోలలవి చూచుక పాతికపాలు గూర్చియా
దిట్టమె గుంట లెన్నఁదగు తేకువతో వలయింపఁ జేలకున్
పట్టుక తక్కువాటికినిఁ బట్టి ప్రతిక్రమ సంఖ్య లర్థమౌ
గుట్టుగఁ గోల యిన్మడియొ గుంట చతుర్గుణ మెన్నికందగున్.

సీ. వారకు వార యేర్పఱచు లోతు వెడల్పు
నిండు మట్టైనచో నిండుగుంట
యరయఁ బాతిక మట్టులైనసట్లగు సంఖ్య
నిడివి వెడల్పును నిండలేక
నలఱైనచోనది...నిండు మట్టి
పాతికకుంటమై పరిధ విల్లు
త్రవ్విన మట్టియంతయుఁ బోడవు వెడల్పు
కొలగని గుంటల కొలఁది దెలియ

తే.గీ. వలయు పనికి నటులఁ గొలఁత వెంబడిమట్టు
క్రమత భుంజ కమ్ములమరఁ జేసి
పరకపాలు పెంచి పాటించి కూడినఁ
గణన సమము వచ్చు గణికులకును

కం. ఛాయాప్రమాణ గణనన్
ఛాయక లెక్కించి బింబపటునిర్ణయమున్
జేయుటలవి యున్నంగా
ఛాయాపరికర్మమనఁగ సఫల న్వెలయున్

వ. గుణక క్రమంబు దశమపరికర్మంబగు నది యునిమిది తెఱంగుల గుణకార భాగహార వర్గ మూలఘన ఘనమూల సంకలితవ్యుత్కలితంబులను దత్తదుచిత కృత్యంబులకు హిత మగు నేక దశ శత సహస్ర దశసహస్రలక్ష దశలక్ష కోటి దశకోటి శతకోటి అర్బుద న్యర్బుద ఖర్వ మహాఖర్వ పద్మ మహాపద్మ క్షోణి మహాక్షోణి శంఖ మహాశంఖ క్షితి మహాక్షితి భూరి మహాభూరి అంత్య అతర్క్య అప్రమేయ సముద్ర సాగరా నంతంబులను ద్వాత్రింశత్స్థానంబుల నమరి నిది గణిత ప్రకరణంబిక షట్చికిత్సాక్రమం బెఱింగించెద.

చం. కమలభవుండు ముక్సురభి క్షమసుధారస మాదరంబుతో
నమరుల కిచ్చి భూప్రజకు హవ్యము గవ్యము చేకురన్ దయా
క్రమమున ధేను సంతతులఁగల్గఁగఁ జేసెఁ దదీయరక్షణ
త్వము లతి ధర్మ మెవ్వరికిధాత్రిఁ బవిత్ర చరిత్ర సంపదన్.

కం. విహితంబుగ ధన్వంతరి
సహదేవుఁడు దచ్చికిత్స శాస్త్రోక్తత స
న్నిహిత మొనర్చిరి జగతిన్
వహిఁ దద్విధ మిపుడు వినుఁడు వైఖరి నెరయన్.

ఆ.వె. నెమరు బెట్టదూర్పు నీరు విడుచు మేఁత
బట్టదప్పుడపుడు బడు ధరిత్రి
వణఁకు మొకు జెమర్చు వడిఁదొమ్ముదాఁకినఁ
బసికిఁ దచ్చికిత్స బరగ వినుఁడు.

కం. త్రికటుకమున్ త్రిఫలమ్మును
నొక మానెడు చింతపులుసు నొగి మహిళవయః
ప్రకటరసమ్మున గొట్టెడు
సుకరత నిడఁ దొమ్ము తెవులు సురుగున్ బసికిన్.

తే. ఎలుఁగునెత్తురు కరదూకు మెలమి మంతి
పొడియుఁ గల్లుప్పు నల్లని వడువు మేక
పంచితమ్మున నిడఁ దీరు పసిఁడి కొట్టు
గంజియున్ గాఁకనీల్లిడఁగా వలయును.

సీ. బరిరొమ్ము సంధిమపలె? ప్రొమ్ము ముక్కుపై
తోఁక క్రిందటఁ జూఁడ దొమ్మదిరుగు
నెరిడిదాఁ కిన మేపు నీళ్లు నొల్లదు క్రుక్కుఁ
గొమ్ము లడ్డము పడునిమ్ముగాఁగ
కొట్టు చూర్ణము సరి గూర్చిన కరదూకు
మది నూనెతో నస్యమమరఁ జేసి
వెదురు టాకురసమ్ము వెసనిడ నది తిరు
వసపు గొట్టాలు పొసఁగు పొడలు.

తే. సమములుగఁ గూర్చియిదెరువమరఁ గలిసిఁ
గలయఁ గరదూపమున్ గింశుక ప్రసవము
లైన సున్నంబులైన నొంపమురనిడినఁ
దిరిసె పుంబట్టియాకులు నెరయ నుల్లి
రసములో నైన నిడఁ దీఱు నెసఁగు పెలితి.

ఆ.వె. ఎలుగు నెత్తురైన నెలమి పొందుగు బువ్వ
లైనఁ గలిఁ బొసంగు పూని మూఁడు
తవ్వలన్ని నాళ్లు తగఁ బశువులకిడఁ
జేరులేని రుజలు తీఱు వేగ.

కం. నల్లఁ బడి యొఱుపుమానిన
నల్ల దెవులు కింశుంబునన మజ్జిగయన్
దెల్లమిఁ గలినిడఁ దీఱున్
మొల్లమి దిరిశమ్ము మనుజ మూత్రము నటులన్.

ఆ.వె. అర్కరసము వేము నా వాలు నల్లేరు
వేము నేలవేము వెలయు తిలలు
గుమ్మడిఫలమునను గూర్చిన నానల్ల
తెవులు మాని పసులు తేఱి బలియు

కం. అఱుగడపుఁ బసికివెల్లు
ల్లరయఁగ నావాలు నుప్పునటు మజ్జిగతో
నల్లననొక పథ్యంబిడ
నల్లన నదిమాని పసరమనువుగ బ్రదుకున్

కం. పలికుట్టుల కుంజెలిమిడి గలయ
సమూలమ్ము నీళ్లఁ గ్రాఁచి కలియున
ట్లల పరిచి కాలికెత్తిన పలిదొలఁగఁగ
బశువు దొంటి వైఖరి నడచున్

ఆ.వె. ఎద్దు కట్టుపట్టు లెలమిముక్కునడొక్క
కెలఁగి నడుము చూడఁ బరిహరమగు
నౌషధమ్ము విడుచునగ్ని వైద్యమ్మున
సకులునను జూఁ దలఁపసుకర మగును.

కం. కొఱ నేలనీనిన పసికిఁ
దుటిమిడియన్ వెదురుటాకు దోడ్తో మే పన్
నెలచేపు నీన లేనెడ
మెరవడిగా వెదురుటాకు మేఁపిన నీనున్.

ఆ.వె. దూడఁ గుడువనీక తొడిఁ గట్టనీయని
జాడ నల్లఁదిగె దూడమేనఁ
బూసి నాకనీయ వాని సొంపై వత్స
గుడువఁగట్టనిచ్చుఁ గొమరు మిగుల.

కం. వెలిదిబియ్యంబును గంజియు
పులకండము నెయ్యి పాలు పాలుపుగఁ దోడలన్
గలయంబూయఁగఁ దొలిచూ
లలవడఁగాఁ జేపు వ్యాధులన్నియు మానున్.

తే. నచ్చుటని నెత్తురోరలఁగ నొచ్చుఁ బసికి
బచ్చిబియ్యంబు కలిబూర్గు బంకశెస్స
దీర్ఘకేసర మనునట్టి తెవులుదవుల
వాత విడఁ దగు నాయంబు వరుసతెలఁగి.

కం. పారిఁబోరి నెత్తురుగారిన
నరుదారఁగఁ దమిదె పిండి యంబలిడఁదగున్
ధర నలికిరికాఁ బైనన్
గరిమన్ గల్లుప్పు కింశుకము కలివలయున్.

ఆ.వె. మాడనొల్లనిదానికిఁ వేడుకలరఁ
నెన్ను నల్లేరు వెల్లుల్లి నెనయ వసయు
మిరియమున్ దక్రమును నిడమెత్తిదయనుఁ
వత్సమునకిచ్చు పాలునవ్వారిగాఁగ.

కం. నెరివెక్కుఁ దెవులునకుఁ గలి
మురువుగ భల్లూకమును
—— ——

కం. —— ——
—— ——
పుడమిన్ బ్రహ్లాదమతము పూనిక నిటులన్.

సీ. పుచ్చాకు వసయును ములుచల్లతో నిడ
మావి చిన్నది చేపు మానితముగ
రహిదిరి నెము కస్తురిరసమున మిరియాలు
మర్దించి మేదించి మారు జెవినఁ
బోసినఁ గంటిలోఁ బూవు మానునిజంబుఁ
దొండాకు పసరున దోడవి రేఁడు
మిరియంపు గింజలు మేదించి కంటిలో
నిడఁబూవుమాని సొంపడరఁ బ్రబలు

తే. నెలమిఁగల్లుప్పు తాటి కాయలును జీల
కరను గంధిలతోడను గలయఁ బోయ
మూఁడగ్రై కొను నెయ్యి గోధుమ యవాగు
పోసినన్ జేపుచేఁగడు బొల్పుఁ బసులు.

కం. పల్లేరున్ గొతిమర్లన్
వెల్లుల్లియు జీడిగింజ విసము డుగవూ
వల్ల హరీతికి జిరకర
మల్లనఁ గలి నిడిన సాధువగు దుష్టెందున్.

కం. ఇలఁ దగిరిశయు సమూలము
గలయఁగఁ గల్లుప్పు జీలకర సమములుగాఁ
బుల కండముతోఁ బెట్టినఁ
నలవడ గానెపుడు గొడ్డు టావున్ జేపున్.

సీ. పొసఁగఁ జాపరపంటి రసమును బచ్చిపా
లిడఁ జూలునిల్చు నెంతేనిగొడ్డు
టావులకైనఁ దోడ్తో పెస మేకల
నెయ్యి వెట్టిన నైన నిలుచుఁ జూలు
పొడుచువాటికిఁ గంటనిడఁదగునూనె రాం
న్నాళ్లలి సాధువై నవిచియుండు
... గుండె చివురుకు నొగిఁ గుంటుదానికి
మిరియపు గింజలు నిరువదొకటి

తే. చేరి తిప్పాకు రసముతో నూరి చెవినిఁ
బిండినంతన కుంటులు పేర్మిఁదేలు
కసవునందికి దిగదీసి మొసఁగఁ జేయ
దృష్టితాఁకుట పసులకుఁదీతిపోవు.

చం. దిరిసెము వేము పారిజము తేకువ తక్కెళ సింధువారమున్
నౌరవసరుల్ సమంబుబుగ నేయియు నూనియ యాముదంబు స
ట్లురయిక పొంగనీక కమలాగ్ని నిదైల మొనర్చి పోసినన్
ధరఁ బశుజాతి వాయువులు దాక్కను బాధలు మాయు నన్నియున్.

కం. కందరసము పులిచల్లయుఁ
గందువతోఁ ద్రివిధ......గంటిని బోయన్
పొంది నముల్ వసులోఁ జెలుఁ
వందన్ బైలుఁటికి పశువు లల్లనఁ బ్రబలున్.

ఆ.వె. వేర్మి మావి పడమిఁ బేలాలపిండి పు
చ్చాకు రసము గూర్చి యనపకట్టు
తోడఁ ద్రిదినమిడిన వీడి మావిలఁబడు
నటులఁ గామి కరగిపైనఁ బడును.

ఆ.వె. పరగు మేడి చెక్క భారంగి పత్తాకు
పసము టల్ల నూనెపాసఁగఁ గూర్చి
పాలుచుఁ ద్రిదినగణన పుచ్చాకు కట్టిడ
మాని యిపురుగండె మహినిఁబడును.

సీ. కసు గుడ్లు గ్రుంగితోఁక న్యాంద్రులు వీడి
చిక్కుగువ్వ తెగులు చెందుపసికి
కల్లుప్పు నావాలు నల్లంబు కలుబంద
పలుకులు సమముగాఁ గలయఁ గ్రుమ్మ
పులిచల్ల కడవలోఁ బోసి జామొకటార
నిచ్చి త్రావఁగఁ బెట్టియిచ్చిసినట్టి
తోఁక ఖండింపుచుఁ గాకసూనియనద్ది
నంతమాత్ర[నె తెవు?] లణఁగిపోవు

తే. పొసఁగ వెంపలి మూలంపు రసము నశ్వ
మమరఁ జేసిన దగ్గుతుమ్ముపుడు మాను
నేలవేము నద్ద సరము లీలఁ గలియు
నిడిన దగ్గులు తుమ్ములు కడఁక నణఁగు

కం. కలితో మోదుగ పువ్వుం
గలయఁ గఁ దిలపుష్పమిడినఁ గదలున్ దగ్గుల్
అలగుండె పగులు దీననె
తొలగు పసులకున్ జికిత్సతో డోఁ జేయన్.

ఆ. గోనుపండ్ల రసము గోక్షీరమును నిడి
దూడమేనఁ బూయదూడ గొనును
కొమరుతీవె గడ్డ కూర్చుక తలవిరి
యాకు నూరియిచ్చిన నవియు నటుల.

ఆ.వె. వెలిమిడాకు నూరి కలియఁ గల్లుప్పును
గలియఁ బూయ దూడ గజ్జిమాను
పరగ గంజవాకు పసరట్టి గుణమిచ్చు
నొడలు గడుగవలయు నొదవి పిదప.

ఆ.వె. ఒప్పు పద్మ కంద ముమ్మెత్త విత్తులు
జుట్టు పాకురసము నూరిది నటుల
పాలదొమ్మి చిన్ని పసికిఁ బ్రక్కలు చూడి
కలి పలాశకుసుమకలిత మిడుడు

కం. వెలఁది విసుపారు లేగకు
నలవడ మావేకు నూనెనద్ది తిన నిడన్
వలయు ప్రతి యాకు చిక్కలి
కలుపున్ గొట్టిడిడఁ గడుపు గట్టున్ వేగన్.

కం. పాలుగుడిచి కడుపారెడు
నాలేగకు మహిషదధియు నటు వంజాకున్
లీలనిడ గట్టు గంజా
కాలీలన్ బెట్టఁ బాలుగలుగున్ బెలుచన్.

కం. తంగేడు కొనలున్ దధియుఁ
బొసంగ నిడ నజీర్ణ మణఁగు సరవిం బెన్నే
రుంగడ్డయు గంజాయా
కుం గూర్చక నిడ నజీర్ణగుణములు మానున్.

తే. పరగ జొన్నలు వేపాకు ప్రత్తి గింజ
లుప్పు నిప్పుల నీఘూమ మొనర వీథిఁ
జల్లినంతన దృష్టి దోషములు దొలఁగు
మఱియు నిప్పులు జడిసిన నెరయ మేలు.

కం. ఈనంగలేని పసికిన్
బూనిక గురిగింజవేఱు పుల్లని కలితో
నూనె యిడి పొత్తికడుపున
మానక లేపనము సేయ మక్కువ నీనున్.

కం. సంగతి కుత్తుకవాప
య్యంగిటుముల్ దీఱు కంఠమనువుగఁ జూడన్
పొంగు ముకుబంతి తలకై
క్కంగా మధ్యంబు నాభిఁ గలనస్య మగున్

సీ. మిరియంపుఁ బొడిజుట్టు పురిడంబు నిడవాత
ములు దీఱుఁ బసులకుఁ దల యెరిసిన
తలతిండి యాశ్శృంగములఁ బుట్టు రోగంబు
తలవిసరున్ బాధవాలక దొలఁగు
నావాలు చవిలెత్తు వెల్లుల్లి శొంఠియు
గాలిమిడి పసరుతోఁ గూర్చి చెవుల
ముక్కున నిడఁ గర్ణముల నిల్వగట్టిన
శృంగ రోగంబు లణంగి పోవు.

ఆ.వె. కాళ్లు వీపు రాక కదలమి యీడుపు
పచ్చిపాలు రావి పట్ట మిరెము
కూర్మి నాల్గు నాళ్లు గొట్టెడు పెట్టిన
రోగమణఁగి పసికి రూఢి మెఱయు.

చం. పదములు నాల్గుతుంటు లిలపైఁ బడునట్లుగ నోరగిల్లు మే
పొదవక చిక్కు నాకురమ కోపక జుట్టును తేగ కుత్తుకన్
దుదిఁ గరశల్యమున్ చెలివితోడుత [గూడ?] శరీరమెల్ల నొ
ప్పిదవుఁ గరీష భస్మమటుఁ బేర్మిగ నించినఁ దీఱునయ్యెడన్.

ఆ.వె. ఆవటపుఁ దీగతోఁ జెప్పుటిట్టమైన
కంఠమునఁ గట్టి పిడకలఁ గల్పినట్టి
బూడె మొయినిండఁ జమరినఁ బోవు కురుపు
జాలు కుంటెడు పసులకు లీలతోడ.

కం. జిల్లేడు కొనలు ముక్కల
నల్లల్లనఁ జొనిపి తీసినంతన తీఱున్
తెల్లమిగ మెత్తగాల్దురు
వెల్లనఁ జక్కరయుఁ గరగఁ బేర్మిన్ దనరున్.

తే. క్రొత్త సున్నంబుతోడి కా గూర్చి మెదిచి
గిరుక నిడుక గలంచిన మెఱయుఁ గాళ్లు
కడుపు కాలకుఁ బసి ముందుకాళ్ల క్రింద
దొడరి ముసలమ్ము నలుమారు దూరవేయ.

సీ. చంపి కుంటుకువెన్క చరణము గోరిజ
విడఁగఁగ గొట్టి నీళ్ల నిడఁగఁ దొలఁగు
దివసమా కుంటుకు దెస నేడు క్రేల్దూఁడు
కాదేని నర్క దుగ్ధములు నించు

డెన్నలఁ గడుపుబ్బు నిల్వ వాత దంటు బూ
దియనీళ్ల ద్రావించి దృష్టి నిడుఁడు
ఘటి యబ్బ లిపి ఘందిమలము నీళ్లిడఁదీఱు
నిరు వాయిగట్టు నీపిరి వెడలమి

తే. కలియు గురుగింజ పసరుతోఁ జులుక నగును
దురియ కిచ్చినఁ బ్రేవులు దునియఁబారు
చేరివానికిఁ దంగేడు చివురునూరి
చల్లతో నిడ నవిమాను సరసముగను.

కం. బారిజ పాకును మిరియము
నీరధి లవణమ్ము నూరి నెరి నిడినన్ స్రాం
పాయుత్తరేణు వెల్లు
ల్లారహి నిడ వ్రణములెల్ల నడఁగున్ బసికిన్.

తే. ఉత్తరేణాకు వెల్లుల్లి యుప్పు మిరెము
నూరియిడఁ బుర్వు చచ్చివేయారు వ్రణము
శాకి యీగయుఁ దజ్జిహ్వ దాఁకనీక
పదిల మొనరించిరేనియు వ్రణము లణఁగు.

ఆ.వె. పలుగు రాళ్లకాల్చి పరగఁ జూఁడినఁ గంతి
పగిలి మిగులఁ బలుచఁబాఱి యణఁగు
కడఁక నట్టి వృశ్చికమునకు గచ్చపా
దయును మిరెము కలిక మయినఁదీఱు.

ఆ.వె. కడఁగి రేలకాయగంధమ్ము కలియిడఁ
బురువు కాటుదేరు పురువులంటు
నెండ వానకోర్వ దిట్టట్టు వడు భార
పొర్వదూర్పదట్టు మొదవుఁ బసికి.

కం. అవిసము లెల్లఁ దీఱున్
భావనమగు నడ్డ సరవుఁ బసరును మిరియం
బాళ్ళనెయి శొంఠి పసపున్
బావకపక్వముగ వేఁతువల నిడి నంతన్.

వ. అనిన విని కౌతూహలాయత్త చిత్తులై శౌనకాదు లత్త పౌరాణికుండగు రోమహర్షణి నిరీక్షించి స్వప్నలక్షణం బెఱింగింపు మనిన నతండు——

సీ. పంచీకృతంబైనఁ బాంచభౌతికమగు
స్థూల గాత్రమ్మున లీలసాత్త్వి
కంబు జాగ్రదవస్థఁగలుగు షోడశవికా
రముల లింగశరీర మహరరాజ
సాహంకృతియు స్వప్నమగు కారణాఖ్య ను
దమతుచే స్వాపమా క్రమముతోడ
విశ్వతైజసులన వెలయుఁ బ్రాజ్ఞుండన
నాత్మలొప్పగు నిట్టిదగు నవస్థ

తే.గీ. అను ప్రమాణమ్ములను సూక్ష్మతనువు బాయ
దనఘ పరమాత్మయెడఁ జెందునంత దనుక
కారణ శరీర మెడయగు కలయఁ బోలయుఁ
గానఁ జిత్సుఖ మాస్వాపగతిఁ బొసంగు.

తే. స్వప్న మింద్రియ దశక హృత్పంయుతైక
ప్రాణ పంచక చర్య ప్రపంచకమగు
కంఠ హృన్నాభి గుదములఁ గదలు వాయు
దానముఖ్య చతుష్కమా ప్రాణగతులు.

కం. వ్యానుఁడు సర్వశరీర
స్థానవ్యాపకుఁడు గాన సకలేంద్రియముల్
వాని వెనుదవులు నెందున్
గానన్ దలఁచినవి విన్న కన్నవవెల్లన్.

చం. కనుపడినట్లు సూక్ష్మతను కారణమై కనుపట్టి నట్టివిన్
వినుఁడవి రాజస ప్రకృతి వింతగఁ జైత్య గుణోల్బణమ్మునన్
గనునవి పుష్యమాసమునఁ గల్గు ననేకవిధంబు లట్టివిన్
దినునులుగా కలల్ గలవు దీని నెఱుంగఁదగున్ ఫలోన్నతిన్.

ఆ.వె. బొంకు పలుకునతఁడు పొసఁగఁ గన్గొనుకల
రోగజన్య మదియు రూఢికెక్క
దందు పరుస నాలుగగు జాల యందష్ట
షట్త్రిమాస ఫలద శాస్త్రి మరయ.

కం. పసుల విదుచు నెడఁ గనుకల
బొసఁగన్ నాల్గైదునాళ్ల బూనిక ఫలద
వ్యసనము సర్పము కుడిభుజ
మొసఁగఁ గఱవఁ గనిన శుభము లెంతయుఁ గల్గున్.

సీ. హస్త్యశ్వరథడోలి కాందోళికలువెన్క
నడవఁగఁ బ్రభువులు గడలుదేఱు
రక్తధార లమేయరత్నముల్ పశుగణ
బ్రాహ్మణులన్ గన్నఁ బరమశుభము
జలగ పామునుదేలు నెలమినంటుఁగఁగన్న
భార్య ప్రియంబాడ బాఱిఁబడఁగఁ
గన్నెలఁ జూడఁగ ఘనసౌధ గిరులపై
జనులఁ గూడుండఁగ జలధిదరిని

తే. నుండఁగాఁ గలఁ గన్న వేఱొకరిదాస్య
మమరునట్టుగ వ్రణగాత్రు నధికహర్మ్య
ధన కనక శ్రేష్ఠవనములఁ గనుటలెస్స
శయ్యనుండంగఁ గలఁ గన్న సౌఖ్య మొదవు.

చ. లకుముకి కోడి క్రౌంచ మొకలావుక గన్గొన నన్ని పిల్వఁగాఁ
ప్రకటిత వాహనస్థితులఁ బాడుగృహమ్ములలో సుఖాసన
ప్రకరములన్ వసింప స్ఫుటపంకజపాండుర వస్తువున్ గనన్
సుకర విభూతియున్ శుభము శోభనమున్ గలుగున్ గ్రమంబునన్.

కం. నీలాంబర సుమభూషణ
జాలాన్విత సతులఁ గనిన సరితాఁదాల్పన్
లీలన్ సూర్యుఁడు చందురుఁ
బోలన్ గలఁగనిన రోగపుంజము లాదవున్.

ఆ.వె. కొమ్ములున్న మృగకులమ్మునఁ బలుకోఁతి
నట నివంగి నెగయునట్టి పక్షి
నంత్య దుష్టజనుల నంబు వర్షము జల
మింకఁగనెడు కలల నెసఁగు కీఁడు.

ఆ.వె. నలుగు బెట్టఁగనిన నల్లనై తెల్లని
వస్త్రచయములున్న వడువుగనిన
రక్తపుష్ప గంధరాజిఁ గన్గొనఁ గీఁడు
కనని వినని కాంతఁ గవయ గ్రహము.

సీ. మొండి ముక్కుడి వాండ్ర దండహస్తులఁ
పాశఖడ్గ సంభృతుల వికారతనుల
పట్టు గొట్టగనెందు చెట్టువెన్నయు నెయ్యి
పెరుఁగు తైలాంగుల ఖర ముఖగత

కాక గృధ్రమ్ములఁ గాష్ఠ పంకమ్ముల
దుర్లక్షణమ్ములతోన పెలఁగఁ
దానంబు సేయంగఁ దైలాంగుఁ డగుటయు
సోమాపకుండము తేరు భూమిమిత్తు
తే. పుట్టి సౌధంబు నొంటిగాఁ బొల్చియొక్క
క్రొత్త పోఁక ధరింపఁగఁ గోరి యొకరు
పలుమఱును విల్వఁ దానవ్వఁ గలఁగనిన
శోక భయపీడ చింతనా నీకమొదవు.

కం. పచ్చని కోకలు సొమ్ములు
నచ్చుగఁగల చెలులఁ గనిన నదిసంపద శా
నిచ్చలు మృతి [గతు ?] కుణపము
నెచ్చఁగఁ గనుగొనుటఁ గల్గు నెంతయు శుభముల్.

తే. అన్నముల్ భక్ష్యములు దీని నట్టులారులు
తినఁగఁ గనినట్లు సైరి భోష్ట్రి నవ గార్ద
భయుత రథమెక్కినట్లుఁగఁ బాత్రనీళ్ల
ముంచఁ జేరఁగఁగల గన్న మొనయుగీఁడు.

కం. వననిధి పొంగుచు నింకఁగఁ
గనుకల నాశంబు బంధుగణ నాశముగుల్
ఘననృత్త గీత వాద్యము
విను నూతనభాండ తామ్రపీఠులు కేఁడుల్.

తే. తొండలల్ గూరమల్లెను బొడుటాకు
పాలపటీయుఁ గాకి గన్పట్టు చెట్టు
ఘృతము పరమాన్న భోజనోద్వృత్తి పొగయు
బీడుకొలను గలం గనఁ గీఁడులొదవు.

సీ. సంకెళ్లు బంధన సంతాప మొనఁగూర్చు
కోరి ముత్తైముగన్న కొడుకు గలుగు
పశక మక్షికముల మత్స్య మాంసమ్ములఁ
గలఁగన్న సంపదల్ గలిగి వెలయు
మంచివారలఁ జూడ మంచిది చేకుఱు
ముంటఁ గన్గొన శుభ మహిమఁ దనరు
నమితపాద ముఖావయవ దేవతలఁ గన్న
దేవతార్చనలు తత్సేవఁ గనుట

తే. కాల సుఖములు నారోగ్య ఖేలలాదవు
నిట్టి స్వప్న ఫలమ్ముల నింగితమతి
వెలయ జనులు శుభా శుభకలిత గతులు
తెలియ నిహపర సౌఖ్యముల్ గలుగు నెలమి.

వ. ఇట్టి స్వప్న లక్షణమ్ములు రోగనిదానమ్ములు నెఱింగి నిశ్శంకాగదంకారులు సాధ్యా సాధ్యాంక నిర్ణయులై దేశకాల ప్రకృతి విశేషమ్ములు దెలిసి ఋజు మార్గంబునఁ బ్రతిక్రియం బూనవలయు నింక శిల్పశాస్త్రం బెఱింగించెద—

కం. హరిహర మందిర రథస
త్వరవిగ్రహ చిత్రకర్మ వాసవిధంబుల్
ధరగృహ గోపుర నిర్ణయ
సరణిన్ వివరించు శిల్పశాస్త్రము వెలయున్.

చం. వరుసగ నొక్కటాది పదిపాల్తుద తాళ విసంజ్ఞ మూర్ధవి
స్తరతను మానభేదకవిధానము సింహతలాట భాతి భీ
కరతల సాలభంజి పృథుక ద్విర దానన యక్షమర్త్యులన్
సురగిరి జాకృతుల్ మురహ శూలి విధాతృ శుభాంగ భాగముల్.

సీ. ఇట్టి యంశముల యందేకభాగ శిరము
నవలి భాగములు కాయంబుగాఁగ
దారు ద్రు మాశ్మ చిత్రముల నేతద్విధ
జాతి రూపము లొప్ప ఖ్యాతిదేవ
తాకృతులకు మితిగైకొని యిది నూట
యిరువదినాల్గు పాళ్లసఁగ నందు
నుష్ణీష మకుటమ్ము లొనర షడ్భాగమ్ము
లగురెండు కేశనేత్రాంతరమ్ము

ఆ.వె. ముక్కు తల్లయు హనువు నిక్కువ యట్లన
యందునుండిచుబుక మాఱు పాళ్లు
దానగళము సగము దగనాల్గు పాళ్లు వ
క్షంబు ద్వాదశాంశ సరణి నాభి.

ఆ.వె. నాభిదిగువ మేహనం బూరుపర్యంత
మమరునట్టి యంశలలరు తాళ
కాంశ జానులొప్పు నటయుగాంశము జంఘ
లడుగు లొనరు వలన నాఱుపాళ్లు.

కం. పాదాంగుష్ఠము పార్ష్ణ్యను
మోదత సప్తదశభాగకములఁదగు పాదం
బాదిగ భాంశంబుల నొలి
పైదగు కూర్పరము బాహు లవి శాస్త్రోక్తిన్.

తే. అమర మణికట్టు దనుక నంద్రైదుపాళ్లు
నదము ? నాపాళ్లుదగు ప్రకోష్ఠమున మిగుల
నలరు మధ్యాంగుళా గ్రాంశ లచటు నాల్గు
వెడలు పలిచేత మూఁడుపాళ్లదరవలయు.

సీ. పంచ్రెండు తొమ్మిదిపాళ్ల గ్రీవాగ్రంబు
గ్రీవమూలము వెడల్పు విధమున
బాహ్వాది మూణ్ణలిపాలు తదగ్రంబు
రెండు నాలుగునైదు రీతి ప్రక్క
లటు తొమ్ము సార్ధ వేదాంశము వెడలుపు
నాక్రిందఁ ద్రిత్రిద్వయాంశకమ్ము
నడుము ద్వయాష్టాంశ మడరునంగంబుల
నిడివిని తగు వెడల్పిడుటు చితము

ఆ.వె. శ్రీ ప్రతిమల కిట్టి స్థితిని ముహ్యాతిక
పాలు పరక కొదవఁ బాడిగాఁగ
సేయ టొప్పు నిట్లు చెలువున దేవత
తత్స్వరూప యుక్తిఁ దరల దెపుడు.

ఆ.వె. తనకు వలయునంత ధరనాల్గు దిక్కులు
సమముగాఁగఁ గొలిచి యమరదాని
ద్వ్యష్ట కోష్టములుగ నంశమ్ము లొనరించి
నడిమి నాల్గు బ్రహ్మ కిడి క్రమమున.

సీ. ఉన్న పంచ్రెండు పాళ్లొప్ప రాసు లొనర్చి
తనరాశి నైనను దానఁజేసి
దైన వర్గమునైన నభవదిశాదిగాఁ
దనదిక్కు వైరంబు తలఁగ కునికి
యలవడ సింహధ్వ జాలయ కోణముల
వాస్తువు గావించి శస్తమహిమ
కుడ్యాగ సమము హస్తమ్మునఁ గొల్చిద్వా
రము లుంచఁగాఁ దగు రమ్యముగను

ఆ.వె. భాద్రపదము మొదలు ప్రాగాది మూఁడేసి
నెలలు వాస్తు పురుషుఁ డలరునాల్గు
దిశల నతని చరణ దిశ నూహ్యుఁడుండుట
తెఱిఁగి నిడివి వాస్తు విడఁగ వలయు.

కం. గృహమునకు వలయు ధారుణి
వహి నిర్వ దెనిమిది పాళ్లు వాస్తు పురుషుఁడో
రహిఁ బదునొండూ ర్ధ్వాంగము
విహితతఁ బదియాఱు క్రింద వీటికి నడుమన్.

తే. ఏక భాగమ్ము నిడివియా తెఱిఁగి యచట
శంఖు స్థాపింపఁ దొలఁగును జంద్రజీవు
లున్న రాసులునవి నిల్పుటొప్పు మిగుల
వాస్తు పురుషుని నెఱుఁగఁగ వలయునిట్లు.

ఆ.వె. బుధునిరాశి వాసపోసి శుక్రునిరాశి
కప్పుగప్పనేనిఁ గలుగుశుభము
స్తంభమునుప ధరణిఁ ద్రవ్వుచో నుమకయుఁ
గేశచయముచూడఁ గీఁడులౌదవు.

సీ. అందుదకమునించి యలరువోయఁగను
ప్రదక్షిణమైనచోఁ దగు శుభములు
నిండ కుండిన తెప్ప నెరి నప్రదక్షిణ
మైన కౌరాదట్టు లరయ వలయు
శ్రవణార్ద్ర లుత్తరాత్రయ శతభిషపుష్య
వసు పంకజములు సూర్ధ్వములు భరణి
యాశ్లేష పూర్వత్రయము మూలముఖకృత్తి
కా విశాఖ లధోముఖములు జ్యేష్ఠ

తే. యశ్వినీ పునర్వసులు మృగహస్త రేవ
తులు ననూరాధ స్వాతి చిత్రలును దిర్య
గాననములందు ఘాత కృత్యము ప్రచార
గతులు తిర్యక్కులను బూన ఘనఫలమ్ము.

కం. ఓడల బండుల తీవెల
జాడలు నవియూర్ధ్వములఁ బ్రశస్తము సస్య
క్రీడారామ గృహక్రియ
లాదక నిమ్మాడ్కి నేయ నురుశుభములగున్.

మ. శరదంభోరుహపత్రనేత్ర ! కలుషాచారామరారీశవి
స్తర సైన్యాటవి వీతిహోత్ర ! దివిషత్పాలామరజ్యేష్ఠ శం
కరయక్షోరగ సిద్ధ సాధ్య మునిసంఘ స్తోత్ర చారిత్ర ! శం
బరద శ్యామల వర్ణగాత్ర ! యలమేల్మంగా కళత్రా ! హరీ.

కం. శరచర కచ్ఛప కిటినర
హరివామన రామ రామ హలధర బుద్ధో
ద్ధర తురగవరారోహక
హరహరి విధివినుతి పాత్ర హరిహర నేత్రా.

పంచచామరము. సురామరారి వీరఘోర మూర్ధ పంక్తిఖండనా !
హరాజ రాజ సూనిశేఖరార్చన ప్రతోషణా !
చిరంత నప్రసిద్ధ శుద్ధ సేవకౌఘ పోషణా !
సరోజరోప కోటిరూప ! సారరమ్య భాషణా !

గద్య॥ ఇది శ్రీమదలమేల్మంగా వేంకటేశ్వర వరప్రసాదా సుకవితా విచిత్ర మహంకాళ్ళప్ప కొండార్య పుత్ర సకలసుకవిస్తోత్ర పవిత్రగాత్ర వినయగుణానునయ వేంగయకవి సహాయ తేకుమళ్ళాన్వయ పయఃపాథోధి పూర్ణసుధాకర తిమ్మమాంబాక ప్రియామాత్యకుమార సకలవిద్వజ్జనాధార శ్రీవత్సగోత్ర పవిత్ర ఆపస్తంబ సూత్ర సత్కవిప్రమోదానుసంధాయి రంగశాయిప్రణీతంబైన శ్రీ వాణీవిలాసవనమాలిక యను మహాప్రబంధంబునందు, ఆయుర్వేద ధనుర్వేద గాంధర్వవేదంబు లెఱింగించుటయుఁ దర్కదండనీతి సాంఖ్యయోగ పూర్వమీమాంసోత్తరమీమాంసాది షట్ఛాస్త్ర ప్రశంసయు భరతశాస్త్ర కళాశాస్త్రా లంకారశాస్త్ర శిల్పశాస్త్ర గజలక్షణా శ్వలక్షణ పశులక్షణ రత్నలక్షణ సాముద్రికలక్షణ గణితలక్షణాద్యుపశాస్త్ర వివరణంబును స్వప్నాధ్యాయ ప్రశంసయు నను కథలంగలది చతుర్థాశ్వాసము.

సంపూర్ణము.